ఓం.

# బసవపురాణము.

వచనకావ్యము.

ఇది

శ్రీమదపర కాళిదాస కవిగురు సమస్తాగమ సర్వతంత్ర

స్వతంత్ర్యాద్యనేక బిరుదాంకితులగు,

బ్రహ్మశ్రీ పూడిపెద్ది లింగమూర్తి పంతులుగారిచే

వ్రాయబడినది.

శ్రీశైల సింహాసనాసీన పత్సకాంతి భగీ శ్రీహత్తినీ పట్టద,శ్రీమ

ద్రాజా సిద్ధలింగదేవర దేశికసార్వభౌమ స్వాములవారి ప్రియ

శిష్యుడును శైవసిద్ధాంత శాఖా కార్యదర్శి గారును

శ్రీమద్భ్రమరాంబా వరప్రసాద విహారులగు

కాళహస్తి వీరయ్య దేవర గారి

పుత్రుడు తమ్మయ్య దేవరగారిచే

ప్రచురింపబడి,

మొదటికూర్పు 1,000 ప్రతులు.

శ్రీ చింతామణీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

రాజమహేంద్రవరము

1927



[వెల 2—0—0.




పాఠక మహాశయులారా !

బసవపురాణమను నుత్కృష్టగ్రంథమును తొల్లి పాలకురికి సోమనాథుఁడను కవిపుంగవుఁడు ద్విపద కావ్యమున రచియించెను. తదుపరి పిడపర్తి సోమనాథ వి దానినే మాతృకగాఁ గొని యేడాశ్వాసముల పద్యకావ్యముగా విరచించెను ఈ గ్రంథరాజములు రెండును కర్ణాట కవులచే విరచింపఁబడియుండుటచే కర్ణాటపద విస్తారమై యుండి మన యాంధ్రులకంత యుపయుక్తము కానందున ఆంధ్రపాఠకులకు సులభ గ్రాహ్యమగుటకై మే మీగ్రంథమును ప్రకటించియున్నాము ఇట్టి యుత్తమగ్రంథమును రచియించి సర్వస్వామ్యసంకలితముల మాకొసగినను ఉభయభాషాకోవిదులును, సుప్రసిద్ధ కవితాధురీణులు నగు శ్రీ పూండి పెద్ది లింగమూర్తి పంతులుగారికి మా వినయపూర్వక వందనము లర్పించుచున్నాము. వీరశైవుల ఆదరాతిశయముల ననుసరించి యింక నిట్టి యుత్తమగ్రంథములఁ బ్రకటింపనెంచి భక్తవరుల ప్రోత్సాహము నకై యెదురుచూచుచున్నాము.

ఇట్లు,

కాళహస్తి తమ్మయ దేవర.

---

# విషయసూచిక


| నెం. | | పుట |
|---|---|---|
| 1 | నారదుడు శివునకు లోకవార్త లెరిగించుట | 2 |
| 2 | నందికేశ్వరుని భూమిపై నవతరించుటకు బంపెదనని నారదునకు శివుడు చెప్పుట | 3 |
| 3 | పార్వతి శివుని నందికేశ్వరునకు, దనకు, గల భేదత్వమునకు కారణమడుగుట | 3 |
| 4 | నందికేశ్వరునకు, దనకు, గలయు భేదత్వమునకు గల కారణంబు, శివుడు పార్వతికి జెప్పుట | 4 |
| 5 | శిలాద ఋషి వృత్తాంతము. | 4 |
| 6 | ధర్మదేవత వృషభ రూపమున జనించుట | 5 |
| 7 | నంది శిలాదునకు, పుత్రుడై, జనించుట | 5 |
| 8 | శివుడు బ్రహ్మాది దేవతలతో నందికేశ్వరుడు భృత్యుడు మైవరము లొసంగుట | 8 |
| 9 | మండ్రింగి మాదిరాజకథ | 10 |
| 10 | మాదమాంబ నంది నోము నోచుట | 11 |
| 11 | మాదమాంబ గర్భవతి యగుట | 12 |
| 12 | నందికేశ్వరుడు మాదమాంబకు స్వప్నమునందు సాక్షాత్కరించుట | 14 |
| 13 | శ్రీ బసవేశ్వరుని యవతారఘట్టము | 15 |
| 14 | బసవనకు జాతకర్మ నామకరణంబులు | 17 |
| 15 | బసవన్న ఉపనయన మక్కరలేదనుట | 18 |
| 16 | తండ్రి కుమారున కుపనయన మవశ్యకర్తవ్యమని జెప్పుట. | 19 |
| 17 | బసవన్న భక్తిమార్గమునకు బ్రాహ్మణ్యంబునకు గల భేదము తండ్రికి జెప్పుట. | 20 |
| 18 | బసవన్న తండ్రికి శంభుభక్తిప్రకార మెరిగించుట | 22 |
| 19 | బసవన్న వివాహము | 23 |
| 20 | బసవేశ్వరుడు తన గురువును దర్శించుట. | 25 |
| 21 | బసవేశ్వరునకు గురువు హితోపదేశించుట | 27 |
| | —*ద్వితీయాశ్వాసము*— | |
| 22 | బిజ్జలరాజు బసవేశ్వరుని బిలవనంపుట. | 33 |
| 23 | మంత్రులు బసవేశ్వరు నామంత్రము జేయుట. | 34 |
| 24 | బసవేశ్వరుని ప్రధానమంత్రిగా నభిషేకించి యూరేగించుట. | 35 |
| 25 | బసవేశ్వరుడు శివభక్తిని శాసనరూపముగా జేయించుట. | 37 |
| 26 | చెన్నబసవన్న చరిత్ర. | 42 |
| 27 | చెన్నబసవన్న శివభక్తుల గారవించుట. | 43 |
| 28 | అల్లమప్రభువు బసవేశ్వరుని జూడవచ్చుట, | 44 |
| 29 | అల్లమప్రభువునకు బసవన్న షోడశోపచార పూజలొనర్చుట. | 45 |
| 30 | బసవేశ్వరుడు ప్రభువును స్తుతిచేసి ప్రమథగణంబుల కీవృత్తాంతంబు చెప్పుట | 49 |
| 31 | బసవేశ్వరుడల్లమప్రభువు, నీశ్వరునిగా నుతించుట | 53 |
| 32 | బసవేశ్వరునకు శివుడు వరములిచ్చుట. | 53 |

| | | |
|---|---|---|
| 33 | శంకగణలు లింగాయలగుట | 55 |
| 34 | కుంచము శివలింగ మూర్తియగుట | 55 |
| 35 | మేకపెంటిక లింగమగుట | 56 |
| 36 | జొన్నలరాశి లింగాకారమగుట | 57 |
| 37 | జొన్నలరాసి ముత్యములగుట. | 58 |
| 38 | గొడ్డుటావున పాలురాటను బతిమియడిసిన భక్తుడు | 58 |
| 39 | సంగమేశ్వరస్వామి, బసవేశ్వరుని మూడువకన్ను వేడుట | 60 |
| 40 | బసవేశ్వరులు, శివునివంచించి, మతిసేరయుట | 61 |
| 41 | బిజ్జలరాజునకు, బసవేశ్వరుడు తనప్రిభావముజూపుట | 63 |
| 42 | సిద్ధరామక్ర్కతి కధ | 65 |
| 43 | సిద్ధరాముని కైలాసమునకేగుట. | 67 |
| 44 | శివుడు సిద్దరామునకు, బసవేశ్వరునిజూపి అతని ప్రభావమున్యశిఇంపుట | 69 |


—*కృతీయాశ్వాసము*—


| | | |
|---|---|---|
| 45 | బసవనితోఁ్యగమున కోర్వక తొడిమింతి రాజునకుజెప్పుట | 73 |
| 46 | జంగమ విటండొకరడు తన లంజకొరకు బసవేశ్వరుని భార్య గట్టిన పట్టు పుట్టంబడుగును ... | 75 |
| 47 | బసవేశ్వరులు తన భార్యకట్టిన పటుపుట్టము జంగమునకిచ్చుట | 76 |
| 48 | సంధ్యాకాల శివపూజ | 77 |
| 49 | ముగ్ధసంగయ, కథ | 78 |
| 50 | ముగ్ధసంగయ, బసవేశ్వరునితో, తానుచేసిన శివపూజ విధానము జెప్పుట | 81 |
| 51 | చెన్నబసవన్న, బసవేశ్వరులతో నిట్టి భక్తుల గూర్చి ప్రసంగించుట | 82 |
| 52 | బసవేశ్వరులవారు చెన్నబసవని కిరుచప్రిపసుపలి వృత్తాంతమును చెప్పుట. | 82 |
| 53 | నక్క్రయవారికధ | 85 |
| 54 | బిజ్జమహాదేవమ్మకధ | 8h |
| 55 | గొడగూబకధ. | 89 |
| 56 | దీపకదలియూరుకధ. | 91 |
| 57 | నాట్యసమిత్తాండి కధ. | 98 |
| 58 | కాళహస్తి కన్నప్పకధ | 99 |
| 59 | సకలేశ్వర మాదిరాజుకధ | 1[5 |


4 వ ఆశ్వాసము.


| | | |
|---|---|---|
| 60 | మడివాల మాచయ్యకధ | 111 |
| 61 | ఇరువత్తుని వృత్తాంతము | 115 |
| 62 | చాపూరు బ్రిమ్మయ్య కథ. | 116 |
| 63 | బిజ్జనరాజు మాచయ్యను చెరను బొందుట | 119 |
| 64 | బసవన్న మాచయ్యను చెరను బొందుట. | 121 |

| | |
|---|---|
| 65 శంకర దాస్య కథ | 123 |
| 66 జగదేవకమల్లు శంకర దాసును శోధించుట | 124 |
| 67 జేవర దాసయ్య శంకర దాసయ్య పరిణతుండగుట | 125 |
| 68 నిమ్మవ్వ కథ | 126 |
| 69 శిరియాలకథ | 127 |
| 70 మృతుడయిన శ్రీయాళ సుతుండు బ్రతుకుట | 132 |
| 71 నిమ్మవ్వ తన సుతుని జంపుట | 134 |
| 72 నిమ్మకు శివుడు ప్రత్యక్షమగుట | 135 |
| 73 నరసింగనైనారు కథ | 136 |
| 74 హాయుదుని కథ | 138 |
| 75 మరుదుండుని కథ | 145 |
| 76 భానునికథ | 149 |
| 77 కరికాల చోడునికథ | 150 |
| 78 వేనుమూర్తికథ, | 151 |
| 79 కడవలనంచి కథ | 151 |
| 80 గుగ్గుల కరియారు కథ | 152 |
| 81 హరిపాలుని కథ. | 152 |
| 82 అడిభర్త నయనారి కథ | 153 |
| 83 వేదాదినాధుని కథ | 154 |
| 84 చేదివల్లభుని కథ | 155 |
| 85 హరియూరు చోళుని కథ. | 155 |
| 86 కలియంచిన యనారు కథ | 155 |
| 87 యిరువదండి కథ. | 156 |
| 88 దంగుల మారయ్యాకథ | 157 |
| 89 గణసాలుని కథ | 157 |
| 90 కుమ్మరిగుండయ్య కథ | 158 |
| 91 పూసల నరయనారి కథ. | 160 |


—*పంచమాశ్వాసము*—


| | |
|---|---|
| 92 కిన్నర బ్రహ్మయ్య కథ | 163 |
| 93 కలకేత బ్రహ్మయ్య కథ. | 172 |
| 94 మోళిగమారయ్య కథ | 176 |
| 95 కన్నడబ్రహ్మయ్య కథ. | 179 |
| 96 ముసిడి చౌడయ్యకథ. | 183 |
| 97 సురియచౌడయ్యకథ. | 189 |
| 98 తెలగా బొమ్మయ్యకథ | 191 |

99 తిరునావుక్కరశకథ 195

—*ఆరవ ఆశ్వాసము*—

100 ఏకాంత రామయ కథ 198
101 ఇరువదాంధారికథ 202
102 పల్లవయనాయనకు పార్వతిపాలిచ్చిన కథ 202
103 విఘుమారునికథ 208
104 సామ్య తొండనికథ 211
105 కాపూరి బ్రహ్మయ్య కథ 213
106 కేవర దాసయ్య కథ 214
107 నాచి దేవయ్య కథ 226
108 సోమన్న కథ 227
109 దైబకవ్వ కథ 229
110 తిలకవ్వ కథ 233
111 పోడ్డలదేవు బాబయ్య కథ 235
112 బసవేశ్వరులవారు బిజ్జలరాజునకు గంటకర్ణాది శివభక్తు చరితంబు చెప్పుట 240
113 వీరశంకరయ్య కథ 243
114 శివశంకయ్య కథ, 243
115 శంకరదాసయ్య ప్రశంస. 248

—*సప్తమాశ్వాసము*—

117 శివ నాగయ్యాగారి కథ 265
118 కల్లి దేవయ్యాగారి కథ 198
119 బిబ్బిబాచయ్యాగారి కథ. 270
120 మాదరదూడయ్య కథ. 273
121 ఉద్భటాయ్యని కథ 275
122 డోహార కక్కయ్య కథ 277
123 జోగిదేవయ్య కథ. 179
124 గుడ్డవ్వ కథ 281
125 భక్తులు విషాస్వాదన కథ 285
126 గజదేవుని కథ 287
127 ఏకేశ్వర కేశయ్య కథ, 291
128 సవరదనాగరయ్య కథ 292
129 మల్లయ్య మదువయ్య కథ 296

సంపూర్ణము



శ్రీమదుమామహేశ్వరాభ్యాం నమః

శ్రీ

# బసవపురాణము.

వచనకావ్యము.

---

శ్రీమదనంతకళ్యాణభాజనంబై, భూజనంబుల - కాశ్చర్యజనకం బగు దేవభూమియందు నానావిధపుష్పఫలంబులతో నతిశయించువృక్షజాలంబులు గలిఁగి, లతాగుల్మవితానంబుల నుల్లసిల్లుచుఁ బార్వతీపరమేశ్వరులకు విహారయోగ్యంబు లగు క్రీడోద్యానవనబహుళంబగు కైలాసంబను ప్రసిద్ధికెక్కిన పర్వతరాజం బొకటి కలదు. అందొక నాఁడు పార్వతీసహితుండైన పరమేశ్వరుఁడు నందీశభృంగీశాదిప్రమథగణపరిసేవితుఁడై లోకోపకారార్థంబుగా వామాంకంబున నున్న కాత్యాయనీదేవి యడుగుఁ బ్రశ్నంబుల కుత్తరంబు విచ్చుచున్న యవసరంబున శారదనీరదప్రభాభాసమానుండగు నారదమహా మునీశ్వరుండు శివుని దర్శింపనేఁగి యంజలిఘటించి నిలుచున్నతఱి నంబికానాథుండు తన చంద్రబింబాంబకంబు నందలి యపాంగదృష్టి నిలిపి కరుణాతరంగితాంతరంగుండై యాతని నిలువెల్లఁ దిలకించుచుండ నాత్మకునభిప్రాయంబెఱింగి సమయజ్ఞయగుట నప్పరమేశ్వరి చేసన్న నారదు నిటురమ్మని యామంత్రణంబుసేయ నాతండభవునికి సమీపవర్తియై నిలుచున్నంజూచి స్వామియాతని ననూనయించి "వత్సా! లోకత్రయం

బున స్వేచ్ఛా విహారివగుని కనాలోక్యంబు భావ్యంబునగు నర్థం బొక్కటియు లేదుగాన భూలోకంబు నందలి విశేషంబుల నామూలాగ్రంబులుగా నాకెఱింగింపుమని యానతిచ్చుటయు నాదేవమునివర్యుండు చేతులు జోడించి యుమాధ్యాపతితో నిట్లని విన్నవించె.

ఈ నారదుఁడు శివునకు లోకవార్త తెలియించుట ఈ

దేవా! దేవుల కెల్ల నాదిదేవుండవు నీవ కావె నీవలననే గదా యీ యనేకల చరాచర జంతు జాలంబుచే నొప్పుచున్న స్థావర జంగమాది భూతప్రపంచంబుల సృష్టిస్థితిలయంబులు జరుగుచున్నవి నీ సోమసూర్య నేత్రంబుల జగంబు లుద్భవిల్లుచున్నవి. నీవు సర్వదాయీ రెండు కన్నులు తెఱచియే యుంచుదువు వానివలననే సస్యౌషధ్యాదు లుద్భవించి భూతదేహంబులం బెంచి జీవాభివృద్ధిం గావించుచున్నవి నీ వగ్ని నేత్రంబున లోకంబుల నీక్షించితివేని, బరాత్పరా, యేమి చెప్పుదు. సమస్తభూత ప్రపంచంబును బంచత్వంబు నొందుట యేగాక భస్మరూపావశిష్టంబగును. ఇట్టి మహానుభావుండవగు నిన్ను భజింపని వారెవ్వరగు? ఏలోకంబునఁ జూచిన నీభక్తులే. అన్నిటికన్న భూలోకమున నీభక్తి యధికంబు. ఎక్కడఁ జూచిన నీయాలయంబులే వానిలో నెల్ల నీలింగాకార దైవత విగ్రహములే నీభక్తి చిహ్నంబు లేని యంగంబును నీనామస్మరణంబు లేని వదనంబును గల మానవుం డొక్కండును లేఁడు. ఐనను, అనాదియగు నీమతంబు భూలోకంబున నింత యభివృద్ధి దశయందుండఁగాఁ బ్రకృతమున, నో భూతేశా! ఏమికారణముననో యది యడుగంటినది. నిత్యనైమిత్తిక శివపూజాధురంధరు లెందునుఁగానరారు. కొందఱు భక్తులవలెఁగనఁ బడుదురు గాని వారే దేవునారాధింతురో తెలియదు వారొకరికి బోధింపరు, ఇతరుల బోధలకుఁ జెవియొగ్గరు మఱి కొందఱు కేవల వీరశైవులు తమ యఱువది నాలుగు వేళల శివపూజలందు మునుంగుచు మౌనముద్రఁ దాల్చి

యులెగులతో మాటాడకుండుటచే నీమతబోధకులు లేరు ఇట్టి సమయ
మున దేవా! నీవు భూలోకమున నవతరించి మతోద్ధారకుఁడవై మత
బోధసేయుచు నీదైవబలంబున లోకములోని మానవులకును వితండవా
దులకును గొన్ని ప్రత్యక్షప్రమాణములు గనపర్చుచు నమానుషకృ
త్యంబులఁ గొన్నిఁ జేసి ప్రజలకు నమ్మకము బుట్టింపవేనిఁ గొలఁది
కాలంబున బౌద్ధమత ప్రచారకుల దాడికి నోడి నీమతము రూపుమా
యునని నాకు భయంబు గలుగుచున్నది. కావున వేఁగ జనింపవయ్యా
యని వినమితోత్తమాంగుఁడై విన్నవించెను

నందికేశ్వరుని భూమిపై నవతరించుటకుఁ బంపుమని శివుండు
నారదునకుఁ జెప్పుట.

అది విని భగవంతుండగు పరమశివుండు "నారదా! నీవిఁక విచా
రింపకుము నాకును నందికేశ్వరునకును భేదమించుకయును లేదు, నేనా
తని భూలోకమున నవతరింపుమని చెప్పిపంపెదను అతఁడు మదీయాం
శంబున మానవరూపంబున జన్మించి నామతంబు నుద్ధరింపఁ గలవాఁ
డు" అని నారదునికిం జెప్పిన వాక్యంబులు విని యంబికాదేవి స్వామి
కిట్లనియె

పార్వతి శివుని నందికేశ్వరునకుఁ దనకుఁగల యభేదత్వంబునకుఁ
గారణమడుగుట

ప్రాణనాథా! నందికిని మీకు నావంతయును భేదము లేక మీరి
ద్దఱొక్క రూపులరని యీదేవమునితో నానతిచ్చితిరి. భక్తులకును
మీకును సారూప్యసంబంధముండుటం జేసి వారికిని మీకును భేదము లే
దని నేనెఱుంగుదును. మీయగ్రభక్తుండును ప్రమథగణాధినాథుండున
గు నందికిని మీకునట్టి యభేదసంబంధమేనా మఱియొక హేతువేమైన
నున్నదా యని యడిగెను అదివిని యీశ్వరుఁడు "దేవీ! నీ సంప్రశ్నం
బులెల్లపుడును లోకోపకారార్థములు.

### నందికేశ్వరునకుఁ దనకుఁ గలయభేదత్వమునకు వేఱుకారణంబు శివుఁడు పార్వతికిఁ జెప్పుట

ఇందుమూలముగ లోకమునకుఁ గొన్ని దేవరహస్యము వెల్లడి కాఁగలదు. నందీశునకును నాకునుఁ గల యభేదమునకు నొక పూర్వ వృత్తాంతము గలదు. అదివినిపించెద నాకర్ణింపుము" అని నారదుఁడు వినుచుండఁ దత్పూర్వచరితం బిట్లని చెప్పఁదొడంగె

### శిలాదఋషి వృత్తాంతము

ప్రేయసీ! పూర్వకాలమునందు శిలాదుఁడనునొక మునిశ్రేష్ఠుండు గలఁడు. అతం డతిఘోరముగ నున్నఁ బార్వతి శ్రీశైల నైఋతి దిగ్భాగమునఁ గందమూలాదుల వర్జించి, చంద్రకిరణ గ్రహణంబున జఠరాగ్నినిఁ జల్లపఱచుకొనుచు నితరాహారములు లేక యానవగింజలంతటి చిన్నచిన్న రాళ్లె తనకాహారముగాఁ గలవాఁడై మూఁడుకోట్ల సంవత్సరములు దపంబొనరించెను. అట్టి తపంబునకు నే మెచ్చి యతనికిఁ బుత్రసంతాన వాంఛ దప్ప నితర కోరికలతని మనంబున లేవని నేనెఱింగిన వాఁడను గనుక, ప్రత్యక్షదర్శన మిచ్చి వరంబుఁ గోరుకొమ్మంటిని. అంత నతండు దేవా! నీదివ్యదర్శనప్రాప్తికన్న వరంబు మఱొండేమియున్నది యైనను వరదుండవగు నీవడుగుమని యాదేశించి నపుడు నే నూరకుండఁ గూడదు. నన్నుఁ గ్రహింపఁ దలచితివేని నీయందలి నిశ్చలభక్తిగల పుత్రరత్నమునకు నాకుఁ బ్రసాదింపుము. కాని, యోపరమేశ్వరా! నీవొసంగు కుమారుండు నీభక్తిలేనివాఁ డయ్యెనేని వానిం దత్క్షణము తలద్రుంచి చంపివేతును. అప్పుడు నీవడ్డుకొనినను విడువను. నీకిష్టమైన నిట్టివరం బొసంగుము, కాదేని నీవచ్చినత్రోవన మరుఁగుము. నాతపోదీక్ష నేనుండెద." అనుటయు నేను భావమాత్రమున నతికుతూహలుండనై "తథాస్తు" అని మఱలివచ్చి యెవ్వని వీనికి సుతుఁగా నంపుదునని యోచించుచుంటిని. ఇట్లుండఁ దొల్లియొం

దాత్రాది దేవతలును స్వర్గంబును దేవముని పుంగవులును లేని
కాలమందు నాముఖంబున జనించి వృషభరూపమున సమస్త

**ధర్మదేవత వృషభరూపమున జనించుట**

లోకముల సంచరించు ధర్మదేవత కృతయుగంబున నాలుగు
కాళ్ళతోను, త్రేతను మూడు పాదములతోడను, ద్వాపరంబునఁ జర
ణద్వితయంబుతోడను, కలివేళ నొంటికాలితోను సంచరించుచు నా
నాయుగంబుల ధర్మాధర్మంబు లెఱుంగుచు నాకు నెఱింగింపుచు నా
వాహనంబై నన్నుఁ గొలిచియుండు నందినిగని, "యోనందీ! నీవు శిలా

**ఈశ్వరుఁడు నందిని శిలాదునకుఁ బుట్టఁగాఁ జనుమనుట**

దుఁడను మునికి నందికేశ్వరుఁడను నామంబునఁ బుత్త్రరూపంబున జనిం
పుము అతఁడు నన్నుగూర్చి ఘోరతపంబు సేసెను నాయందు నిశ్చల
భక్తిగల సుతుండు వృషమానంగ లని మపేక్షించెను అట్టిసుతుఁడవు
నీవయగుదువుగాని యొరులు గానేరరు నీవందుల కొడంబడని వాఁడు
నేనయతనికిఁ బుట్టవలసి యున్నది" అనునంతలో నాతం డతిప్రీతుండై
మహాప్రసాదంబని "దేవా! మీయాజ్ఞ నెన్నఁడేని మీఱితినా? ఇఁక
మీఱుదునా. నీయాజ్ఞానుసారంబుగా నతనికిఁ బుత్త్రుఁడనై జనించెద"
నని తత్క్షణముననే యాయాదివృషభంబగు నావాహన ధర్మదేవత శిలా

**నంది శిలాదునకుఁ బుత్త్రుఁడై జనించుట**

దునకు నందికేశ్వరుఁడను నామంబునఁ బుత్త్రుఁడై ప్రభవించె ఇట్లు
దయించిన యానందికేశ్వరున కేమి సెప్పుదు నోనగాత్మజా, పుట్టువుతోడనే
నాయందలి నిశ్చలభక్తి యుదయించె. భక్తికిముందే పూర్వజ్ఞాన సంప
న్నుఁడయ్యెను వేదవేదాంగపారంగతుఁడయ్యెను. గురుబోధ లేకయుతన
కుఁదానే సమస్తధర్మంబుల నెఱింగి సంపూర్ణ శివజ్ఞాన పరిపూరిత మన
స్కుఁడై శివాచారధురీణుఁడై యఖండ శివపూజాపరత్వమున శివనిష్ఠా
గరిష్ఠుండయ్యె ఇట్లుండి కొండొకకాలంబునకు నందికేశ్వరుఁడు దపం

బాచరింపం గడంగి హేమంతకాలంబునఁ బాఱుచున్న యేళ్లయందును నిర్మల శీతలజలోపేతంబులగు వారిపూరిత జలాశయంబులను జానుదఘ్న కంఠదఘ్నంబులుగా నిలుచుండియు, మండువేసవిని బంచాగ్నిమధ్యంబునను శుష్క పర్ణ వాతాంబు భక్షణంబున క్షుదుపశమనంబుఁ గావించుకొనుచు నేకాగ్రదృష్టిని పాదాంగుష్ఠంబున నిల్చి యుగ్రతపం బాచరించుచుండె. వానితపోగ్నిచే నుద్భవించిన ధూమజ్వాలలు లోకంబు నాక్రమించి దహింపంగడంగుటయు బ్రహ్మాదిదేవతలును దిక్పాలురును దేవమానవమునులును కైలాసంబునకరుదెంచి శివసూక్తంబులను బరమేశ్వరుండ నగునన్ను స్తుతించిన నేను ప్రత్యక్షుండనై "యో దేవతలారా! యోమునులారా! మీయాగమనంబునకుఁ గారణంబు నే నెఱుంగుదును నందికేశ్వరుని యుగ్రతపంబునకు మీరెల్లరు వెఱచి తన్నివృత్తికై నన్నుఁ బ్రార్థింపవచ్చినవారు వానితపస్సునకుఁ గారణంబు నాకుఁ దెలియును వానికి బ్రహ్మవిష్ణ్వాదిపదవులక్కఱలేదు తనకచ్చెపిన న్నాపదవినైన నొల్లఁడు. వానియభిమతం బెఱుంగుదును ఈక్షణంబున మీరేఁగుడని నేఁగుదెంచి వానితపంబుచే లోకంబులకు శాంతిగావింతును పదం" డని శివుండు నారదమహామునియుఁ దోడరా నిఖిల

❧శివుండు బ్రహ్మాదిదేవతలతో నందికేశ్వరునకుఁ బ్రత్యక్షమై వరంబొసంగుట❧

ప్రమథగణసమేతుండనై యేఁగి నందికేశ్వరునకుఁ బ్రత్యక్షంబగుటయు నాతండు పరమహర్షోత్కర్షుండై సాష్టాంగనమస్కారము సేసి పులకితనిజతనూరుహుండై "స్వామీ! శివా! శంకరా! త్రిపురాసురసంహారీ! దక్షాధ్వరధ్వంస! పార్వతీమనఃప్రియా! గజచర్మాంబరా! చంద్రశేఖరా! నాగభూషణా! గంగాజటాజూటా! కపటశైలాటా! భక్తమనోభీష్టఫలప్రదాయకా!" యని యనేకభంగుల స్తోత్రము సేసిన నేను సంతసిల్లి "నందీ! నీకుఁ గోరినవరము లిచ్చుటకు వచ్చితిని. కోరు" మంటిని. అంతనానందికేశ్వరుఁ

డిట్లనియె. "దేవా! దేవతలకైన నలభ్యంబగు నీనిజరూపదర్శన మీయ ల్పతపంబున నొందఁజాలితి నాజన్మము సార్థకమయ్యెను. నాతపమ్ము సా ఫల్యము నొందెను నాకు మఱి యేవరంబు నక్కఱలేదు ఒక్కవరమే చాలును. అది యేమనిన, నీ దివ్యపద్మముల దు నిశ్చలభక్తి నామనంబునఁ జిరంబుగా సర్వకాలసర్వావస్థల యందును నాటుకొని యుండవలెననుటయె ఇంతకన్న మఱివరము లేల? ఇతరవరములు పదివేలు, పదిలక్షలు, పదికోట్లు, లెక్కలేని యసంఖ్యాకములైన నీవరంబునకు సాటిగావు." ఇట్లు పలికెను నందిముద్దుమాటలకు నాకపరిమితసంతోషము గలిగి యతనిగాత్రస్పర్శ సర్వదా నాకుఁ గావలె ననియెడి కుతూహలంబునఁ దాను తొలిజన్మంబున నాకు వృషభరూపంబున వాహనం బగుట నాతని కెఱింగించి తద్రూపమున నే వాహనముగా నుండుమని యంగీకరించితిని మఱియుఁ బూర్వజ్ఞానసంపన్నుండై వృషభరూపవాహనం బవును దేవరూప ప్రమథగణాధిపతివినై యుండు" మని యానతిచ్చితిని. అంతబ్రహ్మాదిదేవతలు నన్ననేక విధంబులఁ గొనియాడి నిజనివాసంబుల కరిగిరి నాగముఁడొక్కఁడు మాత్రము నాయొద్ద నిలిచియుండెను. అది నీవెఱుంగుదువు. నందికేశ్వరుఁడు తపమ్ముచేసిన ప్రదేశమునకు నందిమండలమని పేరు అచ్చోట సంభవించు ప్రతిజీవికి నేను మోక్షంబ నపేక్షితంబుగా నొసంగెదను. ఈనందిచరిత్ర మెవ రేని లిఖించి పూజించినను భక్తిశ్రద్ధలతోఁ జదివినను విన్నను, అట్టివారికి మనశ్శుద్ధియు, నాయుర్వృద్ధియు, నిర్మలబుద్ధియు, భక్తిసంసిద్ధియుఁ గలుగును. అని యిట్లు భర్తచే వినుపఁబడిన నందికేశ్వరువృత్తాంతంబంతయు విని పార్వతియమందానందంబునొంది యాతనికిట్లనియె "హృదయేశ్వరా! నంది మిమ్ముఁ గూర్చి చేసిన ఘోరతపంబునకు మెచ్చి మీ రాతనికి మీసారూప్య మిచ్చుటయే గాక సదాత్మగాత్రస్పర్శ కలుఁగునటుల వాహనంబుగా నంగీకరించితిరి సర్వదా మీశరీరమును దనశరీరము

నొకదానినొకటి స్పర్శించుకొనుచుండుటచే మీరిద్దఱు నేకదేహులరని స్పష్టపడుచున్నది దానంజేసిగదా మీకును నాతనికిని భేదములేదని తొల్లి మీరానతిచ్చితిరి. దానికాశ్చర్యమేమి ఇప్పుడునాకుఁగల మీ యభేదభావంబునందుల సందియంబువాసెను.'' అనిపార్వతి యనునంతలో భగవంతుఁడు నారదునిఁ జూచి "నారదా! నందికేశ్వరు నుదంతం బంతయుఁ వింటివా" యనియడిగెను అందుకునారదుండును "స్వామీ! సాంబసదాశివా, మహాదేవా, మీమహిమ మేమనికొనియాడుదు మీ రానతిచ్చినదంతయు సాకల్యంబుగావింటిని కృతార్థుఁడనైతిని మీదివ్య దర్శనలాభంబున నేఁడొక దేవరహస్యము వినఁగల్గితిని అనియనేకవిధం బుల నుతించి యూరకుండెను. ఈవిధంబునఁ బార్వతికిని నారదునకును దనపూర్వవృత్తాంతమంతయుఁ జెప్పియూరకున్న యీశ్వరునకు నంది కేశ్వరుఁడు చేతులుజోడించి వినయభయభక్తులతో స్తోత్రములు సేయ నారభించెను.

## ఈశ్వరుఁడు నందికేశ్వరుని భూలోకములోఁ బుట్టుమనుట

అదిగని పరమేశ్వరుఁడు నందీశునిఁ జేసన్నందననమీపంబునకుఁ బిల్చి "ఓయీ! నందీ, నీతపః ప్రభావంబును, నీపూర్వోత్తర సందర్భ సచ్చరితంబును బార్వతి తామె గోరినందున సవిస్తరంబురా నెఱింగించి నీకును నాకునుఁగల యభేదత్వమును సైతము స్పష్టపఱచితిని. ప్రస్తుతము భూలోకమంతయు నాస్తికమత భూయిష్ఠమై జనులమనంబుల భక్తియనువాసనయె లేక యున్నది నీకృతంబునఁగాని భక్తిమజల మొలకయెత్తదు గాన నీవు మానవుండవై బసవన్నయను పేరనాయంశతో భూమి యందావిర్భవించి యడుగంటిన శివభక్తిని మజల జనుల మనః ప్రదేశంబుల మొలిపించి తగిన బోధలచేతను, తగినమహిమాతిశయంబులు గనఁబఱచి వారలకు నీవు దైవికసామర్థ్యాతిశయంబులు గల యవతారపురుషుఁడవని నమ్మకము పుట్టించుటచే తను శివభక్తి

యనెడు మొలకకుఁ దగిన దోహదంబొనర్చి దాని వృద్ధిఁ బొందింపవ లెను. అట్లు సేసిన నీయపరశింభుత్వము లోకమునకుఁ దేటపడును, అప్పుడు సమస్తజనులును నీవే నేనని నమ్మెదరుగాన మనుష్యాకారముతో క్షణము భూలోకమున నవతరించుచుండుము చనుము'' అనియానతిచ్చెను. అదివిని నందికేశ్వరుఁడు "స్వామీ! యీస్వల్పకార్యమునకు మీ రిట్లు నన్ను బహిష్కరింపవలెనా! మీదాసుఁడను గానా మీయాజ్ఞ సర్వదా శిరసావహించువాఁడను గానా మీవొక్కమాటలో నానతిచ్చినఁ జాల దా. నీవిట్లుతగా పన్నుగ్రహ వారము సేయవలెనా? "చిత్తము"మన్ని మీయాజ్ఞ శిరంబునఁ దాల్చి మీపాదపద్మంబుల కెఱఁగి యీక్షణము భూలోకంబున కేఁగుచున్నవాఁడను. గాని, యోభక్తవత్సలా! యొక చిన్నవిన్నపము నాకెందున్నను మీయంఘ్రిసరోజములందలి నిశ్చల భక్తిమాత్రము పూర్ణముగా నుండవలెను అదితొలగిన నేనొకనిమి షమైనను బ్రతుకఁజాలను మీయనుగ్రహంబు నాయందుంచి మీ దం ద్రబింబాంబశీతలదృష్టిమాత్రము నాయందుఁ బ్రసరింపఁజేసినఁ జాలు ను అట్లయిన నాకిందున్నను భూమియందున్నను సమానమే ఇదియ నా కోరికె ఇఁక నేనేఁగెద'' నని వేడుకొని పోవుచున్న నందీశుని భగవంతుం డు తనసమీపంబునకుఁ బిలిచి "నందీ! వేగమపద. నేఁజెప్పినట్లు నీయు ము నిన్ను నేవిడువను సర్వదా నీకు సన్నిహితుండనై యుండెద. నీకుఁ దొలిగురువును నేన యగుదును నీప్రాణలింగమనై నీకంఠంబున వ్రేలా డుచుందును నీతో నెల్లప్పుడు జంగమమునిరూపమునఁ గూఁడియుం దును. నాదేహస్పర్శ నీకుఁ గలుఁగఁజేసె నీచేత ఘనకార్యంబులు సే యింతును. నీమూలమున ననేకములగు దేవమాహాత్మ్యములను లోకము నకుఁ జూఁపుదును. నీవే నాప్రాణమవు నాప్రమథగణములకును నీవే ప్రాణమవు. ఇంతయేల నీవే నేను నేనేనీవు" అని యనేకవిధంబుల నూరార్చియనిపెను అంత నంది కేశ్వరుఁడు స్వామి పాదములకు మ్రొక్కి

వాసిని మరసాచూచుచు భగవన్నామస్మరణచేయుచు భూలోకమునకు వచ్చి యెవ్వనికిఁ బుత్రుఁడనై జనింతునని ఏస్త్రీగర్భము పరమపవిత్రమైనదని తలఁచి యోచించుకొనుచుండెను

## మండెఁగమాదిరాజకథ

అంత నిక్కడ (అనఁగా భూలోకమున) ఏదేశమందలి యొకల ప్పయు గంగానదీతోయంబులో యొండి శిలలెల్లను లింగమూర్తులో యెచ్చటి మనుజులెల్లను మహాత్ములో యెవ్వరి లీలావిహారములు యాజ్ఞాక్రియలో యెవ్వరు చేయు సమస్త క్రియలు శివార్పితములో వాక్కులు స్తోత్రములో, విభూతి బాధయో, పదచలనము ప్రదక్షిణమో యిట్టి తన్మయభావంబునను ప్రజలుగలదియై సకలసంపదలతో విలసిల్లుచు శ్రీశైలమునకుఁ బశ్చిమదిశను, కర్ణాటకమను పేరుగల యొక దేశమున్నది. అందు భూదేవికిఁ గంఠహారమువలె నొప్పుచుండిన హింగుళేశ్వరమను నొకపట్టణంబుగలదు. అందుఁ గేవలశివభక్తిపరాయణుండును పాపరహితప్రచారుఁడు నగు మండెఁగమాదిరాజను నొకబ్రాహ్మణప్రవరుఁడు గలఁడు అతనికి సమస్తసద్గుణాలంకారయగుచుఁ బతిశుశ్రూషయే ప్రధానవ్రతముగాఁ గల మహాపతివ్రతాశిరోమణి యగు మాదమాంబ యను ధర్మపత్నియుండెను ఆమె భర్తయొక్క కనుసన్నచే నాతనియభిప్రాయంబెఱిఁగి యతిథిసంతర్పణంబుచేయుచును అత్తమామల సేవయందును భావలను మఱఁదులను గౌరవాదరభావంబునఁ గనుచుండును, అంగవైకల్యులు సన్యాసులగు దీనులఁ గని రక్షించుచుండును మొదలగు వివిధపనులయందు సర్వదా జాగరూకురాలై మెలఁగుచుండును. కలిమిచేఁ దులఁదూఁగుచు భర్తృమనఃప్రమోదకరురాలై యుండును. ఆమెకుఁగలకొఱఁత యేమియులేదు గాని సంతానరాహిత్యమను మహావ్యసనమొక్కటియే యామెమనస్సునందు దూఁగులాడుచుండెను. ఉత్తమసంతానప్రాప్తి యెట్లుగలుగునని పెద్దలనడుగుచుండెను.

గడువరి సపార సమస్తపదార్థంబులఁ దృప్తికరంబుగ భోజనంబిడి బహుళదక్షిణలతోఁ గర్పూర తాంబూలంబులొసంగి, కేలుదోయి జోడించి ధ్యానించుచు నెదుట నిలువఁబడి యుండెను అంత నందికేశ్వరుఁడు జనులెల్లరుఁ జూచుచుండ, వాయువశంబునఁ దనకుఁ బూజగా నిడఁబడిన బిల్వపుష్ప ప్రసాదంబామె హస్తగతంబగు నటుల సేసెను. మాదమాంబయుఁ దత్ప్రసాదంబు సక్కనఁ జేర్చి కండ్లనద్దుకొని మగనిచేతికిచ్చి యాయన వలన నక్షతల గ్రహించి శిరంబునందాలిచి, యథాప్రకారముగా నింటికేఁగి భార్యాభర్తలు సుఖంబునఁ గాలముఁ గడుపుచుండిరి. మాదమాంబ "నందికేశ్వరు ననుగ్రహం బెప్పుడువచ్చెను. ఎప్పుడు గర్భవతినై సుతుంగనియెదనను తలంపు దక్కఁ దన మానసంబున నితరచింత లేక యుండెను

## మాదమాంబ గర్భవతి యగుట.

నందికేశ్వరుఁడును గొంత యవతారంబునకే యాతని గర్భంబునఁబడవలెనని తలంచుచుండెను గావున "నీయమ మహాపతివ్రత ఉత్తమ బ్రాహ్మణుని భార్య సకలైశ్వర్యములతోఁ దులదూఁగుచున్నది విశేషించి నన్నుఁగూర్చి నానోము నోచి నావంటి పుత్రునిఁ గోరినది. నావంటి సుతుఁడు నేనగాక మఱి యెవ్వఁడుండును. ఇంతకుఁ బరమేశ్వరు నానతిని నేను భూలోకమున నవతరింప వలసియున్నది కాలము కర్మముంగూడ సమకూడె. పరమ పవిత్రమగు నీకుమాద నేత్ర గర్భంబు పాధిమాత్రంబు సేసికొని యవతరించెదను" అని నిశ్చయించుకొని నిజచైతన్యంబా మాదమాంబ గర్భంబునం జొఱఁబెట్టెను అంత నెచ్చెలులొకానొక దినంబున నామెకుఁ గలయంటి యలసమర్చి గర్భలక్షణములంగని యిట్లు "తల్లీ! నీముఖంబు వెలవెలఁ బాఱుచున్నది చెక్కిళ్ళు తెల్లఁబాఱినవి చూచుకములు నల్లఁబాఱినవి నడుముగనఁబడుచున్నది నల్లచీమలబాఱువలె నూగారు తీరుగానున్నది. పొత్తికడుపు మూఁడు

ముబోర్లించినట్లున్నది ఈమధ్య నీ వెప్పుడెపుడు భుజించి యోకిలించుట యు మేము గనిపెట్టితిమి అవియు వేవుళ్ళను కొంటిమి" అని చెలికత్తె యలు చెప్పుచున్నంతట నందొకతె మెల్లనఁ జనువ్రన సనవున సాహసించి ఎత్తికొనుచు "అమ్మా! పాలిండ్లఁ బాలునుం బడినవి ఇఁక గర్భవతివి గాని సామాన్యవనితవుగావు మేము నిశ్చయముగా నొక్కి బక్కాణింపఁగలము నందికేశ్వరుఁడు మనలననుగ్రహించె. ఇది మూడవమాసపు గర్భము ఇఁక నాలుగుమాసముల నీవు సత్పుత్రుండు పుడమఁగలఁడు మాభాగ్యమేమని కొనియాడుదుము సఫలమనోరథవగు నినుఁజూచి నీయూడిగంబులు సేయఁగలిగితిమి నీవేదినమున బుతుస్నాతవైతివొ జ్ఞాపకము దెచ్చుకొనుము నాఁటినుండి మాసగణన సేయవలెను" అని చెప్పెను అది విని మాదమాంబికయు "సైదోడులారా! నన్నేల యొకసక్కెము లాడెదరు నాకింతటి భాగ్యముబ్బునా" యనుచుఁ దానును వారు చెప్పిన గర్భలక్షణములను గుర్తించుకొని లోలోన సంతసిల్లుచు నందికేశ్వరుని ధ్యానించుచుండెను ఇట్లు క్రమక్రమంబునఁ బూలు ముదిరి తత్తన్మాసంబుల నగుపడవలయు లక్షణంబులు క్రమక్రమసూచితంబులు కాఁగా తొమ్మిది నెలలు దాఁటి పదియవ మాసమునైతము గొంచమెక్కున తక్కునగా నతిక్రమింపఁ గడఁగినది సుఖప్రసూతి కై యెదురు సూచుచున్న పరిచారికలును దానును "పదియవ నెలయుఁ దాఁటవచ్చినది ఇదియేమివింత. కలిగిన దానికి ఫలము లేకపోవునను [illegible]యు నొక దైవశోధవలె నున్నది మనమేమి సేయఁగలము దైవానుగ్రహమునకు కెదురు సూడవలసినదే." యని దృఢనిశ్చయులై యుండిరి ఈరీతిని మూఁడు సంవత్సరములు గర్భములో లోనవృద్ధిబొందెను గాని ప్రసవము కాలేదు. అంత మాదమాంబ యొక దినమున సపరివారయై రహస్యముగా సంగిగుడికేఁగి "నాతండ్రీ! నందీశా, అపరరుద్రా. నీయనుగ్రహమున గర్భధారణంబు గలిగెను.

నేను సర్వదా నీకు సన్నిహితుండనై యుండ నీకింతసంతాపమేల అమ్మా! నీవనుకొనినట్టుల నీశిరియొక యపూర్వగర్భముగాని నారీజన సామాన్య గర్భముగాదు నీయుదరంబున నున్నవాఁడు నిశ్చలశివజ్ఞానధురీణుండైన మహానుభావుండు శివుని ముఖమునుండి యావిర్భవించిన యావృషభమూర్తి నందికేశ్వరుఁడను నామముఁగల దేవుండుగా జనించి, పమ్మట మహాతపంబొనర్చి, పరమేశ్వరుననుగ్రహంబువడసి, భూతనివారణార్థము భక్తహితార్థంబుగా నీయుదరంబున నుండి భూలోకంబున నవతరింపనున్నవాఁడు ఇఁక నేల దాపవలెను. ఓజననీ! నీగర్భంబుతోనున్న పండువుఁ జేయుమీ నావంటి సుతునిమ్మని నీవు నన్నభ్యర్థించితివి నావంటివాఁడను నేనెగదా కనుక నేనె యీభూలోకంబున నశించిన శివభక్తిని మఱలనుద్ధరింప నవతరించుచున్నవాఁడను ఇట్టి నేను నీగర్భస్థుండనై యుండఁగా నీకింత భయమేలని నన్నునమ్మినదానవు. నీవు సర్వదా శుభమగుదువు. అతిశీఘ్రంబునఁ బ్రసవించెదవు. నీకు బుట్టిన శిశువునకు బసవన్నయని పేరుపెట్టుము అతఁడు శ్రేయస్కాముండై బౌద్ధులనాస్తికత్వంబుఁదొలఁచి శివమతస్థాపనంబు సేయఁగలవాఁడు" అని చెప్పి యంతర్హితుండయ్యె అంత మాదమాంబ స్వప్నంబునఁ గన్నులారఁ గాంచిన వంకని గన్నువిప్పి చూడలేక పరమాశ్చర్యంబునొంది యదినందికేశ్వరుని స్వప్నసాక్షాత్కారమని యెంచి సంతసించి నందీశస్మరణపూర్వకంబుగా చెలికత్తియల సమూహంబుతో నింటికేఁగి తనజన్మము సాఫల్యము నొందెనని కుమారాభ్యుదయంబెదురు సూచుచుండెను

### శ్రీబసవేశ్వరునియవతారఘట్టము

ఇట్లుండ నొకానొక శుభదినమున్నను శుభనక్షత్ర శుభగ్రహసంపత్తిగల యభిజన్మహూర్తంబున గర్కాటకలగ్నంబున మాదమాంబగర్భస్థంబగు నందికేశ్వరచైతన్యంబు తదంతర్గతంబైన సశివ

తత్త్వంబు దన్నుఁబురికొల్ప వత్సరత్రయసంవర్ధమానంబగు భౌతిక దేహంబుతో శివధ్యానపరాయణుండై తేజోభిముఖముగఁ దనయెదుట సాక్షాత్కరించి యంతర్దృష్టిసమ్యగ్గోచరుండగుచున్న శివునకు సాష్టాంగదండప్రణామం బాచరించుచున్న చందంబున నూర్ధ్వప్రసారితబాహుమృణాళాగ్రకరకమలంబులు ముకుళించి దోర్యుగ మధ్యగతంబగు శిరంబుతో నధోముఖంబుగా భూలోకావతరణంబునకురోసి, రాఁజాలక కాలవిలంబనము సేసి, భగవదాజ్ఞోల్లంఘనంబు సేయ వేరక, తుదకువిధిలేక వచ్చుచున్నవాఁ డన్నవిధంబునఁ గన్నులుమూసికొని సర్వసామాన్య శిశుజనసస్థానావయవంబు వెల్వడి యధఃపతితుండై మానవకిశోరంబై యావిర్భవించునంతలో నాతనియందంతర్హితుండై యున్న శివుండు మునివేషధారియై వచ్చి యబ్బాలునంగంబు సాంగలింగసంగతంబుఁ గావించిచనియె అమ్మునియట్లొనర్చుట యక్కడివారెవ్వరుం గనలేదు కానిబాలుదేహంబున లింగధారణంబుమాత్రము గానవచ్చుచుండెను. అదిగని యందఱు నమందానందసంశయాశ్చర్యంబులు ముప్పిరిఁగొన్న మనంబులఁ జూచుచుండిరి అంతనొకానొక మునిపుంగవుండు తెల్లనిదంతపంక్తిగలవాఁడై, చెవులరుద్రాక్షకుండలంబులు చవుకళించుచుండ, నాకర్ణాయతదీర్ఘలోచనుండై, ఫాలభాగవిన్యస్త భస్మరేఖలతో జటాజూటంబుగలిగి మేనరుద్రాక్షమాలలు వ్రేలాడుచుండ, కక్షభుజమున ఘరి యుంచిన విభూతిభస్త్రికగలిగి యొకచేత ఛత్త్రంబును మఱియొకహస్తంబున దాలును బెత్తమునుఁగలయఁ బట్టికొని, బవిరిగడ్డంబుతోఁ జూచువారి కీతండాహరుండే యనినిశ్చయభావంబుల హృదయనమస్కారంబులు సేయుచుండ నచటికరుదెంచి మాదమాంబంగాంచి యిట్లనియె. ॥సతీతిలకమా! నేనీసమీపంబుననున్న తప్పడి సంగమేశ్వరస్థానంబున మాదనయను నామంబున నివసించెడు మానిని. | ఈబిడ్డఁడు నాసుతుండు నేనెన్నఁడు వీనినెడఁబాసి యుండను.

లోకహితార్థంబు వీఁడు సేయుతుండై నేఁడుదయించినవాఁడు నాయ
నుంగు దనయుంజూచి మదిగుందుకుటచే నేఁడీతనిం గన నేగుదెంచితిని
నీవతిధన్యురాలవు నీగర్భంబతి పవిత్రమైనది. వీనినర్భకుఁగాఁ గనుటచేఁ
మీదంపతులు చరితార్థులైరి మీకిఁక భవపాశబంధంబులు లేవు. వీనివ
లన మీకఖండయశంబు గలుఁగును వీనికి జన్మజన్మంబుల నేనే గురుం
డను మఱియొక రహస్యము వినుము. నాపై నానవెట్టి నీకుఁజెప్పెదను
వీనికెన్నఁడును లింగార్పితము గానిపదార్థమేదియునుఁ బెట్టఁగూడదు
సుమీ" యనిచెప్పి యాతం డంతర్హితుండయ్యెను అచ్చటి జనంబు
లెల్లరు నీతండె హరుండని కొనియాడిరి. ఇట్లు కోటిరవి ప్రభాభాసమా
నుండగు నక్కుమారుం గనినతోడనే తలిదండ్రులకు మానవసామా
న్యంబైన యజ్ఞానతమంబు వాసి దివ్యజ్ఞానసూర్యోదయం బైనందున
వారల హృత్కమలంబులు వికసించి పరమహర్షోత్కర్షంబులయ్యె నం
తవారలప్పుడుఁ బురంబుగల సకలభక్తవరుల నామంత్రణంబుసేసి వారికి

## బసవనకు జాతకర్మనామకరణంబులు

సభక్తిసాష్టాంగ ప్రణామంబులాచరించి యర్హాసనాసీనులంగావించి య
ర్ఘ్యపాద్యాది విధులనర్పించి తత్పాద పవిత్రతీర్థంబు సుతునకు గాత్రసేచ
నంబుఁగావించి భక్తవర కరస్పృష్టభస్మంబు బాలకునకు తిలకంబిడి మె
యినిండ నలఁది మంగళతూర్యనాదంబుల స్వస్తిపుణ్యాహవాచకంబుఁ
గావించి తమసంపద కనుకూలంబులగు దానధర్మంబుల బ్రాహ్మణ స
మారాధనంబును నివర్తించి నందికేశ్వ రాజ్ఞాప్రకారంబుగా భక్తవరు
లనుమతిని "బసవన్న" యని నామకరణం బొనరించిరి ఇట్లు తలిదం
డ్రులచే జాతకర్మనామకరణాది సంస్కారంబులు గావింపఁ బడిన
యబ్బాలబసవఁడు తనబాల్యచేష్టలం బితరుల కపరిమితానందంబు సం
ఘటించుచు దినదినప్రవర్ధమానుండై శుక్లపక్షకుపాకరు నందంబునఁ
గళాపూరితుండై పరమేశ్వరుసంశ చేజనించినవాఁడగుట సపరరుద్రుం

డను పేర సకలజన సంస్తూయమానుండగుచు, సంస్మరణమాత్రంబునన సకలవిద్యాప్రవీణుండై యుపనయన సంస్కారార్హంబగు గర్భాష్టమ వర్షవయోమాత్రగాత్రుండై తదుచితోన్నత్యస్థౌల్యబలపరిమాణంబులు గలిగి బాలఫాలేందుమౌళియని జనులవలనంగొని యాడంబడుచుండెను.

## బసవన్న యుపనయనమక్కఱలేదనుట.

ఇట్లుపనయనోచితవయోవిలాసియగు తనయుం గని జనకుండు గర్భాష్టమే యుపనయనమునకుం దగినయీడని పెద్దలవలన వినియున్న వాఁడు గావున దైవజ్ఞోద్దిష్ట శుభముహూర్తంబున బంధుమిత్ర పరివారాదులం గూడి తనయుపనయన సంస్కారంబు గావింప నుద్యమించు తండ్రి యత్నంబుం గని కుమారుండే తండ్రికి మృదుమధురవాక్యంబుల సవినయంబుగా నిట్లని విన్నవింపం దొడంగె నదెట్లనిన - "తండ్రీ! నీవు శివభక్తుండవై యుండియు, నేక శివాచార పరత్వంబు మాని యుపనయనమను నితరకర్మంబునకుం బాల్పడందగునే? మనకు శివుండే యేకగురుండు తదితరులను మనము గురువులుగా భావించి గైకొనం గూడదు అట్టి శివుని మాని యితరమానవులను గురువులం జేసికొన వచ్చునే? పూర్వజన్మమున దుష్కర్మములం జేసిన వాని నీ జన్మంబున బ్రాహ్మణునిం జేయుట పాతకంబుగాదే? గురుకటాక్షంబున నొక్క జన్మమే గలవానికి జన్మభేదంబులు గల్పించి సంస్కారంబులు సేయుట మహాపాపంబుగాదే? గురుపదయుగమ్మున నర్పింపందగిన హవిస్సు నగ్నిపాలు సేయందగునే? అనాదియగు పంచాక్షరీమంత్రజప పరులమగు మనము పరమంత్ర జపం బొనరింపం గూడునే? శివభక్తులకెత్తు చేతులు పరభక్తులకెత్త వచ్చునే? మఱియు నొక్క విశేషంబు సెప్పెద నాకర్ణింపుము. అమితఫలప్రదంబులగు శివపదంబుల కర్చనం జేసి కర్మబంధంబులం బాసి పూర్వకర్మ నిర్మూలనంబునుం జేసి, పుణ్యావశంబున నైన

నీజన్మంబునకు శూద్రత్వంబాపాదించి కర్మద్విజత్వంబునుం బొలదింప నుత్సహించుట వెఱ్ఱితనముగాదె? కేవలభూతిరుద్రాక్షధారియగు వీర శైవుఁడు శివేతర దైవలాంఛనంబులుదాల్పఁ బాల్పడునే? నీవిట్లుం చినను ద్రాటఁగట్టినను నీవేగతియని శివునేనమ్మి నిశ్చలచిత్తంబునే నే శివాచారపరత్వంబున నైహికాముష్మికంబులను శుభయ కర్మబంధం బులంబాసిన నన్ను మఱల కర్మసాగరంబునఁ ద్రోయఁజూచితివే, తం డ్రీ? బ్రహ్మశిరంబుఁద్రుంచిన యీశ్వరుని ప్రమథగణ సంఘాతుండ నగు నన్ను నల్పంబగు బ్రాహ్మణులంబునఁ జేర్పఁదగునే? జాతిగోత్ర హీనుఁడగు సద్గురు కటాక్ష జనితుఁడనగు నన్ను జాతిగోత్రంబుల నాశ్రయించు వానిఁగా నెట్లొనర్చెదవు? పరమేశ్వరునివర్ణంబెయ్యది? అట్టి పరమేశ్వరుఁడే మన్నైనొకశరణ్యంబుగానమ్మి యున్న నాకు ను వర్ణంబేది? ఇంత కాలము శివభక్తి పరాయణుండనై యుండియుఁ దద్భక్తి మర్మంబింత యేని నెఱుఁగని నీకు నావాక్యంబులు విన సహ్యంబులుకావు. ఐనను నేటినుండి నాకు నుపనయనమన్నమాట మఱిఁ తలపెట్టవద్దు." అని చెప్పు నుతుని వాక్యంబులాలించి తండ్రి యిట్లనియె

తండ్రి కుమారున కుపనయన మవశ్యకర్తవ్య మని చెప్పుట.

నాయనా! కుమారా! బసవన్నా నామాటవినుము బ్రాహ్మ ణులకు షోడశ కర్మలు వేదచోదితములు అవియన్నియు బ్రాహ్మణుల కవశ్య కర్తవ్యములే. అట్లుచేసినవాఁడే సద్బ్రాహ్మణుఁడనిపించుకో నును చేయనివాఁడు నీచుఁడు శివభక్తుఁడైనను వేదప్రోక్త కర్మముఁ జేసినదోషమేమి? మనదిరుద్రగణము. నంది మొదలగు వారాగణము లోనివారే వారందఱు నుపనయనము సేసికొనవలసినదే వేదమాతయై న ప్రణవంబు తారకబ్రహ్మమయైన రుద్రదేవతాత్మకంబు ఇఁక నుప నయనంపు తెఱంగువినుము. వటువు నడుమ భిక్షాపాత్రశివుఁడే చేర

ధరించిన భిక్షాపాత్రమైన బ్రహ్మకపాలము చుట్టబెట్టిన త్రాళ్లు నాగభూషణములు పాలాశదండము (మోదుగకఱ్ఱ) విష్ణువిగిద పంచశిఖలు శివునిజటాజూటము పంచకంబు కృష్ణాజినము (లేడితోలు) గజచర్మము. నొసట నిడుదు భస్మంబు మన్మథునిబూది ఇవి యన్నియుఁ గలగాయత్రీబ్రహ్మచారి వేషధారావిశేషుని వేషంబగవా ఇది సాంబమూర్తి భిక్షాటనమునాఁడు నటించినచర్య యే ఉపనీతవటు స్వరూపము కేవలము మ శివుని భిక్షాటన స్వరూపముగదా ఇట్టియుపనయనము తంత్రమంతయు నీవింత మాత్రమాలోచింపవు గావు ఇట్టియుపనీత వటువేషము దాల్పనివాఁడు శివభక్తుఁడగు బ్రాహ్మణుడు కానేరఁడు ఇందువలన మన్మహాదేవునియందలి నిభక్తికి లేశమైనను లోపము లేదు ఇదినీవు బాగుగనాలోచింపుము లేక లేకకన్న సుమారుండవు నేనుక నీకు నొక్కవకాణించనలేనన్న వాఁడను ఇంతెగ నీమార్గము నైష్ఠాన సమ్మతముగాదు వారికి మెచ్చింగ రేని నిన్ను వెలి బెట్టుదురు ఎప్పుడు నీకునునాకును నొక్కచోటునునికయెప్పటికిని కులముద్ధరించు తనయుండవు నీవుగలిగితివని నేను సంతసిల్లితిని అట్టినీవు నాయనా! నాకులమును మూలచ్ఛేదము సేయుటకు గారివైతివా? ఇట్లుగాచిన నీపాట్లునాకుసరిపడదు. నీభక్తినీయది నీయిష్టానుసారముగ జరింపుము నీకును నాకును సంబంధము లేదు చిరకాల తపోలబ్ధుండవగు గర్భవాసార్భకుండవగుట నింతగా నీకుఁ జెప్పవలసివచ్చినది." అనినిష్ఠురోక్తులువలుకు జనకునకుఁ దనయుం డిట్లనియె. "ఓతండ్రి! మాటిమాటికి బ్రాహ్మణ్యము

బసవన్న భక్తిమార్గమునకు బ్రాహ్మణ్యంబునకును గలభేదము తండ్రికిఁ జెప్పుట

భక్తిమార్గముగానీ పుడిమియించుచుంటివి బ్రాహ్మణ్యధర్మమునకును భక్తిమార్గమునకును, బహువ్యత్యాసముగలదు. బ్రాహ్మణ్యంబు మంత్ర గురుదేవతాపూజావిధాన బాహుళ్యంబుగలది. ధ్యానధారణాదులు నం

దుపేటువేటనుండును. కావున బ్రాహ్మ్యంబు భక్తిమార్గంబుగాదు. భక్తి మార్గమన్నది యేకగురోపక మంత్రేక దేవతైక పూజావిధానంబు గలది ధార్యధారణాదులు నానావిధములుగానుండును. ఇంక నుపనయన ప్రకారమువినుము దానికి ప్రధాన మంత్రము గాయత్రిగదా. అది నేగదా తొల్త నుపదేశింపఁబడును దానికెగదా బ్రహ్మోపదేశమం దురు దానిలోనెగదా బ్రాహ్మ్యంబు సిద్ధించును. అట్టిగాయత్రి బహు దైవకంబు అదియెట్లనిన గాయత్రికగ్ని ప్రధానముఖము. బ్రహ్మప్రధా నశిరస్సు ఆపెరుద్రుఁడుశిఖ విష్ణువుహృదయము. పసువులు ప్రాణాపాన వ్యానోదానసమానములను ప్రధానవాయువులును నాగకృకరకూర్మ దేవదత్తధనంజయులను నుపవాయువులును కలసిన వాయుదశకంబు భూమియోని వర్ణను తెలుపు గోత్రముసాంఖ్యాయనసము అక్షరము లిరువదినాలుగు నేత్రములు మూఁడు కుక్షులారు ముక్తావిద్రుమహే మనీల ధవళచ్ఛాయలుగల ముఖంబులతో విలసిల్లు ప్రధానాంగం బులో శిరంబులయిదు. ("శుక్లవర్ణా షడాననా" యని ప్రమాణముం గలదు.) ఇయ్యవియును పృథగ్గ్రీవాన్వితంబులై ప్రత్యేక కుక్షియుక్తం బులు. ఆకుక్షులారును మహామాయ పరిపూరితంబులు ఇట్లని మీ యాజ్ఞిక విధానంబున గాంచఁబడియెడి నుడియు "నగాయత్ర్యాఃపరం మంత్రం నమాతుః పరదేవతా" యనులోకోక్తి మీరెఱింగినదే కా వున నీకి శివభక్తికని గాయత్ర్యాత్మక బ్రాహ్మ్యధర్మమునకు భేదమునే వివరించెదను సావధానుండవై వినుము. దైవమననెద్దియు లేనిదే సాంఖ్యా యనమని యాదిసాంఖ్యాయన గురుండే చెప్పియున్నాఁడు సాంఖ్యా యనోక్తప్రధానమార్గ బహు గాయత్రిబహుదేవతోపాస్తిగలది. అ నఁగా సమస్తదేవతాత్మకము గాయత్రిగనుక నట్టిగాయత్రినుపాసించు వారితర దేవతల నుపాసింపనక్కరలేదు గాయత్రీమాత్రంబున బ్రా హ్మ్యంబు సిద్ధించును గనుక తదితర దైవంబుల నర్చించుటకు నవస

రము లేదు ఏలయన సమస్తదేవతాత్మకమని యిదివఱకే చెప్పఁబడి యున్నది కావున గాయత్ర్యుపాసకులు దానినమ్మియుండవలెను గాని యన్యమంత్రంబుల నాశ్రయింపఁగూడదు అందుచేతనే "న గాయత్ర్యాః పరంమంత్ర" మని చెప్పఁబడినది కనుక నాయనా! తొల్తగాయత్రి నుపాసించినవాఁడు శివభక్తుఁడు కాఁగలఁడు. ఇదిగాక గాయత్రిప్రాత ర్మధ్యాహ్న సాయంసంధ్యా సముపాసనస్థితంబు గనుక కర్మభూయిష్ఠంబు కర్మమార్గంబు భక్తిమార్గమునకెట్లు సరిపడును మఱియు, తొల్తనే మంత్రోపాసనంబులేనివానికి గాయత్ర్యుపదేశంబవశ్యకర్తవ్యంబు గాని పుట్టువుతోడనె శివమంత్రోపదేశ పూర్వకంబుగా లింగసంగత దేహుఁడనగు నాకు గాయత్ర్యుపదేశం బెట్లుక నన్యూనంబగును "ఏకో దేవః" అనున్యాయంబున నేక దేవోపాసనంబుండ నలెను బహుత్వం బెన్నటికిని గూడదు కాఁబట్టి యీవిషయమై మఱివాదింపకుము

బసవన్న తండ్రికి శివభక్తిప్రకారం బెఱింగించుట

షడ్దర్శనాతీతుండగు పరమేశ్వరునియందలి భక్తిమార్గం బెఱింగించెద వినుము "విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖ విశ్వతోబాహుః" అని శ్రుతిప్రమాణంబు గలదుగదా. అనఁగా దీనియర్థమేమి? (భగవంతుఁడు) విశ్వతశ్చక్షుః=విశ్వమంతయు వ్యాపించిన నేత్రములు గలవాఁడు ఉత=మఱిన్ని, విశ్వతోముఖః=విశ్వమంతయు వ్యాపించిన ముఖములుగలవాఁడు, విశ్వతోబాహుః=విశ్వమంతటను వ్యాపించిన బాహువులు గలవాఁడు ఇట్టివాఁడయ్యును "అత్యతిష్ఠద్దశాంగుళం" అనిచెప్పఁబడి యుండెఁగదా అనఁగా నిట్టి విశ్వరూపముగల మహాత్ముఁడు సూక్ష్మరూపియై దశాంగుళ వైశాల్యంబగు ప్రదేశంబు నధిష్ఠించి జగదంతర్వ్యాప్తినిం బొందియుండెనని భావము. "గురోరధికం" అనునటుల గరిష్ఠముకన్న గరిష్ఠమైనవాఁడు మఱియు "అణోరణీయాన్ మహతోమహీయాన్" అనికూడ చెప్పఁబడుచున్నాఁడు. అనఁగా దానణుస్వరూపముకన్న నణు

స్వరూపముకలవాఁడు మహత్స్వరూపముకన్న మహాత్స్వరూపముగల వాఁడును ననియగ్రము బట్టి సర్వాత్మస్వరూపుఁడును జగదంతర్వ్యాప్తిపుఁడును సచ్చిదానందమూర్తియు(నుమా సహితుండగు)శ్రీశివలింగమూర్తియే నాకు గురువును, పరమగురువును, పరమేష్ఠిగురుండును నైయున్నవాఁడు మంత్రిరాజంబగుఁబడు ప్రణవసహిత షడక్షరమైన ప్రణవపంచాక్షరియె నాజపమంత్రంబు జటాధారణంబును, విభూతిరుద్రాక్షమాలాలంకరణము నే నావేషము శివభక్తవైరులను ఖండించుటగాంచమగు భక్తియే నాయాయుధంబు భక్తియుక్త సాష్టాంగదండనమస్కృతికే గాగా భగవంతుఁడు ప్రసన్నుఁడగును యట్టి భక్తులదర్శనము పాపక్షయకరము మోక్షప్రాప్తికరము నగును భక్తియే జీవన్ముక్తి. కనుక నే భక్తికిని బ్రాహ్మణ్యమునకు నైకమత్యము లేదని తొల్తనే నీకు నేఁ దెలిపియుంటిని ” ఇట్లని బహుభంగుల భక్తి బ్రాహ్మణ్యంబులు వేఱువేఱని నిరూపించి “నాకు భక్తియేగాని బ్రాహ్మణ్యంబక్కఱలేదని తండ్రికిఁ జెప్పి, నాకుఁ దండ్రియుఁ దల్లియు సమస్తబంధువులును శివుఁడేగాని తదితరులు గా” రనియు “మీ పొత్తు నాకక్కఱలే”దని తలిదండ్రులదిగనాడి, నాగాంబయను సహోదరి తన్ననుగమింప బయలు వెడలి చూచువారు వెఱగొంద బసవన్న యొకశివాలయప్రదేశమునకుం జని యచ్చోటఁ గూర్చుండెను

## బసవన్న వివాహము

అంత బిజ్జలదేశపురాజునొద్ద దండనాయకుఁడగు బలదేవుఁడు బసవనకు మేనమామయు, మాదమాంబకు సోదరుఁడును గనుక బసవన యుపనయనమహోత్సవ దర్శనార్థంబువచ్చియున్న వాఁడగుటచేఁ దద్విషయిక పితాపుత్ర సంవాదంబు విని బసవనను మహాజ్ఞానిగా నెఱింగి యిట్టివాఁడు నాకల్లుఁడైన బాగుండునని యోచించి యతని నొడంబఱచి తనపట్టణంబునకుఁ గొంపోయి వివాహప్రయత్నము సేసెను పుర

ము శృంగారించి పంక్తిళ్ళు పాకలు వేయించి బంధువులను శివభక్తులను రావించి భక్తులపాదములుగడిగి, తత్తీర్థంబు వధూవరులపైఁ జల్లి వారికి భోజనతృప్తి సేసి, బహువిధ భేరీమృదంగాది మంగళతూర్యనాదంబులు సెలంగఁ గొందఱు వాకుచు మఱికొందఱు త్రాగుచు, నిఁకఁ గొందఱు మఱికొందరితో వివిధవిషయక ప్రసంగంబు లొనర్చుచు, శివభక్తులు శివగీతములం బాడుచుఁ దన్మయత్వంబున నాడుచుఁ నిట్లనేక సత్కారముల వినోదించుచుండిరి అప్పుడు బసవన్న ప్రతిభక్తునియొద్దకు నేఁగి, సాష్టాంగంబుగా నమస్కరించి, తద్దత్తవిభూతి బిల్వపత్రపాదంబు స్వీకరించి, నిజతను శిరంబులం దాల్చి, భక్తాంఘ్రిరేణువులం దన శిరం బునందాల్చుచు, తత్పాదదర్శనం బతికుతూహలంబునఁ జేయుచుఁ దన పాదంబులు వారికి గపడకుండ వెనుకకు ముడిచి ముకుళితకర కమలం బులైన ముంజేతులు ముందుకుఁజాచి, మోచేతులఁ దొడలపై నిడుకొని తనతొంటిరూపుఁ దాల్చెనోయనునట్టుల, నిజపూర్వచతుష్పద బసవాకా రునిఁ జూచువారికిఁ దోఁప, భక్తమండలి చుట్టునుం దిరిగి మఱలయు ధాస్థానముఁ జేరి కూర్చుండి తానును వారితోఁబాటు గీతగానంబుసే యుచు శివతన్మయుఁడై యుండెను. అప్పుడు బిజ్జలరాజు దండనాయకుఁ డగు బలదేవమంత్రి తనయల్లుని భక్తిజ్ఞాన శివతత్త్వవేతృత్వతన్మయ త్వములఁజూచి, రెండవశంభుండై నాకల్లుండయ్యెనని పరమానందమును బొందుచుఁ దనకూఁతురగు గంగమాంబికను దెచ్చి, భక్తులగు పెద్దల కుంగనపర్చి "కీని నా మేనల్లుఁడగు బసవన్న కిచ్చి వివాహము సేయుటకు మీరెల్ల రామోదించి శుభముహూర్త నిశ్చయంబు సేయుండని యు భ్యర్థించెను వారందఱు నేకగ్రీవముగా "శుభస్య శీఘ్ర"మ్మని యున్న ది గావున నీవిఁక నాలస్యంబు సేయుక యీమంచి ముహూర్తమె శుభ తారాచంద్రబలంబులు గలది గనుకఁ దక్షణమె వివాహంబొనరింపు మనిరి, పాముకులకు గ్రహతారాచంద్రబలంబులు గమనింపవలెను గాని

జ్ఞానులకు విగావలెనా? వారికిఁ దలంచినదే ముహూర్తము. వెళ్లినదే త్రోవ. ఆడినదే మాట. చేసినదే పని కాని, వారికి మంచిముహూర్తముతోను, మంచిమార్గములతోను, మంచిమాటలతోను, మంచిపనులతోను నిమిత్తము లేదు ॥శ్లో॥ కింకుర్వంతి గ్రహాస్సర్వే శనిసూర్యాంగారకాదయః। ఏకాదశస్థే గోవిందే గురుర్దేవస్సనాతనః" అనుచాటువాక్యమె వారికిఁ బ్రమాణముగాని, యితరవేదశాస్త్రములతో వారికిఁ బనిలేదు. అనఁగా జ్యోతిషశాస్త్రానుసారముగా దేవగురువగు బృహస్పతి (గురుఁడు) శింశుమారచక్రంబునందలి మేషాదిద్వాదశరాసులలో, జన్మరాశియందుండఁగా (ఏకాదశమునకు లాభరాశియని పేరు.) తక్కిన శనిసూర్యాంగారకాది గ్రహములు, మఱియేరాశి యందున్నను శుభాశుభభేదములు లేక' యాగ్రహములు శుభఫలముల నేయిచ్చును. సనాతనగురుఁడైన శివుఁడు (ఇచట గోవిందశబ్దమునకు శివుఁడర్థము ఎట్లనిన—గాం వృషభం విందతీతి గోవిందః=ఎద్దును (వాహనముగా) బొందినవాఁడుగనుక గోవిందుఁడు) పదునొకండవ యింద్రియమగు మనస్సునందుండఁగా శనిసూర్యాంగారకాది గ్రహములు చెడుస్థానములయందున్నను, ఏమిసేయఁగలవు? (అనఁగా సర్వకాలసర్వావస్థలయందు భగవంతునియందే మనస్సులగ్నము సేసికొనియున్న వారికి గ్రహచారముతో నిమిత్తములేక వారుసర్వదా శుభఫలములనే పొందుదురనుట) అట్టి భగవద్భక్తులచే నియమింపంబడిన సద్యశ్శుభముహూర్తమున బలదేవ దండనాయకుఁడు తనకూఁతురగు గంగమాంబికను సమస్తాభరణాలంకృతం జేసి, భాగినేయుఁడగు బసవనకిచ్చి వివాహము యథావిధిగా "దశపూర్వేషాం దశాపరేషాముద్వాంశ్యానా" మనుశ్రుతివాక్యప్రమాణానుసారముగాఁ గన్యాదానపూర్వకముగా శాక్యవైదికతంత్రమంత్రపూర్వకంబుగా నొనరింపబడెను. అంతభక్తవరులా వధూవరలను సకలసద్గుణైకాలంకారులుగాను పుష్పగంధన్యాయంబున నన్యో

న్యాస్పదులుగాను, పార్వతీపరమేశ్వరులవలె నేకతత్వైక మనస్సంక ల్పులుగాను, శివజ్ఞానదీప్తిసంభిహిత నిజహృత్తనుస్కులుగాను, చిర కాలాభివృద్ధిం బొంది యుండుదురని యాశీర్వదించి సమయసముచితా లాపంబు లాడుచుండ బసవన వికసితహృదయారవిందుండై లేచి నిలు చుండి భక్తవరుల కభిమతార్థంబులొసంగి తదాశీః పరిపూర్ణుండై చేతు లు జోడించి వారలకిట్లనియె

బసవేశ్వరుండు తనగురువును దర్శింప బోవుట

భక్తాగ్రేసరులారా ! ఈసమీపమునందున్న కప్పడిసంగమేశ్వర మున మద్గురుండు వసియించుచున్నవాడు నేనేగియాతని దర్శనం బొనర్చి తత్పాదంబుల కెరంగి ప్రియభాషణంబులం దనిం సద్బోధ నొంది వచ్చువాఁడ నన్ననుమతింపుఁడని సవినయంబుగాఁ బ్రార్థించెను. భక్తులెల్లను వల్లెయనియంగీకరించి తమతమయథాస్థానములకుం బోయి రి. అంత బసవన నిజపత్నియగు గంగాంబికయు, నగ్రజయగు నాగాంబి కయు వెంటరాఁ బయనమై పోవుచుండెను నానాదిగంతసమాగతులును, భసితరుద్రాక్షమాలాలంకృత దేహులునగు జంగమకులప్రధానులగు భక్తవరుల సంకులధ్యానంబుతోఁ గిలగిలలాడుచున్న గురునివాసస్థాన మగు కప్పడిసంగమేశ్వర స్థానము దృగ్గోచరమయ్యెను అప్పురిమాహా త్మ్యంబేమని చెప్పుదు. దానినై భవమాదిశేషునకైన వర్ణింపనలవిగాదు దానిచుట్టును సర్వదా జీవనదులు ప్రవహించుచుండును అచ్చటిచిన్న గుట్టలను, కైలాసశైలతుల్యములే. ఎచ్చటఁ జూచినను భస్మపుగనులే అందలయావులు కామధేనువులు అందలిదూడలెల్ల నందులే వృక్షము లన్నియు రుద్రాక్షతరులే సకల కుసుమఫలవిలసిత తరుసమూహంబు లగు నుద్యానవనంబు లనేకంబులుగలవు అచ్చటిపురుషులు ప్రమథ గణదేవతలే. స్త్రీలు దేవతాస్త్రీలే సకలజనప్రలాపములు సభక్తికృత శివస్తోత్రకలాపములే, అందువొంగలు లేరు. దొమ్మరులు లేరు, జారులు

లేరు చోరులులేరు దుర్మదాంధులులేరు లోభులులేరు కాముకులు లేరు. క్రోధులులేరు మోహవ్యామోహకులులేరు భేదబుద్ధులులేరు. అం ఱుపమచిత్తులే సత్వగుణప్రధానులే శివతత్త్వచింతాపరాయణులే. ఇట్టి కప్పడిసంగమేశ్వరమును జూచి యానందకందళితహృదయారవిం దుఁడై, బసవన, యచ్చటిభక్తవరు లెల్లనుఁ దన్నుఁగాంచి యెదుర్కొని లోనికిఁదోడ్కొనిపోఁగా నచ్చటికేఁగి స్వామియాలయంబుసొచ్చి ప్రాంగణం బున నిల్చినలుఁగడలం బరికించి ప్రాకారప్రదక్షిణంబుసేసి గర్భాలయ ముఖద్వారంబున స్వామికభిముఖముగా సాష్టాంగదండప్రణామంబుఁ గావించి కళ్యాణమండపంబు నందాసీనుండై పౌరాణికసూత్రంబుల స్తుతియించుచుండెను అంతనాయీశ్వరుఁడు తనపూర్వపు జంగముని వేషంబున శిష్యునకు ప్రత్యక్షంబుగా నాలయంబు వెలువడివచ్చి తన్నుఁగాంచి యుర్విపై సాష్టాంగంబుగా నెఱఁగి యెత్తఁగి యూరకున్న శిష్యుని దనచేతులనెత్తి శిష్యమాత్రుండుగాక పుత్రప్రాయుండగుటఁ గౌఁగిటం జేరిచి తననిశ్చలభక్తికి మెచ్చియిట్లనియె "బసవన్నా! ఇచ్చ టికి వచ్చుచుఁ బోవుచున్న భక్తవరులచే నీసచ్చరిత్రంబుఁ బలు

<>బసవేశ్వరునకు గురువు హితోపదేశంబు సేయుట<>

మాఱు విని యంతరంగంబున నిత్యంబును నిన్నె దలచుచుంటిని. ఇది సత్యముగాని యిచ్చకపు మాటగాదు. నేను భక్తపరాధీనుం డ నగుట నీయంతరంగభక్తికి మెచ్చి నీకు నానారూపమ్యంబొసంగి నా యంతవానిఁగాఁజేసి నీవలనఁ గొన్ని ఘనకార్యంబులు సేయింపందల కొంటిని నీకును నాకునభేదవ్యవస్థాప్రవృత్తి యగుటంజేసి నీవుసేసిన కా ర్యంబులన్నియు నేను సేసినట్లంగీకరింతును. ఈనీస్వరూపమె నాస్వరూ పము. నీయవతారమె నాయవతారము ఇంతయేల నీవెనేను కనుక నా యనా! నీకుఁ జిరకాలమునుంచి మనోగతంబుగా నెలకొనియున్న శివ భక్తి మితిమీఱకుండునట్లుగాఁ గాపాడుకొనుచు మెలంగుచుండుము,

భస్మరుద్రాక్షలు ధరించినవారిని శివస్వరూపులుగా భావించుకొనుము. ఒకవేళ శివభక్తులం దేదేని దోషమున్న యెడల దానిదోషంబుగాc గా నక మేలుగుణంబుగనే భావింపుము శత్రువులైనను లింగధారులై నీకం టc బడితేని వారిని మిత్రులుగా నెంచుకొనుము. నీవుపట్టినది వీరవ్రతము అట్టివ్రతంబున కెప్పట్టునను చ్యుతిలేకుండ నరయుచుం గాపాడుకొనుము నీమతంబు వర్ణాశ్రమధర్మంబులను బరిపాటింపని సర్వజనసమ్మతంబు నేక శివార్చనాపరాయణంబు నగు వీరశైవమతము. ఇట్టిమతంబున కెన్నc డేని భంగము రానీయక శివభక్తులెల్లరు నేకజాతివారై గాని భిన్నజాతి వారుగా వారి నెంచి కులభేదంబు వారియందారోపించి న్యూనాధిక భా వంబులం జూడక సర్వసమత్వబుద్ధిచే నందఱ నొక్కజాతివారుగా నెం చి వారలతోc గలసిమెలసి యుండుము. ప్రకృతము లోకము శివభక్తి వైకల్యంబునొంది యున్నది ఆది శివభక్తిమార్గమును దలి నూతన భక్తిమార్గములం గల్పించుకొని వితండవాదములు సేయు దుర్జ నులయెడ మృత్యుప్రాయుండవై వారల నిర్మూలింపుము వేదోక్తమున వర్ణాశ్రమధర్మరాహిత్యంబు నగు నాగజంగమ శివభక్తిని శాస్త్రవిధిగా నీభూమిపై విలసిల్లం జేయుము శివార్పిత శేషము నేగాని యితరపదార్థ ముల నెన్నcడు గ్రహింపకుము శివతాదాత్మ్యంబు గలవాcడవగుట కం దర్పుని దర్పమడcచి వానిని భస్మమాత్రావశిష్టుcగాc జేసిన శివుని మాడ్కి నీవును వానిని గెలిచియుండవలెను గాని, వానిబారికి లోనై మోహకామావేశంబుల నొంది పరసతులం దిలకించి భ్రాంతచిత్తుండవై వారలయందు బద్ధానురాగుcడవుగాక, నారీస్తనధరనాభీదేశంబులు దృగ్గోచరంబులైనc జిత్తచాంచల్యంబునొందక యవి మాంసపిండవసాది వికారములని నిశ్చలమనోభావుcడవై స్త్రీపురుషభేదము దేహమునందే గాని లోనియాత్మకు లేదని గ్రహించి యట్టి భేదరాహిత్యంబు సూచిం చుటకే, శివుcడు సగమాcడురూపును సగము మగరూపును దాల్చి దేహా

మాత్రమున భేదముంగనపర్చుచు నంతరంగమున భేదము లేదని పరం
జ్యోతి రాకారంబున వెలుంగుచు మనల కెఱింగించుచున్నవాఁడని నీవు
తెలుసుకొని యితరులకు సుబోధకంబుగా నెఱుఁగఁజేయుచు నిర్మోహ
నిశ్చల తత్త్వంబులతోఁ గూడిన జీవన్ముక్తుని భావంబుననుండుము శివై
కపరాయణుఁడవై వచ్చి శరణాపన్నభక్తులనువంచింపక రక్షించుటయే యధి
కతరమగు శివభక్తియని యెఱుంగుము స్థావరజంగమాత్మకమగు నీ
సృష్టిప్రపంచంబులో జంగమములగు సర్వంబును నాస్వరూపంబుగా నె
ఱుంగుము ఇట్టి జంగమంబులకు సర్వదా శరణ్యుండవై రక్షించుచుం
డుము కొందఱు వితండవాదులు నిన్ను వశపఱచుకొనుటకు నిన్ను
బోధించి పరమతంబులకుఁ ద్రిప్పఁ బ్రయత్నింతురు వారిదుర్బోధ
లకు మోసపోవక వశుఁడకుము స్వతంత్రతఁ జెందియుండియున్న నీవు
స్వతంత్రతంగాపాడుకొనుము ఇట్టి క్రమమును దప్పినయెడల జ్యోతిస్వరూప
నిరూపితుఁడగు ఫాలాక్షుఁడు వారిని రూపుమాపును. నీనీమంబును స
త్యంబును ధీమంతుఁడవై యెంతమాత్రముఁబోనీక నిలుపుకొనుము.
సర్వదా సాంబసదాశివపూజాధురంధరుండవు కావలెను." అని యిట్లు
భగవంతుఁడందఱుం జూచుచుండ మునివేషంబున వచ్చి యందఱు
వినుచుండ బసవన కిట్లుపదేశించి మఱల నందఱుఁ గనుచుండ గుడిలో
నికేఁగి యా స్థిరాకారంబు నొంది యెప్పటి లింగాకారంబున నుండె.
అదిగని సమస్త జనంబులు విస్మితులై యాశ్చర్యరస నిమగ్నులై

కప్పడి సంగమేశ్వర పురజనులు బసవేశ్వరునిఁగాంచి యాడుట

,, ఇతఁడె శివుఁడు మునివేషమున వచ్చి నిజతనూజునకు హితం
బులుపదేశించి యెప్పటి యట్లగుడిలో దూరి లింగాకారంబున డాఁగి
యున్నవాఁడు కానిచో నింత యపూర్వముని పుంగవు నింతకుమున్నె
న్నఁడేని మనము చటఁజూచి యుంటిమె? ఇంతకు మనము చూచుచుండ
మునివేషమున గుడిలోనుండి వచ్చి మఱల మనము చూచుచుండఁగనే

గుడిలో నంతర్హితుండయ్యె. ఇంతకన్నఁ బ్రత్యక్ష ప్రమాణ మేమి గలదు? ఆహా! ఏమి యాశ్చర్యము ఈబసవన్న భక్తి యెంత యపూర్వమైనది ఈతండు శివున కెంతయనాది సద్భక్తుఁడో గదా కానియెడల నీతండు రాఁగానే మునివేషంబున గుడినుండివచ్చి యీతనిఁ గౌఁగలించుకొని యనునాసయించి మృదుమధురగంభీర భాషణంబులఁ బుత్రవాత్సల్యంబు దేఁటపడ నాతనికి హితోక్తులుగఱపి మఱల యథావిధిగా గుడిలోనికటరిగి తన లింగరూపంబున నున్నవాఁడు ఇది గని మనము ధన్యులమైతిమి బసవనివలె మహాదేవుని ప్రసాదంబుఁ బడయు నేరని మన జన్మంబు లేఁదుకు? బసవన్నదే సాఫల్యమైన జన్మము, మనజన్మంబులు నిరర్థకంబులు" అని మెచ్చుకొనుచు బసవకుమారుని వంకఁ దిరిగి "భళిర బసవా! భద్రరూపరుద్రావాహా, సర్వలోకైకపూజ్య, బసవకుమార, బసవేశ్వర, ఈశ్వరాభేదభావ, కీర్తివిస్తార, భక్తిసార, నీభాగ్యమేభాగ్యము నీజన్మమేసఫలజన్మము. నీవేధన్యుండవు మాబోంట్లుండిన నేమిప్రయోజనము శివభక్తిసారమంతయు నీయందే యిమిడియున్నది. నీవి త పవిత్రజన్ముఁడవు గనుకనే పరమేశ్వరునకుఁ బుత్రప్రాయుండవైతివి తొల్లి భగవంతుఁడైన శివుఁడు జంగమరూపంబున భక్తుల భక్తిసారంబరయుఁగోరి విషమంబులగు కోరికలంగోర భక్తులు వానినోడఁగూర్చి తత్ప్రసాదంబు బడసిరి అందుఁగొందఱ చర్యల నెఱింగింతు వినుము భల్లాణచక్రవర్తి భగవంతుఁడు కోరినందునఁ దన భార్యను స్వామికి సమర్పించెను అంత స్వామిమెచ్చి యాతని భార్య ప్రక్కలోఁ బసిబిడ్డఁడై వారల కోర్కెఁదీర్చెను ఇట్లనె ప్రతివానిని విస్తరించి చెప్పవలె వారలు సేసిన విషమ కార్యములంబేర్కొందుము. మఱియొక భక్తుఁడు తన యొంటి వస్త్రమును స్వామికి సమర్పించి తాను దిగంబరుఁడయ్యెను. వేఱొకఁడు తన తనయుని శిరము వండిపెట్టెను. ఇంకొకఁడు తండ్రినిఁ జంపెను ఇట్టి యసంభవములగు కృత్యముల

నాచరించియు భగవత్కృపవల్ల నష్టమేమియు లేక యనుగ్రహింపఁబడిరి. అట్టి పురాతన భక్తు లెవ్వరును బాలుఁడవగు నీ కీడుగారు స్వామి నీభక్తికరపి ప్రసన్నుండయ్యె నందుమా, నీవు సరిగా నెనిమిదేండ్లయిన వయస్సైనఁ బూర్తికాలేదు గర్భాష్టమ శరద్వయస్కుఁడవు అందు గర్భ గతవత్సరములు మూఁడునల బోను ప్రకృతమున నైదేండ్లు యీడుగల బాలుఁడవు ఇట్టి బాల్యమున నిట్టి భక్తిజ్ఞాన సంపన్నుండవు గనుక నే మాతులుండగు బిజ్జలదేవ దండనాయకుఁడు దిసయనుండు దనయను సమానవయస్కను నీకుఁ బెండ్లిసేసి బాలుండవయ్యును నర్హపాత్రుయునిఁగా నిన్ను భావించి పసికూనను నీవెంట నంపివేసెను భగవంతుఁడు సర్వజ్ఞుఁడు, సర్వజగదంతర్యామి గనుక నీభక్తిఁదాను పరీక్షింపకయే మెచ్చెగెను గాన నిట్టి నీకితరమనుష్యమాత్రు గురువులు చాలకని తానె నీకు గురుండై యుపదేశించి యేకగురుండై నీయెడలఁ బ్రవర్తించుచున్నవాఁడు. నిన్నుఁజూచిన మామనంబు లాశ్చర్యభావంబు నొందుచున్నవి వేయేల, నిదానించి యోచించిన నీ యీశ్వరునకును నీకును భేదభావంబించు కంతయు నున్నట్లు మాకుఁదోఁపదు. శృతియును దిలకింప నింకొక్క యంశంబు మామనంబులకు గోచరంబగుచున్నది అది నిజంబు కావచ్చును. ఏమన, భూలోకంబునఁ గర్ణాటదేశంబునఁ గేవలముకుఁగంటి యున్న శివభక్తినిఁ బునరుద్ధారణంబుఁ గావించుటకుఁ దనయభేదస్వరూప స్వభావంబులు గల నిన్ను బోధించి యవతరింపుమని యానతిచ్చి యీశ్వరుఁడె యనిపె ననియు, మాదమాంబ సంతానాకాంక్షఁ గడునియమముతో నందినోము నోచి నీవంటి పుత్రుఁగోరుటయు నామెని పవిత్రమైన గర్భముగా నీవెంచి దానినుపాధిమాత్రంబు సేసుకొని యవతరించితి వనియుం దోఁచుచున్నది. ఇది యే న్కారువంబుగానిచో నింత బాల్యంబున నిట్టి భక్తిప్రభావ బా

హాత్మ్యంబెల్లు గలుగును. మహాపటన్మృత్యుంజయ నమమాత్రంబైన తప్పీజంబున నడగి యుండి యది భాగతంబుగాఁ గానందునుండి బయలువెడలి వ్యాపించినట్టుల నతిబాలుండవగు నీలోని మహద్భక్తియ డఁగి యున్నది ఇఁకమీఁద దిగంతంబులకు దీని యూఁడలఁ బ్రసరిం పఁజేసి విస్తరిల్లు వటభూరుహంబు చందంబున నీకీర్తిప్రతాపంబులును, భక్తిజ్ఞాన ప్రభావంబులును, నీదైవికప్రజ్ఞావిశేషంబును నీవు సేయఁ బోవు నమానుషకృత్యంబులును దిగ తప్రశాంతంబులై నీకఖ డశ్రే యోదాయకంబులు గాఁగలవు. రూపంబున బాలుండవయ్యును వస్తు తః మహామహుండవగు నిన్నుఁగన్నులారఁ గాంచితిమి మానేత్రంబు లు సఫలంబులైనవి మాజన్మంబులు సార్థకంబులైనవి నీమూలం బున శివభక్తిసుఖల మొలకయెత్తి భూమియందు వ్యాపింపఁగలదు మేము కోరినదియు నదిచేకాన, నో బసవకుమారా! మహానుభా వా, ప్రత్యక్షరుద్రా, భద్రపూర్వస్వరూపా, మమ్మెల్లర నీయపాంగ దృష్టిచేఁ గాపాడుము " అని యెల్లవారును డన్నుంగని యాశఁగొలి చియున్నవారలంగని మందహాసంబున నాదరించి వారి వీనులకింపుగ దుర మృదుమధురస్వరంబున శివగీతంబులం బాడుచుదొల్లి, శివుండు బాలుండగు మేధా దక్షిణామూర్తి రూపంబున వటవిటపి సమీపంబు నజ్ఞానముద్రా ప్రదర్శనంబున సకలమునీశ్వరుల సందియంబులు దీర్చి జ్ఞానోపదేశంబు సేసిన చందంబున బాలుండయ్యును దన మందహాసం బున వారిసందియంబులు దీర్చి తన మహానుభావత్వంబు వారలకుఁ దెలిపెడు రీతిని శివజ్ఞాన తత్వబోధచే బసవేశ్వరుఁడు గొన్నిదినంబులా కప్పడి సంగమేశ్వరమున నిల్చియుండెను.



# బసవపురాణము.

## ద్వితీయాశ్వాసము

ఆకళ్యాణపురమున బిజ్జలరాజు మంత్రియైన బలదేవుఁడా బసవన్నకుఁ దనకూఁతునిచ్చి మహావైభవముతో వివాహంబుఁ గావించుట ప్రమథులువిని మిగులసంతోషించినవారై అట్టివాఁడు తమ సన్నిధానంబందుండఁ దగినవాఁడని పరమేశ్వరునకు విన్నవించి తదాజ్ఞచే నతనిఁ గైలాసంబునకు రమ్మని పిల్వఁ బంపినారో యనునట్లు మఱికొన్నిదినంబులకు బలదేవామాత్యుండు శివదూతాహూతుండై తదనుసరణాసరణిం గైలాసగతుండై శివసాయుజ్యంబు బడసెను.

### బిజ్జలరాజు బసవేశ్వరునిఁ బిల్వఁబంపుట.

ఆతని మరణంబునకు బిజ్జలరాజు మిగుల వ్యసనమునొంది యాతనికుటుంబమునందు సమర్థుఁడగువాని నాతనిస్థానమునందు నియమించి కుటుంబరక్షణంబు గావించు నుద్దేశముతో నాతని బంధువులం గలయుంగనుంగొని యిట్లనియె "ఓబలదేవబంధువులారా! మీకన్న నెక్కువ విచారమును నేను బలదేవమంత్రి మరణవిషయమునఁ బొందుచున్నాను ఇఁక మీరు దేపదే యాతనిఁ గూర్చి వగవఁ గూరుట మాని యాతనిపదవికిం దగినవాని నొక్కని దనఁ కుటుంబము లోని వానిం జేర్కొంటిరేని, నేనాతనిం దగు బహుమానంబున రావించి బలదేవుని పనిలో వానిని నియమించి తత్కుటుంబరక్షణంబుఁ గావింతు" నని ప్రభువు వచించిన తక్షణమే బంధువులందఱు నైకకంఠ్యముగా

రాజుతో నిట్లు విన్నవించిరి. "దేవా! మాబలదేవమంత్రి కల్లుడగు బసవేశ్వరుఁడున్నవాఁడు. అతండమానుష తేజోవిలాసి. మాదమాంబా గర్భశుక్తిముక్తాఫలంబు సమస్తసద్గుణాలంకారుఁడు. సకలవిద్యాగరిష్ఠుడు. వేయేల! అతనిమహామహిమం బొక్కవిషయంబున దేవరకు నాశ్చర్యజనకంబుగాకపోదు. అదిమనవి సేతుము సావధానులరై చిత్తగింపుఁడు నిజవివాహానంతరమాతండు భార్యయగు గంగమాంబయు నగ్రసోదరియగు నాగమాంబయుఁ దనతోడనరుదేర కప్పడిసంగమేశ్వరమునకుం బోవుచుండ నందఱుం గనుచుండ సంగమేశ్వరుఁడు మునియాకారముతో గుడినుండి బైటవచ్చి బసవేశ్వరు నాలింగనముసేసి "వత్సా" యని పిలిచి యనేకంబులగు హితోక్తులు గఱపి మఱలనందఱు నాశ్చర్యనిమగ్నమానసమానసంబులం జూచుచుండ నాలయంబులోని కదేరూపంబుననరిగి యటన తర్ధానంబు నొందె. కనుక మహాప్రభూ! ఇట్టిభగవత్సాక్షాత్కారంబుగల మహానుభావుఁడు మీ ప్రధానమంత్రియై యున్ననిఁక మనరాజ్యంబు భాగ్యమేమనవచ్చు ఆట్టివానిం దక్షణము పిలువఁబంపుఁడు. అతండిప్పుడు సంగమేశ్వరమునందే యున్నవాడు. "అలస్యాదమృతం విష"మ్మన్నటుల నాతండు స్వతః వైరాగ్యోపహతచేతస్కుండగుట నేక్షణ మెందేగునో కాన నవైళంబ పిలువఁ బంపుఁ"డని బంధుజనులువిన్నపం బొనర్ప, రాజు కుతూహలాయత్తమానసోల్లాసభాసమానుండగుచుఁ దనయితరమంత్రిజనంబును రథగజతురగపదాతిచతురంగబలసమేతంబుగాను, బహువిధాలంకృత భద్రగజపురస్కృతంబుగాను, బసవేశ్వరుఁ దోడ్తేరఁ బుత్తెంచెను.

### మంత్రులు బసవేశ్వరు నామంత్రణంబు సేయుట.

అటుల ననుపఁబడిన మంత్రిజనంబులు కతిపయ ప్రయాణంబుల బసవేశ్వరు నతివేగంబునఁ సంగమేశ్వరాలయమున ముఖమంటపంబున దివ్యజ్ఞానవిగ్రహుండై, నిజాంగనాగ్రజలే తనకు ననుకూల

సహాయనులుగాఁ దదేకదీక్షా తన్మయత్వంబుల గీతగానంబు సేయు
చున్నవాని, సబహుమానంబుగా, సవినయంబుగా ననూనయించి
యిట్లని ప్రశంసించిరి. "స్వామీ! బసవేశ్వరా! నీవు బాలుండవయ్యును
సర్వజనసమ్మాన్యశీలు డవు. నీవా సంగమేశ్వరున కత్యంతప్రియ సుతుం
డవని లోకోక్తి వినంబడు తుచ్ఛంబులగు మానవభోగంబులం బరిహ
రించి దివ్యజ్ఞాన సంపన్నుండవై జీవన్ముక్తుండవగు నీకు మానుష మర్యా
దాధికారభోగంబులు రుచియింపవని మాకుఁ దెలుసును అయినను
మేము నిన్నుఁ గోరుట మాకొఱకుఁగాని నీలాభమునిమిత్తముగాదు.
ఒకవిధమున నీకును లాభకరమేయనవచ్చును అదియుందు వివరించె
దము. నీమామయైన బలదేవమంత్రి కైలాసగతుండగుట నీకుఁ
దెలిసిన విషయమే. ఆతనిస్థానమున నిన్నుఁ బ్రధానమంత్రిగా నియ
మించుకొన నుద్దేశించి నిన్ను సవినయంబుగాఁ బ్రార్థించి తోడ్తెచ్చుటకు
బిజ్జలరాజు మమ్ములను నీయొద్ద కిపుడు పుత్తెంచినవాఁడు మాయం
దాదరభావముంచి మాతోడ నరుదెంచి యీపదవిఁగైకొమ్ము అది
మాకు వైభవముగా నుండును నీమామస్థానములోఁ నిన్నుఁ జూఁ
చుచుండుట వలన మా నేత్రములు సఫలములుగాఁ గలవు.
మఱియు నిన్ను దర్శించుటకు బహుప్రదేశములనుండి బహువిధ
ములగు భక్తులు చనుదెంచుచుందురు. వారల నాదరించి వలయు భోజ
నభాజనంబుల వారలనుఁ దృప్తులఁగావించుటకు నీకును ధనమావశ్య
కము నీవీపదవి నంగీకరించితివేని మిగుల ద్రవ్యసంపన్నుఁడవగుదువు. రా
జిచ్చుమాసవేతనమే నీకు సమృద్ధిగా నుండును. అది నీకవసరము లేక
పోయినను నీకడకరుదెంచు భక్తులయందు వినియోగము కాఁగలదు గ
నుక మమ్ముఁ ద్రోసిపుచ్చక మావిజ్ఞాపన మంగీకరించి నీకై యలంక
రించి తెచ్చిన యీభద్రగజంబు నధిష్ఠించిరమ్ము" అని బహువిధముల
దన్నా మంత్రణంబు సేయు మంత్రుల సాదరణపూర్వకముగా గౌరవించి

వారలతోఁ దాను నిజసతి తాగ్రిజాతా సమేతంబుగా గజవాహనంబు నూని సామాన్యయానంబునఁ బురంబున కరుగుచుండె.

అంతనిక్కడఁ గళ్యాణపురాధీశుండగు బిజ్జలరాజు బలదేవామాత్యుజామాత యేతెంచుచున్నవాఁడని విని యాతని యాగమనంబున కతిముదంబున నెదురుసూఁడుచున్నవాఁడు గాపురంబును శృంగారింపించి చతురంగ బలసమేతంబుగా నెదురేగి నాతినూదంబున వాహనం

### బసవేశ్వరుని ప్రధానమంత్రిగా నభిషేకించి యూరేగించుట

బుడిగిపాదచారియై వచ్చుచున్న బసవన్న నభివందనపూర్వకంబుగా నాలింగనంబు సేసి యాతనితో వచ్చుచున్న భార్యను నగ్రసోదరిని తగ్గ నుచిత బహుమానంబులచే నిజాంతఃపురసంచారిణులతో బలదేవసేనానాయకు గృహంబునకనిపి బసవేశ్వరుం దక్కిన మంత్రులను దన యాస్థానంబునకుఁ గొంపోయి యమాత్యభృత్య కోశాధిపసామంతపౌరజానపదసుహృద్బాంధవపురోహితవైద్య దైవజ్ఞానులతోఁ గూడి ఉచిత మాగధులు కైవారంబులు సేయుచుండ నిండుకొలువున బసవేశ్వరుని మంత్రి నున్నతమయాసింహాసనాసీనుం జేసి సభ్యుల యనుమతంబున నన్నిన్నిగ్గడ దండనాయకుల వెనుక ప్రధానమంత్రిగా నాతని నభిషేకించి భద్రగజంబెక్కించి వచ్చి "నన్నును నా రాజ్యంబు సర్వంబును నీవ నేలు"మని యాన లిచ్చుటయు నమ్మహానుభావుండు చిఱునవ్వు నవ్వి "రాజా! సర్వరక్షకుండగు పరమేశ్వరుని కొక మనుష్యమాత్రుని పాలించి రక్షించుట యొక పెద్ద కార్యమా! నీవా భగవంతుని యందు నిశ్చలభక్తి గలవాఁడవై శివదాసుల యెడల భయ భక్తులుగల వాఁడవై మనుచుండుము అట్లైన నిన్నును నీప్రజలను నేను గాపాడెదను. నీచేత నీరాజ్య మఖండసామ్రాజ్యంబు గా నేలించెదను" అని చెప్పి ముద్రికఁ గైకొనెను అంత బసవేశ్వరుని రాజు భద్రగజారూఢునిం జేసి మంగళవాద్యములతో నతఁడే మనప్రధానమంత్రి యని భేరీధ్వని పూర్వకంబుగాఁ బురజనులందఱకుఁ జాటిచె

ష్పాదన యానతిచ్చి పట్టణపు వీథులం దూరేగింపఁ బంపిన నట్టి యూరే
గింపుటుత్సవము దర్శించెడు పురజనులును రమ్యహర్మ్యంబుల పైగవా
క్షములనుండి చూచుచుండెడు పుణ్యాంగనలు నాతనిపై సేసలు చల్లు
చు "బసవేశ్వరుఁడను నితఁడేనా? ఇతనినేనా లోకులందఱు పరిశంభుఁ
డందురు? ఆహా! యీ భవ్యసుదాత్త మాలాధారుఁ డంచితంబగు
నీతిని యాకారమునఁ గనినఁ గేవల మనోరథాభిప్రాయమును కలఁడు
దగినవాఁడు గానే యున్నాఁడు ఇతఁడేనా మండంగి మాదిరాజ భార్య
యగు మాదలాంబ గొడ్డు పోఁగిజన్న ముద్దుబిడ్డఁడు? ఇట్టి సుకుమా
రుని, నవమన్మథాకారుని, జ్ఞానస్వరూపుఁ గనుటకు నామె యెన్ని
నోములు నోచినదో? ఈ భూలోకము మాటుమడియున్న శివభక్తిని
పునరుద్ధారణ మొనరింప మానవరూపమున నిట నవతరించిన సాక్షా
త్పర శివుండితఁడే నిశ్చయముగా ను" అని యనేక ప్రకారము
లఁగొనియాడుచుండ నూరేగి మరలి నిజగృహంబున కేఁగి మజ్జనభో
జనాది క్రియ లొనర్చి యని నాఁటి దినము నిజపత్నియగు గంగమాంబి
కతోడను సోదరియగు నాగమాంబికతోడను బలదేవ మంత్రి భార్య
యగు తన యత్తతోడను నను దిన సల్లాపంబుల సుఖగోష్ఠినుండెను

బసవేశ్వరుఁడు శివభక్తిని శాసనరూపముగాఁ జేయించుట

మఱునాఁ డుదయమున బసవేశ్వరుఁడు యథాకాలప్రబోధితుఁడై
నిత్యకృత్యస్నానసంధ్యావందన శివపూజాదు లొనర్చుకొని యుచిత
వస్త్రాలంకారంబులఁ దాల్చి కొలువుకూటంబున కేఁగి ప్రజలనెల్లఁ బి
లిపించి యెల్లరు శివభక్తి శివపూజాపరులై సర్వదా తమతమకార్య
ములం దీర్చుకొనుచుండవలయునని యాదేశించి, మఱియుఁ దనరాజ్య
మందంతటను రాష్ట్రజనులు సదా తమతమ జీవయాత్రానుకూలంబు
లగు కార్యంబులు సేయుచున్న వారైనను నిర్మల నిశ్చల మనంబుల
తో శివపూజమాత్రము తిథివార మాససంవత్సర నిర్ణీత సకాల పరి

వర్తితంబుగానే నుఱక సేయుచుండవలెనని చారులచే నాజ్ఞాపత్రంబు లనుపుటయేగాక యదియె యొక శాసనంబుగావించి ప్రకటించిచెను. ఈశాసనము నందలి ముఖ్యవిషయములేవన:—

(1) శివరాత్రియున నేడాదికొకతూరి మాఖకృష్ణచతుర్దశినాడు సర్వజనసమాచరణీయంబని జనసామాన్యవిశ్వాసము. అదినిజమేగాని భక్తులకుఁ బ్రతిరాత్రియు శివరాత్రియేగాన శివభక్తులెల్లఱు ప్రతిరాత్రియందును లింగోద్భవకాలముపర్యంతము శివపూజ జరుపుచుండవలసినదే. శివభక్తులనేవారలను దూషింపఁగూడదు. శివభక్తులే శివునిస్వరూపమని భావింపవలయును. భక్తులం దేదియైన దోషమున్నయెడల దానినుగ్గడింపఁగూడదు భక్తులనెన్నఁడు నెత్తిపలుకఁగూడదు

(2) సాక్షాత్తు పరశివుడైనను నాకిదికావలెనని యడుగఁగూడదు. శివభక్తులకిగినది లేదనఁగూడదు ఇచ్చుట యందాలస్యము కూడదు భక్తులను వంచింపఁగూడదు. భక్తులేమి యడిగినను మారుమాటాడక యిచ్చునది తనయొద్ద లేకున్నను వేఱొకని నడిగి తెచ్చి యిచ్చునది

(3) తనకెంత సామర్థ్యమున్నదో యంతియే సేతునని చెప్పునది గాని, చేతఁగాని పని సేతునని ప్రాగల్భ్యము లాడఁగూడదు. అది తప్పఁగూడదు అన్నదానికన్న నధికము సేసి కనపర్చవలెనుగాని తక్కువగ కనపర్చకూడదు. ఆడినమాటలలో బొంకు యుండఁగూడదు

(4) కామక్రోధలోభమోహ మదమాత్సర్యంబులను నరిషడ్వర్గమును జయింపవలెనుగాని మనస్సున వానికెన్నఁడును జోటియ్యఁగూడదు. వానిని మన్నువలెఁ జూడవలెను పశులనెన్నఁడు సాధింపఁగూడదు. పరనిందను తానును పొందఁగూడదు. అందఱు శివభక్తిపూజాపరాయణులై యుండవలెను.

(5) ఇతరుల మర్మములను వెలిబుచ్చఁ గూడదు. శివమతేతరులకు సమయమిచ్చి వారితో మాటాడఁగూడదు పరమతవాదులను భంగపఱుపవలెను. శివదూషణము తనచెవులతో వినఁగూడదు

(6) శివభక్తులధనము నపహరింపఁ గూడదు. భక్తులకు ప్రతివాఁడు నకింకరుఁడై యుండవలెను. భక్తులనెవరు నాక్షేపింపఁగూడదు వారాడినదే మాట తొక్కినదే త్రోవ వారినెవ్వరును వారింపఁగూడదు. లింగముగల ప్రతిజంగమును ప్రాణలింగముగా భావించుకొనవలెను

(7) పామరుల నెన్నఁడును వేఁడఁగూడదు. భవులకు దండము పెట్ట గూడదు. (భవులనఁగా లింగధారణ లేనివారు.) దురాగ్రహులకైన భవులకు దానధర్మములు జేయఁగూడదు పాపబాధలకు లోనై యుండఁ కూడదు. అనఁగా పాపకార్యములను జేయఁగూడదు. సంసారమందెల్లపుడు మునిఁగియుండఁ గూడదు. కుమ్మరిపురుగు బురదలోని వసించుచుఁ దనయొడలికి బురదనెట్లు తగులనీయదో అట్లె సంసారములో నైతము ప్రతిదాని నంటీయంటని రీతిగా నుండవలెను.

(8) ఇంద్రియములను జయింపవలెనుగాని వానికిలొంగి యుండఁ గూడదు సర్వదా శివభక్తిపరాయణత్వమున నుండవలయును. వేదచోదితమైన యాదిశివమతములను నెలకొల్పవలెను.

(9) తలపట్టి ప్రమాణముసేయఁగూడదు శివశరణవ్రతులను వెదకిరక్షింపవలెను శివశరణుల నెటఁగన్నను జేతులెత్తినమస్కరింపవలెను. (శివశరణవ్రతులనగా "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ, అహంత్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి సువ్రత" అని అని భగవద్వాక్యము సర్వధర్మములను విడిచి యొక్కఁడనగు అనఁగా నాకన్నపరము లేదనే భావములో నన్నే శరణుపొందుము. అట్లయిన నిన్ను సర్వపాపములనుండి నేనుతొలగింతును, అనిభగవంతుఁడు భక్త

నికుపదేశించును గనుక యేమానవుడు పాపభీతిచే నేకర్మవలన నేపాపము సంభవించునో యేపాపమునకే శిక్షసంప్రాప్తమగునో అట్టివిచక్షణ నేర్పరక తన్నుఁజూచి రక్షించు భారము శివునియందే నైచి " అన్యథాశరణం నాస్తిత్వమేవశరణంమమ" యనుభావముతో శివునే శరణుపొందియుఁడెచ్చటనైనా పరపుణ్యంబుల నెఱుఁగక రక్షించుచుండునో అట్టివాడు శివశరణాగతుండు. లేక శివగణుఁడు ఈలాగిది భక్తులను వెదకి కాపాడవలెనని భావము ,

అని యిట్లు ప్రత్యేకనిబంధనలు శాసనరూపముగాఁ బ్రకటించి ప్రతివారును నిత్యము ప్రాతరాది ప్రాతః పర్యంతముఁ దాము సేసిన కృత్యము లన్నియు శివార్పితములుగాఁ గావింప వలెనని సామాన్యవిధి యొకటి స్థిరముగఁ బ్రకటీకృతంబు గావించెను సామాన్యవిధియనఁగా "ఆత్మాత్వం గిరిజామతిః పరిచరాః ప్రాణాశ్శరీరంగృహం, పూజాతే విషయోపభోగరచనా నిద్రాసమాధిస్థితిః, సంచారః పదయోః ప్రదక్షిణవిధిః స్తోత్రాణిసర్వాగిరో, యద్యత్కర్మకరోమి తత్తదఖిలం శంభోతవారాధనం" ఓశంభూ! మహాదేవా, యీదేహమందలి యాత్మయేనీవు మతిలేక బుద్ధియేపార్వతి. ప్రాణములే యనుచరులు శరీరమెయిల్లు అనఁగానీయాలయము ఇంద్రియ విషయభోగములన్నియు నీపూజ నిద్రయేసమాధి పదసంచారమే నీకుఁజేయు ప్రదక్షిణము సర్వవిధములగు వాక్కులే స్తోత్రము ఇట్లు నాయొనరించు ప్రతిదిన నిత్యకర్మ మేదియో అదియెల్ల నీయారాధనముగాఁ గైకొమ్ము', అని ప్రతిదినమీ ప్రార్థనా పూర్వకముగా నిద్ర మేల్కొన వలయునని సామాన్యవిధి

ఇట్లు తన మతప్రచారము రాజశాసనముగాఁ గావించి బసవేశ్వరుఁడు విధ్యుక్తముగాఁ బ్రజాపాలనంబు సేయుచు ననేకమహిమలు గనపఱచుచు రాజుయొక్కయు బ్రజలయొక్కయు మెప్పును బడయు

చుండెను. ఇట్లు బసవేశ్వరు మాహాత్మ్యంబు బసవేశ్వరునకే యెఱుక తేక నాకొల్పిరమేశ్వరునికి నార్యామహాదేవికిం బ్రమథగణనాధునకు గోచరమగును గాని వేయుశిరంబులుగల యాదిశేషుండైన నెఱుంగజాలండు మఱియు సీబసవేశ్వరుని జనులందఱు భక్తిజ్ఞానవైరాగ్య సంపన్నుండనియు, వేదాంగపారంగతుండనియు, ధైర్యసాహసౌదార్యాద్యనేక గుణగణయుతుండనియు నీతికోవిదుండనియు, సకలవిద్యాపరిపూర్ణుండనియు, దృఢప్రతిజ్ఞుండనియు నిత్యసత్యవ్రతుండనియు, త్రిగుణాతీతుండని యు, త్రికాలవేదియని యు, శాంతస్వభావుఁడనియు, సర్వజ్ఞుండనియు సర్వసంపత్సమన్వితుండనియు వదాన్యోత్తముండనియు నిన్నియేల కేవలము పరశివుని యపరావతారమని నుతించుచుండిరి. శివభక్తులెందఱువచ్చినను వారలకేమి కావలసినను నదియెల్లం బరిపూర్ణముగా నిచ్చువాఁడనియు లోకమందంతట నొక ప్రవాదవ్యాపించెను. అందువైని లో మందున్న భక్తజాలమంతయు బసవేశ్వరు దర్శనార్థము నిత్యము వచ్చుచుండెను ఈవచ్చువారిలోఁ గొందఱు నిండు మనంబులఁ దమకోర్కెలు తమవట్టిన వ్రతములు బసవన సఫలములు సేయఁగలఁడను నమ్మకము తోఁడను కొందఱీతం డెట్లిచ్చునో చూంతమను తలంపులతోడను మఱికొందఱు నిశ్చలవైరాగ్య భావులు తమ వైరాగ్యముద్ర నవలంబించి కేవలము భక్తివిగ్రహుండగు బసవేశ్వరుని దర్శించు భావంబులతోఁడను నానావిధభక్తులు నానావిధములగు వేషభాషలతో నరుదెంచుచుండిరి ఇట్లు తీర్థయాత్రలకుఁబోవు వైర్థికావళివలె భక్తజనులందఱు బసవేశ్వరుదర్శనముచేసిన మాత్రమున దృఢభక్తిగలుఁగునను నమ్మకముతో బసవతీర్థ మాడఁజనుదెంచుచుండిరి అందుఁ గొందఱు కరితురగాందోళికారథాద్యారూఢులై తమతమ బిరుద నిషానులతో నందు కుందగువాయిద్య విశేషంబులుగల మరాధిపతులగు కిరీటస్వాములును మఱికొందఱు భస్మరుద్రాక్షమాలాలంకృ

బసవేశ్వరుని లింగధారణంబును పంచాక్షరీమంత్రోపదేశంబును బసవేశ్వరుఁడే యొనరించి నిజాగ్రశిష్యునిఁగా బరిగణించుచుండెను. అతండు "గురుర్బ్రహ్మా గురుర్విష్ణుర్గురుర్దేవో మహేశ్వరః గురుస్సాక్షాత్పరబ్రహ్మా" యను న్యాయానుసారంబున బసవేశ్వరుఁడే సమస్తంబు నని నమ్మికొని యాతనిసేవయే సర్వదా యేమఱక సేయుచుండెను. ఇట్లుండి చన్నబసవేశ్వరుఁడు లోకులచేఁ జన్నబసవేశ్వరుఁడుగా భావింపఁబడుచుండెను. ఈ చన్నబసవన్న మాతులునకు నంతేవాసియై యాతనియడుగులఁ బాఁడనే చరించువాఁడు గనుక మేనమామను దర్శింప వచ్చు భక్తులకెల్లఱకుఁ దగిన యుపచారంబులు తానే యొనర్చుచుండెను.

### చన్నబసవన్న శివభక్తులను గౌరవించుట

నిజమాతుల దర్శనార్థము శివభక్తులు వచ్చుచున్నారన్న వార్త విని తత్క్షణమునందే యెంతదవ్వైన నెదురుగా నేగి వారల నుచిత సత్కారముల గౌరవించి వారలకై యలంకరింపఁబడిన రాజమార్గమున వారలఁ దోడ్కొనివచ్చి కస్తూరికలిపిన నీటఁ గలయంపిసల్లి ముక్తాఫలంబులు ముగ్గులుగా నింపఁబడ్డ యిండ్లలోనికిఁ గొందఱిని బాడిండ్లలోఁ గొందఱిని శాలలలోఁ గొందఱిని మందిరములలోఁ గొందఱిని విడియించి విభూతి గంధపుష్ప బిల్వపత్రధూపదీపనైవేద్యములగు శివపూజాద్రవ్యంబులు సమృద్ధిగా సమర్పించి పూజాసమయంబున పరిచారకులచే శంఖకాహళి తూర్యాది నాదంబులు గావింపఁబడునటుల నేర్పాట్లు చేయించి పూజానంతరంబున షడ్రసోపేత భోజనంబుల వారలం దృప్తులుగా నొనర్చి యే విషయమునందైనను లోటు లేకుండునటుల సర్వంబును సమకూర్చుచుండును. మఱియు భక్తులు తమకు కావలయునని కోరిన నల్లను వారికిఁ దానే సవరణచేయుచుండువాఁడు. ఒకానొక సమయమునందు భక్తులతని సామర్థ్యముఁ బరీక్షించుటకో నిజముగాఁ దమకుఁ గావలసియో మనము నిశ్చయింపనేరముగాని, తమకు

సతీచతురలగు వనితలు కావలెనని కోరుచుండెడివారు. చన్నబసవండు ను తమ మదినెంతమాత్రము గినియక వారల దూరక యెవ్వారి నెల్ల ఇనట్టి వేశ్యాభుజంగులఁ గాపాడుచుండెడివాఁడు ఇట్లు భక్తులుకోరిన వెల్లను మేనమామను వాఁడుగినక్క అలేకనే తానే వారల కొసం గుచు తత్క్రియగుచుపుడు వారలను నిజగురు (మేనమామ) సామీప్యం బునకుం గొండొనిపోయి గురుశుశ్రూషయుం గా భక్తులరాకయాలని కెత్తింగింపుచుండును. నిజాగ్రశిష్యుండును సుశ్రాయుండును భాగినే యుండునగు చన్నబసవన్న భక్తుల నెదుర్కొనుటయు వారలకు సాష్టాంగ దండప్రణామంబులు సేసి తదంఘ్రి రేణువులఁ దనయొడలం బూసికొని పాదధూళి శిరమునం దాల్చి కుశలప్రశ్నపూర్వకంబుగా సంభాషించుచు తన దాసానుదాసత్వంబు తెలుపుచు వారలకుపచార పూర్వకంబగు కైంకర్యము సేయుచుండుటం గని బసవేశ్వరుండు మిగుల నానందంబునొంది యాయుకుండగినవాఁడగా నాతని నియమించి తన శివధ్యానమంత్ర జపపుణ్యాతిశయత్వంబున నుండియు నే మఱక రాజకార్య నిర్వాహకత్వంబు నందును దెటల్లు చుండెను

◇ అల్లమప్రభువు బసవేశ్వరుని జూడవచ్చుట ◇

ఇట్లుండ నొకానొకదినమున బసవేశ్వరునిం జూచు నుత్సాహముతో సంగమేశ్వరస్వామి శ్రీ సంగమేశ్వర పురాధిష్ఠాతయగు అల్లమప్రభురూపంబున జంగమవేషంబు గైకొని శివధ్యానపరాయణుండై సకలవిద్యా సంపన్నుండగు పరమయోగిచందంబున ద్వంద్వాతీతుండై సమకాంచనలోష్టాశ దృష్టితో భక్తిరసం బుట్టిపడుచుండఁ జూచువారల కితండే పరశివుండను భ్రాంతి గలుగఁ జేయుచు లింగసంగతదేహుండై ఆహా నోర్వలిగింబుల రెంటిని రెండుచేతులం జూపుచు శివతన్మయత్వంబునం దన్నుం దానెఱుఁగక యిది మొఱక యిది పల్లం యిదిపుట్ట యిదికట్ట యిదిచెట్టు, ఇదిగట్టు ఇదికొండ ఇది

యేము ఇదిస్థలము ఇదిజలము నను భేదదృష్టి లేక సర్వసమదృష్టితో నరుదెంచు నతని కావలి తొలఁగి మార్గమిచ్చుట చూచువారల నాశ్చర్యరసమగ్నులఁ జేయుచుండె ఈతీరున వచ్చుచున్న యల్లమప్రభువును బసవన్న చూచి కేవలము సంగమేశ్వరస్వామియే వచ్చుచున్నటుల భావించుకొనియె. సర్వసామాన్యముగా శివభక్తుల నెల్లను బసవన్న శివస్వరూపులనుగాను భావించువన్న విషయములో సాక్షాత్తు శివుఁడే యారూపముతో వచ్చినప్పుడాతని శివునిఁగాఁ గనుట బసవన్నకొక వింతగాదు. రత్నపరీక్షకుని యొద్దకు రత్నము తనంతనే దాఁ జన్నయట్లు భక్తిరత్నపరీక్షకుఁ డగు తనయొద్దకు మూర్తిభవించిన భక్తియే వచ్చుచున్నటుల సాక్షాత్కరించిన యల్లమప్రభువును సంగమేశ్వరస్వామియగు శివునిరూపముగా భావించుకొన్న బసవన్న పరమానంద సంభరితమానసుండై భక్తిపూర్వకంబుగా నెదురేఁగి సాష్టాంగ దండప్రణామంబులు పదేపదే గావించుచు వినయవినమితోత్తమాంగుండై తోడ్తెచ్చి నిజాంతస్స్పృహ ప్రవిష్టుంగావించి మణిమయాసనాసీనుం జేసి బహువిధముల స్తుతించి బహువిధోపచారంబులు బూజించె

అల్లమప్రభువునకు బసవన షోడశోపచారపూజ యొనర్చుట.

ఆపూజ చుట్టయా తెగిన సుపూర్వకంబుగా. బూజించెనట్లన — అఖండతేజోరూపంబున నఖిలాండకోటిబ్రహ్మాండ బహిరంతర్వ్యాప్తుఁడవగునో దేవా! నిన్ను నా చిన్న హృద్గృహంబున నిమిడి యుండెడి సూక్ష్మరూపునిఁగా నామనంబున భావించి యావాహించుచున్నవాఁడను అఖండభూమండలంబే వాదపీఠముగాఁ గల నీకునో దేవా! యుపశమించుటకొక చుల్ప మణిమయాసనము సమకూర్చుచున్నవాఁడను పాతాళగంగచే సద్యఃప్రక్షాళనంబు సేయఁబడు నీ పాదంబులకో దేవా! పాద్యంబుగా నంబుకణంబులం జిల్కుచున్నవాఁడను. ఏనీ చేతను విడువఁబడ్డయొక్క బిందువు హిమవంతంబునఁబడి

యందు బిందుసరంబను పేర నొక పెద్ద సరస్సు యందుండి ప్రవహించెడు జాహ్నవీనది సగరభూపతికుల్యాబడి సాగరంబై యధోలోకంబున గారి సగరసుతుల యరుదవేల భస్మరాసులపై పారలిపారి వారలకు సద్గతిఁ గలుగఁ జేసి భోగులకు విహారయోగ్యంబగు భోగవతియను నామంబునఁ బ్రవర్తిల్లుచున్నదో అట్టిసిచేలికి పుడిసెడునీళ్లు నేనర్ఘ్యంబుగా సమర్పించుచున్న వాఁడను అలకానదీ నిర్మలతోయంబులనాచమనించునీకునో దేవా! నేను మాయూరి తటాకోదకం బాచమనీయంబుగా నొకయుద్ధరిణెడు సమర్పించుచున్న వాఁడను. ఆకాశగంగా సంతతధారాపాతాభిషిక్తుఁడవగు నీకునో దేవా! నేను పరిమితవారి పూరంబగు పాత్రి నుంచి సూచీముఖవ్యాసపరిమాణ స్వల్పరంధ్ర నిస్సరద్ధారా పాతంబున నభిషేకంబుగా విచుచున్న వాఁడను మాఁప్రమాణా తిరిక్తకృత్తిపటాంబరావృతుఁడవగు నీకునో దేవా! నేను మానవతంతువాయపిడకలిపము హస్తమాత్రప్రమాణావధి విశిష్టంబగు కర్పటతంతువిరచితవస్త్రయుగ్మంబొసంగుచున్న వాఁడను. భస్మరాగ యజ్ఞోపవీతుండవగు నీకునో దేవా! నేనురజితకృత్తి సూత్రనిర్మితంబగు యజ్ఞోపవీతంబర్పించుచున్న వాఁడను "సర్వోపచారి పీఠ్యస్య భస్మోపరిత కుందవ" యనున్యాయంబున సర్వదా భస్మధవళితాంగుండవగు నీకు నవపుష్పములే యున్నను న్యాపిరానీమేచక కంఠప్రదేశంబునఁ దాకెను. శ్రీగంధ బలుపుచున్నవాఁడను. ఆకాశంబే కేశపాశముగాఁగల నీకు నక్షత్రంబులే యకుతప్రాయంబులుగా శిరంబునందూఁగాడుచుండ, మందబుద్ధినగు నేను తండులశ్వేతాక్షతల నర్పించుచున్న వాఁడను అభ్రపుష్పంబులను పుష్పవంతాలంకృత శివస్కుండవగు నీకునో దేవా! నేనుకతిపయపుష్పపత్రంబుల సమర్పించి పూజసేయుచున్నాఁడను సర్వలోకంబుల వారికి భక్తిగంధపువాసననీవు గల్గఁజేయుచుండ నీకునో దేవా! నేను గించిత్తువాసనగల ధూపద్రవ్యపరిమళము జూపుచున్న వాఁడను. అఖండజ్యోతి స్వరూపుఁ

డవగునీకు నో దేవా! నేనొక చిన్నవృత్తి దీపమును దర్శించుచున్నవాఁడను. హాలాహలాశనుండవగు నీకు నో దేవా! నేనుద్ధరిసెఱుఁగంగ నాపోశనముఁ గల్పించుచున్నవాఁడను. కపాలభిక్షాన్నభోక్తవగు నీకో దేవా, నేను నాయింట గలుగు షడ్రసోపేతాన్నంబును నాచేత స్వయముగాఁ దినిపించుచున్నవాఁడని యొకబండారు పళ్లెరంబున నానాభక్ష్యభోజ్యాహారంబులు వడ్డించి పాలు పెరుఁగు నేయి తేనె పప్పు నాయసాపూపాదులు వీని నన్నిఁటిని వడ్డించి నివేదనమాత్రమునుగాక తనచేతఁ గలిపి కబళ్లు సేసి యొక్కొక్కకడి స్వామినోటి కందించుచుండెను

చేతఁ జూలపాశి భోజనము గొనునప్పుడు కబళ్లు తాను స్వయముగా నారగించినట్టుల నేఁడు బసవన చేతికబళ్లు సంగమేశ్వరపురాధినాథుండగు నల్లమహారాజు రూపంబున వచ్చిన సంగమేశ్వరస్వామి యారీతి ననే స్వయమారగించెను ఇట్లు బసవనయుండెడు కబళ్లను ప్రభువారగించుటలో లక్షయు నెనుబదివేల శివస్వరూపజంగమ భక్తులభిక్షకై యుక్తయుంబుగా వండఁబూర్వంబసిన భోజనపదార్థంబు సర్వంబు నగ్నియందాహుతి కాబఁడిన యాజ్యంబువలెఁ బూర్ణంబైన సుఖలన తి నామగ్రి సమకూర్చుట కనకాశము లేకపోయెను ప్రభువుతృప్తిపొందినట్లగుపడ లేదు మఱిచుట్టిఁ గబళ్లనెనుటకు నోరాగలించుచుండెను. అది గని బసవన స్వామి దృష్టనొందించుచుని వేఱుపాయంబుగానక యాత్మోపహారం బొసంగుటయే మంచిసాధనంబని భోజనభాజనంబగు స్వర్ణస్థాలికయందుఁ దానొక కడిగానుంచి భూతసర్వాంగుండై పిండిరూపంబున భగవంతుని వదనంబు కెగయు నుంకించు నంతలోఁ బ్రభు

## సంగమేశ్వరుని అల్లమప్రభునకు శివుఁడు కొనియాడుట.

వదిగాంచి పుత్రవాత్సల్యంబున నాతనిఁ గౌఁగిలించుకొని ముందుగా నిట్లని ముద్దులాడఁ దొడఁగెను ‹‹భళిర బసవా! చాభానురా బసవా! వహ్వా బసవా! నాచిన్నిబసవా, నాచిట్టిబసవా, నాముద్దుబసవా, నాబుద్ధిబసవా,

నానుద్దిండబసవా, నాకీర్తిబసవ, నాభక్తిబసవా, నామంత్రిబసవా, బంఢారుబసవా, నాభాగ్యబసవా, నాముద్దులమూటబసవా, నునవ్వులచన్నబసవా, నానందిబసవా, నావృషభబసవా, నావాహనబసవా, నాప్రమథగణబసవా, నిన్నెంతయుముద్దులాడినను గవిపితీరకున్నది "ఆత్మావై పుత్రనామాసి" "అంగాదంగాత్సంభవం" ఇత్యాదిశ్రుతిప్రమాణవాక్యములకు మూలకారణుండనగు నాయనుంగు దనయుఁడవు. విశేషించి నా దయాదిశిష్యుఁడవు, భక్తుఁడవును నీయందునాకుఁగల ముద్దుమోహంబునకు వనియులేక సర్వదానీగాత్రస్పర్శంబునాకుఁ గలుఁగుచుండునట్టుల నిన్ను నావృషభవాహనంబుగాఁ జేసికొంటిని అట్టి నాయాదివృషభేశ్వరుఁడవగు నీవు నేఁడు భూలోకంబున నంతరించుచున్న నాభక్తిని మఱల నుద్ధరించుట కీరూపావతారంబుఁగొని యవతరించినాఁడవు ఇట్టి నీయందు నాయుందలిభక్తి యత్తమిల్లి విత్తంబుగా నెలకొని తన నెత్తావినిసిలికి బుత్తెంచి తన్నాఘ్రాణించిన జనులను దనయొక్క కాంక్షించుకొనుచున్నది దానంజేసి భక్తులెల్లను నీరూపరేఖావిలాసంబులను భక్తిగంధ పరిమళమును గన్నవారు నిన్ను జీవముగల పుత్తడిబొమ్మయని నిశ్చయభావంబుల భావింతురు నీలోవెలుఁగొందు భక్తింగని నుతికొందఱు నిన్ను నంతర్దీపకళగల మహారత్నంబవందురు నీభక్తిఫలరసాస్వాదకులగు నన్యులు నిన్నుఫలాగ్రంబగు నిక్షుదండంబందురు మఱియు నీవుభక్తుఁడవును, జ్ఞానులలో జ్ఞానివి పండితులలోఁ బండితుఁడవు మంత్రులలోమంత్రివి, రాజులలోరాజవు, భోగ్యవంతులలో భోగ్యవంతుఁడవు, విలాసములలో విలాసవంతుఁడవు, సిద్ధులలో సిద్ధుఁడవు. మునిపుంగవులలో మునిపుంగవుఁడవు, సత్యమునకు సత్యంబవు, ధర్మమునకు ధర్మంబవునై యుండువు అన్ని సర్వతోముఖుండగుట నొడలెల్లను నోళ్లుగలవాఁడును, సర్వతఃపాదంబగు ప్రావాహజలంబు తనువెల్లను గాళ్ళుగలదియు నెట్లయ్యెనో అట్లే నీవుసర్వతో

భక్తిభావుండవగుట నీకెకరమంతయు భక్తిరసమునే వెలిగక్కుచుం డును. నీగాలి తగిలినంతమాత్రమున పశువులకును పక్షులకును క్రూర జంతువులకైనను, భక్తి గలుగును. బసవా, బసవా యని నీ నామో చ్చారణసేయు జనులకడ మెలఁగెడి జంతువులకైనను ముక్తి గలుఁగును. బసవాయని నిన్నుఁ దలఁచుకొని విషముఁ ద్రాగినను నది యమృతమగును. బసవాయని నీ నామస్మరణసేయువారికి నగ్ని జలమగును వజ్రాయు ధము కుసుమబాణంబగును. కార్చిచ్చు వెన్నెలయగును. మఱియు నవి యే నీనామ మంత్రోచ్చారణపూర్వకంబులుగాఁ బ్రయుక్తంబులయ్యె నేని శత్రువులవై జలమే యగ్నియగును. కుసుమబాణమే వజ్రాయుధం బగును. వెన్నెలయే కార్చిచ్చగును. నీనామస్మర్తలగువారికి శత్రువులు మిత్రులగుదురు. ఇంక నీకట్లగుట యొకయాశ్చర్యమా. నీకుఁగల లింగై క్యసౌఖ్యకేళీవినోదంబును, జంగమ ప్రాణానుసంధానానుమోదంబును భక్తజనపామరప్రసాదంబును ముల్లోకంబుల నెవ్వరికిఁగలవు నాతండ్రి నాయన్న, నాచిన్న, బసవ, బసవసేవక, బసవభక్త, బసవమంత్రి, బస వరాజ, బసవేశ్వర నాముద్దుపట్టీ యని మఱియు ననేకప్రకారములఁ గొ నియాడి పునఃపునరాలింగనంబులచేఁ దన్నోలిందనుపుచున్న ప్రభువునకు బసవన భూయోభూయస్సాష్టాంగదండప్రణామపూర్వకంబుగ నిట్లనియె.

## బసవేశ్వరుఁడు ప్రభువును స్తుతిచేసి ప్రమథగణంబులకీ వృత్తాంతంబు సెప్పుట.

దక్షక దర్పాపహారా! హరా, శర్వా, శంభూ, స్వామీ, నేనా నీకు కడుపునిండఁగ భోజనము పెట్టువాఁడను. తొల్లి పార్వతీదేవి హర గణంబులకొవిందుచేసి యందు నొక జట్టిబాలుని మహిమంబునకు నతు లాశ్చర్యయై యభవునకుఁగ నతండు తన గణంబుల మాహాత్మ్యంబు భవానీదేవికిఁ దెల్ప నామెలజ్జావనతవదనయయ్యె. ఆవిధంబు వినుపింతు వినుము. నీవెఱుంగనిది కాదు అయినను నీవుమఱియొక వేషంబున

నన్ను మాయచేయవచ్చితివి గనుక నీమహిమ నీకేవినిపింతును. పూర్వ
మొకానొక దినమున సాంబమూర్తి నిండుకొలువునందుండ నాతని
దర్శించుటకు బ్రహ్మ విష్ణుదేవతలెల్లను వచ్చియుండిరి. వారందఱు
నగజ చూచుచుండఁగనే యున్నవా రున్నట్టున శివసారూప్యులైరి.
అందఱు జటాజూటులే. అందఱు త్రినయనులే అందఱు పంచ
ముఖులే. అందఱు నాగభూషణులే. అందఱు పినాకపాణులే మఱియు
నందుఁ గొందఱు శివరూప చిహ్నంబులుగలవారై బహుబాహులు బ
హుపాదులు, బహుముఖులు, బహుకర్ణులు, బహునేత్రులు, బహుశిర
స్కులునగుచు మఱియు నందఱు సింహగజశరభశార్దూలాది వనమృగా
కృతులను అగనజమహిషగోశ్వఖరసూకరాది గ్రామ్యమృగజాతిరూపంబు
లను గండభేరుండ శరభ సాళువ గరుడ రామబంధు హంసకార గృధ్రో
లూకాది ఖేచరరూపంబులను, మకరకచ్ఛప కూర్మమండూకాది జలచర
రూపంబులను, వాసుకితక్షక కర్కోటకాది పాతాళవాసుల రూపంబు
లను, సిద్ధసాధ్యాది దేవయోనులరూపంబులను, దేవతల రూపంబులను,
దిక్పాలకులరూపంబులను. మఱియు ననేకంబులగు శివరూపంబులు
గొన్నవారై, పరమేశ్వరుని జగము విశ్వరూపంబును వారల నందఱిం
గని దాక్షాయణీదేవి మిగుల నానందంబునొంది వారలకు విందుసేయఁ
దలఁచి భర్తృననుజ్ఞఁగొని వారల నుండ నియోగించి యున్మేషనిమిషో
త్పన్నవిపన్నభువనావళియగు నాలోకమాత బ్రహ్మాండంబులే పాత్రభాం
డంబులుగాను దిగ్భిత్తులే భోజనమందిర ప్రాకారములుగాను, సంకల్ప
మాత్రంబున సమస్తపదార్థంబులను షడ్రసోపేతంబులగు భోజనపదా
ర్థంబులు సంగ్రహించి యందఱికిం దృప్తిగ భోజనము బెట్టించుచుండెను
అప్పుడశంభుని ప్రమథగణంబు లదిగని తమయునొక్కబాలుని జూచిర
మ్మనిపంపిరి ఆ బాలుఁడునచ్చి మొదట తెఱపిలేక భోజనము చేయుచున్నవా
రలను, పదార్థసంగ్రహంబును జూచి, యాశ్చర్యనిమగ్న మానసుం

డైయంబయొద్దకేగి "తల్లీ! నాకాఁకలియగుచున్నది. పట్టెడుకూడు పెట్టింపు మని వేఁడఁగా నాయమ తత్‌క్షణమే వానికిఁ బెట్టించెను వాఁడుఁ గూర్చుండి వడ్డించిన పదార్థము లేనుఁగుతలకాయలంతేసి కబళ్లు సేసి యొకయఱలిప్తలో భుజించి యింకా దెమ్మనుచుండెను పార్వతిపరిచారికలు వడ్డించినకొలఁది నాతఁడు దినుచుండెను గాని యాఁకలియాఱుట కంతము లేదు. ఇట్లు సమస్త దేవ మానవ జాతంబులకు సిద్ధపఱుపఁబడిన ప్రయత్నపదార్థమంతయు నీయొక్క బాలుఁడే యారగించుటఁ గని హైమవతీదేవి భర్తృసాన్నిధ్యమునకుఁ బోయి, "దేవా! యీ లోకోత్తరుఁ డగు బాలకుఁ డెవఁడు? వీని క్షుద్బాధ నాశ్చర్యజనకం బగుచున్నది. పరిమాణంబున పండ్రెండేండ్ల బాలునివలె నున్నవాఁడు. వడ్డించిన పదార్థములను దినుటకుఁ దాఁ జేసిన కడి యంతగుఱువు తానుండఁ డనుకొందును. అట్టి కబళ్లు సంఖ్యాతములుగా వడ్డించినకొలఁది దిగమ్రింగుచు సకలభువనదేవమానవగణంబులకుఁ జాలినంత ప్రయత్నపదార్థంబులఁ దానొక్కడే సరిపెట్టినవాఁడు ఇంకను దినవలసినవాని లెందఱో యున్నవారు. వారలకెట్టులు నేను దృప్తిగా భోజనం బిడుదానను ఇదియు నీమాయవలెనే యున్నది. నీగుణములయొక్కయు నీయొక్కయు మహిమలు నీకే తెలియును." అని లజ్జావనతవదనయై నిలుచున్న దేవిం గని భక్తవత్సలుండగు భగవంతుఁడు "దేవీ! సంకోచంబు వలదు. నీవు సంగ్రహించిన భోజనపదార్థంబు లక్షయంబులైనవి నీవిందువలన భక్తగణరూపుఁడ నగు నేను దృప్తిఁ గొంటిని" అనునంతలో సమస్తదేవగణంబులు తల్లికడ కరిగి "యో లోకమాతా! మాకందఱకును దృప్తికరముగు భోజనముఁ బెట్టితివి ఇఁక మేము మోసవఁజాలము కుత్తుకలబట్టి తింటిమి ఇంకను పదార్థజాలం బపరిమితంబుగా నున్నది. పాప మీపిల్లవాఁ డెందుండి వచ్చెనో యింకను దినఁ గోరుచున్నవాఁడు. వానికిఁ బెట్టింపు" మనవుడు దేవి వానిఁ జూచునంతలో మఱల యథాప్రకార

ముగా సామగ్రియపారముగాఁ బడియుండె. పిల్లవాడుఁను వడ్డింపుమను చుండె. అప్పుడు పరిచారకులు వడ్డించిన పదార్థములలో మఱి రెండు కళ్లు కళ్లు "తృప్తోస్మి" యని యాబాలుఁడను నంతలోఁ బ్రతిధ్వని విన బడినట్లు సమస్తభూతకోటియు నైకకంఠ్యముగాఁ "దృప్తోస్మి యను నాదంబు వినఁబడెను. ఆబాలుం డదృశ్యుఁడయ్యెను. భూతజాలంబు నదృశ్యమయ్యె. బ్రహ్మాదిదేవతలు లోనగువారందఱు నదృశ్యులైరి. అదిమొదలు పార్వతి యమందానందాశ్చర్యంబులు మనంబునం బెనంగొన నభవుపాలికిఁ జని నిలుచుండెను. పరమేశ్వరుండుఁ నామెంగని "దేవీ! చూచితివా నాప్రమథగణంబుల మహిమ? నీవుచూచిన బాలుఁడు నాబాలప్రమథగణము గానివాఁడు ఈగణమునే భూలోకము లో నాభక్తులందఱు జంగమం దురు. ఇట్టిబాలకుల నేకులున్నవారు. ఇట్టిబాలకునొక్కనిచే నీయజాండంబుల నేకము లుత్పన్నములగుచున్నవి. ఒక్కనిసామర్థ్యమే లోకాతీతమనుటలోఁ దక్కినయందఱి సంగతి వేఱ సెప్పనేల? అట్లగుటనే వేదములుసైతము నాగణంబుల వేలువేల సెప్పలేక యసంఖ్యాసహస్రములని యూరకున్నవి కనుక నాప్రమథులు బాలకులైనను మహామాహాత్మ్యసంపన్నులు. ఇఁక మునులమాట తలపనేల? వారందఱు నారూపములు. నేనువారిరూపము. నాకును వారికిని భేదమెంతయును లేదుగాన నీవునాభక్తులకును ప్రమథగణంబులకును ప్రసన్నురాలవై వారలనరయుచుండుము నీవనవేతే? నీవునా అర్థాంగివి. నీవేనేను నేనేనీవు. నీకును నాకును భేదములేదుగదా కనుక నాభక్తులు నీభక్తులు నాగణంబులు నీగణంబులు. నీవులోకమాతవు. ఆదిశక్తివి. అందఱు నీదాసులే నీవులేని ప్రాణంబొక్కటిలేదు. ఇన్నియు నెఱింగిన దానవై నీవిటులాశ్చర్యపడుట నాకాశ్చర్యంబుగా నున్నది." అని పార్వతినుగ్గడించి యానందముఁ గలుగఁజేసిన భర్తకు నమస్కార పూర్వకంబుగా నామెయనునయోక్తులఁ బ్రసంగించుచు ననుకూలవర్తి నియై యుండెనఁట.

## బసవేశ్వరుఁడల్లమప్రభువు నీశ్వరుఁగా నుతించుట.

మహానుభావా! అట్టి భగవంతుండగు నీశ్వరుఁడవు నీవె కావా. నన్నుఁ బరీక్షింప నొకమనుష్యమాత్రుండగు నల్లమప్రభు వేషంబున నీవిచ్చటికరుదెంచినను నీయనుగ్రహంబున నాప్రాక్తన జన్మసంస్కా-రంబున నాకుంగల్గినయంత దృష్టిచే నిన్నుఁ దక్షిణామ నాప్రభువగు సంగమేశ్వరునిఁగా నెఱింగినవాడను గనుక నే యీషోడశోపచారపూజ నీకు గావించితిని. కొండంత దేవుని గొండంత మేటిపదు పత్రితోఁ బూజించు వారుకలరా? భక్తితోఁ బత్రినీకునమర్పింతురు "త్రిదళం త్రిగుణాకారం త్రినేత్రంచత్రియాయుధం, త్రిజన్మపాపసంహారం ఏకబిల్వంశివార్పణం" మని యొక్క బిల్వదళముతో మాత్రమె నిన్నుఁ బూజింతును. నీకు నేను కడుపునిండ భోజనము పెట్టఁగలనా? నీకడుపునిండించు భోజనపదార్థము నేనే గనుక నే ఆత్మోపహార మొసంగి సమకట్టితిని. లోకంబుల కాదిభూతంబవునీవు. నీవల్ల నేసమస్తలోకంబు లుద్భవిల్లుచున్నవి. వృద్ధిఁబొందు చున్నవి. లయంబులగుచున్నవి సృష్టికర్తయగు బ్రహ్మయు పోషణకర్తయు జగద్బహిరంతర్వ్యాప్తియుఁనగు విష్ణువును సంహారకారకుండగు ప్రళయభైరవుండును నీయందుద్భవించిరి వారందఱు నీప్రమథగణము లోనివారే. నాదృష్టికి సమస్తంబు నీస్వరూపంబుగాఁ గనఁబడుచున్నది ఇట్టి యంశములో నిన్ను భిన్నభావంబుల నేమని నుతింపఁజాలుదు" నని యనేకవిధంబుల నుతించు బసవన్నను దయార్ద్రదృష్టినీక్షించి యల్లమ రాజాతని కిట్లనియె.

## బసవేశ్వరునకు శివుఁడు వరములిచ్చుట

బసవేశ్వరా! నీవు దలంచినట్లు నేను నిక్కంబుగ నాయాదిశివుండనే. నీయందలి ప్రేమచే నాఁడు నీ జననకాలమందు నీశరీరంబున లింగ సంగతంబు గావించి నీయమ్మతో నీవు నాసుతుండవని చెప్పియుం

టిని పిమ్మట నీవు సంగమేశ్వరమునకు నీయక్కయు నీయతివయుఁ దోడరా నేతెంచినపుడు నిన్నాలింగనముచేసి నీకు జ్ఞానోపదేశంబు సేసి తిని ఈనడుమ నీమామ స్థానంబున నిన్ను బిజ్జలరాజు నియమించుట యు నీవు నీయుద్యోగంబు సేసికొనుచు భక్తినేమఱక భక్తులవరయుచు పరమభక్తుఁడవై యుండుట చూచి నీకు నెలయు వరంబులొసఁగి మఱి యొకనారి తొల్లిచేసిన జ్ఞానోపదేశంబును స్థిరీకరింపవలెనని యిప్పుడీ రూపమున వచ్చితిని శివభక్తులకు నీవొనరించుచున్న యాదరణకు వార లకు నీవొనర్చుచున్న ధనధాన్యాది వస్తువాహన సదుపాయములకుం దగినటుల కల్పవృక్ష కామధేను చింతామణులు నీయింటసర్వదా యుం డునటులు చేయఁ దలఁచితినిగానియట్లొనర్చుటవలన, వానిలోపము దేవ తలకు బాధకరముగా నుండును గనుక నిను సమస్తపదార్థ సమృద్ధి యెల్లప్పుడు నీయింట నుండునటులను నలయు సామగ్రులు, నెలయు ధన ములు, నలయుభోజన పదార్థములు, నెలయు ధనకనక వస్తువాహనా నేకసంపదలు, వివరమేల, నివెప్పుడేవి కావలయునని కోరిన నదియె ల్ల నమర్చిన్నట్లు నీవు సిద్ధుడగు చుండునటులను నే వరంబులిచ్చితి మఱి యు నీవు స్వర్గవనె ఒంగారను, ఆడినదె మాట, పాడినదె పాట, నడి చినదే త్రోవ, నీవు శాపానుగ్రహ సమర్థుండవు ప్రతివాది భయంక రుఁడవు విజయుఁడవు సకలవిద్యా వరాంగుఁడవు ఇఁక వేస్వేర విన రింపనేల? నీవు దేవత్వంబు నొందితివి. ఇవి నాయిచ్చవచ్చిన వరములు ఇదివఱకు బసవన్నవగు నీవు నేఁటితో బసవేశ్వరుఁడ వైతివి నేనేనీవు నీవేనేను ఇఁక నాభక్తిని భూలోకంబులోఁ బ్రజ్వలింపఁ జేయుము. దిగ్విజయంబు నొందుము" అని యనేక వరంబులొసఁగి మఱల జ్ఞానో పదేశంబు సేసి రాజనీతులు గఱపి సాంగంబగు ధనుర్విద్యయుఁ దగు నస్త్ర పరికరంబులతో నొసంగి బసవేశ్వరునిచేఁ గొడువ యుపచారం బులంగొని యిట్లు షోడశోపచార పూజాంతంబున నాతండు సూచు

చుండ నచటనే యంతర్ధానంబు నొందెను. బసవేశ్వరుండును దన్నుఁ దా మఱచి రాచకార్యమును దక్క తక్కిన యన్నివేళల యందును లింగతన్మయుఁడై యుండెను. ఈ యల్లమప్రభు బసవేశ్వరుల సమాగమ కథ వినువారును జదువువారును నముత్ర సుఖంబులు నిహలోకంబున ననుభవించి యంతమున శివసాయుజ్యంబు నొందుదురు.

## వంగకాయలు లింగకాయలగుట

ఒకానొక దినమున బసవేశ్వరులవారు శివపూజ గావించుకొని భక్తులనారాధించు సమయమునఁ గొందఱు లోనికరిగి భక్తులతోఁ దామును భుజింపఁదలఁచి లింగధారణంబు లేనివారు లోని కరుగఁగూడదని తమపైమీఁద వంచలకుద్ద పలికలుచింపి యొక్కొక దానియం దొక్కొక్క వంకాయలమూటగట్టి లింగకాయలవలె మెడలఁ గట్టుకొనివచ్చి కూర్చున్నవారలను బసవేశ్వరుండు గాంచి "భక్తవరులారా! తాము లింగధారణ లేనివారు శివభక్తులయిండ్లకు రాఁజాలరు మీకును శివపూజసేసి కొంకు మహిమాలింగింపులా చేయు" మని యాజ్ఞయిచ్చిన వారలందొరుల మొగంబు ఏక్షించికొనుచు సిగ్గుపడి మూటలన్నియుఁ జేయివైచి విప్ప లేక తమవొంగతనము బైటబడుటను భయంబునఁ నొండొరుల మొగంబులు చూచుకొనుచుండ బసవేశ్వరులవారది యెఱింగి "భయపడకుఁడు మీ మెడలలోనివి లింగకాయలేగాని వంగకాయలుగావు విప్పిచూచుకొనుఁ" డని బలిమిని వారిచే మూటలువిప్పించిన నవియెల్లను లింగకాయలయ్యె. వారును శివపూజలుగావించుకొని భక్తులతోఁబాటు దామును విహారింగించి బసవేశ్వరులవారివలన ? హలుమానాలు ? హలుమతిగాఁ బొందినాటంగోలె లింగమతధారులై బసవేశ్వరులమతంబు నవలంబించిరి

## కుంచము శివలింగమూర్తి యగుట.

పూర్వము మల్లనయను నొకశెట్టి బేరమాడుటకు గ్రామాంతర వెళ్ళియుండెను ఈమల్లనకు తుమకు దీక్షనాలుమశిఖర మెనను దర్శించుచో

భుజించనను వ్రతముగలదు. ఆగ్రామములో నట్టిశివాలయములే మింజేసి తోడిబేహారులు కుంచమునొకదాని నొక్కచోఁబోర్లించి దాని ప్రక్క నొక్కయశ్వత్థవృక్షశాఖను పాతించి కుంచముపైఁగొన్ని శివప్రీతికరంబులగు దెల్లని కర్ణికారపుష్పంబులను బూజించి మల్లనతో "మేము శివాలయముంగంటిమి. రమ్ము. చూవుదు" మని తోడ్కొనిచని యాకుంచమును జూపి నీమల్లన బహుభక్తితో నాకుంచమును లింగమూర్తిగా భావించి నమస్కరించి చని భుజించుచుండ వణిజులునవ్వుచు నొకనాఖరుని బిలిచి "రోరీ! మా మల్లన్న కుంచమునకు మ్రొక్కి శివుని మ్రొక్కితినని తనవ్రతభంగము చేసికొనియెను. నీవేగి వేగమాకుంచము నొకింత తెమ్ము" అని యనుచుండ మల్లన చిఱునవ్వునవ్వి రోరి కుక్కలారా! మేల యిట్లుఱచెదరు! అక్కడప్రతిష్ఠింపఁబడిన లింగమూర్తిని బెఱుకవిూతరమగునా? పదపడి చూతమని యందఱందోడ్కొని యేగు నంతలో నక్కడనొక దేవాలయంబున దాని నావరణమునుండి మ్రానునుండి శాఖలుపైకి వచ్చిన యశ్వత్థవృక్షమును దానిలో లింగాకారముగానున్న కుంచమును దానిపైని పూజింపఁబడిన కొండగోగుపుష్పంబులను గని యందఱు మల్లనప్రభావమునకు నమితాశ్చర్యమునొంది మల్లన నొకదేవసమానునిగా నాటినుంచి భావించుచుండిరి. ఆయీశ్వరుఁడే మల్లేశ్వరుఁడయ్యె. ఆమల్లనె మల్లేశమల్లనయని ప్రసిద్ధికెక్కెను.

## మేకపెంటిక లింగమగుట.

కోటకోటండను నొక్కగొల్లపిల్లవాఁడు తనకుసహజముగా నంకురించిన శివభక్తికి నిత్యము లింగాభిషేకము సేయనిది భుజించువాఁడుగాఁడు. ఇట్లుండ నొకనాఁడు వాఁడు మందగాయుచుండఁగా నచటికి వానితండ్రి వానికై యాహారములుగొనిపోయి తినుమని యిచ్చి తాను మందఁగాయుచుండెను. ఆపిల్లవాఁడు లింగాభిషేక మొనర్చుట కక్కడ లింగమూర్తి దొరకనందున వెదకఁగా నొకరావిచెట్టు క్రింద నొకమేక

పెంటిక పడియుండఁగా నది యేలింగమూర్తిగా భావించి యొకమేఁకను దోలుకొనిపోయి దాని పాలన్నియు నాపెంటికపైఁ బిదికి పిమ్మట తాను పూజించెను. మందగాయుచున్న వానితండ్రి దూరముగానుండి నిపీ చర్యఁగాంచి యట సని వాఁడు క్షీరాభిషేకం బొనర్చిన మేఁకపెంటికను జూచి వానిపైఁగోపించి యాపెంటికను గాలఁ దన్నఁగాఁ పిల్లవాఁడు కోపమునఁ దండ్రితన్నినది పెంటికకాదు శివలింగమనుకొని తండ్రినిఁ దన చురికితోనేయ నది మెడకుఁ దగిలి పీక తెగివాఁడుసచ్చెను. వెంటనే రక్షకభటులు వానిఁ బట్టుకొని నిష్కారణముగా వీఁడు తండ్రినిఁజంపెనని రాజునకు విన్నవింప రాఁడుపనిచూచుసరికి మేఁకపెంటికయే లింగమూర్తియై తొలిమేఁక యాపెంటికపై నిలువంబడి తనపొదుగుపాలను లింగమూర్తిపై నభిషేకముగాఁ దానేకార్చుచుండెను. గొల్లవాఁడు బ్రతికినవాఁడై మందగాచుకొనుచుండెను. రాజును గొల్లవాఁడును మిగుల నాశ్చర్యరస మగ్నులైరి. పిల్లవాని మనోభక్తిమెచ్చుకొనిరి నాటినుండి రాజును గొల్లవాఁడును పిల్లవానితోఁగూడ లింగధారణమును బొంది శివభక్తులగుటయేగాక రాష్ట్రమంతయు శివమతముగ మారెను.

## జొన్నలరాశి లింగాకారమగుట.

బ్రహ్మాశనుఁ డనునొక జంగమభక్తునికి శివలింగమూర్తిని దర్శించి నమస్కరించనిది భుజింపనను వ్రతమొకటియుండెను ఆతం డొకనాఁడు గ్రామాంతరము బోయి యచ్చట నొకకాపు జొన్నచేనిలో వంటచేసికొని భుజింపఁబోయి లింగమూర్తికొఱకు నలుదిక్కులఁ బరికించి దూరముననున్న యొక తెల్లని జొన్నలరాశిని జూచి "వందేశంభుముమాపతిం సురగురుం వందేజగత్కారణం వందేపన్నగభూషణం మృగధరం వందేపశూనాంపతిం వందేసూర్యశశాంక వహ్నినయనం వందేముకుందప్రియం వందేభక్తజనాశ్రయంచ వరదం వందేశివం శంకరం" అని ధ్యానించి నమస్కరించునంతలో నదియొక లింగాకా

రమయ్యెను. అంతనా కాపు వచ్చిచూచి భక్తునిప్రభావమునకు మిగుల నాశ్చర్యమునొంది యాలింగమును బూజించుకొనుచుండెను. ఇట్టిచిత్రములను భక్తులనేకు లనేకములగుపర్చిరి. బసవేశ్వరుడు దొంగలమొఱల వంకాయలు లింగకాయలను జేయలేదా. బసవేశ్వరుప్రభావమున జొన్నలరాశి మంచిముత్యములయ్యె.

## జొన్నలరాశి ముత్యాలగుట

ఒకనాఁడు బసవేశ్వరులవా రత్యంగన మాచరించు సమయంబున నొకజంగమువచ్చి "నాలింగపూజకు నిత్యము దినమునకు మూఁడు కుంచముల మంచిముత్యములు కావలెను. ఈచాతుర్మాస్యదీక్ష యిక్కడ జరుపవలెనని వచ్చితిని. పదిపెట్ల మంచిముత్యములు కావలెను. అవి నీవు సమకూర్పఁగలవని వచ్చితిని" అని చెప్పఁగా నాయన స్నానము యిదపిమ్మట ముత్యములెట్లిస్తునని యోచించుచుండు సమయమున నెదుటనున్న యొక జొన్నలరాశి మంచిముత్యములై తనకు గనిపించినదాని నిభక్తునకుఁ జూపి "నీయిష్టమునచ్చినన్ని ముత్యములు తీసికొమ్మని యా జొన్నలరాశిని గనుపఱచెను. అది చూచి భక్తుఁడు బసవేశ్వరుల ప్రభావమునకు నాశ్చర్యమనుచుఁ దనకునలయు ముత్యములం గొనిపోయెను. అతఁడు పోయినపిమ్మట మఱల జొన్నలరాశి యెప్పటివలె నుండెను. బసవేశ్వరునొద్దకు వచ్చుభక్తులు పూర్వపుభక్తుల ప్రభావంబులు సెప్పకొనుచుందురు.

## గొడ్డుటావునఁబాలు రాటనుబత్రియుఁదీసిన భక్తునికథ

ఒకానొకభక్తుఁడు వేఱొకనిలోఁ దొల్లియొకభక్తుఁడు మొరటద వెంకయ్యయను భక్తునింటికిఁ జని తనశివపూజకు, బ్రతిదినము నొకయావుపాలును బుట్టిపోఁణకెడు బిల్వపత్రియుఁ గావలెననియు నట్లులేనిచో నాటిదినము శివపూజలేకపోవుట యేగాక తనకును శివపూజ (భోజనము) లేదని చెప్పుచు "వెంకయగారూ! మీరుభక్తులనియు మీరట్లు సమకూర్ప

గలరను నిండునమ్మకముతో నేఁటిరాత్రి మీయింటికివచ్చితిని. ఈయర్ధ రాత్రమున నాశివపూజ జరగవలెను. మీరుసనుకూర్చిన నివ్వాడె సమ కూర్పుఁడు. తేపుమీారు నేనుగానరాను.'' అని చెప్పినంతలో వెంకయ్య మిగులవ్యసనము నొంది జంగమదేవరకు సాష్టాంగదండం బొనరించి యాసనాద్యుపచారములు సలిపి స్వామీ! మీరుశివపూజకు సిద్ధపడుడు. మీరుకోరినపాలును బత్తియు మీాకుఁ దెచ్చెనేను మీశివపూజయగు నంతలో మీారు శివపూజకు (భోజనమునకు) వలయు సంభారంబులు సిద్ధపాకంబు గావింతునని దలగొని యొకపాత్ర శుభ్రముగాఁగడిగి దొడ్డిలోఁ గట్టియున్న గొడ్డుమొదవు నొద్దకుఁబోయి పొదుగుగడిగి చనికట్టులు రెండు రెండుసేతులఁబట్టి పితుకనంతలో "జయుదయి" యని ధారలుపడి నిమిషమాత్రములో నాపాత్రనిండిన నదిగొని జంగమయ్య ముంపిరనిడి వెలుటిలోఁ బందిరిపడిపోయిన దానికిఁ గ్రాలవడియున్న యొకమద్దితాటనుజూచి దీనబత్తిఁగోతునని తట్టఁబట్టిచెట్టెక్కి తట్టలకొలఁది బత్తిఁగోసి పుట్టిపోణకెడు కాఁగా తాటయెప్పుడుతాటవలె నుండెను. ఆపత్రి జంగమయ్యయెదుటఁబెట్టెను జంగమదేవరయాపాలను బత్తితోఁడను తనశివపూజముగించి విందారగించి వెంకయసూచుచుండ నక్కడనేయంతర్ధానమొందెను. ఇట్టిదైవశోధలకాఁగెడి భక్తులుగలరా యనరెండవభక్తుఁడు'' ఇట్టిపుక్కిటిపురాణములు మనపెద్దలు సెప్ప వినుమేగాని మనమెన్నఁడు నెక్కడను జూచి యెఱుఁగమనెను. అది విని మొదటిభక్తుఁడు "ఏమీ! మనబసవన్న మొన్న జొన్నలరాశిని ముంచిముత్యములుసేసి యొకజంగమయ్యకుఁ బదిపుట్లిచ్చెనని వినలేదా? బసవనకుమించిన భక్తులు మఱిగలరా? అతనిం దర్శింపఁబోదముపద. నిదర్శనంబులింకను ననేకములుసూడఁగలము. ఒకానొకప్పుడు శివుఁడే జంగమరూపమునవచ్చి అతనిభక్తినిశోధించిపోవుచుండును. అని యిట్లు ద్దలునసుకొనుచు బసవేశ్వరుదర్శనమునకుఁ బోయిరి. ఇట్లు భక్తపారి

జాతమని పేరుపొందిన బసవేశ్వరులయొద్దకు సర్వదాసంఖ్యకు మించిన భక్తులువచ్చి యిష్టార్థసిద్ధులు పొందిపోవుచుండు భక్తగణము తన యొద్దలేనియొకనిమిషమైనను బసవేశ్వరులకు లేదు. ఒకొక్కవేళ జంగమ దేవరలు రాత్రినిశీథసమయమున బసవేశ్వరులునిద్రించుసమయమున నేతెంచి తమసడివిన్న నాయనమేల్కొనును నిద్రాభంగముసేయఁగూడదని నిశ్శబ్దముగా వేచియుందురు. అప్పుడుతన్నెవ్వరో లేపినటుల బస వేశ్వరులుమేల్కొని యాయర్ధరాత్రమునందె వారల కరిధిసత్కారంబులు గావించువారు

## సంగమేశ్వరస్వామి బసవేశ్వరులను మూఁడవకన్ను వేఁడుట.

భక్తులేదియడిగిన నది బసవేశ్వరుఁ డిచ్చుచున్నాఁడని బసవేశ్వరుఁ బ్రతీక్షించుటకు సంగమేశ్వరస్వామి యొకదినంబున జంగమరూపంబున నరిగి భక్తపూజాపరత త్పరుఁడగు నాతనింగని ,,ఓబసవమంత్రీ! నీకీర్తి దిక్కుదిక్కులయందు వ్యాపించినది భక్తమందారుఁడవఁట ఇదినాకసాధ్యమిది యసాధ్యమనిలేక భక్తులడిగిన నదితప్పకయిత్తువఁట. నీయుదారసాహసంబులు నేవిన్నదిమొదలు నినుఁజూడవలెనని యువ్విళ్లూరుచుంటిని నేఁడు నిన్నొకటి యర్థింపవచ్చితిని. అదినాకొసంగితివేని నీకీర్తిసమస్తలోకంబులం దేజరిల్లును" అనియనునంతలో బసవేశ్వరులు చేతులుజోడించి ,స్వామీ! యిచ్చువాఁడెవఁడు? పుచ్చుకొనువాఁడెవడు? ,,మహేశః ప్రతిగృహ్ణాతు మహేశోవై దదాతిచ మహేశస్తారకోభాభ్యాం మహేశాయనమోనమః"యనున్యాయము వినలేదా సమస్తము మహేశస్వరూపమె ఇచ్చువాఁడనను నేనుఁబుచ్చుకొనువాఁడవను నీవునూ మహేశుఁడు భక్తస్వరూపుఁడు. అట్టిభక్త స్వరూపమున నన్నుఁ గృతార్థుజేయవచ్చిన నీవే యీమహాదేవుఁడవు.

## బసవేశ్వరులు శివునివంచించి నుతిసేయుట

కావున నోమహాదేవా! యిదిగో యీయద్దముఁ దిలకింపవయ్యా, నీకు మూఁడవకన్ను లలాటఫలకంబున విస్పష్టంబుగా గోచరించెడిని.'' అని యొకయద్దముఁ జేతికిచ్చెను. భక్తరూపంబునవచ్చి ననంగమేశ్వరుఁ డాదర్పణంబు నతిదర్పంబుతో నీక్షించి తనుం బ్రతిఫలించిన నిజఫాలలోచనంబుఁ గని విస్మయమంది బసవనచే బహునేర్పుగ వంచితుఁడనైతినని నవ్వుకొని లేచిపోవుచుండఁగా బసవేశ్వరులు లేవనీక చేయిఁబట్టి కూర్చుండఁబెట్టి '' దొంగజంగమా! సంగమేశ్వరస్వామీ! నన్నుభ్రమియింపఁబోయి నీవేభ్రమపడితివి ''భూసురో బ్రాహ్మణాశ్చైవభూరుహోబ్రజ గమైవచ' యనులోకోక్తి వినలేదా? ఇప్పుడు జంగమరూపంబున వచ్చిన నీవే ప్రత్యక్షరుద్రుఁడవు. నీకు మూఁడవనేత్రముండఁగా నన్ను యాచింపవచ్చితివా? నీవెక్కడ దాఁచితివి ఎవరికైన నెఱువిచ్చితివా శంకరదాసయ్య కిచ్చినది మఱలఁ జేకొనలేదా? ఇట్టి దొంగచేష్టలెక్కడ నేర్చుకొంటివి? కనుకనే నీచేతి ద్రమ్మిచ్చి నీకన్ను నీకుఁగనపర్చి నిన్ను నేమాయ చేసితిని ఈవిషయములో నీవోడితివి. నేగెల్చితిని ''పుత్రాదిచ్ఛేత్పరాజయ'' మ్మనుట సిద్ధంబేకదా నేను నీప్రియసుతుండనుగానా? సర్వతంత్రుండవగు నీవెట్లు ప్రవర్తించినను నీకేజెల్లును గాని యుత్తమ శివభక్తు లెవ్వరిని విడవన్నమాట నీకుఁ దెలియదా నీవు నిజమైన భక్తుఁడవైనయెడల నీవును లాతివారి నడుగువాఁడవుకావు. భగవంతుండవు గనుక భక్తులనడుగుటకును వారలకిచ్చుటకును నీవేతగుదువు. దేవరదాసయ్యకుఁ దవనిధినొసంగితివి. శంకరదాసయ్యకు నిఫాలలోచన మొసంగితివి. శిరియాలురాజుశెట్టి సుతునిఁ జంపెంచి యాతనిభార్యచేఁ బిలిపించి మఱల బ్రతికించితివి. కుమ్మరగుండయ్యకు నిండుయౌవన మొసంగితిని. ఇట్టి వేవియు నిన్ను నేఁ గోరలేదు. నాకవసరం

బును లేదు. నాకు స్వర్గాదిభోగము లక్కఱలేదు. సంపద లవసరము లేదు భక్తభుక్త శేషమే నాభుక్తికిఁ జాలును. నీసేవ భక్తులనేకుల నేకవిధంబులఁ జేతురు. ఒక్కొక్కళ్లొక్కొక్క కైంకర్యముననే దృష్టులై దాననే వారు నీసాయుజ్యంబు నొందుచుండిరి. ఒకభక్తుఁడు కేవల మభిషేకమె ప్రధానసేవగా నియమించుకొని దానికిఁ గొన్నినియమంబు లేర్పఱచుకొని తనజీవితమంతయు దానియందే వెళ్ళఁబుచ్చి తుదకు నీ సాయుజ్యంబు నొందెను. మఱియొకభక్తుఁడు పుష్పకైంకర్యమె ప్రధానసేవగా నేర్పఱచుకొని పలువిధములగు కుసుమంబుల సేకరించి దండలుగుచ్చి నీకు సమర్పించుచు జీవితంబుగడపి పరమపదంబు నొందెనుఁ వేఱొకభక్తుఁడు నీకు గంధంబు సమర్పించుటయె ముఖ్యసేవగా నమ్ముకొని ప్రతిదినము నిండ గంధముతీసి నీకు నలఁదెదనని నియమము చేసికొని యానియమముఁ దప్పక నెఱవేర్చునని నీప్రసాదంబు నొందెను ఇట్లనె వేఱవేఱ సెప్పనేల? కోటికోటయ్య, పుష్పదంతుఁడు, పూజారికన్నప్ప, ఇందిరేకవ్వ, నమ్మినంది, ఒడయపళ్లఁడు, ఏణుమూర్తి, ఓహిళయ్య, నరిదసోపప్ప, మాళిగయ్య, చోళవిభుఁడు చిరుతొండనంబి, సంగళవ్వ, కరికాలచోడరాజు, హళొన్నయ్య చెన్నయ వీరచోడయ్య, రేచయ్య, బిచ్చిబాచయ్య, నమిత్తాండి, కల్లిదేవయ్య నామవేది, మాయిభట్టు, కళియంబ నయనారు శ్రీపతిపండితుఁడు మల్లికార్జునపండితుఁడు, సకలేశ్వరమాదిరాజు, కక్కరదేవుఁడు కేశిరాజు దండేశ్వరుఁడు గణేశ్వరుఁడు ఇరవంతుడు చరమయ్య కరయూరిచోడు ఏకాంతరామయ్య, బల్లహుఁడు శంకరదాసు ఏణాధినాథుడు శివలెంక మంచయ్య బంకేబంకవిభుఁడు సురియచౌడయ్య కులచిరియారు, బెజ్జమహాదేవి రుద్రపశుపతి కిల్లయ్య, శివరాత్రిశంకరయ్య, భోగిదేవయ్య దేవదాసు, కిన్నరబ్రహ్మయ్య, మడివాలుమాదయ్య, కడవలనంబి, కోటమల్లయ్య, కుమ్మరగుండయ్య, తెలుగుబొమ్మయ్య, కోవూరిబ్రహ్మయ్య,

నురియచండయ్య, (చమడయ్య) బల్లేశుమల్లయ్య, బిబ్బబాచయ్య, మొర టదవంకయ్య, గొడగూచి యీమొదలగు శివభక్తులనేకులు స్త్రీపురుషులు నీకొక్కొక్కరొక్కొక్క యుపచారంబుసేసి తరించిరి. సర్వదా సర్వజ్ఞా అధీశ్వరా పరమేశ్వరా సర్వాంతర్యామీ భక్తవత్సలా భక్తస్వరూపా భక్తభావ్య హరా శంభో మహాదేవా అనంతనామ వేషధారీ నిన్ను నాకేమియు నిమ్మని యాచింపను మతిసెయు నోదయానిధీ! నీవు కాలకూట భక్షణంబు గావింపని మునుపును, బ్రహ్మవిష్ణుబుక్షవులు గాకపూర్వమును, త్రిపురసంహారము గాని నాడును పార్వతీపరిణయంబునకుఁ దొలుతను,ప్రళయసృష్టి స్థితిలయంబుల కర్త్వకాలంబున నీవొక్కండవే దేవుండన్న నేనొక్కండనే నీభక్తుడను కనుక నోదేవా! నేను నిన్నుఁ గోరునది మఱియేమియు లేదు గాని యిప్పటివలె సర్వదా నీయందగు నిశ్చలతన్మయభక్తినే నాకిమ్మని వేఁడుచున్నాఁడను. ఇట్లు శివవినయంబుల భగవంతుని స్తుతించి తన్ను వంచింపవచ్చిన యాతనివంచించి బసవేశ్వరుల వారందర వార్ధి నోలలాడుచుండ నిదేసమయమని జంగమరూపధారియగు నభవుండంతర్ధానంబు నొందెను. బసవేశ్వరులు నిజరాజకార్య ప్రవర్తకుండయి యుండెను.

## బిజ్జలరాజునకు బసవేశ్వరులు తమ ప్రభావమును జూపుట.

ఒకనాఁడు బిజ్జలరాజు నిండు కొలువున వందిమాగధ నటవిటగాయక కవిపండిత వేశ్యాజన వినోదంబులు జరుగుచుండ, మంత్రి సామంతాప్త జనంబులు తమతమ యథాస్థానాసనంబుల నాసీనులై యుండ, నిజ సింహాసనాసీనుండగు బసవేశ్వరుఁడు సభాసదు లెల్లఱు నదిరిపాటునఁ దిరిగి తనదిక్కు చూచి నవ్వునటుల ఓయని పలికి భయపడకుము. నేఁ బట్టుకొంటినని బయలఁ జేతులు సాచి యేదియో గట్టిగాఁ

బట్టినటుల పట్టియుండెను. అదిచూచి సభికులందఱు పక్కున నవ్వసాఁగి
రి, రాజును నవ్వి "బసవన మంత్రీ! గోరంత బూఁడిద మేన నలఁదినఁ
గొండంత వెఱ్ఱి పట్టుననుసామెత నిజమాయెను. నీశివభక్తి నీకుఁ దల
కెక్కిన కొలంది పిచ్చిచేష్టలు పెచ్చుపెరుగుచున్నవి ఎందుకిట్లు చేతులు
సాచి బయలుపట్టితివి? నీచేతుల నేమియు లేదే. పట్టుకొంటి నంటివి. ఎవ
రితో మాట్లాడితివి? ఏమియీ వెఱ్ఱి ప్రేలాపనము. అని నవ్వుచు ననె
ను అదివిని బసవేశ్వరులవారు తన ప్రభావము తాఁ జెప్పుకొనఁ గూడ
దని యూరకున్న సమెల్లందన్ను వాతులుఁడని (పిచ్చివాఁడు) యనాదర
ణ సేతురుగానఁ జెప్పక తీరదని రాజునకిట్లనియె. "వినుమో భూపాల
తిలకమా! నేను పిచ్చివాఁడనుగాను, మన త్రిపురాంతకేశు గుడికిఁ
దూరపుగా నాఱామడ దూరమునఁ గపిలేశ్వరమను నొక గ్రామము
కలదు. అందు నెలకొనియున్న కపిలేశ్వరునకు నొక తపసి నన్నూఱుపు
ట్ల పాలు మహాన్యాస పూర్వకంబుగా రుద్రాభిషేకం బొనర్చెను. సో
మసూత్రియు నెంబడిన బైటఁబాఱిన యా క్షీరప్రవాహము పురంబున
నెల్లవీథులను నిండి కాలువలై పాఱుచుఁ బ్రజల గమనాగమనంబుల
నడుగు దున్నుఁ బురదయై కాళ్ళఁ ద్రొక్కఁబడి పెను బ్రాఁపియై నడ
చువారి పాదము కూఁకుపోవుటయు జాఱుటయు మొదలగు నిక్కట్టు
లు గలుగఁ జేయుచున్నది. అత్యుత్తమురాలు వయోవృద్ధురాలునగు
గాళవ్వయను నొక గొల్లగత్తె వెన్నయు మీఁగడయుఁ జల్లయు నమ్మ
కొనఁ బోవుచుండఁ గాలుజాఱి బోరగిలఁ బడఁబోవుచు "బసవా!"
యని నన్నుఁ దలఁచుకొనెను. అంతనే నవ్వాభయవడకు నేను పట్టితినం
టిని. ఇంతియు. ఇంతకన్న మఱి విశేషము లేదనెను. అదివిని రాజును
సభికులును మఱింత నవ్వి యిదియొక యున్మత్తప్రలాపము. ఆఱామడ
దూరమందున్న యవ్వను నీవు పడకుండఁ బట్టితివా యని తక్షణము
రాజు దండనాయకు నొకనిఁ బిలిచి యొక యుష్ట్రంబు నాయత్తంబు

సి నిమిషమాత్రమున నాయవ్వను బోడితెమ్మని పంప వాఁడట్లు చేసెను. అవ్వను రాజు సభలోనికిం బిలిచిన నామెవచ్చి బసవేశ్వరులవారు సెప్పిన వృత్తాంతమును జెప్పి తన కాలి బురదను తన తలపైనున్న భాండమును జూపి యిదియొక వింతగా మీరు గనుచున్నారా. ఈ బసవేశ్వరుగారి ప్రభావము మీరెఱుఁగరా. తొల్లి యీయువతి ముగ్గురిలో నొకండగు తిరుచిత్తంబులునను శివభక్తుఁడు తన శివపూజ నిమిత్తము పుష్పములు పత్రి కోసుకొని సజ్జలో బెట్టి పట్టుకొని యింటి మార్గమధ్యమున వెనువాన గురిసి త్రోవయంతయు నడుసై బురదలోఁ గాలు జాఱి పడుచు పుష్పాలు పత్రియు పాడగునను భయమున "సామీ! రక్షింపు" మని యొక కేక వేయునంతలో నచట శంభుఁడు సాక్షాత్కరించి యతనిఁ బడకుండ గాఁపాడెను. ఆ సాక్షాత్కరించిన శివుఁడ యిప్పుడు లింగాకారమున భక్తశంభుఁడను పేరఁ బరఁగుచున్నవాఁడు. నాఁడా శంకరుఁడు భక్తునిఁ గాపాడినట్లు నేఁడీ బసవశంకరుఁడు నన్నుఁ గాపాడెను. ఇదియేనా ఈ బసవేశ్వరుల మాహాత్మ్యము మీరింకను వినలేదా అట్లయిన నేఁజెప్పెద వినుఁడు

## సిద్ధరామకృతి కథ

నేనొకనాఁడు సొన్నలిగకుఁ బోతిని. అక్కడ భక్తులనేకులు శివధ్యానపరులై శివమననంబున సద్గోష్ఠి నుండుడు. అచటికా దినమున సిద్ధరాముడు కృపియను నాతఁ డరుదెంచెను. అతనినిఁ జూచి వారందఱు దుర్వేగి సవినయ[illegible]న భక్తికంబుగాఁదో[illegible]తెచ్చి యుచితాసనంబునఁ గూర్చుండఁబెట్టి యందఱు నెదుట ముకుళిత కరకమలులై నిలిచి యీతని కిట్లనిరి. "ఓ సిద్ధరామా! జగత్ప్రసిద్ధయశోభిరామా, సమస్తసద్గుణ ధామా, మునికుల సోమా, నిర్జితకామా, నీ మహిమను గొనియాడ నెవరికిఁ దరమౌను, అనాది ప్రసిద్ధమగు శ్రీశైలమునకుఁ బత్రినిధిగా

నీవొక్క యభినవ శ్రీశైలమను పురము నొకదానిని నిర్మించి యందు శ్రీశైలమునుంచి తెచ్చి మల్లికార్జున లింగమూర్తిని బ్రతిష్ఠించి యం దఖిలతీర్థంబులు మూర్తిభవించునటుల సమస్తతీర్థమయంబు గావించి యారామతటాకాదులను సైతము వెలయఁజేసి యన్నసత్రంబు గట్టిం చి యఖండయశోవిరాజమానుండవగుచుఁ దపస్విలలో నగ్రగణ్యుండ వై దేదీప్యమానంబుగఁ బ్రకాశించుచున్నవాఁడవు. నీవుభూలోకము లో నవశనవ్రతుండవు అన్నపానములజోలికిఁ బోవు నినుఁబోలు నిం ద్రియనిగ్రహులు యోగసిద్ధులు మఱిభూలోకంబున లేరని మేమనుట యతిశయోక్తియు నిన్నునిచ్చకంబు గానుపించుటయుఁగాదు సత్యము సత్యము ముమ్మాటికిని సత్యమిది నీవుప్రతిదినంబును శివపూజానంత రము బ్రమథలోకంబునకు, యోగగమనంబునఁ బోయి వారలతో నిష్టగోష్ఠి గొంత జరిపి పిమ్మటఁ గైలాసంబునకువచ్చి యాభూతేశునం దర్శనం బాచరించి మఱల భూలోకంబునకు సాయంకాలమునకు వచ్చు చుందువు మాకందఱికొక సందియంబు గల్గినది అదె నీవది స్పష్టం బుగ విశదీయవలెను. అందుకై నీకొఱకు మేము పేదలు పెన్నిధికొఱకె దురుసూచునందంబునఁ జూచుచున్నారము. అదియేదియనిన అఖండ ప్రతాపంబునఁ గుతపరవివలె భూలోకంబునఁ బ్రజ్వరించుచున్న మన బసవేశ్వరులను బ్రతిదినమును గైలాసంబున సాంబమూర్తివారి సాన్ని ధ్యంబున నుందురని జనప్రవాదము వినుటయెగాని చూచివచ్చి చెప్పిన వారు లేరు నీవునిత్యము నటకేగుదువు గనుక బసవన్నయట నున్నదీ లేనిదీ చూచివచ్చి మాకునీవు వాక్రుచ్చితివేని నీమాట మాకుఁ బ్రమా ణము మేముదైవముగా నమ్మెదము. దయచేసినా మనోభీష్టసిద్ధి నొనర్పు' మని భక్తులుకోరునంతలో సిద్ధరామయోగి ॥ నేమితప్పక నేను కైలాసమునకేగి చూచివచ్చి మీకుఁజెప్పెద'' నని నాఁడె తాఁ గైలాసమునకు సిద్ధగమనంబునంబోయెను.

## సిద్ధరామముని కైలాసమున కేగుట

అట్లు నసి కైలాసంబున రవిశతకాంతితోఁ బ్రకాశించుచున్న పరమేశ్వరుని సభాసదనంబున కేగునంతలో నచట విష్ణుబ్రహ్మాలోకచోనున్న తాసనములను, ద్వాదశాదిత్యులొక్కటను, వసువులెనమండ్రొక్కతలమునను, నవగ్రహంబు లొకచక్కని, దిక్పాలాష్టకం బొక్కనంకను, దేవతావితానం బొకచాయను, విద్యాధరాప్సరోయక్షురక్షోగంధర్వ కిన్నర పిశాచ గుహ్యకసిద్ధసాధ్యగరుడ కింపురుషులను సంజ్ఞలచే వెలయుచున్న దేవయోనులొకొక్క దిక్కునను భృంగీశనందీశాది ప్రమథగణంబులును బాలప మధులు నొక్కప్రదేశమునను, వీరభద్రగణేశషణ్మారకుమారత్రయంబు సమీపంబునను, యోషిద్గణంబు వెనుకభాగంబునను, నృత్యాభినయగానవిద్యా ప్రవీణతా ప్రసన్నులగు గణికానికరంబులు పురోభాగంబునను వందిమాగధులు పార్శ్వప్రదేశములను, సనకసనందనసనత్సుజాతాది దేవమునులును, విశ్వామిత్రాత్రి భరద్వాజగౌతమ వాల్మీకివసిష్ఠ వ్యాసభరద్వాజాంగిరః ప్రభృతి మధ్యమలోక తాపసులును, కపిలాది పాతాళలోక మునులును, శుకాద్యవధూతలును, వాసుకి, శేష, తక్షక, కర్కోటకాది నాగలోకవాసులును, స్త్రీరూపంబుల సకలాభరణాలంకృతలై మూర్తీభవించిన నర్మదాసింధ్వేరావతీయమునాసరస్వతీ, గౌతమీ, తపతీ, కావేరీ, తామ్రపర్ణీ, ఫల్గునీ శోణా, గండకీ, కృష్ణావైణ్యాది పుణ్యనదీనదంబులును, పురుషరూపములనావిర్భవించి తత్తదుచిత ప్రదుచిత మణిమయమకుటాంగద హారక్త్రక రత్నహారస్వర్ణచేల భర్మాంసుకూలాలంకృతులగు హిమవన్నిషధ వింధ్య మాల్యవత్పారియాత్ర గంధమాదన హేమకూటములనుకల పర్వతములును, మలదర్దురరోహణాదులగు నితరధరణీధరంబులును మృతపతులచితులం బ్రతిష్ఠంబులగు నగ్నిహోత్రంబులఁ దిదనుగమనానుకూల సరణి యదియగుట నందు నానంద సుందరవదనారవిందంబులతో నిజత

నూలతలం పూర్ణాహుతులుగా వ్రేల్చిన మహాపతివ్రతాశిరోమణులు దమతమ మగలతో దివ్యదేహంబులు దాల్చినవారై సురనారీపరివీజిత చామరాందోళనంబున నుద్వేల్లితంబగు భుజవల్లీ కంకణఝణత్కారంబు నిజవిజయసూచకంబగు జయశబ్దవాచకంబు ననుకరించుచు వింతసొంపు గలిగింప విమానారూఢులై యరుదెంచిన పుణ్యస్త్రీపురుషమిథునంబు లొక్కొక్కయెడను, స్వస్వయోగ్యతానుకూల నానావిధాసనంబులం దాసీనులై పరివేష్టించియుండ విచిత్రమణిగణాలంకృతంబగు సమున్నతంబగు కనకాసనంబున గంగాగౌరు లంగోత్తమాంగంబుల నలంకరింప గంగాయమునా సంగమస్థానంబునుం బోలిన సితాసితదేహదీప్తిం బ్రకాశించుచు నిజభూతగణంబులు తమతమ యథోచితసేవలొనర్చుచుండ హాకినీ శాకినీ డాకినీ యాకినీ ప్రభృతి మహాచతుష్షష్టి కోటియోగినీగణంబు లంబాసేవాతత్పరలై పార్వతిం బరివేష్టించి వారుగొలుచుచుండ, నాంగోపాంగంబులగు వేదంబులును, చతుష్షష్టికళలును, మూర్తిమంతంబులై యూడిగంబులు సేయుభసితరుద్రాక్ష ఫణిహారనాగయజ్ఞోపవీతాది భూషణంబుల దేదీప్యమానంబగు నిజదేహకాంతి ప్రసరించి సభాభవనంబును ధౌతసర్ణమయంబొనర్ప దానియందంబును జూడఁజనిన భక్తులకెది యపారంబగు ఘూర్ణితపయఃపారావారంబున నందగించుచుండ నిండుకొలువున్న చంద్రశేఖరు నాస్థానంబుఁగని, సిద్ధరామయోగి హర్షోత్కర్షాంకురితపులకాలంకృత నిజదేహుండై యామృడునకు సాష్టాంగదండప్రణామంబాచరించెను అప్పుడు పార్వతితో లోకోపకృద్భాషణగోష్ఠినున్న యప్పరమేశ్వరుండు సిద్ధరామభక్తుని ననుగ్రహపూర్వకంబుగా నాలోకించి "యెందుండి రాక విశేషంబులే" మని యడిగెను. సిద్ధరాముఁడును "స్వామీ! భూలోకంబున నుండి వచ్చుచున్నవాఁడను. అందలి భక్తులందఱు బసవేశ్వరు లిటనున్నవారో లేరో చూచిరమ్మని నన్నుఁ గోరి"

రని లలాటఘటితాంజలిపుటుండై విన్నవించెను అప్పుడు పినాకపాణి సిద్ధరామమునిపుంగవుని దయార్ద్రదృష్టి నవలోకించి సిద్ధరామా! బసవునిప్ర

**శివుఁడు సిద్ధరామునకు బసవేశ్వరులంజూపి యాతని ప్రభావంబు లుపన్యసించుట.**

భావంబు గనవచ్చితివా భక్తులెల్ల నాతనిం బరీక్షింపఁగోరిరా. అట్లయిన బసవనిమాహాత్మ్యం బభివర్ణించుటయేగాక నీకునిప్పుడ విస్పష్టముగ నాతనిజూపెద బసవలింగ మాలోకమీలోక మనక యన్నిలోకములలో నెక్కడఁ జూచిన నక్కడేయున్నవాఁడు నాయందున నాప్రమథులనడు మనుసర్వదాయుండును క॥ ఇందుఁగలఁ డందు లేఁడని సందేహమువలదు నాబసవలింగఁడునీ వెందెందు వెదకిచూచెదు వందందే సిద్ధరామ యమిగలఁడుసుమీ। లోకములో గురు లింగజంగమంబులు మూఁడును బసవనిస్వరూపములే. అనఁగా లింగతత్త్వము నుపదేశించు గురువును, లింగమూర్తియు, నారాధించు జంగమంబును (భక్తుఁడును) బసవరూపములు మూఁడు నొక్కరూపమే ధ్యానధ్యాతృధ్యేయరూపములు మూఁడు నొక్కరూపమే ఇక్కడక్కడనన నేల? చూడుము బసవలింగము నాహృదయమున నున్నవాఁడు అఃముక్కంటి తనహృదంతరమును జూఁప నందుధృతజ్ఞానముద్రుఁడై యరమోడ్పుఁ గనుదోయితో ధ్యాననిష్ఠాగరిష్ఠుండై పద్మాసనాసీనుఁడై భూలోకములోఁ దానుగనిన బసవనమంత్రి నిజరూపము కేవలలింగాకారంబున బసవలింగమూర్తియై దృగ్గోచరుండగుటయు నాసిద్ధరామమునియు నచ్చటి సమస్తసభ్యులు నతులాశ్చర్యరసనిమగ్నులై దర్శించుచు చేతులుమోడ్చి యీశ్వరునకు నమస్కరించుచుండ పార్వతీదేవి యదిగని పరమాశ్చర్యం బొందుచుండెను. అదిగని పరమేశ్వరుఁడో గిరిజా! చూచితివా నాబసవనిప్రభావంబు నేను నాయాదివృషభవాహనరూపంబగు బసవఁడు నొక్కరూపులమని తొలుత నీకు శిలాదముని వృత్తాంతమునఁ గొంత యెఱింగించితి గదా.

వినుము. ఇఁక నామూలాగ్రముగా బసవనిమాహాత్మ్యం బభివర్ణించెద బసవఁడు లోకపావనుఁడు నేనులోకాధీశుఁడను బసవఁడ సకలలోకోప కారి. నేనుసకలలోకసంహారకుఁడను బసవఁడుభక్తులకు రత్నభాండాగా రము నేను భక్తదేహుఁడను బసవఁడుభక్తికిరాజు నేనుముక్తికిరాజు ను బసవఁడేభక్తిపట్టభద్రుఁడు నేనులింగపట్టభద్రుఁడను. బసవండుసచ రాచరలోకానీకంబులం జరించు చరలింగమూర్తి. నేనుస్థాణులింగమూ ర్తిని బసవండపరశంభుండు నేను కేవలము శంభుఁడను మమ్మునెమ్మ దినమ్మువారికి భక్తిగలుగును బసవనిందలంచినవారికి ముక్తిప్రదంబగు భక్తివైరాగ్యంబులు జనించును మఱియు నేనుభక్తులాసంగిన వారి ప్రాణదేహార్థంబులఁ గైకొందును బసవఁడో భక్తులడిగినఁ దనప్రాణ దేహార్థంబులు వారలకుఁ దప్పకయిచ్చును. ఒకప్పుడుగాక పోయినను దానగ్రహించియిచ్చును. బసవయను నక్షరత్రయమూలమంత్రంబు నెవ్వ రెవ్వరుజపింతురో వారియందు నేనును నాగణంబులును సర్వదా గాచి యుందుము. ఇది నిజము. మఱియు నో పర్వతరాజపుత్త్రీ! వినుము ఎ వ్వండు మన్నామోచ్చారణంబు సేయుచుండు బసవాంశజుండే ఎవ్వాం డు మత్పూజసేయు నతండు బసవాంశజుండె ఇంతయేల బసవని యం శలేనిది భక్తిగలుగదు కనుక భక్తులందఱు బసవయంశలవారె బస వం డెల్లవేళలయందు నాయందును నాప్రమథగణము నడుమను తానల రుచుండును. బసవనికి భక్తుల సరిసిప్రోచుటకన్న నితరసంసారసుఖంబు లక్కఱలేదు" అని యగజకు గజచర్మచేలుండు నిజప్రతాపంబు విను పించునంతలో నతనిహృదంతర్వర్తినైయున్న బసవన్న స్వామికిట్లను దేవా! నీకు భక్తుఁ డొకండును లేఁడు నేనొక్కఁడనె నీభక్తుఁడను ఏమనఁగా నీవు భక్తస్వరూపుఁడవు. భక్తులందఱు నీయొక్కరూపే యని వేదంబులు ఘోషించుచున్నవి. లోకములోని భక్తులందఱు నీ స్వరూపమెయయి నేకభావముగాని నపుఁడా యేకవస్త్వారాధనము

సేయువాఁడెవఁడు? నేనె గనుక నేనొకండనె భక్తుఁడను. నీవొకం
డవె భగవంతుండవు భక్తాంఘ్రిరేణువును దలధరించి భక్తభుక్త
శేషమును క్షుధోపశమనార్థ మారగించి భక్తశుశ్రూషాపరతంత్ర
వ్యాప్తినున్న నాకుమఱి యపవర్గమన్న వేఱున్నదే? ఇదియే నా
కు మోక్షము. ఇంతకన్న మఱినాకు మోక్షప్రాప్తి యవసరము
లేదు కాననో భక్తవత్సలా నాకు క్రిమికీట సరీసృపస్థావర జంగమం
బులగు పర్వతోర్వీరుహాదులందుగాని, నగమృగాది భూచరంబులందుఁ
గాని, గృధ్రఘూకాది వాయుచరంబులందుఁ గాని, గరుడగంధ
ర్వాదిఖేచరంబులందుఁ గాని, మత్స్యకూర్మాది వారిచరంబులందుఁ
గాని, సింహశార్దూలాది పశుచరంబులందు గాని, మఱియేయితరజం
తు జీవరూపంబున జన్మగలిగినను భక్తిమాత్రము నన్ను విడువకుండ
నినెమాత్రము నాకుఁ బ్రసాదింపుము దీనికెంచినవరమొక్కటియు నా
కక్కఱలేదు అనివేఁడుకున్న బసవనికి భగవంతుండు బసవదేవా! "నీవే
నేను నేనేనీవు" అనియుభయులొకండగి సిద్ధరామలింగని చూచితివా.
సిద్ధరామా వింటివా బసవనిమాహాత్మ్యంబు. నీకోచన తృప్తికరంబుగా
బసవనిఁ దిలకింపుమని బసవనిఁజూపెఁ జూచిసిద్ధరాముఁడయు నాశ్చర్య
సముద్రనిమగ్నుఁడై మఱిమఱి శూలికిసాష్టాంగదండంబు లాచరించి
ముదలఁగొని భూలోకంబునకు వచ్చి భక్తులకెల్లనునుఁ దద్వృత్తాంతంబు
వినిపించె. వారలకతండు సెప్పుచున్నతఱి నేనక్కడనుండివింటిని ఇట్టి
బసవన్నకు లోకాంతరంబునంగాక దేశాంతరంబునంగాక సమీపభూప్ర
దేశంబునఁ బరకపదచ్యుతిఁజేల నోటఁగఁ బోవు ముసలవ్వను జెంతఁబట్టి
కాపాడుటయొక వింతయో' యని కాళవ్వ సెప్పఁగావిని బిజ్జలరాజు గోప
వృద్ధనుఁజూచి యామెయందున్న పంకచిహ్నంబులఁ దిలకించి బసవేశ్వ
రుల ప్రభావంబుఁ దలఁచి బహుళాశ్చర్యంబునొంది యా కాళవ్వయును
గొల్లముదుసలికి ధనకనకవస్తువాహనాభరణాలంకరణంబుల నొసంగి

పంపెను మఱియు నారాజు బసవేశ్వరు లయనల్పదైవికప్రాభవంబుఁ దలఁచి తనమనంబునం దెవ్వరికరసగోచరంబున నిశ్చలుండగు లింగమూర్తి నిశ్చలభక్తిచే నారాధింపఁబడుచుండునట్టి భక్తులే ధన్యులు. సర్వగతుండవగు నీభక్తులకు సర్వగతత్వములనడుట యాశ్చర్యంబె సర్వమయుండైన యభవుభక్తులకు సర్వమయత్వంబు సహజంబుగాకపోవునె? అణిమాద్యష్టాంగయోగసిద్ధుఁడగు కాలకంఠునిభక్తుల కాసిద్ధులు వశగతంబగుట భగవదనుగ్రహంబుగాదె అట్లుగాక పోవునె? దూరజ్ఞాన దూర శ్రవణ దూర దృష్టులు శివభక్తులకుఁ గరతలామలకంబులుగావె. భక్తులకుం దనసారూప్య సాయుజ్యంబు లిచ్చిన యా యాకాశకేశుండు దనకుఁ గల సర్వజ్ఞత్వాదిసిద్ధులు భక్తులకుం బ్రసాదింపకున్నె? భగవంతుండు భక్తులఁ దనకన్న నధికులనుగాఁ జూచుచునుట సిద్ధమె. నన్నుదూఱిన నేసహింతునుగాని నాభక్తులదూఱిన సహింపనని భగవంతుఁడు సెప్పియున్నవాఁడు దైవశోధ గోడంబడును గాని భక్తశోధ కోర్వఁడు తనభక్తులఁ బరీక్షించువారలకు దాఁబరీక్షించి వంచించుచు ఒకానొకవేళలయందు భక్తులను దాఁబరీక్షించునపుడు వారలచేఁ దానువంచితుఁడగుటకు సిద్ధపడియె యట్లొనర్చును. ఇందుకుఁ దార్కాణము భల్లాణరాజు మొదలగు పూర్వపుభక్తు లనేకులు గలరు. అంతయేల నిన్నమొన్న బసవన భక్తరూపమున వచ్చినశివునికి దర్పణము చేతికిచ్చి దర్పమడఁచలేదె ఆహా! బసవా, బసవమంత్రీ, బసవరాజ, బసవేశ్వరా, ఎంతవాఁడవుర, యని యనేకవిధంబులుగ బసవేశ్వరులను గొనియాడి యనేకంబులగు ధనకనకవస్తువాహన దాసదాసీజనమయ భర్మాభరణమృదుదుకూల రథగజతురగాది బహుమానంబులొసంగి తానునుశివభక్తి పరాయణుండై యుండెను. ఇట్లు రాజుచే బహుబహూకరింపఁ బడినవాఁడై బసవేశ్వరుఁడు తన రాచకార్యంబులం దేమఱక శివభక్తులను సర్వదా గౌరవించుచు వారికివలయు పదార్థం

బులొడఁగూర్చుచు వైదిక రాజకీయవ్యాపారంబులం దేకాగ్రదృష్టి గల వాఁడై యమాత్యత్వంబు నివర్తించుచుండెను.

---

## తృతీయాశ్వాసము.

---

(బసవని త్యాగమున కోర్వక తోడిమంత్రులు రాజునకుఁ జెప్పుట)

ఇట్లు రాజసన్మానంబు నొందిన బసవేశ్వరుఁడు తనరాచకార్యంబులు యథావిధిగా నెఱవేర్చుకొనుచుండఁగా నొకానొక మాసాంత దివసంబునఁ దనసైన్యములకు వేతనంబులుపంచి యిచ్చుటకు ధనంబు పేటికలం దిడికొని శకటంబులపైఁ బెట్టించుకొంచు నేఁగుచుండుట మార్గమధ్యమున నొకవిటజంగమ గాంచి యాతనిభక్తవేషంబున వంచించి యొక పెట్టెయం దున్న ధనంబు సర్వంబుఁ దనకిమ్మని యడుగఁ దప్పక యట్లనే యాధనమంతయుఁ గీసి యాతని కిచ్చెను అదిగని తనతోడిమంత్రులు రాజుగారికి చూపి "స్వామీ! చెప్పినపాపము చెప్పకున్న దోషమును సంభవించును గనుక విన్నవించుచున్నవారము. బసవన్న మీయొక్క సమ్మతిలేని ధనమంతయు పెట్టియలకొలఁది భక్తులకు ధారవోయుచున్నవా" డనిరి. అదివిని రాజుమిక్కిలికోపించి బసవేశ్వరులఁ బిలిపించి నీమంత్రిత్వము మాకక్కరలేదు మాధనము మాకిచ్చివేయుము నీవు భక్తుండవని పరధనమును లోష్టవత్తుగా భావింతువని మేము నమ్మినచో మాధనమును మాతాతతండ్రులు గణించినయాస్తివలె వ్యయపఱచుచున్నావు. ఇదియేనా నీ దైవభక్తి. ఇదియేనా రాజవిశ్వాసము అని యాగ్రహదృష్టితో నడిగెను. బసవేశ్వరులును మందహాసము దరవికసనారవిందుండగుచు "ఓ వెట్టిప్రభువా! ఇంతమాత్రమునకింత యనుమానము పడవలెనా? నిర్మలశివభక్తుల ధనమునకాశపడుదురా! ఈశ్వరభక్తుల

నైశ్వర్యంబునకుఁ గొదువయుండదు. కల్పవృక్ష కామధేను చింతామ ణులు వారలయింట నెపుడునుగొలువుండును. మానససరోవర నిర్మల నీరపానంబొనర్చు కలహంస ముత్తికిగుంటలకరుగునా? మందారమాకం దాదిపుష్పముల మధురసంబుఁగ్రోలు తుమ్మెదయుమ్మెత్తపూవులపై ్రవాలునా? పరమేశ్వరదత్తమహదైశ్వర్యంబు నందులఁదూగుభక్తుఁ డితరధనంబుల కాశపడునా? ఇవిగోతాళపుచెవులు ఈపెట్టెలుదీయించి మీధనమునుమీరులెక్కపెట్టుకొనుఁడు అందొకచిల్లిగవ్వయైనఁ గొ ఱఁత యుండిన నీచేత నేఁగరిచశిక్షకుఁ బాత్రుండఁ గాఁగలను" అని మృదూక్తులఁ బ్రతివచనంబులఁ బలుకుచు పెట్టియలబీగంబులు దెఱచి యందున్నధనంబు సర్వంబును లెక్కప్రకార మొకదమ్మిడియైనను దక్కువలేక గనపర్చెను అప్పుడక్కడనున్నజనంబులు గొండఱు తమ లోఁదాము పరస్పరాశ్చర్యరససంమగ్న మానసులగుచు నిట్లనిరి తొల్లి మధురాపురినాథుండు తనప్రధానమంత్రిచే నధికధనంబు గొఱ్ఱంబులం గొనుటకుఁగాను దేశాంతరంబుఁ బంపుచుండ మధ్యమార్గంబున నొక భక్తుఁ డాధనంబును గోరకుండిత్రియిచ్చివేసి గుఱ్ఱములనుగొనుటకు ధనంబులేమి యడవిలోనుగులఁబన్నించి నక్కపోతులం బట్టించితెచ్చి జక్కనయనారి యనుమంత్రిరాజున కొప్పింప నవియేవేలకువిలువగుఱ్ఱం బులై పుడమిఱేనికిం బ్రమోదంబు బుట్టించె భక్తులప్రభావం బిట్లుం డును మనబసవనమంత్రి రాజుసొమ్ము సరిగాఁగనఁబర్చుట యేమివింత యని తమలోఁదాము సంభాషించుకొనుచుండ బిజ్జలరాజది విని బసవే శ్వరుల ప్రభావంబున కాశ్చర్యపడి యాతనినొనేకవిధంబుల గారవించి యపచారంబుచెప్పకొనియున్న మంత్రులంగని యీమీఁదమాబసవన పై మాతోఁగొండెములంజెప్ప గుఱ్ఱలనాలుకలు గోయించి బొత్తి సున్నంబంటించి నోటిలోదుమ్ముఁ గొట్టింతునని కట్టడము సేసెను.

జంగమవిటుం డొకండు తనలంజకొఱకు బసవేశ్వరుల భార్యగట్టిన పట్టుపుట్టంబడుగుట

మఱియొకనాఁడు జంగమవిటుం డొకండు లంజయింటనుండి బసవేశ్వరులనడిగి ధనముతెమ్మని యాలంజ దాసినిఁ బంపెను అదిసని బసవేశ్వరుల నగరికిఁబోయి యట నాతని భార్యయగు గంగమాంబిక గట్టియున్న పట్టుపుట్టముం గని ధనముమాట యుజాడనిచ్చి వేగమతిరిగివచ్చి యాలంజను గని "అక్కా! నీకేమని చెప్పుదును. బావగారు నన్ను బసవేశ్వరులనడిగి మన కర్చువెచ్చములకు ధనముఁదెమ్మని యంపినారు బసవేశ్వరులనగరికి నేనేగి సూచునంతటిలో నాతనిభార్యయగు గంగమదేవి గట్టియున్న పట్టుపుట్టము నాకనులకు మిఱుమిట్లు గలుగఁజేసినది. ఏమియాచీరెయందము ఏమి దానినిగనిగలు ఏమి దానిజరీయంచు ఏమి దానిమార్దవంబు ఇఁక నేవేఱవేఱఁ జెప్పలేను ఆచీరెవంటి చీరెయీ భూలోకంబున నేగాదు ఏలోకంబున నేనారీమణియొద్దను లేదని నేను దృఢముగా నొక్కిచక్కాణింపఁగలను బావగారినిఁ బంపి యాచీరెఁ దెప్పించి నీవుధరించితివేని నీజన్మ సార్థకంబగును. అట్టిచీర ధరింపని యాదుజన్మంబేల? అని దాసిచెప్పిన మాటలువిని యాపడుపుఁబోఁటి తనవిటునిఁజూచి "ప్రియుఁడా! బసవమంత్రిభార్య గంగమదేవి గట్టిన పట్టుపుట్టము నీవు దెచ్చి నాకివ్వవసరే. లేనిమొదల నేటితో నీస్నేహము నాకక్కఱలే" దనియెను విటులు కామాంధులు గదా లంజకోరినఁ దనమానప్రాణములైన నీయసిద్ధపడుదురు సిగ్గన్నమాట మొదలేయుండదు. లంజకోరికదీర్చుటకు జంగమవిటుండు మైనిండ భూతినలఁది రుద్రాక్షమాలలుధరించి రుద్రాక్షకిరీటంబు తలపైనిడి రుద్రాక్షాంగదంబులు రుద్రాక్షకటకంబులు రుద్రాక్షాంగుళీయకములు రుద్రాక్షపావలు రుద్రాక్షఛత్రంబును ధరియించి యడుగడుగున "శంభో, శంకర, మహాదేవ, సాంబ, సదాశివ" మొదలగు శివనామోచ్ఛారణంబు సేయుచుఁ బ్రత్య

హురుద్యనివలె వేషమున్నై మఱొని బసవేశ్వరుల దివ్యభవనంబున కరిగి శివపూజానిష్ఠాసమయంబగుటఁ దానును లోనికరిగి బసవేశ్వరులచే నతిథిసత్కారంబులంగొని "బసవనమంత్రీ! నీకడ కొకముఖ్యమగు పని గలిఁగి నేవచ్చితిఁ నాకుధనధాన్యంబు లక్కఱలేదు భోజనభాజనంబులును పనిలేదు. నీవుంగనధరించు దుకూలవుట్టంబు నాకొసంగి యతిశీఘ్రంబున నన్నంపెతివేని నీకుఁ బదిపున్నెంబులఫలంబు గలుఁగును" అని యింకయుఁ జెప్పఁబోవుచున్న జంగమవిటుని బసవేశ్వరులు మఱి చెప్పనవసరములేదని తనభార్యను రావించి "చెలీ! నేఁడు మనభాగ్యమే మని కొనియాడుదును. పుట్టువెలుఁగని యీజంగమ పుట్టువేల్పు సాక్షాద్భ్రుడు మ్రోఁడు. మనగృహపావనంబు సేయ నేతెంచి మనల జన్మలుసార్థకంబగునట్టుల నీకట్టినపుట్టం బభ్యర్థించుచున్నవాఁడు ఇప్పుడీతని కిదిస

⇐ బసవేశ్వరులు తనభార్య కట్టినట్టుపుట్టము తానుస్వయం విప్పి జంగమున కిచ్చుట. ⇒

మర్పించితి మేని మనకు మఱి పుట్టువుండెదు కాన నామాటఁ ద్రోసివేయక నైళి బయాపుట్టం బిచ్చివేయుమని తానామెపైటచెంగు పట్టిచీరెలాగుచో మఱల నెప్పటియట్ల నాపైటచెం గట్లమఱియుండెను చీరెయంతయు దేహమునుండి తొలఁగించునంతలో మఱియుఁ జీరెయు నమరియుండె. ఇట్లు బసవేశ్వరులామె కట్టినపుట్టంబు గట్టినది కట్టినట్లుండగా ననేకచీరెలామె శరీరమునుండి యొలిచ యచ్చట నేలపైనొకరాశిగా చీరెలుపడనై చెను. అదిమాచి జంగమవిటుండు సిగ్గుపడి "ఏమి యీబసవనప్రభావము ఈయన తీసినకొలఁది చీరెల క్షయంబులగుచున్నవి. అయిన నిదియొక వి తగాము శివభక్తులకివి సామాన్యకృత్యంబులే. తొల్లియిడుగుపి నాయనారి తనభార్య చీరలిట్లే యొలిచి యిచ్చియుండ లేదా? బల్లహుఁడు తనభార్య నీయలేదా? ఇంక మఱెందఱెన్ని యీయలేదు. అన్నిటికన్న చిత్రమైనది మఱియొకటి మానకంజారుఁడు

తనకూఁతుపెండ్లి మహావైభవముతోఁ జేయుచుండ నొకబక్కరి తపసి
వచ్చి యాపెండ్లికూఁతురి శిరోజములఁ దనకు జడలుగా ధరించుటకు
నిమ్మనియడుగ నాయన యెంతమాత్రము మనంబునఁ గొత్త పెండ్లి
కూఁతురను శంక లేక యాపెండ్రుకలు గత్తిరించియివ్వలేదా? శివభక్త
లు దమప్రాణములైనను గొంకు లేక యడిగినతక్షణము సమర్పింతురు
గావున బసవనమంత్రి యీచిఱుతొసఁగుట యొక యాశ్చర్యంబుగా"
దని తనమనంబున ననుకొని నాప్రియురాలు నేనిచట జాగుసేసినందుకు
మనంబునఁగినియునేమో యిఁకనిటఁ దడయరాదు వలసినన్ని చీరె తె
త్తికొనిపోయెదనని తననెత్తిమీఁద నొకచీరెలమూటఁ బెట్టుకొని మన
లిక త్వరగ మనంబున వెలయాలి యిల్లుఁ జేరెను అంత నక్కడిజను
లందఱు బసవేశ్వరుని యుదారభావంబునకును సద్గుణాంగీకారంబు
నకు నతులాశ్చర్యానందంబుల నొందుచుఁ బొగడఁగ మంత్రియు నంతఃపురం
బునకుం జనియె.

(సంధ్యాకాల శివపూజ)

అంత దినకరుఁడు పగలంతయుఁ బసవేశ్వరులు సేయుచున్న
దానగరిమనుఁ జూచుచుండి కరయుగంబున నాతఁడు సేయుచున్న దాన
మునకు సహస్రకిరణంబులఁ దాఁ జేసెడిదానము సరిరాదని నాతనిప్రతా
పంబున కోడిపాఱెనో యన్నటుల సూర్యాస్తమానంబయ్యె తనయిం
టికతిథిగా నేతెంచుచున్న సూర్యభగవానుల కర్ఘ్యపూజలుగావించు
టకు నపరదిగ్వధూమణి లక్షపుష్పపూజకునై సేకరించిన కెందామరల
రాశియనఁ బడమటిదిక్కున సంధ్యారాగమతిశయిల్లెను అట్టి సంధ్యా
రాగసమయంబున శివార్చనలు శివభక్తులు సేయుచున్న సమయంబున
బసవనమంత్రియుఁ దనశివపూజ కుద్యుక్తుఁడై యొగునవసరంబునఁ గొం
దఱు తృతీయపురుషార్థపరులగు జంగమవిటులు దమశివపూజలు తమ
తమభోగవనితల యిండ్ల దీర్చుకొనువారై ఫలయుగంధకుసుమాది పరి

కరములు బసవనడిగి తీసుకొని తదనుమతి నడుగుచుండిరి. ఇట్లువిలువ లగు జంగమును వేశ్యలయిండ్లకుఁ జనుటగని, ముగ్ధసంగయయను

## ముగ్ధసంగయకథ

నొకభక్తుఁడు కేవలలింగపరాయత్తచిత్తుఁడు ప్రథమ పురుషార్థపరుండు లింగశబ్దము తత్సంబంధసేవాపూజావిషయక పరిభాషతప్ప తదితర శబ్దార్థమైన నెఱుంగనివాఁడు తనమనంబున నిట్లువితర్కించుకొనెను. పంపెడువాఁడుబసవనమంత్రి వెళ్లెడువారు మహాదేవభక్తులు కోరుడుగొని పోవుచున్నవి శివపూజాద్రవ్యసంభారములు. ఈభక్తులందఱు శివపూజ లొనర్చుకొను స్థలము లంజలయిండ్లట ఒక్కొక్కభక్తునికొక్క లంజ యిల్లు విడిదిగా నేర్పఱుపఁబడెను వీరందఱచ్చటికి శివపూజార్థముపోవుచున్నవారు లంజలయిండ్లశివపూజలు బహువిఘ్నతతో నిశ్చలత్వముతోనే ప్రతిబంధకములు లేక జరుగునేమో? నేనునుబసవనమంత్రి నడిగిర్వొక లంజయిల్లు విడిదిగానడిగి యచటకేఁగినిశ్చలముగా శివపూజసేసికొని యెదనని లంజయన్ననేమోయెఱుఁగని యామహానుభావుఁడు బసవ దండనాథునికడకేఁగి తనకును వలయుసంభారములతో శివపూజకై యొకలంజయిల్లు విడిదిగానియమింపుమనివేఁడెను ఈతనియమాయకత్వమునకు మౌగ్ధ్యభావమునకు బసవేశ్వరులవారు మందహాసముసేసి తగిన సాధనసామగ్రిసంభారములతో నొకయతిచతురురాలగు మనోహరాంగియను నగువేశ్యయింటికిఁ దోడిచ్చిపంపిరి ఆవేశ్యయునిట్టిపరమభక్తాగ్రేసరుఁడు దనయింటికివచ్చుచున్నవాఁడని ముందుగానెఱింగినదికావునఁ దనగృహంబునకు ననేకశృంగారములుగావించి పచ్చనితోరణములు గట్టించి కస్తూరికలపినసీటఁ గలయంపిచల్లించి ముత్యాలముగ్గులు వెట్టించి శయనగృహంబ లంకరించి బొమ్మలుపటములువెట్టించి మణిదీపములుంచి పందిరిమంచమందు పట్టుపరుపునుబఱపించి దానికిఁజుట్టునుం బూలదండలు వ్రేలించి తలగడలుదిండ్లువెట్టించి వాసనద్రవ్యంబులు సిద్ధపఱ

చి లోనికిఁ గాలుపెట్టడముతోఁ గామోద్రేకంబుగలుగునటుల నేయించి తానును బన్నీటజలకమాడి పసుపుమేనలఁదికొని కుంకుమచందనంబుల నుం బూసికొని కస్తూరితిలకంబిడి దివ్యవస్త్రదివ్యాభరణంబుల ధరించి వేచియుండి తనగృహసమీపమునకు ముగ్ధసంగయ్యరాఁగానే యెదురుగాఁ బోయి యడుగులకెఱఁగి కైదండయొసఁగి యర్ఘ్యపాద్యంబులచేహస్తపాదప్రక్షాళనంబులు సేయించి యాతండుగొనివచ్చిన నాకర్లచేతి పూజాద్రవ్యంబులం దనదాసిచేలోనికంపి శయ్యాగృహంబున కాతనిఁ జేర్చునంతలో నాతండదిగని వెఱఁగందియది పరమేశ్వరునాస్థానమని యామంచంబు మారునాస్థానమంటపంబని యెంచి శివపూజకు నిది సరియగు స్థలమనిమనోల్లాసంబుగగుర నచ్చోఁదన ంబళి విప్పిపరచి కూర్చుండి శివపూజకుఁ దాఁదెచ్చిన సంభారముల నందుకొని యచ్చోనుంచుకొని విభూతి మేన ధరించుచు వేశ్యనుసై

ముగ్ధసంగయ వేశ్యాగృహములో శివపూజ సేయుట.

తమొభస్మనిఁగా భావించి స్త్రీపురుషవివక్షణత నెఱుంగని యా మహానుభావుండు నీవేలభూతి మేనఁ బూయవనియడుగ నామె "స్వామీ! నామేనఁ బచ్చనిబూదిబూసితి నిదియే పార్వతిధరించు విభూతియని దారాసుకొని పసుపుజూపెను. రుద్రాక్షమాలలుదీసి తనమెడలోవైచుకొని నీవేలరుద్రాక్షలు ధరింపవని యామెనడుగ నాముగ్ధయు నతిచతుర గావున స్వామీ! యివిగో నామెడలోని రుద్రాక్షలు" అని మౌక్తికహారంబులు గనపర్చి "స్వామీ! రుద్రాక్షలు లవణసముద్రప్రాంతములం దుప్పునీటిచే వృద్ధియగు రుద్రాక్షచెట్లయం దుత్పన్నంబు లగుటవలన మీవినల్లగానుండును నావిదుగ్ధసాగర మధ్యంబునం బడియుండి సర్వదా పాలతోఁదడియుచు దానియడుగున నిసుకలోఁ గూరుకొనియుండు శుక్తిరుద్రాక్షతలంబులలోని గింజలగుటచే మారుద్రాక్షలు తెల్లగానుండు" నని తనహారములు సూపించెను ఇట్లు సంగయ సేయు ప్రశ్నలకెల్ల

తానుమారుత్తరంబు లిచ్చుచు నతని మనసున కెక్కునటులఁ దన యూర్యామతంబును బోధింపనదియు నొకశివమతంబని యాతఁడనుకొని "భక్తాగ్రేసరుఁడా! నీమతంబు బహుచిత్రమైనమతము ఈమతమునకు గురువులెవ్వ" రనిన నాతలోదరి స్త్రీపురుషభేదములేక తన్ను భక్తుఁడా యని పురుషవాచకంబున సంబుద్ధిసేయునాతనికిఁ దద్భేదంబుఁ దెలుపునదై యిట్లనియె "స్వామి! మీది శివమతము. మాది పార్వతిమతము మామతమున కాదిగురుడు సదాశివుఁడె ఆతనివలన పార్వతి యుపదేశమునుబొంది యామె మాకెల్లఱ కుపదేశించెను కాన మేము పార్వతీ మతస్థులము పర్వతియన శివునిభార్య శివుఁడు పురుషవ్యక్తి పార్వతి స్త్రీవ్యక్తి లోకములోని భక్తులందఱు వారిస్వరూపులు మీవంటిపురుషులందఱు శివస్వరూపులు. నావంటి స్త్రీలందఱు పార్వతీస్వరూపలు శివపార్వతులిద్దఱు నేకాంగులు అట్లనే భక్తపురుషులు, భక్తవనితలు నేకాంగులు. అట్లనే భక్తస్త్రీపురుషు లందఱు నేకాంగులే బసవనమంత్రి మొదలగు మహాపురుష భక్తులందఱుఁ దనుతమ కొక్కొక్కయర్ధాంగిఁ గలిగియుండురు. వానితో వారు సమస్తసుఖంబు లనుభవించుచుందురు ఇఁక మీవంటి ప్రత్యేకస్త్రీలులేని భక్తులకు మేము స్త్రీలుగా నర్ధాంగమలంకరించు స్త్రీభక్తులము మీరు నేను నేకాంగులమై చరింపవలెను కాన వినుము. ఈరాత్రి సమస్తభోగము లంగీకరించి నామాట యంగీకరించి మీరునాతో నేకాంగత్వమున నీరాత్రి సుఖింపవలెనని కోరుచున్నా ననెను. అదివిని యట్లనే సేతము. ముందుమన శివపూజ కానిమ్ము పిమ్మట నీచెప్పినయట్లు చూతము" అని తనశివపూజ పెట్టియఁ దెమ్మన నామె శివపూజ నామూనందిచ్చి తనదాసీజనంబుల నాటపాటలకె సిద్ధపఱచి శివపూజా సమయమందుఁ దానును వినోదంబు జరుపుచుండెను. ఇఁక శివతన్మయత్వంబున నాతఁడు శివపూజ ముగించునంతటితోఁ దెల్లవాఱెను సూర్యోదయం బయ్యెను. బసవేశ్వరుల

## ముగ్ధసంగయ్య బసవేశ్వరులతోఁ దాను చేసిన శివపూజా విధానము సెప్పుట

త్యాగశీలత్వమును దార సాహసంబులకు వెఱఁగంది సిగ్గుపడి పాఱిపోయి [illegible] మఱల జూచు నుత్సాహంబున వచ్చినాఁడాయను నటుల సూర్యుఁడుదయించెను. అప్పుడు ముగ్ధసంగయ్య బసవనమంత్రి గృహంబునకేతెంచి తనకన్నముందు వచ్చి కాచియున్న వీరభక్తులందఱు వినుచుండఁడ తనచేసినపూజావిధానం బిట్లని సెప్పఁదొడఁగెను "అయ్యా! బసవేశ్వరులవారూ! నేను గడచిన రాత్రి శివపూజయందు బహుబాగుగా నెఱసేర్చితిని. ఆలంజయు నాకన్న నధికభక్తురాలవలె నన్నుఁ గారవించెను. మీరుగూడ నాతోవచ్చియున్నయెడల నావినోదంబునకు మీరు నానందించియుందురు. నాలోకకల్పిత్తసంగతి తెలిసినది. పార్వతీభక్తులు స్త్రీలట. శివభక్తులు పురుషులట. పార్వతీశివుఁడు నెల్లు సర్వదాయేకాంగులై [illegible] యట్లనే స్త్రీభక్తులు పురుషభక్తు లేకాంగులై యుండవలెనట. శివునికిఁ బార్వతియున్నట్టుల మీవంటి భక్తులకొక్కొక్క స్త్రీభక్తురాలేర్పడియుండునట. ఇట్టి మావంటి స్త్రీలు శివభక్తులకొఱకుఁ దామేర్పడిరట. స్త్రీపురుషవాచకముల భేదములు తెలిసినవి. స్త్రీలు ధరించునది పచ్చనివిభూతి తెల్లరుద్రాక్షలునట. వారు మున్ముందుఁగూడ రుద్రాక్షధరింతురట. అవి పెద్దదియై తెల్లవారుజామునఁ దూర్పుదిక్కునఁ గనఁబడు వేగుజుక్కవలెనుండును. ఇంక యున్నెన్నో ఆభక్తుఁడు—కాదు భక్తురాలు—నాకుపదేశించెను. తనయొద్దనున్న భక్తబృందమును బిలిచి నాశివపూజాకాలమందు గానవాద్యామోదంబు గలిగించెను. శివుని[illegible] బసియొకదా [illegible] స్త్రీపురుషభక్తు లేకాంగులు కావడమె శివానందమట. ఆయేకాంగత్వము రాత్రులయందేగాని పగలు లేవట. పగటిపూట భిన్నాంగులుగా నేయుందురట. ఈయేకాంగత్వ విషయము నాకంతగా బోధపడలేదు. కాని స్త్రీపురుషభేదము మాత్రము

దెలిసినది. పార్వతీపరమేశ్వరులు సమర్థులు గనుక వారలేకాంగత్వమునఁ జరింపఁగలరు. మనము మనుష్యులగుటచే నట మన కేకాంగత్వము రాత్రులయందేగాని సర్వదా లేదట ఇంకయును నేకరహస్యములు నేటి రాత్రి శివపూజాసమయమున నుపదేశింతు నని యామె చెప్పెను.’’ అని సంగయ్య చెప్పుచున్నతఱి వినువా రందఱు నొకరితో నొక రెకసక్కెములాడుకొనుచు కడుపులు చేతఁ బట్టుకొని యాతని యమాయకత్వమునకు నవ్వుచుండిరి. బసవేశ్వరులవారు మందహాసము సేయుచు నాతనికిఁ గొన్ని హితమార్గములు బోధించి యుచితసత్కారములు సేసి పంపెను

## చెన్నబసవన్న బసవేశ్వరులతో నిట్టి భక్తులఁ గూర్చి ప్రసంగించుట

అప్పుడు సమీపముననున్న బసవేశ్వరులువారి మేనల్లుడు చెన్నబసవన్న యాముగ్ధసంగయ్య మూఢభక్తికి నాశ్చర్యపడుచు నిట్టిమూఢభక్తులు తొల్లి యెందునైన నుండిరా? ఇప్పుడున్నారా? ఇకముందు నుండఁగలరా? యని తనసంశయమును బసవేశ్వరులవారికి నెఱుఁగ వారు మునుపున్న భక్తులచర్యలు గొన్ని వానికిఁ దెలిపి యిట్లనిరి

## బసవేశ్వరులవారు చెన్నబసవనికి ఋష్యపశుపతి వృత్తాంతంబు సెప్పుట

ఓయి చెన్నబసవన్నా! చూచితివా యీభక్తుని మాహాత్మ్యము ఈతండు మనము పురాణములలో వినియెడి తొల్లింటి ఋష్యశృంగునివంటి వాఁడు ఆతండును స్త్రీలను సైతము మునులుగానె భావించుచుండెడి వాఁడు. విభాండకుండను మునికి నొకయప్సరస దర్శనంబున రేతస్స్ఖలనం బయిన నాతండు రేతంబుతోఁ దడిసిన కౌపీనంబు నొకసరోవరంబునఁ బ్రక్షాళనంబు సేయ నొయాఁడులేడి తృషార్త్తయై వచ్చి యానీరు ద్రావినఁ దానికి సద్యోగర్భంబున మృగచిహ్నంబుతో నొసలనొక శృంగంబుగల సుతుండు దుదయించిన నాముని యాబాలు నాశ్రమంబునకుఁ

గొంపోయి పెంచెను. ఆతఁడె ఋష్యశృంగుఁడు తుదకాతండు వేశ్యల వలన నాలోకజ్ఞానమునుబొంది స్త్రీపురుషభేదము నెఱింగి తుదకు మహా నుభావుండయ్యెను

పూర్వకాలమునందు రుద్రపశుపతియను నొకభక్తుఁడు తనయూ రిలో నొకపౌరాణికుడు భాగవతంబు పురాణంబు సదువుచు క్షీరసాగ రమథన కథాప్రసంగమున నయ్యవసరమునందు హాలాహలమును జగన్నా శనకృత్కరాట్టహాసంబు నొంది విషము బయలువెడలిన దాని బ్రహ్మాది సర్వాదులు కోరినందున శివుడు మ్రింగెనని విని యాపౌరాణికుని మ అలమలల నాధనయే యడిగెను "ఏమి లోకాంతకరంబునగు విషము ను శివుఁడు మ్రింగెనా? ఇది నిజమేనా?" యని గుచ్చిగుచ్చి యడుగు టయు నప్పౌరాణికుండది నిజంబని చెప్ప నాభక్తుఁడు నేలబడి కొంత వడికిఁ జైతన్యమునప్పి పిమ్మట పెలివిరాఁగానే 'నాతండ్రి! శివన్న నీవు విషమేలమ్రింగితివి నీవు మ్రింగితివన్న నిజమునె. నేసయవస్థను వచ్చినపుడు నిజముగా మ్రింగిన నీవేయవస్థ నొంటివో కదా రొమ్ము కట్టినయెడల నది చంపును కాన నాతండ్రి వేగమ గ్రక్కివేయుము. క్రక్కకున్న నీకు మరణంబు సంభవించును ఆదుర్వార్త నేను వినఁగల నా? అయ్యో! విషముమ్రింగుమని నిన్ను గోరుటకు వారలను నోరెట్లాడె? వారే మ్రింగఁగూడదా? తామే యాపదయు లేక సుఖముగా నుండవలె నట నీవు విషము త్రాగి చనిపోవలెనట ఏమి వీరిగడుసుతనము నీకుఁ దల్లియున్న నట్లుమ్రింగనిచ్చునా? నీయర్ధాంగమున నున్నయగజ యెట్లో వ్వకొనియె వీరభద్రాది సుతత్రయము బెటపనియె వారు నిన్నుఁ దాగ నిత్తురా? ఇఁకనైన వేగమ గ్రక్కుము నాతండ్రి. నేభరింప లేకున్నాను ఈవార్త నాగుండె బద్దలుకొట్టుచున్నది. నేనేమిసేతును ఎంతదుర్వార్త వింటిని విషము గ్రక్కివేసితివా లేదా? పౌరాణికుండా! ఆవిషము గ్ర క్కివేసెనా లేదా? నిజముసెప్పు" మని పలువిధంబుల పలవించుచున్న

యూరుద్రుశుపలికిఁ బౌరాణికుండింక యుమియనులేదు. కంఠమున నున్న దని చెప్పెను అదివిని "అయ్యో! కంఠగతమైన దేవివిషము ఇకనాకేది దిక్కు ఆవిషము కంఠము దిగినయెడల నుతిచెప్పుటదేమి? ఆపయిని మరణవార్తయే ఇకనేఁ బౌరాణికునడిగిన నావార్తయే చెప్పును ఇక నేను మఱెవ్వరినడుగక మరణవార్త చెవులఁ బడకమున్న నేనేమరణం బునొందెద నని యవ్వనుఁడు యొకయగాధసరోవరంబులంగని యం దుదుముక నుంకించునవసరమున ప్రమథగణంబులతోడను గంగాజటా జూటంబులతోడను శాలేయ ఖరశిలాభూషణములతోడను వాసుకినామ కసర్పరూప పాశంబులతోడను నాగయజ్ఞోపవీతంబుతోడను దుర్గాస మాక్రాంతవామార్ధదేహంబుతోడను సూర్యశశాంకవహ్నినేత్రంబు లతోడను పరమేశ్వరుండు ప్రత్యక్షమై "భక్తసత్తమా! నీమూఢభక్తి కి నేమెచ్చినాఁడ నీకుఁవలయు వరముగోరు" మనవృషభభక్తుఁడు "స్వా మీ! నావరంబుమాట దైవంబెఱుంగు నీవువిషము నుమిసితివా లేదా? ఆమాట ముందునాకు జెప్పుము ఆపైనావరముమాట చూచు కొందును" అనునంతలో నీశ్వరుండు వానినోదార్చి "నేను విషము గ ఱపులోనికి మ్రింగలేదు గళంబున నిముడ్చుకొన్నవాఁడను. గాననేఁగ దా భక్తులునన్ను నీలకంఠుఁడందురు ఈవిషంబిట్లుండుట నాశరీరంబు నకు హానియేమియు రానేరదు. నేను యథాయోగ్యముగానున్న వాఁడను" అనునంతలో భక్తుఁడు విషమెప్పటికైనను ప్రాణహాని జేయును గనుక నాతండ్రీ! వేగమ యుమిసినైవుము కంఠములో నెల్లకాలముండు నా? కంఠము దిగినయెడలఁ దప్పక ముప్పువచ్చును అదుగో దిగుచు న్నట్టు నాకగుపడుచున్నది అని యాపరమేశ్వరుని కంఠముదిక్కున నె రదేకదృష్టితోఁ జూచుచున్న భక్తునిఁ దనతొడపైఁ గూర్చుండఁబెట్టు కొని" ఈవిషమెప్పుడు నిట్లనేయుండును క్రిందికిదిగదు నీవునమ్మవేని నమ్మకముపుట్టువఱకు నట్లచూచుచుండు" మని శంభుఁడనునంతలో

భక్తుఁడు “నేనిట్లనె మాచుచుందును ఈవిషము కంఠము మెప్పుడు దిగితే యప్పుడు నాశరీరంబు విడుతు” నని చూచుచుండెను ఇప్పటికి రుద్రప శుపతి యీశ్వరునికొఁడపైని కూర్చొనియున్నాఁడు. వింటివా చెన్నబస వా మూఢభక్తుల చర్యలని బసవేశ్వరులు చెప్పి మఱియు నిట్లనియె

సక్కనయనారికథ

సక్కనయనారియను నొకభక్తుఁడు తనభార్యయుఁ దానునొక శివపూజ సేయుసమయమున నెవరిలింగమూర్తిని వారు వామకరంబున నుంచుకొని ధ్యానావాహనాదిషోడశోపచారంబులఁ బూజించుచుండిరి. భర్తనిగులనీషుగా శివపూజ సేయుచుండెను భార్యతనలింగమూర్తి నకచేతనుంచుకొని యేకాగ్రచిత్తంబునఁ దిలకించుచుండె నాలింగమూర్తి తనువృపైని జలజలమని చలిచీమ క్రిందట్లగపడెను అదిగని యారోగము దేహమంతయు వ్యాపించె నని శరీరమునకుఁ హానివచ్చునని దానికిఁ జేయవలసిన ప్రతిక్రియ యామెచేసెను. ఆచలిచిరోగమునకుఁ జేయవ లసిన శాంతి యేమనఁగ గనపడినవెంటనే యాతనువృపై నారోగమం కురించిన భాగమునఁ దక్షణముయుమిసి బూడిదెపామిటగనుక నానయ నారిభార్య యట్లనే తొందపడి యారోగనివారణముఁ గావించెను. ఆ యుమియుటలో నామెనోటి తుంపరలు పక్కను శివపూజసేయుచున్న భర్తచేతిలో నున్నలింగమూర్తిపై కొన్నితటలునఁబడెను అదిగని యామెమగఁడు మిగులఁగోపించి “యోసీపాపీ, నీకుభక్తియనువాసన యేలేదు. మూఢురాలవు నీవు నాలింగమూర్తిపైన నోటితుంపర లెట్లుపడినవో. నీనుంచినాశివపూజ భ్రష్టమైపోయినది ఇఁక నిన్ను నే నొల్లను నీయిచ్చవచ్చినచోటికిఁబొమ్ము” అని ప్రియురాలి నెటకేని వెళ్లఁబుచ్చి తానుశివపూజయెటులనో ముగించి మఱునాఁడు పగలంత యు నేకాకిగాఁ గాలయాపనము సేసి రాత్రిశివపూజకై లింగమూర్తిని బైటఁదీసి చేతిలోనిడుకొని చూచునంతలోఁ దొలిరాత్రి తనభార్య

నెంతవఱకు దూపాడిచెనో యంత మేరదప్పఁ దక్కినలింగమూర్తి దేహమంతయు నెత్తురుపొక్కులతో చలిదిరోగముచే మెల్ల యల్లలనాడుచుండెను. అదిగని యాయనారి తానుభార్యను దణ్డించేసిన దోషమునకు బశ్చాత్తాపమునొంది భార్యయొక్క భక్తికిమెచ్చుకొని యామెను వెదకి తెచ్చి మనోహరాంగీ, నీభక్తిని నేఁగనుఁ గొననేర నైతిని నాలింగమూర్తినిఁ జూడుము. నీవుగతరాత్రి దూపాడిన మేరదప్ప తక్కిన మేనంతయు నెట్లురోగపూరితమైనదో" అనియామెకు సాష్టాంగనమస్కారమాచరించి యీవ్యాధి నివారణసేయుమని కోరుటయు నామె దేవుని మేన పొక్కులుకనిపెట్టి అయ్యో! నిన్న నామగఁడు నన్నుకోపపడి పొమ్మన్ననుఁ బోక మొఱ్ఱడితనముఁ జూపి నేను స్వామిశరీరమంతయు నప్పుడె దూపాడిచినయెడల నింతజబ్బుముదరకుండును ఇప్పుడు దేహమంతయు వ్యాపించె నే నెట్లు బాగుసేయఁగలను దేవునియొడలు పడిపోకము దేనాయంగము నేను విడిచెద"నని తనువుఁదొరఁగఁ బ్రయత్నించు నామెకు శివుండు సాక్షాత్కరించి "అమ్మా! నీభక్తికి నే మెచ్చితి మీభార్యాభర్తలిద్దఱికి వలయువరంబులుఁ గోరుఁడిచ్చెద"నని యడిగెను అందుకు వారు "దేవా! నీదివ్యదర్శనంబయ్యెను. ఇంక మాకుఁగోరవలసిన వరములెవ్వియో మాకుఁదెలియద"నిరి అందులకు భగవంతుఁడు వారియుమాయకృత్యమునకు సంతసించి వారలకు భూలోకమున నున్నంతకాలము సకలైశ్వర్యములతోఁ దులఁదూఁగుచుండునట్లనుగ్రహించి కైలాసంబునకేఁగి తననారూప్యముక్తిఁ బొందులాగునను వరంబులిచ్చి యంతర్ధానమయ్యెను

## బిజ్జమహాదేవమ్మ కథ

మఱియు బిజ్జమహాదేవమ్మ యనునొకపెద్ద యతివ శివార్చనాపరతంత్రురాలై యొకనాడు తనమనంబున నిట్లని వితర్కించె "శివునికిభార్యయుండి, తదితరపరిచరులుండఁగుండి, యొక్కతల్లి లేకపోవు

టకుం గతంబెయ్యది యగునో, తల్లి లేక యితండెట్లు పుట్టి యుండును. లోకములో సకలజీవులు జన్మించుటకుఁ దల్లియే గదా మూలకారణము. అట్టి తల్లివలన నేమి యితండును బుట్టియుండ నోపును తల్లి యున్న నీతనికిన్ని పాలు నిచ్చునా? తల్లి యున్న నీతనినిల్లు తిరిపెమెత్తనిచ్చునా తానయి నఁ బదియిండ్ల నడిగి తెచ్చి బిడ్డని సాకునుగాని యిల్లు పేక్షించునా. తల్లి యున్న నితనినిట్లుకోలు దాల్పనిచ్చునా? విసము త్రాగనిచ్చునా వల్ల కాటిలోఁ దనబిడ్డఁడుండి బూడిదె బూసికొనుచుండ నేతల్లిచూచి భరింపఁ గలదు. ఇతనికిఁ దొల్లియొకతల్లి యుండి గతించి యుండవచ్చును. అయ్యో, లోకములో నిందఱుస్త్రీలు, బిడ్డతల్లులున్నారు ఎవరైనను తమబిడ్డఁడని శివుని గావించి యుపచారములు సేయుటకు కాపాడుచుండఁగూడదా కావునేనొక నీకు నాబిడ్డఁడుగా భావించుకొని సకలవిధంబుల నాతని కుపచారములు చేయుచుందును" అని నిశ్చయించుకొని యప్పుడు జనించిన నెలపరిమాణమునుగల యొకలింగమూర్తిని దెచ్చి యిట్లనుకొని నాయనా, నీవు నాబిడ్డఁడవు. నిన్ను నే నిప్పుడుఁగంటిని. ఇకనో నేటినుంచి నీకు బాలోపచారంబులు సల్పి నిన్నుఁ బెంచి పెద్దవానినిఁ జేసెదను." అని నూనె మేనఁబూసి నలుగిడి యుష్ణోదకంబులు మీఁదఁ జలికినోటి లో నీరునఁ నిండఁ జేయుచు పెట్టి నీరుగ్రుక్కుచు కడుపునిమి యొడలు దోమి మఱలమఱల నీరుపోసి జలకమాడించి తడియొత్తి పొత్తిళ్ళవెట్టి యందుఁబరుండబెట్టి లాలిజోలి పాడి నిద్రపుచ్చి మఱు మేలుకొలు పాడి లేపిపాలిచ్చి మఱలఁ బరుండఁబెట్టి యిట్లు దినదినము శైశవకర్తవ్యములగు నుపచారంబులు సేయుచుండును నేలఁబ్రాకుటకున నా తండ్రి, ప్రాకుచుంటివాయని లేవనెత్తి యక్కునఁదుముకొని మోకాళ్ళను చేతులనంటిన మన్నుఁ దుడిచి చేయూతనిచ్చి నడిపించును. విద్దెములు సేయించును నడిపించును పరుగెత్తించును. చిన్నచిన్నమాటల ను నేర్పును పెండ్లిసేసెదనని యోదార్చుచుండును

అయిదుసంవత్సరములయీడు బాలుఁడగునంతకు నాగూలియు నవ్వ యంతలివాత్సల్యంబున నామె సేయు నుపచారంబులు గైకొనుచు నిజమైనబాలునిక్రియ నామె ముచ్చటలు దీర్చుచుండెను. ఇట్లుండి యొకానొకనాఁడు భగవంతుఁడు ముసలవ్వకు మోక్షమిచ్చుటకు నుద్దేశించుకొని యేదైననొకమిషగల్పించి యామెకుఁ బ్రత్యక్షము గాఁదలంచి మిగులరోగపుఁరితునివలె నోరుదెఱవక కంఠమ్మమూసి తల్లియొద్దఁ బాలుత్రాగుచు నోటనున్న కుచమూచుకమును మెల్లనవదలి యూరకపరుండెను అదిసూచి యాయవ్వ „అయ్యో! నాతండ్రీ! నీకెక్కడరోగము వచ్చినది సీరోగము నాకైవచ్చినదికాదు నేఁబోయి నీవున్నలోకమున కెంత మేలుగలుగఁగనో గదా నాచిన్నికుమారా! నిన్ను విడిచి నేనెట్లు బ్రతుకఁగలను నాతో మాటాడవేమి కన్నువిప్పిజూడవేమి. ఇది యేమిజబ్బో తెలియదు ఏవైద్యునికి జూపుదును ఒడలుచల్లగానేయున్నది నాడి బాగుగానే కొట్టుకొనుచున్నది. పైనిబట్టి జూచినయెడల జబ్బేమియు గనపడదు పిల్లనాపునూతియు గిడిమోక్షణమో యీరెంటి విడుచు వాసనలేఁ గనిపించుచున్నవాఁడు. ఇదియేమి మాయరోగమో తెలియదు నేనేమిసేయుదును నాకేదిదిక్కు ఎటుఁబోదును. నాయనా మాటాడ వేమి నాబిడ్డా, నీకొకయొక్కట్టు వాటల్లిన నాగతియేమి కాను. తండ్రీ! ఒక్కమాటు నీముద్దుమాటలు నాచెవినిఁ బడనిమ్ము కన్నువిప్పుము ఈయూరిరి రవంతయు బోయినదమ్మంట నీముఖము సూచి నేను జీవించియుంట కన్ను విప్పుడే యీపాటి నీవుసూచుచుండఁ గనే నాప్రాణంబులు విడుతు"నని యుఱివెట్టుకొనఁ బ్రయత్నించెను. అంతలో భగవంతుడు తనప్రమథగణంబులతోడను, నందీశభృంగీశాది రుద్రగణంబులతోఁడను నారదాదిమహామునులతోడను, వాగీశలక్ష్మీశాదులతోఁడను నాకొఱకరించి „అవ్వా! నీకేమికావలయుఁ గోరుము. నిన్నుద్ధరింప నేను బ్రత్యక్షమైతిని నీభక్తికిమెచ్చితిని నీభ

క్తికిలోఁబడితివే నేను బిడ్డఁడనై నీయొద్ద మెలఁగితిని ఇక నీకు మోక్షముగావలెనా? ఇహ లోకజీవనము గావలెనా చెప్పుము. నా యనుచరులు సైతము నీభక్తికి ఎహ్హుపంతపించుచున్నవా'రని సాంబశివుఁడు తనతోఁ బ్రసంగించుటవిని యామె ముసలియవ్వ తనయమాయకత్వముఁ దేటపడునట్లుగాఁ జూచువారలాశ్చర్యము పడునట్లుగా నాదేవుని దేవుఁడని యెఱుంగక తనబిడ్డఁడనియే భావించుకొనుచు "నాతండ్రీ! నాకేవరము నక్కఱలేదు నీకేరోగములు లేక చిరకాలజీవివై నాకన్నులయెదుట లీలావిహారంబులనుచుండి లోకోద్ధారణంబు సేయుచుండుట యొక్కటియే నాకుఁ గావలసినవరము" అనియూరకుండెను అంతనా సాంబసదాశివుఁడు చిఱునవ్వునవ్వి "అవ్వా, నీవుతల్లివై నన్ను సంరక్షించుచుండఁ నాకుజబ్బేమియుండును. నాకేమియు దేహమునందస్వస్థత లేదు. నిరామయదేహుఁడనై యున్నాను, నీవేమియు నట్టి విచారము మనస్సునందుంచుకొనవద్దు నీవుకోరినవెల్ల సిద్ధించునని బలుకుచుండెను అని యామెకు భక్తి ననుగ్రహించి ముక్తికొంతకాలమునకు మీఁదటనిచ్చెదనని పిమ్మటఁ గైలాసమునొందుటకు ననుగ్రహించి యంతర్ధానంబు నొందెను

## గొడగూచి కథ

మఱియు శివదేవుఁడను నొకభక్తుఁడు తనభార్యయుఁ దానును గ్రామాంతరము వోవుచు నింటియొద్దఁ దనకడసారికూఁతునుంచి యామెకుఁ జెప్పవలసినబుద్ధులు చెప్పి "యేమిమానిన నొక్కపనిమాత్రము మానవద్దని చెప్పిరి" అమ్మా! నీవుబుద్ధిగానిల్లు గాచుచుండుము. నీయాటపాటలనే మఱిమేయుచిత్యమును నిత్యముగాఁ జేయు శివకైంకర్యము మానకమాత్రముగా నీవు సేయుచుండుము, మేము ప్రతిదినమును కుంచెడుపాలు మనయావుమునుండి బోసి తీసికొని శివాలయమునకేఁగి యీశ్వరునకర్పణము సేయుచుండుము ఈమనమునంతనానవా

లుచుకొని యుని నీవానవాలుంగొనిపోయి భక్తిపూర్వకముగా శూలికిసమర్పించివచ్చి యాపైని నీయితరపనులు సేసుకొనుచుండుము." అని యనేకవిధంబులఁ దనయుఁబదింబది బోధపర్చి వారుగ్రామాంతరమునకుఁ బయనమైపోయిరి. ఆకన్నియయుమిగుల భక్తిశ్రద్ధలతోఁ బాలుపిదికి బాగుగఁగాచి యాకాగినపాలను దానానవాలుంచుకొన్న తూమునంబోసి దేవాలయమునకుంగొంపోయి యాలింగమూర్తియెదుటనుంచి "స్వామీ! నాతండ్రి నీకీపాలుప్రతిదిన మిావొప్పనసమర్పింపుమని నాతోఁజెప్పి దేశాంతరము వెళ్లెను నేనీయానవాలు నీకొఱకు మాయయ్య యిచ్చిన యీయానవాలు ముంతతోఁదెచ్చితిని. చూచుకొనుమని మాయీయానముంతయూనో కాదో, పాలు తెప్పగాఁ గాగినవో లేదో సూచుకొమ్ము ఏలోపమున్నను నాకెఱింగించితి వేని భక్తిసేతును కనుక నాయందుదయయుంచి యీపాలుత్రాగి ముంతనాకిమ్ము నిచ్చటనె గాచియుండెద "నని గుడిబయటికిఁ జ్ఛి కొంత సేపు కూర్చుండి మరల లోనికిఁబోయి సూచునరికి పాతెప్పటివలెనేయుండెను అదిగనియా చిన్నది ఏమిదేవా! నాపై కోపమా, నేను కన్నెననియా, భక్తికి చిన్న పెద్దతనంబులనవసరంబులు కొలఁదికన్నవయనియా, కొల్చి సూచుకొమ్ము మామూలుకన్న మఱి గిద్దెడో, సోలెడో, పెచ్చుండునుగాని తక్కువయుండదు త్రాసుకొలఁబుఱ్ఱకు సరిగాఁదెచ్చితిని ఒకబిందువైనను దొంగనీయక బహుజాగ్రతగాఁ దెచ్చితిని. పాలలోఁబాచదారకలవలేదనియా మాతండ్రి నాకుఁజెప్పలేదు కావలసినయెడల నరనిముషములో నింటికిఁబోయి తెప్పియిచ్చెదను లేదావానికిఁదో డటుకులు గావలెనా నీమనసులోమాట నాకెట్లు దెలియును నీవీపాలారగించని నో నాతల్లిదండ్రులు నన్నుఁగొట్టితిట్టుదురు. కాఁబట్టి నాతండ్రి! నన్నిట్టులు నట్టక నీమనస్సులోని యభిప్రాయము వెలిబుచ్చి నా చేత నాపసేయించుకొని పాలారగించినన్నంపుము నేనింటికడ నింకయునేకపనులు సే

నుకొనవలసియున్నది నీవునీయభిప్రాయము సెప్పునంతవఱకు నేను లేవను" అనిసాష్టాంగపడి యేడ్చుచుండెను ఇట్లుగొంతసేపు విలపించి తుదకు స్వామిపాలుత్రాగియుండునని లేచికన్నులుదుడుచుకొని మాచు సరికిఁ బాలునట్లనేయుండెనుగాని యొకబొట్టయినను తఱుఁగలేదు. అదిగని యేడ్చుచు పెద్దగొంతుతో "దేవా! నీకుఁగనికరములేదు విషముఁద్రాఁగిన కఠినచిత్తునకుఁ గనికరమెక్కడనుండివచ్చును విషము మోపిన నీనోరుచేదెక్కి యున్నది. ఈతీయనిపాలుద్రాఁగిన ఆనోటి యరుచిపోవును నీవుపాలుద్రాఁగనిచో మాతండ్రి నన్నుఁబడఁగొట్టును వానిదెబ్బలచేఁ గుళ్లి చావవలసివచ్చును అట్లు దుర్మరణంబునొందుటకంటెనో ముక్కంటీ, నీముంగల నీశిరంబుపై నాశిరంబుమోపి యొక్కనాతి కపాలమాత్రము సేసుకొని నీలోనైక్యమైపోయెదను. ఇంతకన్నమఱొండు మార్గము నాకుఁగానరాదు" అని యాలింగము నెత్తి మొత్తుకొనుట తలకించుటలో నాలింగమూర్తి తటాలున రెండుచేతులుసాచి యొకచేతను పాలముంతఁబట్టుకొని వేరొక్కచేత నామెఁ గిరియుంబట్టి యామముంతెడుపాలు గుటుకు గుటుకున నొకబెట్టుగాఁను. తడిపైయైనను లేకుండునట్టుల ముంత నాకివేసినట్టుల నారగించి యాముంత నాయింతిచేతికిచ్చి మాఁటమాటాడక విడిచిపెట్టెను ఆముద్దియవద్దయునోద్దితోఁ బాలుశూలితాగెనని కడుమోదంబున నింటికేఁగి యితరపనులుచేసికొనెను ఇట్లు ప్రతిదినము నావనిత గొనిపోవుపాలు మామూలుప్రకారము స్వామి త్రాగుచుండెను. ఈప్రకారము గొన్ని దినములు సనిన వెనుక నొకనాఁడుముంతతోఁ బాలుగొని యాచేడియ వాడుకప్రకారము స్వామిచేతికందియ్య నాతియ్యవిల్తునిగొంగ దొంగవలె పాలారగించి శుష్కపాత్రంబు నాబింబోష్ఠి కిచ్చిపుచ్చిన నామెసంతోషముతో నింటికిఁ బోవుచుండ నా మార్గముననే గ్రామాంతరము నుండి వచ్చుచున్న తల్లిదండ్రులాబిడ్డగని యెక్కడినుండివచ్చుచుంటివని

డొక్కడతాఁగనే రాకాసీ. నిన్నుఁ బొట్టఁబెద్దలగునటుల నొక్కతాపు దన్ని యమలోకమున కంపెదఁజాగుము నీవుకూఁతురవా. కాదు. నాదేవుని కలు పూర్చినపాతకవు ఇక నిన్నుంచఁగూడదు" అని డొక్కపైఁదన్న యత్నించునంతలో నావంతిగమన యాశ్వగమనమై యొక్కపోటున "శంభో! శరణు శరణు శరణు నాస్యథాభవితం మయాదుష్కృతం త్వమేవ శరణమమ" అనిపెద్దగొంతుతో నేడ్చుచు లింగమూర్తిపైఁబడెను అపాటుతో లింగము భిన్నమై రెండుపాయలు కాఁగా నామశువ నూలోనికిం బోవుచుండెను. "బిడ్డా! నీకుభయము లేదు నాలోనీవు వచ్చి కాలమునాయుండుదువు." అనిభగవద్వాక్యము వినఁబడెను. అప్పుడాభక్తురాలు తనపసియాభక్తిని దెలుసుకొనఁ జాలక "బిడ్డా! పోతివా" యని పట్టుకొనఁబోవునంతలో నంతయు లోనికిఁ బోయి దానితలవెండ్రుకలు మాత్రమాశివదేవుని చేతిలోఁ జిక్కెను అంతలో లింగాకారముట్టిపడిపోయెను దానిపై నామొకలవెండ్రుకలు మాత్రము తలంటిపెట్టినవిడిచి వ్రేలుచుండెను ఇట్లు భగవంతుఁడా ముగ్ధభక్తురాలిపైఁ దినలోనైశ్యముసేసి కొనెను ఆ లింగమూర్తి హృదయమున వ్రేలుచుండిన వెండ్రుకలు ఆఱు నెలలకొకసారి మొలచుచుండుటచే గత్తిరించుచుండును. యిప్పటికి నాయాలయంబున నాశివలింగముపై వెండ్రుకలు కనఁబడును. ఆఱు నెలలు కాఁగానె మొదిగినంతమట్టు కత్తిరించి వేతురు ఆశివదేవుఁడును భక్తునికూఁతురువంటి భక్తులు ముజ్జగంబులంగలరే ముగ్ధభక్తికిని గాఢభక్తికిని భగవంతుఁడు ప్రసన్నుఁడైనటుల మఱియేభక్తికిని బ్రసన్నుఁడుకాఁడు. ఆగాఢమూఢయను నాచిన్నదాని మూఢభక్తికిఁ బ్రత్యక్షప్రమాణ మిప్పటికి నా లింగమూర్తియే. ఈకథఁ జదివిన వినినవారికి సకలసుఖంబులు నీశ్వరకరుణచేఁగలుఁగును.

### దీపకదళియారుకథ

కంచియను పట్టణమున నొకశివభక్తుఁడు దీపకదళియారను నామంబున వాసంబుసేయుచుండెను ఆతఁడొకనాఁడు వేఱే యొకవ్యాపకముపైని గ్రామాంతరము బోవుచు మార్గమధ్యమున నొక యడవిప్రదేశమున నొకపాడుపడిన శివాలయముంగాంచి యిట్లు చింతించెను " ఆహా! ఏమియీవింత శివుఁడీయరణ్యమున నున్నవాఁడు. శత్రులవలన నేమికీడుమూడునో గదా, ఈతనికెప్పుడును పెద్దవారితోనైగము త్రిపురములం గూల్చెను మఱియుఁ బెక్కురక్కసుల నుక్కడంచెను తాను దయాళువని లోకప్రసిద్ధికదా ఇట్టివారలఁజంప వారివారితో తనకేల విరోధముఁగొని తెచ్చుకోనవలెను. తనదయాళుత్వము దేవతలకు మేలును రాక్షసులకుఁ గీడును గలుగఁజేయుచున్నది రాక్షసులో బలవంతులు వారి విరోధముగూడదు ఇట్టివిరోధులుగల యీతఁడు కారుచిచ్చిట్లు గ్రమ్మిని మహారణ్యమున నుండవచ్చునా? ఇతనికి గుడిమండలము లేదు చుట్టును ప్రాకారము లేదు. తలుపులు ద్వారబంధములు లేవు సోమసూత్రము గానరాదు పార్వతియుండు చోటు గానరాదు ఇంత కట్టుదిట్టములేని యీయాలయమునఁ బూజానమస్కారముల యిట్లుంచుకొనుటకుఁ దనకేమి భయమువచ్చినది కానిమ్ము. ఇక్కడ నొకపెద్ద గోపురములతోడను చుట్టుప్రాకారములతోడను గట్టిపట్టువట్టి నేనొక పెద్దగుడి నిర్మించెదను "అని తిరిగి గ్రామమునకుఁ బోయి తన యాస్తి నంతయునమ్మి యా ధనంబుగొనివచ్చి యచ్చట నొకగొప్ప ప్రాకారముగట్టించి దానినడుమనొక పెద్దయాలయమును గోపురద్వారబంధ కవాటగవాక్షములతోడను చిత్రంబులగు బొమ్మలతోడను నిర్మించి యాలయంబునకుఁ గ్రమముగ సోమసూత్రము త్రవ్వించి పార్వతీదేవి యాలయము వేఱఁగట్టించి యర్చకుల నిర్ణయించి వారలచే యథాకాలయథావిధిపూజలు

నిత్యంబు నత్యంతవిభవంబుతో నీశ్వరునకు నీశ్వరికిఁ బ్రతిపూజలు
జరుగు నేర్పాట్లు సేయించి యంగళ్లు పెట్టించి యిండ్లుగట్టించి యందు సం
సారులనుదించి వారలకు భోజనసత్త్రముల నేర్పఱిచి స్వామినిత్యసేవకుఁ జా
కళ్లు నుంగళ్లు వేశ్యలు కులాలుఁడు స్వస్తివాచకులు మొదలగు సేవకార్ల
నియమించి తానుఘనకర్తయై రాగభోగాదులు క్రమముగా నెరవేర్చు
చుండెను. ఇట్లు పరమభక్తిందాలయుండగు నద్దీపకళియారు భగవంతుని
సేవచేయుచుండఁగా గొన్నిసంవత్సరములు పూర్తిగాఁ బూజజరుగుచుం
డెఁ బిమ్మట క్రమక్రమముగా మానసవృత్తులను సకాలమున నీయ
లేకపోయినందున వారలుకూడ మానుకొనిరి ఆభక్తుఁడు నున్నంతవఱకు
గ్రామస్థులచేఁ బూజగావించుచుండెను కొన్నాళ్లకువారును మాను
కొని యూరువిడిచిపోఁగా భక్తుఁడు తానే పూజయొనర్చుచుండెను.
పూజాద్రవ్యంబు లేవియున్నను నేవిలేకపోయినను దీపపుసేవమాత్రము
తప్పవలేసని రాత్రింబవళ్లు ప్రాంతమై నయ్యుండశ్యాని వెలుఁగున
ట్లుల సేయుచుండెను. ఇటులనుఁ గొన్నాళ్లకు దీపమునకుఁ జమురును
దుర్ఘటమయ్యెను. అప్పుడు భక్తుఁడు చుట్టుపట్లనున్న చెట్లుకొట్టితెచ్చి
కాల్చుచు దీపపుకాంతిఁ గలుఁగఁజేయుచుండెను అంతనాచెట్లును సం
పూర్ణములయ్యెను తాఁగట్టించిన యిండ్లయొక్క పైకప్పును, దూలము
లు వాసములు కలపులు ద్వారబంధములు కాల్చి వెలుం
గుఁ గలుఁగఁజేయుచుండెను అవియును జెల్లిపోయెను. తుదకాభక్తుఁ
డు దానుమాత్రము మిగిలి మఱి యేద్రవ్యమును లేకయుండెను.
స్వామియాలయమునకు దీపము లేదయ్యెను. అప్పుడా భక్తునికి మఱి
యేయుపాయమునుఁ దోఁచక తనతలవెండ్రుకలు మూఁదికిని కుచఁగట్టి యా
కొనల ననలంబుఁ దగిల్చి రగిల్చి వెలిఁగించి యదియే దీపంబుగా నాలయ
మునుచుట్టును దిరుఁగుచుండెను వెండ్రుకలు గాలితలలోని మెదడంటుకొ
ని కాలుచుండి వెలుఁగుచున్నను వానికిఁ జైతన్యములేక యట్లనే తిరుఁగు

చుండెను. అప్పుడు భగవంతుఁడు తన ప్రమథగణంబులతోఁడను వామాంగోత్తమాంగ విరాజమాన గౌరీగంగలతోఁడను బాలచంద్ర శిరోభూషణములతోఁడను నాగయజ్ఞోపవీత నాగచర్మనాగాభరణంబులతోఁడను ప్రత్యక్షమై "నీభక్తికి మెచ్చితి వరము వేఁడుము" మనన్ ఆ భక్తాగ్రేసరుఁడు "నాకేవరమును అక్కఱలేదు మనమీ యరణ్యంబున నుండవద్దు పద పోదము నా గుడితోఁ గైలాసంబునకు" అని విన్నవించెను. అదివిని యినశశిహుతాశననేత్రుఁ డాయాలయముతోఁడ నాతనిఁ గైలాసంబునకుఁ గొంపోయెను. ఇట్టి చిత్రంబులుగలవె గుడితోను కట్టెతోను కైలాసంబునకేగిన యీ యేకదళియాను కథఁ జదివినను విన్నను మిన్నువాక వాల్ప నల్పంబులగు నాయురారోగ్యంబులిచ్చి ధనకనకవస్తు వాహన సమృద్ధులొసగి రక్షించును

## నాట్యసముత్తాండికథ

కంచిలోఁ గాపురమున్న నాట్యసముత్తాండి యనువొక భక్తుఁడు ఒకనాఁడు శివాలయంబునకేగి యందు తాండవలింగమూర్తి దర్శనముసేసి యామూర్తి వీక్షించి పైకెత్తఁబడెడు కాలొకటియు నేల మోసిన కాలొకటియు వంగిన నడుము సిగ్రమంబగు వికృతాకారమును జూచి యాగుడిపూజారితో నాముకవబత్తుఁ డిట్లనియె. "ఓయీ! నంబీ దేవుని యాకారమిట్లేల వికృతముగానున్నది చూడుమదిగో! ఒకపాదము నేలనుమోపియు మోయనట్లున్నది - మఱియొకపాదము నిగికెత్తబడి యామిన్ను వెన్నుదన్నియున్నది. నడుమువంగి యసియాడుచున్నది శరీరమంతయు నొకదిక్కునకు నొరిగియున్నది చేతులు కదలుచున్నవి పిడికిట నేమియో పట్టినట్లున్నవి అవి యాచేతులుగదలుట నొకవిధమైన ధ్వనిఁ గలిగించుచున్నది కన్నులు మూయఁబడియున్నవి భూషణములు సడలియున్నవి. మెడలోనిహారములు చిక్కువడియున్నవి కేశపాశము విడియున్నది ప్రక్కలోని పార్వతి గానరాదు ఒకప్రక్క దగ్గఱఁ గూ

ర్చుండి సూచుచున్నట్లున్నది ఇదియంతయుఁ గన నాకు భయమొదవుచున్నది ముక్కంటి యొంటికొక యిక్కట్టువాటిల్లదుగదా నిజము సెప్పుము" అని మఱిమఱియు నడుగు భక్తుని యమాయకత్వమును గని యాయచ్చకుఁడు వాని వంచింపఁదలంచి "భక్తవరుఁడా! నీకేమి సెప్పుదు. ఇప్పరమేశ్వరుని కిది యొకమహావాతరోగము గన్పించినది నేనును నీవలె నిదిగని యాశ్చర్యపడుచుంటిని. తగినమందు పడకపోయిన నదిప్రమాదించు" నని యనునంతలో నాభక్తుఁడు సతగునఁ బరుగెత్తి యింటికిఁ బోయి తనకున్న యావదాస్తియుఁ దెగనమ్మి ధనమువట్టుకొనివచ్చి యానంబిచేతికిచ్చి వైళంబమందు సేసి యిమ్మనియడిగెను. "మఱియు నీరోగమెంతవేగముగా నివారణచేయుదు వంతవేగము నేనును నాదారయు బానిసలును నీదాస్యము సలుపుచుందుము ఈభగవంతుఁడే సాక్షి" యని బహుదీనముగా వేడుకొనెను. అంత నాటక్కరిపూజారి యొకపొయ్యిపెట్టి యందొకకాఁగు నిడి గోతెనూనెపుఁ గొంతయాముదమును బోసి యాముదపాకులు, జిల్లేడాకులు, మొదలగు కొన్నియాకులపసరుకోసి పిండిమఱిగించి పొంగినదించి వడియఁగట్టి "ఇదియొక తైలము దీని పేరు మహానారాయణతైలము. దీనికిదియె మందు నీవు ప్రతిదినము దేవుని దేహమునకు నిదె మర్దనాసేయుచుండుము రోగముకుదురు" నని చెప్పి యిచ్చెను. ఆభక్తుఁడు నిదేక్రమమున నిత్యము నాతైలము మృత్యుంజయునొడలికి మర్దించి కొన్నాళ్లు కాచమురు ముగిసినను లేశమైన గుణము లేకుండుటచే తాను మఱికొంత తైలము వండి యాయాకుల రసముతోఁ గలిపి స్వామిశరీరమునకుఁ బూయుచు నిసుపాట్లములతోఁడను వేడిసేటియావిరిఁ బట్టిన బట్టచెంగుతోఁ డనుఁ గాచుచు రవంతయైనఁ గుదురకుండుటచే విసిగి "ఇంక నీరోగము మానదు ఇట్టివాతములకు మహామారియె తగిన మందు మహామారియనఁగా సలసలమఱిగెడు నూనెసెలఁటిలో నుడికిన సర్వావయవోపేతమానవదేహపు మాంసపు

ముద్దఁగదా. నేను యుట్టిమంమగాకున్న నీరోగనివర్తిగాదు కనుక నివృ్వాడేయుట్లయ్యెద" నని క్రాగెడునూనెలో దుముకనుంకించు నాతనికి నిజపరివారసమేతుండైన చంద్రచూడుండు ప్రత్యక్షుండై "వత్సా! నీభక్తికిమెచ్చితి, కోరినవరములనిచ్చెద నడుగు" మనభక్తుఁడు "దురాదర్శా నావరములమాటలేమి, నీయొడలికీతగనిరోగంబెట్లుసంప్రాప్తించె. ఇది యెట్లుమానును? ఈ తెవులుమాన్పుకొని నీయనామయదేహమున్నాకుఁజూపు" మని యడిగెను. మనుసికదయ్యాండాయయ్యనొయ్యనఁజేరఁదీసి "నాయనా! నాముగ్ధభక్తుఁడా! యిదిరోగముగాదు. నేను మహానటుండను. నాట్యముసేయఁ దలకొంటినేని నాయాకారమిట్లుండును. నేను జగన్నాటకసూత్రధారుఁడను. భూమియేనానాట్యరంగము. ఆకసంబునల్లయు. ఈచోట రెండుపాదములుంచి నటింతును. లోకంబులును, లోకేశులును, లోకస్థులును, ననినపిదప నలోకంబగు నీవిశ్వంబున నేతాండవమాడునపుడు నేనొకఁడనేయుందును. అప్పుడనాయర్ధాంగమందున్న యుంగన నాతాండవమునకు సాక్షియై యాటించుచుండును. దానంజేసియే యామెకు మహేశ్వరమహాకల్ప మహాతాండవసాక్షిణి" యనునామాంతరంబు వ్రుదవెను. ఇదిగాకనాకాదిలోకపాలకులును, లోకస్థులును, సమస్తభూతగణప్రపంచంబును, మార్కండేయాది మహామునులును ప్రహ్లాదనారదవసురుద్రాదిత్య ప్రముఖబృహ్మన్ముఖపురస్కృత బ్రహ్మ విష్ణువులకుఁ గనులపండువులగా నొకానొకప్పుడు తాండవమాడుచుందును. ఏనెప్పుడునాట్యముసేసినను పార్వతినాప్రక్కనే గూర్చుండ చూచుచుండును. ఈతాండవవేషమేగాని రోగములేదు. ఈనాతాండవరూపమును దర్శించినవారికి మఱిజన్మలేదు. కానన నీవునాతోఁగూడఁగైలాసంబున కరుదెంచి మఱిభూమియందు జన్మించక దేవత్వముచుబొందిన యీతనువుతోఁడనే నాసన్నిధినుండు' మని యూతని దనతోఁగొంచునేగెను. కాఁబట్టియట్టిభక్తుండగు నీనాట్యన

మత్రాండికథ వినువారును, జదువువారును భూలోకంబున ననేకాబ్దంబులాయురారోగ్యైశ్వర్య సంపన్నులై సమస్తసుఖంబు లనుభవించి తుదకుముక్తిభాజనంబగు కైలాసంబున శాశ్వతముగానుందురు.

## కాళహస్తికన్నప్పకథ

దక్షిణకైలాసంబనఁ బ్రశస్తికెక్కిన కాళహస్తియను పురప్రావరణంబున నొక్కింతదూరమున నుడమూరను పేరనొకబోయపల్లె కలదు. అందుకన్నప్పయను నొకబోయనాయకుఁడు శివభక్తిపయఃపయోధినిర్మగ్నమానుండగుచు శివపరతంత్రవృత్తినుండును. అతండొకనాఁడు వేటకై తనబోయలు కొందఱు వెంటరా నరణ్యంబునకు నాఖేటంబున కరిఁగియలసి యందునొక శీతలచ్ఛాయాసమావృతంబగు నొక భూరుహంబుపొంతఁ బరుండికించిన్మీలితనయనుండై నిద్రించుచుండెను. అప్పుడుగంగాధరమూర్తి యాతనియింగితంబెఱింగి తనసేవాకైంకర్యంబతనికొడఁగూర్ప నుద్దేశించిస్వప్నసాక్షాత్కారంబున నతనితో "ఈమార్గంబునఁ గొంతదూరం బేఁగితివేని నీకుదివ్యాంగంబగు నొకలింగంబు దృగ్గోచరంబగు నదియనీప్రాణలింగమనుమీ. ఏమఱక దానికిసభక్తిసేవాకైంకర్యంబు సేయుచుండుము. దాననీకు మేలుగలుగు" నని యానతిచ్చి తానంతర్ధానంబునొందె. అట్టిస్వప్నంబుగని యాకన్నప్పయదిరిపడిలేచి, యున్నట్టుండి నలుదిక్కులంగలయంగనుఁగొన నొక తూర్పుదిక్కునఁ గాలిత్రోవని, యామార్గంబునఁ గొంతదవ్వేగునంత లోనపూర్వలింగాకారం బటఁగాంచి "భళీ! నాకలయెంతనిక్కువంబు. ఈదివ్యలింగంబట నాకొఱకే వెలసెఁ గనుఁగొంటిని. ధన్యుఁడనైతిని. వాయుమార్తికంబును ఫాలలోచనంబునుం గలయీశునిచటఁగంటి. ఈ తఁడెనాప్రాణలింగ" మనిసాష్టాంగదండమిడి ప్రదక్షిణముసేసి చేతులు జోడించి మఱిమఱిమ్రొక్కి నాభాగ్యవశంబున నీశుండట నాకుఁ బ్రత్యక్షంబయ్యె. నాకలనిజమయ్యె. ఈయీశ్వరునిచట విడిచి నేఁబోఁద

గను. ఈతనిబుజ్జగించి యొడంబఱిచి నాగ్రామంబునకుం గొంపోయి పాకఁగట్టి యందు బ్రతిష్ఠించి పూజించుచుండెద'’నని నిశ్చయించి మఱల నద్దేవునకు పునస్సాష్టాంగంబుగావించి కైమోడ్చి సభక్తికంబుగా గద్గదస్వరంబున నిట్లువిన్నవించెఁ—“నాతండ్రీ, నాదేవా, నాయీశా నాప్రాణలింగమా, నీవిచట నొంటినుండుటకుఁ గతంబేమి? ఎవరిపైఁ గోపమున నిచటకేఁగుదెంచితివి? నాఁడుదక్షాధ్వరంబున నిజయోగాగ్ని ని దగ్ధయైనసతికొఱకు హిమవత్పర్వతంబున నగ్నరయొక్కండవు మెండవ్రతపంబొనరించి పార్వతీసమాగంబునొందితివి వామభాగమున నామె ను ధరించితివి నేఁడట్లనే నీదేహదక్షిణభాగంబలంకరించుటకు వేఱొక సతిగావలెనా? అట్లయినఁజెప్పుము మాయూరనీకుఁదగిన కిరాతాంగన యొండుగలదు దాని నీకుఁగూర్చెదను. దుష్టదనుజులతోఁ బోరాడునపుడు నీయొక్కగిబ్బనిచ్చటకు మోపికొనవచ్చి నేలబడవైచిపాఱిపోయెనా? అట్లయిన నిప్పుడెపరుగెత్తిపోయి దానింబట్టితెచ్చెదను లేకశత్రువులెవ్వరైన తరుముకొనివచ్చిరా? అట్లయిన నాయధికవిక్రమంబున నట్టిపగతుని నొక్కకోలను నేలఁగూల్చి నీభయంబుఁదీర్చెదను లేదా భక్తజనగు నన్నుదరిసించుట కిచటఁగాచియుంటివా? అట్లయిన నాతోడరమ్ము మాబోయపల్లె నీకొఱకు మంచియిల్లుగట్టించి యందునీకుభోజనభాజనములకు దగిన వసతులనేర్పఱిచి నిత్యము నేను సేవచేయుచుందును. అసలైన పుట్టతేనెయు మంచివెదురుబియ్యమును గలవు కాయగూరలనేకములు గలవు బహువిధములగు మాంసాహారములు గలవు. లేచిరమ్ము వేగము పోదము” అని యెన్నివిధములఁ బిలిచినను స్వామి మాటలాడక స్థాణువై యూరకుండెను అదిగని కన్నప్ప తనలోనిట్లని వితర్కించె. “నేనెంతబ్రతిమాలినను శూలి మాఱుమాటాడలేదు కారణము తెలియదు. ఏమన చిరకాలమునుండి యీనిర్మానుష్యారణ్యప్రదేశమున నొక్కఁడపడియుండుటచే భోజనములేక శుష్కించి నీరసపడియున్నాఁడు. అం

దువలనఁ బలుకలేకున్నాఁడు కాఁబోలు! కానీ, నేనిచ్చటనే కొంతకాల ముండి యాతనికి భోజనము తృప్తిగాఁ బెట్టి కొంతబలము మనస్థైర్యము గలుగఁజేసి నుఱిపెల్చుకొనిపోదును అని నిశ్చయించి యాచోట చుట్టు ను శుభ్రముసేసి యాహారాన్వేషణములకై యేగుచుండెను ఇటులుం డఁ దొల్లి కొందఱు దైత్యులు శివునిఁ గూర్చి యుగ్రతపంబొనర్చిరి వార లకు నాథ్యాంతిప్రత్యక్షమై “వరముఁ గోరుఁడిచ్చెద మీకువలసిన బ్రహ్మవిష్ణ్వాది పదవులనైన నిచ్చెద” ననియెను. అందుకారాక్షసులు “దేవా! మాకా యాపదవులేల? బ్రహ్మాదులు మారాక్షసులకు లొం గినవారై మాబాధలుపడలేక మమ్ము నిగ్రహించుటకు నిన్నుఁ బ్రా ర్థించుచుందురుగదా! వారలకజేయులైనట్టి మాయంధక, గజ, త్రిపుర తారకాద్యసురుల నీవనిర్జించితివి వారు నీచే హతులై నీనామాహ్యమును బొంది నీసన్నిధినుండిరి గాని నీతోనైక్యము గాలేకపోయిరి మేము పునర్జన్మ లేక నీయుదరంబున నుండఁగోరి మాదేహముల నీకాహారము గా నొసంగవచ్చితిమి మమ్మునెనవి మాకు నీగర్భగోళములో శాశ్వతా వాసము నిమ్ము అందుండిమేము జన్మరాహిత్యులమై సుఖించెద” మనిరి అందు కాయంధకాసురభంజనుఁడు “ఓదనుజులారా! మీరు కోరిన కోరికబహుదుర్ఘటమైనది అయినను తప్పక దీర్చెదను. మీరు శ్రీకాళ హస్తిపుర సమీపారణ్యమున మృగరూపమునజన్మించి యెవరికింటం బడక సంచరించుచుండుఁడు కలియుగాదిని నామహాభక్తుఁడు బోయ వాఁడొకఁడు మృగాన్వేషణార్థై వచ్చును అప్పుడువానికి మీరగుపడు దురు మిమ్మువాఁడు చంపిమీదేహములను నాకుపండిపెట్టును అవి నే నారగించి మీకుమోక్షం బొసంగెద”నని చెప్పియంతర్హితుండయ్యె అదితిసుతులు వెంటనేవచ్చి యాయరణ్యంబున మృగరూపంబున నున్న వారు. కన్నప్పకు దృగ్గోచరులుకాగానే యామృగయుల వేఁటాడివాని మాంసంబులు రుచిపుట్టినట్లు వుల్లలగుచ్చి కాల్చిప్రక్కనున్న సరోవ

రంబున పుక్కిడునీరు నోటఁబట్టుకొని, యెడమచేతం దనకోలలువిల్లును బట్టి కుడిచేతమాంసద్రోణికలు బట్టి తలపైఁ బూలదాల్చి వేవేగవచ్చి యెడమకాలి చెప్పుతో నిర్మాల్యముఁదీసి పుక్కిటినీళ్లతో మార్జనము చేసి తలపై బువ్వులతోఁబూజనలిపి కుడిచేతినంజుళ్లు భోజనముపెట్టి యిట్లు దినదినమునఁ దప్పక సేయుచుండెను లింగదేవుఁడును బ్రత్యక్షము గా నారగించుచుండెను. ఇట్లుండఁగా మహారణ్యమగుటచే నిత్యపూజ యొనర్పలేక యొకమిూగి యేఁటను నెలలకొకసారి గడుయత్నమున నచ టకుఁ జని దేవునికిఁబూజానమస్కారంబులు గావించిమఱల వచ్చుటకుఁ బోయిన వాఁడొకనాఁడు దనమామూలుపూజ సేయుటకు వచ్చిచూచి యీస్థలమంతయు నపవిత్రమైనదని శుద్ధిసేసియథోపచారాపచారముల తోఁ బూజించి రహస్యముగా నటనేగాచియుండెను ఇంతట గన్నప్ప తన పూజాద్రవ్యంబులు దెచ్చి పూజించువిధానముంగని యమ్మహాయోగీ మహాత్ముఁడు దేవునెంగిలిసేసెను వీఁడుతన పాదమున నిర్మాల్యవిస ర్జనంబుసేయుట, యెంగిలినీటమార్జనంబుసేయుట, మాంసమునివేదిం చుట మొదలగు నీకార్యములెల్ల స్వామియెట్లుసహించె వీనినెట్లయిన నంతంబునొందింపవలెను నేనువీనితోనిగ్రహించరాదు. తొంటియేనుం గును సాలెపురువుసంపిన టులనేఁ జేయవలెను. ఒకయరణ్యముననొక తంతువాయంబు భూరుహంబుపొంత వెలసియున్న యొకలింగమూర్తికిఁ దనతంతువులచే వృక్షశాఖలందిలయు నల్లియొక యాయాకారముగా నిర్మించి దానికిఁ బ్రాకారగోపురద్వారగవాక్షాదు లొనరించి యాగుడి యందు దేవునికిఁ దానుకుసుమంబులుదెచ్చి పూజించుచుండెను ఒక నాఁడొకద్విపి యాయూర్ణనాభం బొనర్చినయాపనిగని యెవరిట్లు స్వా మియగుపడకుండ మూసిపెట్టిరని తనతుండంబుననాపట్టెల్ల తెగఁద్రోసి తుండంబునఁ దెచ్చిననీళ్ళతో మార్జనంబొనర్చి శిరంబునఁదెచ్చిన పచ్చనిపూవులతోఁ బూజించెను ఇంతలోసుమంబులు దేఁబోయిన

సాలెపురువు ద్విరదచేష్టితంబునుఁగని తనయంతరము వానియంతరము పరస్పరతారతమ్యము నెఱయక సాహసించి యాకరితుండంబు వెంబడి శిరంబున కెగఁబ్రాకి లోలోనలిచిఁ దొామ స్త్రిష్కముమూయుచేసి దాని తోనాయిభంబును జావునటులఁజేసి నంపి తనకోపధముఁ దీర్చుకొన లేదా. నేనును నట్లే పేరింగపటోపాయంబునఁ బరిమార్చెద''నని మఱి మఱిఁజూచుచుండ నాఖండవరశుండు వాఁడు దెచ్చిన మాంసము నార గించి యొకకంట నీరుగార్చుచుండెను. ఆనీరుగారుట కనప్ప గాంచి "అయ్యా, నాదేవుని కంటికిరోగము వచ్చినది. దీనినేనెట్లు మాన్పుదును ఇది యేమిరోగమో పోల్చువారెవరు మందిచ్చువారెవ రు. తెచ్చువారెవరు." ఇట్లని యనేకవిధంబుల నాలోచించి "యిన్ని పాట్లుపడుటకన్న నాకుడికన్ను నవలీలఁబెఱికి స్వామి కంటిమీఁద నతికి యానీరుగారుట మాన్పెద'' నని యట్లనేచేసెను వెంటనేకన్ను నీరుగా రుట మానివేసెను. అప్పుడకన్నప్ప రెండవకంటి కెన్నడైన నిట్టిరోగ ము వచ్చునేమో అట్లురాకుండ నిప్పుడె నాయెడమ కన్నుకంటికి ముందు గా నతికివేతునని కన్నుఁ బెఱుకఁబోవునంతలో నంతకాంతకుండు పాద మూపి యాకన్నప్ప మొదటఁ దనకిచ్చిన కన్నుతనికి మఱలనిచ్చి "నీభక్తి కి మెచ్చితిని. నీవువేఱుగ నాకియ్యవలెనా? నాకన్నులేనీకన్నులు. నీక న్నులేనాకన్నులు. నేనేనీవు. నీవేనేను." ఇట్లని సంభాషించుకొనుస మయంబున తొంటియోగి యదిగని తానున్న స్థలమునుండి పాయలుపడి కన్నప్పకు సాష్టాంగదండంబులు మొక్కి "నీయెడ నేఁజేసిన యపరాధంబు నకు నన్నుక్షమింపుము. భక్తుఁడవన నీవేభక్తుఁడవు. శివైక్యంబన్న నీదే. నీవంటి శివైక్యపరతంత్రులు మఱిలేరు మూఢభక్తుఁడవు నిన్నుఁ బూ జించినఁజాలును. శివునివేఱుఁ బూజింపఁబనిలేదు." అని బహుసంగుల నాతనిఁ గీర్తించుచుండఁ జూచుచున్న తల్లి భవానీదేవియు నక్కడ చి క్కటిపి నిలుచున్న భక్తులగు ప్రమథగణంబులు నతికుతూహలులగు

చుండిరి అంతలోఁ గన్నప్పది దిక్కు ముక్కంటియు పన్నగభూషణుని దిక్కుఁ గన్నప్పయుఁ బరస్పరాలోకంబులు సేసుకొనుచుండ వారిదృష్టు లన్యోన్యంబు నేకీభావంబులగుట నెల్లఱుంగాంచి మించినభక్తియో గంబునఁ దదేకదృష్టులై వారి దెసఁ బఱఁగించుచుండిరి అప్పుడప్పరమే శ్వరుండు గన్నప్పను గాఢాలింగన పరితుష్టునిఁ జేసి "నీకుఁబురుషార్థంబు లు నాలుగునిచ్చెద ఇంద్రాదిదేవపదవులనైనఁ గోరిననిచ్చెదఁ గోరు" మనననమ్ముగ్ధభక్తుండమ్మృడునితో "దేవా! నాకు మోక్షమన్ననేమి యో దెలియదు పురుషార్థంబుల తెలివి మొదలేనున్న ఇంద్రాదిపదవు లేల? నాకుఁ గావలసినదొక్కటియె అదియేదన నీదృష్టిసర్వదా నాప యిం బ్రసరించుచుండవలె నాదృష్టియెల్లవేళల నీయంఘ్రులయందనిలిచి యుండవలెను మనమిద్దఱముఁ బరస్పరాలోకనే హాదన్యోన్యదృగ్జాలుర మైయుండవలయు నింతియనాకోరిక" అని యూరకున్న కన్నప్పను గ రుణార్ద్రచిత్తుండై గాంచి తనయెదుటనుంచుకొని యొకరినొకరు సర్వదా నిరీక్షించుకొనుచుందురు నేఁటికినిఁ గాళహస్తిలో నీశ్వరసాన్నిధ్యంబు నఁ గన్నప్ప విగ్రహంబునుగలదు ఆకన్నప్ప పుక్కిటినీరే దేవునికిమా ర్జనము సేయుచుందురు ఆకన్నప్పను ముందుబూజించి యాశేషించిన పుష్పాదిద్రవ్యంబుల శివునిఁ బూజించెదరు శివునికిఁ గన్నప్పనము సేసి నవాఁడగుటచేఁ గన్నప్పయను పేరనాభక్తుఁడు ప్రసిద్ధికెక్కెను ఈకన్న ప్పకథ జదివినను, విన్నను, వ్రాసినను సద్యోముక్తి కలుఁగును వింటిరా భక్తవరులారా! భగవంతునికి భక్తులయందున్న గౌరవము తనభక్తుని కగ్రపూజయిచ్చి యాతనిశేషంబును దాఁ గొనుచున్నవాఁడు ఇట్టిముగ్ధ భక్తులనెందఱినో యీశ్వరుఁడు కాపాడుచుండుట వినుచుంటిమిగదా వారలచరిత్రంబులీతీరున నేమనము ప్రసంగించుకొనుచుండుటలో లోక వ్యాప్తంబులైనవి" అని చెన్నబసవన్న యడిగినప్రశ్నకై నతండు విను చుండ భక్తులకు బసవేశ్వరులు మూఢభక్తులకథలు వినిపించి మఱియు

నాభక్తులను సంబోధించి మున్ను కళియంబనాయనారను భక్తుఁడు సర్వదా యిట్టిమాహాభక్తులకథలు సెప్పుచు మీవంటిభక్తులను దనుపుచుండెడివాఁడని మనము వినలేదా? అట్లనే నేఁడు నేను మీచెవులకింపుసొంపొదవెడికథలవినిపించి మీసేవ సేయఁగలిగితి నింతకన్న నాజన్మంబునకు వేఱసార్థకతయున్నదె" యనుచు వారలగోష్ఠినిఁ గొలువుదీర్చియుండెను

## సకలేశ్వరమాదిరాజు కథ

భూదేవి కంఠహారమున నాయికామణియనందగి నంబెయనునొకపురంబున కధీశుండై పురమర్దనునిభక్తుండొకండు సకలేశ్వరమాదిరాజను భూనాయకుం డఖండాయవృత్తినిఁ బ్రజాపాలనంబు సేయుచుండెను అతండు సకలసుగుణనికరప్రపూరితుండును, శమాదిషట్కసంపన్నుండును, శరీరావష్టాంగయోగసిద్ధుండును, నమలినచిత్తుండును, బ్రవిమలవృత్తియు నజరిత్రప్రతాపానందిత సూర్య్యచంద్రులుండును బాహితాఖండలప్రతి శత్రుశిరస్సంఘటలుండును త్యాగభోగ భోగ్యసకలవస్తుసంపత్తిప్రపూరితాఖిలుండును, సంగీతసాహిత్యావాగ్వైభవ సమగ్రుండును దానదీనావన పరిజనప్రజాపాలనానుగ్రుండును, వీణాగానవాయిద్యనిపుణుండును, వేదవేదాంగపారగుండును, శ్రితకల్పభూరుహుండు నగుచు నవనినేలుచుండును. ఇట్లుండ నొకానొక కాలంబున కాతనికి జంగమలింగానుభవ ప్రాప్తిగలిగి ప్రతిదినము గడియగడియకు వితరచింతలుమాని, రాజ్యభారంబు మంత్రిపై నిడి లింగపూజ సేయుచుండును పూజాసమయమున దినేకవిధంబులగు ననేకచిత్రవిచిత్ర రూపంబులదండంబుమీఁదె డు ననేకాహ్వయంబులగు వీణెలననేకరాగంబులను మేళగించి వాయుచు శంబున నాయారాగంబుల నాయావిపంచులు పలుకుచు నునటుల నేర్చు జచియుంచును శంకరాభరణము మున్నగు శివప్రీతికరంబులగు రాగంబులు పలుకఁజాలు సమయంబుల నాయుమాధవుఁ డావీణియం నన్నె

సమర్చుకొని తా ననేకరాగంబులం బాడుచుండ నయ్యండజయాన యగు
జలిగొండతేలి కూర్మికూఁతురు నాదంబునకుఁ దగులయ్యె శ్రుతుల నతుల
వినోదంబునఁ బరిగొల్పుచుండును. అదిగని ప్రమథులు నితాంతప్రమో
దవంతురితస్వాంతులగుచుఁ జూచుచుందురు ఇట్లత్యంత భక్తిసమంచి
తుండగు నయ్యత్యుత్తమ భక్తుండు కాత్యాయనీ భర్తృపూజాతత్ప
రుండై యొకానొకనాఁడు శివభక్తులెల్లరుం గలసిమెలసి సుఖగోష్ఠినుం
డ మాదరసువినుచుండ శ్రీశైలంబున మల్లరసు లేక మల్లికార్జున నామ
కభక్తుండొకండు రాజ్యంబువిడనాడి భక్తియోగంబున జ్ఞానయోగ బు
నొండొంట నేకభావంబులుగొన దేవత్వంబునొంది శ్రీశైలమల్లికార్జు
నుండనఁ దానె యాపర్వతాధిష్ఠాన దేవుండై యున్నవాఁడని విని యాత
ని దర్శింపఁగుతూహలుండై తనరాజ్యంబువిడిచి యతిప్రయత్నకృతప్ర
యాణంబుల నాశ్రీశైలంబునకుఁ జని యందలి విశేషంబులం గనుచు
పోవుచుండెను ఆపర్వతరాజంబున సమస్తంబును లింగమయంబె చెట్లు
నదులు గండశిలలు గుహలు మృగములు పక్షులు సరీసృపములు లోన
గు సమస్తస్థావర జంగమ పదార్థంబులన్నియు నాతనికిఁ గేవల లింగాకా
రంబులవలె గనుపట్టుచుండెడివి ఇట్టివిశేషంబులఁ గనుచుఁ బాతాళగం
గలో మునింగి ముక్తిగుండంబునఁ గ్రుంకువిడి మూలవిరాళ్లింగ దర్శనం
బుగావించి యింకమల్లిఖర్జున లేక మల్లర్సు ప్రత్యక్షలింగమూర్తి దర్శ
నంబున కాతని నన్వేషించుచుఁ బోవంబోవ మార్గమధ్యంబున నొక
చోట నతనిదృఢభక్తి నరయఁగోరి మల్లరసు తనయోగప్రభావంబున
విశ్వరూపంబుదాల్చి త్రోవనరికట్టి యడ్డంబుగా నితనికేగుటకు దారిలే
కుండఁ బండియుండెను మాదిరాజు చనిచని యావిశ్వరూపునిఁ గాంచి
యివికాళ్ళుసేతు లివితలయను సంగవిచక్షణలేక పడియున్న యీరూపం
బేమి ఇదియొక కొండయో, బండయో, భూతమో, మృగమో, నదీప్రవ
హామో, సత్వత్రధాత్రీరుహమో, నిరూపింప శక్యంబుగాకున్నది.

వినను దీనితల యెక్కడనున్నదో సూతమని చని మూఁడుసంవత్సరము లేకప్రియాణంబుగా నరిగినను దలగానరాలేదు మఱలివచ్చి కాళ్లు దెస గనుఁగొంపమని యాదిక్కున నెనిమిదిసంవత్సరముల నవరతప్రయాణం బొనర్చినను కాళ్ళుకనఁబడలేదు. అంత యథాస్థలంబునకు మఱలవచ్చి సాష్టాంగదండంబాచరించి చేతులుజోడించి "మహానుభావా! నీమహాత్మ్యం బుఁగనుంగొన నాయింద్రాదులైనం జాలరన నేనెంతవాఁడ. నన్ను గ్రహింపు" మని యనేకవిధంబుల నమ్రుఁడై క్రమవాగ్రసంబాతని చె విసోకంచేయుటయు నానుల్లరుసు ప్రత్యక్షంబై మాదిరాజు నాలింగనం బుసేసికొని నీభక్తికిమెచ్చితి నీవిట శివపూజ సేసికొనుచుండుమని యత నికొక యాశ్రమంబుఁ గల్పించి యీ చెట్టు గొమ్మనీడ బహు దూరప్రసారి నీ విక్కడ నిశ్చల జప సమాధి నిష్ఠనుండుమని చెప్పి యాతనిమరల భూమికిబంపనూహించి, యాతలో కొంతకాలంబునకుఁ దానొకగొల్లని రూపంబుధరించి యేతెంచి యామాదిరోజున్న చెట్టుకొ మ్మనతికిత్తై చెను అంత నామాదిరాజయోగి యా గొల్లవానింగని "యోరోరి మూఢుఁడా, పాపాత్మా, నీకునఱుకుటకు మఱిచెట్టుకొమ్మ లులేకపోయెనో? నాయున్నవృక్షశాఖయే ఖండింపవలెనా? చూడు. నిన్ను నాకోపానలంబున భస్మముసేయ గలనుగాని తపస్వికిఁ గోపము కూడదు" అని తన్ననేక విధంబుల దూషించుచున్న మాది రాజుంగని కపటగోపకుండగు మల్లరును నవ్వుచు ,,నేమయా, యోగిపుంగవా మహాతపశ్శాలి, నీయాగ్రహంబునకు మేఱయేమి? నీవు తపస్వివా? తాపసికిఁ గోపముండవచ్చునను నేను పాపినంటివి లోకులు పాపాత్ములు గాని వారెవ్వరు?' పాపాత్మా పాపస భవ, యను నార్యోక్తి విన లేదా? మనపుట్టువు పాపకూపమునందుండి మన పెఱుఁగుట పాపలోక మున మనమరణము పాపమువందే నాకుఁగొట్టుట కొక చెట్టులేదా యని యడిగితివి నీకు నివసించుటకు మఱియొక్కచెట్టు లేకపోయెనా?

సంసారముత్యజించి మీవంటిసన్యాసులు మఱల నీషణాత్రయాభిలాష వ్రెంపుటఁ గాదే నీవిప్పుడు కోపంబువలంబించుట సర్వసంగపరిత్యాగి యగు యోగికి కాలస్థలవిచక్షణంబు లేలని తినతపంబున కేచటనైనను సరె యెప్పుడైననుసరె" యిట్లని యనేక విధంబుల సోదాహరణంబుగ నాతనిమందలించుచు నిజరూపంబు సూపిన మల్లికార్జునస్వామిని గని మాదిరాజు సిగ్గుజెందిన మొగంబుగలవాడై తిన్నఁ దానిం దించుకొనుచు నపరాధంబు క్షమింపుమని బహుభంగులఁ బ్రార్థించెను. అంత నామల్లయ్య మాదిరాజ గని నిన్నుఁ మఱల భూలోకంబునకుఁ బంప నేఁ జేసిన పన్నుగడగాని, నీ భక్తికి లోటులేదు పరమేశ్వరునానతిని నదికేశ్వరుఁడు భూలోకమున బసవేశ్వరరూపంబునఁ గల్యాణపురంబున బిజ్జలరాజమంత్రియై యవతరించినవాఁడు అతనికి సహాయుండవై శివభక్తియోగంబున నతనితోఁ గూడ వర్తించుచు నీ భూలోకంబున నిఁక నేఁ బదిసంవత్సరములు నుండవలెను ఇప్పుడు నీకారు నూటయేబది సంవత్సరములైనవి. మఱియేబది యబ్దంబులు బసవనమంత్రితో నుంటివేని నామీఁదనిన్ను నాసన్నిధికి రావించుకొనియెదను ఇప్పటికనీకుఁ గావలసినవరంబులు గోరు మిచ్చెద వానిం గైకొని బసవనమంత్రిఁ డనుండుము" అనునంతలో చూచి రాఁడు పునఃపునఃదండనంబులొనరించి "దేవా! నీవు వరంబు లొసంగెదనంటివి ఏమివరంబులు కావలయును? స్త్రీలఁగోరుదునా? అందఱును పరస్త్రీలే అయ్యవందునా అదిమాయ దానిని గుర్తెఱుంగజాలము ఆమాయయువచ్చు నెప్పుడో పోవు నెప్పుడో వచ్చుట నెచ్చటనుండియో పోవుట యెచ్చటికో తెలియదు పోనిమ్మ ఇంద్రపదం గోరుదునా? అదియేమి శాశ్వతము ఇప్పటికెట్టి యింద్రులెందఱైరో? బ్రహ్మత్వమందునా? అదియు నధ్రువము ఇది యెన్నవసృష్టియో ఇంక నెన్నిసృష్టులుగానున్నవో శాశ్వతమైనది యనపాయమైనది శివపద మొక్కటియె అది నేఁ గోరనక్కఱ లేదు.

గాన మహాప్రభో, నాకేవరంబులక్కఱలేదు నీయనుగ్రహంబను వరం
బొక్కటియె చాలును నిన్నుఁ బొడఁగని నీచేను గలావితుఁడనగు నాకు నిత
రవరసముదాయమునందుఁ గోరికయుండునే మందారకుసుమంబు నా
ఘ్రాణించు నిందిందిరమధునకుసుమంబునొందు నే నానాకు నీయంఘ్రిద్వయ
భక్తిదప్ప వేఱువరంబక్కఱలేదు ॥ అనుచు మఱిమఱిభక్తిపరవశత్వం
బున సాష్టాంగంబాచరించుచుతరిగిరుగ బుద్ధితిరిగి కళ్యాణపురంబున బ
సవేశ్వరుల యాస్థానమంటపంబు సమీపంబునఁ బడిలేచిన, నంతకు
ముందొకనాఁడు బసవేశ్వరులు సంగమేశ్వరుం దర్శనంబునకుంబోయి
తెల్లింగాకారమధ్యంబు వెలువడి యీమాదిరాజువంటి యొక వ్యక్తిపై
కివచ్చి తిన్నుంగలసినటులఁ గనిపెట్టియుండెను గనుక నీమాదిరాజును
బసవన చేయూఁతయిచ్చి లేవనెత్తి సాష్టాంగంబెఱిగియును నమోక్తుల
నుపచారంబులుసలిపి తనయుండనుంచుకొని కన్నతండ్రివలె నాతని భా
వించుచు నతిభక్తిగౌరవంబు లాతనిఁ బెనఁ గనపఱచుచు శివార్చనాపర
త్వంబున నిద్దఱు నేకనిష్ఠాగరిష్ఠురగుచు రాచకార్యంబు వేమఱక విధ్యు
క్తంబులుగా నెఱవేర్చుకొనుచు కొన్నిరాజుచే మన్ననలంగొంచుఁ బ్రజ
లచేఁగీర్తింపఁ బడుచు, శివభక్తులచే నాదరింపఁబడుచు మహానైభవం
బున శివమతిస్థాపకుండగుచునుండె అట్టి బసవేశ్వరులయందు వాత్స
ల్యంబున మాదిరాజును గౌరవించి శివునియపర రూపంబన నాతని
యొద్దన సద్వికాల సర్వావస్థలయందుండి యాతని నేక హితోక్తులు
గఱపుచు నతనికిందోడుఁ నీడయైయుండెను మల్లికార్జునస్వామి యా
జ్ఞందాల్చి యాదేవుండానతిచ్చిన కొంగువదొయేఁ బడినయొండ్లు బసవేశ్వరుల
తోఁ గడిపి పిమ్మటవఱల శ్రీశైలంబునకరిఁగి వారియాస్థానంబున వా
రినద్గోష్ఠినుండంగలవాఁడు ఈమాదిరాజుచరిత్ర మింతచిత్రమైనదిగను
కనే యన్నిఁటికన్న నిది మిన్నయైనది కావుననీతని సత్కథసావాధా
నమనస్కులై వినువారెల్లఱు శివసాయుజ్యమును బొందుదురు. చదివి

నవారును, వ్రాసితగ్రంథంబును నిత్యపారాయణంబుగా పూజాపీఠంబు ననుంచుకొని భక్తిశ్రద్ధలతోఁ బూజించువారికిం గలుఁగుఫలము నిక వక్కాణింపశక్యముగాదు. చతుష్షష్ట్యుపచారాంచిత చతుష్షష్టిసమయ సమాచరిత నిశ్చలసద్భక్తిపూర్వక శివపూజాఫలంబు సర్వశః ప్రాప్తం బుగాఁగలదు.

---



# బసవపురాణము.

## నాల్గవయాశ్వాసము

---

### మడివాలు మాచయ్య కథ

ఈభూమండలమున నెప్పరిగెయను నొకచిన్నపల్లెగలదు. అందు మడివాల మాచయ యనునొక శివభక్తుఁడుండెను ఆతండయోనిసంభవుండు కులమున రజకుఁడు. శివభక్తికిమూలకందము జితేంద్రియుఁడు జ్ఞానసంపన్నుఁడు సర్వదా జంగమార్చనాసక్తచిత్తుఁడు వీరశైవుఁడు. న్యాయశీలుఁడు. నిష్ఠురప్రగల్భవాగ్వైముఖుఁడు. భక్తప్రసంగసుముఖుఁడు అరిషడ్వర్గమునగ్గాపరోపె. అపునర్భవాపవర్గమార్గప్రచారి హరభక్తానుసారి, దీనజనోపకారి దుష్టజనాపకారి భక్తివిస్తారమూరి దురాచారదూరి. లింగజంగమార్చనప్రకారప్రచారి భక్తాంఘ్రిరేణువు. ఇట్టి మహానుభావుఁడు కులమునఁ జాకలియయ్యునుఁ దన యయోనిజత్వమున మహానుభావుండు కావచ్చును కల్యాణపురంబున బసవేశ్వరుల భక్తిజ్ఞానవైరాగ్యంబులును జంగమభక్తార్చనదీక్షయు విని తానాపురంబునకేఁగి బసవేశ్వరులంగని వారిచే సాక్షాత్ఫాలనేత్రునిఁగాఁ బరిగణింపఁబడి సపర్యలనందుచు నందేయుండెను. తన కులవృత్తి యగు బట్టలుతుకుట యెయొకముఖ్య కర్తవ్యంబుగా నిశ్చయించుకొని హరభక్తుల మాసిన బట్టలు పరిశుభ్రముగానుదుకుచు వారలకిచ్చుచుండును బట్టలుతుకు కాలంబున మిగులనాచారసంపత్తి గలిగియే సంపర్కముఁ దగులనీక యుదికినవస్త్రములం దనతలనే ధరించి మోయుచు సహజబలసంపన్నుఁడుగనుక నొకకేలనొక సునిశితధారాకరవాలంబు దాల్చి రెండవచేతనొక గంట వాయింపుచు "శివభక్తుల మడిబట్టలు తెచ్చుచున్నాను. వీనికే

విధమైన మైలయు సోకఁగూడదని చేరరాఁబోకుఁడు. వచ్చినఁ దెగనఱికెద దూరంబుగఁబొండు అడ్డురాకుఁడు ॥అని నోటఁజాటుచు గంటమీఁటుచు కత్తిపోటుఁజూపుచు నిటికినేఁగి యెవరిబట్టలువారి కిచ్చుచుండు. తానుశుకువేళభక్తు లెవరైన నేఁగియడిగిన వలసినన్ని మడుగుధావతులువారికిచ్చును. ఇట్టిశిష్టాచారసంపన్నునియొక్క వీరభక్తిప్రతాపంబు భక్తులచేవినుచు బసవేశ్వరులు వేయువిధంబుల నాతనిఁ గొనియాడుచుండును. అదివిని పురజనులందఱు నిట్టిభక్తుఁడు లేఁడని పొగడుచుండిరి జనులనుతికిఁ బాత్రుఁడై వీరాచారపరాయణుండగు మాచయ కళ్యాణపురంబున నట్లుండి యొకానొకదినమున యథాప్రకారముగా నుదికిన భక్తాంబరముల నంబరమంటెడు తనశిరంబుపై మూఁటగట్టిపెట్టుకొని యింటికిఁ బోవుచుండ నొకమనుజుండావని కేకలు ఘంటానాదమువినుచున్నను చేతనున్నకత్తి గనిపించుచున్నను ప్రమాదవశంబున దాయంజనుదెంచి తప్పించుకొనిపోవుటకు నష్టంబ్రోవ లేకునికి నాతనికట్టెదుర నెట్టనిలువఁబడి విస్ఫారితుఁడై యూఁకున్నవారింగని తలద్రెవ్వనేసి కత్తినెత్తి యెత్తగునిమ్మత్తలంబున కెగమీఁటును అదిగని పురజనులందఱు నేకముఖంబున జేవిపాలికిఁ జని «యో యెకిమీఁడా! యింతకాలము నీ చల్లని రాచరికమునఁ బ్రజలందఱు నీప్రజలయట్లఁ దమదేహదనాదులపట్ల నిశ్చింతులై సుఖులై యుండిరి నేఁటికాలమునకు మనపురంబున కొక మహామారియేతెంచి వీరు వారు నాక పురజనులఁ దననోటపైచుకొనుచున్నది ఆమారి యేదియన నో మహారాజా! యేచాకలి వానిని పరమభక్తుండని యయోనిజుండనియు నపరశంభుండనియు మన బసవేశ్వరులవారు సేవించుచుందురో యాచాకలి మాచఁడే. వీని మూర్ఖత గాలిపోను. బట్టలులికి యింటికిఁదెచ్చుచు దగ్గర రాకండి. వచ్చినఁ బుచ్చెకాయ దెగనఱికెదనని బిగ్గరగాఁ జాటుచు గంటవాయించుచుఁ గత్తిఝళిపించుచు వచ్చుచుండు వాని భీకరాకారధ్వనులు

గని వినిన మానవులె గాక పశుపక్షిసముదయమును క్రిమికీటకాదులు ను సైతము వానికి నోరకిలిపోవునుగాని వానిదృష్టి గోచరత్వంబు నకు దూరంబగుచుండును అది యేమిచిత్రమో కాని నేఁటిదినమొకవింత మేమెల్లఱమును బరమాశ్చర్యంబుతోఁ గాంచివచ్చితిమి పాప మొక యనామధేయుఁడు ప్రమాదవశంబున సమీపించి యోసరిలిపోవుటకు మారుదారిలేక దగ్గరిలిన నగ్గఁడమింషఁడు చెండుగతి వాని మొండెం బునుండి ముండంబును గత్తివేటునఁ దూలించెను అది మీఁదికెగయుట గనఁబడెనుగాని మఱిపెగుటమేము చూడలేదు మహావాయుపదంబున నాఁడు మహాభారతయుద్ధంబున భీమునిచే మడియింపఁబడి యేనుంగుల యంగంపుడెక్కలు నేఁటికి నెగురుచున్నవని పెద్దలగు పౌరాణికులు సెప్ప నొప్పఁజికింపక మనమువిని నవ్వుచుండుటయేగాని నేఁడు మన మడివాలు మాచభీమునిచే నెగమీటఁబడిన మనుజశిరంబు దిరంబుగఁ దిరుగుచున్నటులఁ బ్రత్యక్షగోచరము గనుచున్నారము దాన నోదయా నిధీ రాజునకుఁ బ్రజలు బిడ్డలు ప్రజలకు రాజుతండ్రి రాజునకుఁ బ్రజ శరీరము అట్టి దేహంబున నున్న దేహిరాజుకాఁబట్టి యీపురంబున కాపాడింపఁబడిన యీకాళరాత్రిని దేవరవారు పాఱఁదోలనిచో నిఁక గొన్నిదినంబులకే మనపురంబు నిర్మూలంబగుటకు లేశమైన సందియం బులేదని యొడయని పాదంబుల వ్రాలి లేవకున్న జనులంగని రాజు బసవముఖాలోకనంబుగావించి బసవమంత్రీ! వింటివా ప్రజాలాపంబు లుచాకి వాని సీవింత పెద్దసేసినందున మనకు మూడినకీడు చూడుము ఇఁక మాఱు మాటాడక వీని నూఱువిడిచి పోవువానిఁ గాఁ జేయుము అందు కుపాయంబు నిరపాయంబగు దాన సీవ యారయుము" అనునంతలో బసవేశ్వరులు "రాజోత్తమా, ప్రజలరిత్త మాటలకు భయపడవలదు వాఁడు మహానుభావుఁడు. దైవాంశసంభూ తుఁడు. అట్లయగుటనే యయోనిసంభవుఁడు. విస్తరించివచింపనేల? వా

స్తవంబుగాఁ బ్రశస్తంబగు నాభూతేశుని యపరావతారుఁడు. ఒకమను
జునిఁ జంపెనని మనము చంపింపఁగూడదు చంపినను సామాన్యమైన
చంపుగాదు. శిరంబిప్పటికి నంబరముననున్నదని మనవారె చెప్పుచున్న
వారు. ఇదియొకపవిత్రతగాదె? మఱి యతని శిరముఁదెచ్చితిమేని మఱల వాని
బ్రతికింప నలతండోఁపునని నానమ్మకము కనుక వానిజోలికఁబోఁగూడ
దని నాయభిప్రాయ" మని బసవేశ్వరులు బదులుచెప్పెను అదివినిరాజు
"ఈబసవనమంత్రి యెప్పుడు నిట్టిపిచ్చితలంపులే తలంచుచుండు" నని
యాయనకుం దెలియకుండఁ దనచుట్టలంజీరి "మీరు మన భద్రగజంబు
ను పురికొల్పి యామాచఁడు వచ్చుదారిఁగాచి, యద్దంబుసొచ్చి తొలఁ
గుమన్నఁ దొలంగకుండు. ఏనుంగుండీకొలిపి వానిమట్టించి పీనుంగుంగా
వింపు" డని యానతిచ్చెను. అంత నా సామంతులావంతు లేనుఁగును కట్టా
యితంబుసేసి రాజాజ్ఞ నెఱవేర్పవిధిలేక భయంబొనఁగూర్చుచు మాచ
య్యవచ్చుమార్గము నరికట్టికాచియుండిరి మాచయ్యధీరుండు. తననిత్య
కృత్యంబగు బట్టలుదుకు పనిపూర్తిసేసికొని యథాప్రకారము ఘంటా
నాదంబుతోడను, నిజసింహనాదంబుతోడను "రాకురాకుఁడు తొలఁ
గిపొం" డనుచు నేనుఁగు సమీపించి యరణ్యంబున మృగరాజై స్వేచ్ఛా
విహారంబున నుండవలసినగజము నిజప్రారబ్ధవశంబున నొక్కమనుజనా
యకునకుఁ జిక్కి దుఃఖంబుపాలగు నీక్షుద్రమాతంగంబునకా నేఁ దొలం
గుటయని మావటీండ్రు ప్రాణంబుల కాశపడదరేనిఁ దొలఁగిపొండని
చెప్పి పాఱిపోఁ జూచుకరిరాజు రాజభటుల ప్రోత్సాహంబునఁ దనపైకు
ఱుకఁబోవ నద్దానిండాసి తుండంబునందికొని ముక్కముక్కలుగా ఖం
డించి యంతఁబోక శుండాలంబు నంగంబున మాంసంబిడి తొలిదియొ
మ్ములిచి యున్న విచక్షణలేకయుండునటుల. జిందఱవందఱగా నఱికితుం
డఖండంబుల నాకాశంబున కెగఁజిమ్మియాడించుచు గారిఁజేసికొని
గజదనుజుం బరిమార్చి మఱలిచను మినుసికయ్యాయెయ్యనఁ దననెలవుఁ

చేరి "నాపై నీస్త్రంబేరకుండు దంబుమీఱిన గర్వంబున డీకొల్పిన యీయల్పమతియ గుక్షితిపతిని గతజీవుంజేయక యూరకుండువాఁడం గా" నని శపథంబొనర్చెను అవివిని బిజ్జలరాజు బసవేశ్వరులం జేరఁజేరి యంఘ్రులపైఁబడి యీయిదుముఁ దప్పొంపుమని బహుదీనముగాఁ బ్రతి మాలుకొనెను బసవేశ్వరులును రాజును దయార్ద్రదృష్టింగని "యో వెఱ్ఱిరాజా! నామాటవినవైతివి మడియాలువాఁడను భ్రాంతిచే వానిని సామాన్యమనుజునిఁగా భావించి వానిం జంపయత్నించితివి. చంపఁబోయిన భద్రదంతి యంతంబునొందె. పరమభక్తుల కిల నసాధ్యంబులుగలవె?"

### ఇరువత్తుని వృత్తాంతము.

మున్ను ద్రావిడదేశంబునఁ గరయూరను గ్రామమున నిరువత్తను నొకశివభక్తుఁడు గలఁడు అతండా చోడరాజురాజ్యమున నరువదిముగ్గురు భక్తులలో నిరువదియవవానివంటివాఁడగుటచే నిరువత్తను నామనంబున బరఁగుచుండును మఱియు నతఁడు సర్వసంగపరిత్యాగి. సమస్తశివపురాణార్థవేది షడ్విధలింగార్చనార్పితావధానుండు జంగమపూజాతత్పరుఁడు ధనయౌవనసంపన్నుఁడు సర్వదా పురాణగోష్ఠిం గాలంబు గడపువాఁడు ఇట్టివాఁడై యొకగొప్పవ్రతంబున నుష్టించుటకు మనోనిశ్చయంబు చేసికొనియెను. అదియేమన — నీశ్వరభక్తుల కపచారంబులు సలుపు నేమనుజునైనను జంతువునైనను భూతంబునైనను దేనినైనను కనికరములేక ప్రాణవియోగంబు సేయుటయే ఇట్టి గట్టిపట్టుఁబట్టియా యిరవత్తు తత్తఱలేని చిత్తంబున మత్తగజంబునైన మొత్తఁజాలు బలశాలి గనుక నానియమంబున జనులకుఁ బురాణంబులు సెప్పుచుండెను. ఇట్లుండఁ గొండొకనాఁడు పట్టపురాజు పట్టపుటేనుఁగు మదోద్రేకంబున గట్టువదిలించుకొని బయటఁబడి మీఁద నాధోరణుండు మల్లించుచున్నను మాఱ్పకవానిని సరకుసేయక పురవీథులం దిరుగుచు నెదుటఁబడ్డ యే

జంతువునైనను మనుజునైనను విసరివైచుచు పురమెల్లఁ జిందరవందర సేయుచుండెను. ఆయూర నొకశంభుభక్తుఁడు శివపూజకుఁ గుసుమవిసరంబులఁ గోసుకొని తెచ్చుటకుఁ దెల్లవాఱుజామున లేచి తోఁటతోఁటను జెట్టుఁజెట్టును వెదకి సద్యోవికసితంబులును సువాసనావాసితంబులు నగుపుష్పంబుల నేఱికొని సజ్జనిండించుకొని యింటికేఁగువాఁడు కర్మవశంబున నాయిభంబు బారిఁబడియెను. వానినది తుండంబున నెత్తిమీఁదికెగమీటి దంతంబులమధ్య వ్రేలునటులఁ బట్టియుంచెను. ఆభక్తునికి గజదంబొకటి ప్రక్కనుగ్రుచ్చుకొని ప్రాణావసాన సమయస్థుఁడై కొలఁకులలోఁ బ్రాణంబుల ధరియించి "శంభో, శంకర, మృత్యుంజయ, మృత్యుముఖంబుననున్న నన్నుద్ధరింపు" మని దీనముగా మొఱవెట్టెను. ఆదీనరోదనము ద్వాదశనామకభక్తుని వీనులసోఁకిన నతఁడు విని "యిది యేమి! భక్తునకెవ్వనికో యాపదవాటిల్లినది పోయిచూత" మని బయలు వెడలి చూచుసరికి శుండాలంబు తుండాగ్రంబున దంతములనడుమ గాయపడిన ప్రక్కనుస్రవించుచున్న రక్తముతో మినుకుమినుకులాడఁగ మనోన్ముఖంబులగు ప్రాణములతోనున్న భక్తునియవస్థ గానఁబడియెను. అదిచూచి యిరవత్తు భక్తుఁడు తనచిత్తముచేఁ జేసికొన్న ప్రతిజ్ఞంబరిపాలించుటకు నించుకేనియు వెనుదీయక హస్తిహస్తంబు నిజహస్తంబున నాకర్షించి లాగి మెడవంచి దానిపైనున్న మావంతునొక మోదిమోది నంపి పిడికిటిగ్రుద్దుచేఁ గద్దనన మొగ్గమోరంబును విదళితకుంభంబై నేలఁబడఁజేసి కొమ్ములనడుమ నిమిడియున్న భక్తునిఁ బయటఁదీసి వానికి నుపచారంబులు సేయుచుండునంతలో "నిరువత్తు భక్తునివలనఁ గలభంబు మృతినొందింపఁబడిన" దని భటులువిన్నవింప చోడరాజువిని యిరవత్తు నొద్దకుఁ దానేఁగుదెంచి సాష్టాంగంబెఱఁగి కరములమ్మోడ్పు ముకుళించి "స్వామీ! నాసామజంబు భక్తునిమోడఁ జేసినయపరాధంబు నాదిగాని దానిదిగాదు భృత్యులు సేసినదోషమునను రాజశిక్షార్హుఁడు

తిర్యగ్జంతువగు నాకంతికేమి తెలియును? అట్టిదాని లోఁగదీసికొనినేరని నాదోషంబున భక్తుఁడు ప్రాణావశిష్టుండయ్యెను ఈతండు బ్రతుకునో బ్రతకఁడో నిశ్చయింపనలవిగాకున్నది ఇట్టి స్థితిలో భక్తునుంచి నేజీవించుట నాదితప్పు నన్ను బరిమార్పుఁడని మీారట్లానర్సరుగాన నాశిరంబు నేనఖండించుకొనియెద" నని గండ్రడకత్తెరతోఁ గలఁగత్తెరించుకొనఁబోవునంతలో సాక్షాత్పరశివుఁడు వామభాగాంగీకృత శ్యామాదేవితోను ప్రమథగణంబులతోడను బ్రహ్మవిష్ణులతోడను నందివాహనారూఢుండై గంధర్వాప్సరోగణ పరిసేవితుండై పొడసూపి రాజభక్తికి మెచ్చుకొని "నీభక్తిసాహసంబులు నాకుఁ బరితోషకంబులయ్యె." నని యిరువత్తు వంకఁజూచి నీప్రతినకును రాజభక్తిసాహసంబులకును నేను పరిపూర్ణతృప్తుండనైతి. ఇఁకనీవును, రాజునుకోరినవరంబుల నిచ్చెదఁ గోరు"డని యానతిమున్నె సచ్చినకిరిని బ్రతికించి దానిమాపటీనికిఁ బ్రాణంబులొసఁగి దానిదంతంబుల మధ్యనుండి యూడఁదీయఁబడి ప్రాణసందేహావస్థయందున్న భక్తునికి యథాస్థితినొసఁగి యున్నదేవుని నిరవత్తుగాని, రాజుగాని వరము లేవియుఁగోరలేరు. భగవంతుఁడు వారలకు సన్తోషమాతిమిచ్చి మీాయిష్టానుసార మీాలోకంబునఁజరించి తుదకుఁ నాలోకంబున ప్రమథులతోఁబాయు మీారునాగణములోనివారై యుండుఁ"డని యానతిచ్చి యంతర్హితుండయ్యె. వింటివా, రాజా, భక్తులయొక్క ప్రభావ"మని బసవేశ్వరులు రాజునకుజెప్పి యీయిరువత్తుకథ విన్నవారును జదివినవారును బహుబలధనసంపన్నులై సకల భోగముల ననుభవించి తుదకుమోక్షంబునొందెద"రనియుం జెప్పి మఱియునిట్లనియె

## బాపురిబ్రహ్మయ్య కథ

బాపురిబ్రహ్మయ్యయను వీరశైవుని వృత్తాంతము మఱియుఁ జిత్రంబదివినుము. బ్రహ్మయ్య వీరశైవుఁడు వీరాచారతత్పరుఁడు సం

తతజంగమలింగార్చనాసక్తుఁడు ఉత్తమోత్తముఁడు. భోగిగాఁడు. రాగిగాఁడు త్యాగి విరాగి శౌర్యధైర్యస్థైర్యౌదార్య దేహబలధనసంచయసమన్వితుఁడు ఇట్టివాఁడు శివపూజాకారణంబులగు పుష్పవృక్షంబులతోఁటలనేకంబు లుత్పాదించి దినదినముఁ దెల్లవారుజామున లేచియును మాపచయంబు సేసి యింటికిదెచ్చి వానితోదండలుగ్రుచ్చి యాపూలదండలతో భక్తులనలంకరించుచుండును. వారిశివపూజలకు విడిపువ్వులంగూడ నిచ్చుచుండును. మఱియును నేనుసంతర్పణంబుల భక్తులం దృప్తులంగావించుచుండును. ఇట్లుండ నొకనాఁడొకరాజు మఱియొకరాజుపై దండెత్తిపోవుచు బాపూరునొద్దకువచ్చి యచ్చటిపూవదోఁటలును బ్రహ్మయ్యతొల్లి నందిరూపుశివునికి జొన్నలు మేపుటయు నొకవాదంబునఁ బట్టుపట్టిగట్టురాపట్టినిఁ జెట్టవట్టిన యాజగజెట్టిని ప్రత్యక్షంబు గావించి యాతనిచేఁ గొన్నియంశముల నిదర్శనంబులుగాఁ బలికించుటయు లోనగుబ్రహ్మయ్య ప్రభావమునువిని తాను దండుదిగుటకు వసతియగు స్థలమిదెయనియచ్చటఁ బనగృహంబుల నిర్మించుకొని వసతులనేర్పఱచుకొని బసదిగియుండెను

అంతనా రాజన్యుని గజరాజంబు మదించిమావంతుని లెక్కసేట్టక స్వేచ్ఛావిహారంబు సలుపుచుఁ గట్టుటకుఁదొరుకక యడ్డపడిన జనులనుగాని జంతువులనుగాని తుండంబునఁబట్టి విసరివైచుటయు, దంతంబులఁ బొడుచుటయుఁ గాలందొ్రక్కుటయు మొదలగులీలల యమలోకలీలల నాలోకింపఁజేయుచుండెను అప్పుడు బ్రహ్మయ్యభక్తుఁడు పూలసజ్జసంకసంకించుకొని యత్యుత్సాహముతో నింటికేఁగుచుండ నడిత్రోవలో నీమదకరియెదిరింగని "ఎచ్చటికేఁగుచుంటివి తొలఁగిచనుము" అని తుండంబుఁబట్టి వెనుకకుఁద్రోసిన యావేదండం బేమలాడుకొనుచు వెనుకవెనుకం దిగజాఱి తుండంబుమీఁదికెత్తి యొక్కఘీంకారగర్జనం బాచరించి తోఁడనవిగతజీవియై నేలంబడియెను. అదిగనిరాజభటులు సని

రాజునకునివేదింప నాభూజానియు దిగ్గనలేచి పరువునఁగాలినడక నేతెంచి బ్రాహ్మయ్యయ్యకుఁగులవైఁబడి యుపచారంబులు సెప్పుకొని తన్ను రక్షింపుమని వేఁడుకొనఁగా భక్తుఁడుకరుణించి కరిజింబిచ్చి యనుగ్రహించె ఇట్లుబ్రహ్మయ్యభక్తునాశ్రయించి రాజుకృతార్థుండయ్యె. ఇట్టివిగదభక్తులసామర్థ్యాతిశయములు. వారలుశరణన్న వానినెంతిపాపాత్ముఁడయినను గాచిరక్షింతురు పురసింహము వానినెంత బలవంతుడైననుఁ బొరిగొనియునజూపాలికిఁ బంపుదురు. కావునఁనో బిజ్జలరాజన్యా! ఇఁక మనకొకదారిలేదు నామాటపెడచెవినిఁబెట్టి మడివాలు మాచయ్యను నీచునిఁగానెంచి చంపనెంచితివి మనమాతనిపాదంబులపైఁబడి శరణుసొచ్చుటకన్న నొండుసాధనాంతరము లేదని బసవేశ్వరులు సెప్పునంత

## బిజ్జలరాజు మాచయ్యను శరణుబొందుట

టి... నొక్కటాటునఁబోయి మాచయ్యకాళ్లుపట్టుకొని సాగిలిమ్రొక్కివిపవకన్నంగాచి బసవేశ్వరులును మాచయ్యకు సాష్టాంగదండంబు వెట్టి రాజకొఱకుఁదాబ్రతిమాలుకొనియెను అందుమాచయ్య రాజునను గ్రహించి తొలుత నేనుంగును, దానియయంతను బ్రతికించి యొప్పిమ్మన్నఁ దానుతొలుదొల్త చచ్చినమనుజునిప్రాణంబులిచ్చి యనిపెను. రాజపారముదంబునఁ దనయనుంగు నేనుంగును మావటీని బురజనునిఁ దోడ్కొనినిజప్రాసాదంబునకు వేంచేసెను బసవనమంత్రియు మాచయ్యకనేక భక్తుపచారంబులు గావించియాతనిమఠంబున కాతనిఁ బుత్తెంచి నిజమందిరంబునకుఁ దానేఁగి సుఖాసీనుండైయుండె. ఈపూరిబ్రహ్మయ్య భక్తాగ్రేశరునికథవిన్నను జదివినను చెప్పినను బహువిధసుఖసంపదలతో నీలోకంబునఁనాయువున్నంతకాలము నోలలాడి పిమ్మట శాశ్వతశైవసాయుజ్యమోక్షమును బొంది శివలోకంబున నుందురు. మాచయ్య నిజనిత్యకృత్యంబులను యథాక్రమంబున నివర్తించుచుండఁగా బసవేశ్వరులును భక్తగోష్ఠిఁగడు సుఖంబున దినం

బులుగడఁవుచుండి యొకానొకదినంబున నొకగీతంబుపాడెను ఆగీతం

## మడివాలు మాచయ బసవేశ్వరులఁ దూలనాడుట.

బున భక్తులయొక్క దైన్యమునుగూర్చి కనికరముగలిగించు ధోరణిగ నఁ బఱిచెను లోకంబుననున్న భక్తులలోఁ గొందఱు తన్నెఱింగివచ్చి నవారును మఱికొందఱు తనత్యాగశీలతవిని యేతెంచువారును, తాను వెదకించి సగౌరవంబుగా రప్పించినవారునై యనేకమందిభక్తులు తనయొద్దనే సకలసౌఖ్యోపేతులై యుండ సంతసించుచు దీనులగువారుఁ మఱిలేరుకదాయని విఱ్ఱవీఁగుచుండువానికి నాఁడాకస్మికంబుగా "కౌపీనవంతః ఖలు భాగ్యవంతః" అను శాస్త్రోక్తిప్రకారముగాఁ గొందఱు భక్తచూడామణులు నిజ జటాజూటాలంకరిష్ణు రుద్రాక్షచూడామణి మయ మకుటాంగద కటకాంగుళీయక కర్ణకుండలాది భూషణంబులతోఁ గౌపీనధారులై భిక్షాపాత్రలం గేలఁ గీలించుకొని కేవలపరశంభు స్వరూపంబులతో భిక్షుకులై తనమందిరంబునఁ బ్రవేశించినవారిం గని జ్ఞానసంపన్నత్వంబున వారల ప్రభావంబెఱుంగక పేదవారనుకొని "అయ్యో! భక్తజనదారిద్ర్య తిమిరమునకు నేనొకమిహిరుండనై మూలమూలలనున్న పరిపరివిధంపు హరదాసుల వెదకి తెప్పించి వారివారికి వలయు గోరికలం దీరుచుచుండ నీరిక్తభక్తు లెచ్చోటనుండి వచ్చిరి" అని వారిబహిర్దృష్టంబగు దీనవేషంబునకు మనంబు శోషింపవారివిషయమై తానొందిన జాలి, నాలీలగీతరూపంబున నుద్ఘోషించెనుగాని వారు దన్నరయుటకు గపటవేషంబున నరుదెంచిన మాచయధీరుసంగతిఁ గితవభిక్షులని యెఱుంగకపోయెను. అట్టి బసవాద్గీతంబగు నాగీతంబును విన్నభక్తజనులు మాచయయొద్దకుంబోయి యట గానంబుగావించిరి. అదివిని మాచయ్య కటకటంబడి భక్తజ రిక్తస్థితి శ్రవణపరాఙ్ముఖుండుగావున నట్టి దానిం దనచెవిని సోఁకించిన బసవేశ్వరుల ననేకవిధంబులదూషించి పరమభక్తులపేదఱికము నా చెవినిఁ బడకూడదు భక్తులెన్నఁడు దరిద్రు

లుగారు "అపి శాపీన వాన్ శంభుస్తథాపి పరమేశ్వరః" అనునట్టుల నీ భక్తులును భగవదైశ్వర్యసంపన్నులుగాని, నీవనుకొనినటుల దరిద్రులుగారు. నీధనమదాంధతచే నీవేలోకంబున ధనాఢ్యుఁడవని, మహాదాతవని నీయొద్దకుఁ వచ్చువారందఱు దీనులనియూహించి నీయహంభావమును నీవుప్రకటించితివి నీత్యాగమనెంత. నీవిచ్చిన భోగమన్న దెంత? ధనకనకవస్తువాహన దాసదాసీజనభూక్షేత్ర గజాశ్వాందోళికా ద్యైశ్వర్యంబులన్న నెంత. నీకంటికి భక్తులంతదరిద్రులు గాఁగనఁబడిరే. నీవిచ్చినదేపాటి? చూడు నాసామర్థ్యంబు నేఁటినుండిభక్తులకు నీవొకకాసైన నొసంగనవసరము లేదు ఇదిగో నేనవనిధులవారకేర్పఱిచెదను. నీవుధనదునివలె నానిధులంగాఁచియుండి వచ్చినభక్తులకిచ్చుచుండుము. అని బసవన్నను ద్దేశించి కొంచము శుద్ధోదకంబుఁ బుడిసిటఁగొని యభిమంత్రింపి లింగసంగతంబుఁ గావించి నేలచల్లునంతలో నాబిందువులన్నియు నానావిధములగు నవరత్నజాలంబులు కుప్పకుప్పలై యుచ్చోఁబడియుండెను. అంతనుమున్ను బసవేశ్వరులు మాచయ్య తన్ను దూషించిటవిన్నవాఁడై వెంటనేయుట కేఁగియున్నందున నామణులనెల్లంబోగుసేసి తానే భక్తుల భాండాగార ద్వారపాలకుఁడను నటులఁ గాచియుండి వారలకెల్ల వేళలనిచ్చుచుండెను.

## బసవన్న మాచయ్యను శరణుబొందుట.

ఇట్లుండి బసవేశ్వరులు నిజాహంభావంబునకు భావంబునన సిగ్గునొంది మాచయయొద్దకుఁ బోయి యడుగులఁబడి దేవా! నీవుసాక్షాత్తు సంగమేశ్వరుఁడవు నన్నేలధర్మమియించెదవు నన్నటయుట కొక్కొక్కవేళ నొకొక్కవేషంబున వచ్చుచుంటివి. నాఁడల్లమనుపాలు లేనేతెంచి నన్నువంచింపబూనితివి నేఁడీమడివాలురూపంబున వచ్చినన్ను మోహపెట్టుచుంటివి గాని, ప్రారంభమునుంచి నిన్నుదైవభావ బున

గనుచున్న నేను నీమాయచే నావరింపఁబడినవాఁడనై నిన్నెఱుంగలేక నీరూపంబున నేతెంచినభక్తులను నిన్నుఁగాఁ గనఁజాలక నీయుపాలంభనమునకుఁ బాల్పడితి దానునిత్యదండంబుతోసరిగాదె. నీకును నాకును హస్తిమశకాంతరముగలదు ఏనుంగుకన్న పెద్దజంతువును దోమకన్నఁ జిన్నజంతువును మఱిలేవుగదా అట్లనేనీకన్నఁ బెద్దయగుదైవంబును నాకన్ననధముండగు భక్తుఁడు లేఁడు. మఱియు "అణోరణీయాన్మహతోమహీయాన్" నన్నభావము నీయందేగలదు అధికములో నల్పమిను డునుగాని, యల్పములో నధికమడంగదు అధికుఁడవునీవు, నల్పుఁడను నేనని తొలుకొల్తనే విన్నవించుకొనియె యుంటిని కాన నన్ను లోఁగొని నాతప్పుసైచి నాకుసర్వదా సహాయుండవై యుండవేఁడెద "నని యనేకవిధంబులం బ్రార్థించుచు పాదంబులంబట్టి వదలకున్న బసవన్నంగరుణార్ద్ర దృష్టినవలోకించి" యోబసవా? నీవుచెప్పినటుల నీభక్తిపారవశ్యంబును భక్తజనాదరణంబును త్యాగశీలతయు భోగవిముఖతయు నిత్యాన్నసీకరణంబుల నరయఁదనివినేరక ముక్తిమాత్రాపేక్షముల నీయొద్దకువచ్చుచున్నవాఁడను మనుజునికిఁగల దుర్గుణంబులెన్నియైనను క్షమార్హంబులుగాఁగలవు. కాని యహంభావమునకుఁ దుల్యమగు దోషంబునుతొండులేదు అహంకారవిదూరుఁడు భగవత్సాన్నిధ్యంబు నొంది లిదైక్యభావముంగనును. అహంకారవశంగతుండధఃపతితుండై యార్ద్రమృత్పిండమువలె నడుగంటునుగాని కందుకమువిధిని మీఁదికెగయనేరఁడు. కావున నిట్టియహంకారస్వరూపము నీకుబోధపఱచి దానిలోఁబడవద్దని నీకుపదేశింపవచ్చిన నీయిష్టదైవంబగు సంగమేశ్వరలింగమూర్తి నేనే "ననిస్పష్టపఱచి మఱియు, గొందఱియహంభావులయవస్థస్పష్టముగా మనోగోచరంబులగునటుల వారలచరితంబులు కథారూపంబున వెల్లడిసేయువాఁడై మఱల నిట్లను. వింటివాబసవన్నా! నాయన్నా, తొల్లియహంభావంబునవర్తిల్లిన భక్తులను వాటిల్లినయవస్థలు

## శంకరదాసయ్యకథ

జడయశంకరమను నొకమహాస్థలమందు శంకరదాసను పేరుగల భక్తుఁడుగలఁడు అతఁడువీరశైవుఁడు త్ర్యక్షఫాలనేత్రము గలవాఁడు అపరవీరభద్రుఁడనఁదగు రౌద్రరసముగలవాఁడు సంసారవిమోచనుఁడు అష్టైశ్వర్యసంపన్నుఁడు. జరామరణంబులులేనివాఁడు నిర్మలజ్ఞానస్వరూపి. శివపూజాధురంధరుఁడు ఇట్టివాఁడు గంతలుబొంతలుగుట్టి యంగడినమ్మి నిత్యమును దస్సికయమున నైదుమానికులువడ్లు దెచ్చుచుండెడివాఁడు ఆయైదుమానికలవడ్లతోఁడనే కోట్లకొలఁది జంగమభక్తలకు సంతర్పణసేయుచుండెడివాఁడు. ఇట్లున్నశంకరదాసయ్య చరిత్ర విని కనఁగోరి యనేకశిష్యకోటితో దేవరదాసయ్య యేతెంచికాంచి మిగులసంతసించి మగుడఁదనమఠంబున కేఁగి "యహహా! శంకరదాసయ్యభక్తియేమి శివదాసులకుఁజేయు నాసంతర్పణములేమి." యని కొంతతడవు పొగడిసుక్కలి దయగలవాని వలెవిచారించి దుగ్గవ్వను బిలిచి శంకరదాసయ్య యింటిలోఁగొడుకుఁదప్పకులేదు గనుకనీగంపెడు చిట్టు గొనిపోయి యి"మ్మని చెప్పి మలమలమాడు కాత్రాడలోఁబంపెను అదిమాచి శంకరదాసుమిగుల హర్షించినవానివలెఁ బైకిసంతసించి "ఓహో! దేవరదాసయంగారు మాయందుదయదలఁచి గంపెడుచిట్టుపంపినారు. మమ్మేమిగోరఁదలచినారో కూలివానికి నొకయిచ్చిగొన్న తవుడిది యని యొకచేయిగంపలోనుంచి పిసికిలించఁగా నాగంపెడుచిట్టును బిడికిటిగోనిమిడిపోయెను దానితోవాలింటనున్న యానదాస్త్రీయు నడఁగిపోయెను అంతశంకరదాసయ్య 'అయ్యో! మీనింటిలో కొణిజెడ్డె నను లేకపోయెనా? ఉన్నదొకగంపెడె అదిమనకుఁ బంపివేసెను మతివానికెక్కడిది" యని గర్వంబునఁబలికెను దుగ్గళవ్వమఠంబున కేతెంచి యావృత్తాంతంబు సెప్పనంతలో దేవరదాసయ్య సిగ్గుజెంది దానొందినయవమానమునకు నగచుచుండగాఁ దుగ్గళవ్వ యాతనితోనిట్లనియె 'దేవ

రదాసయ్యగారూ! మీరిట్లు శివదాసులను శోధించుట తగునా? ఏపుట్టలో నేపామున్నదో ఎవరిమహిమ యెట్టిదో తెలియఁగక పలుకఁగక నైదుమానికెల గింజలలో కోట్లకొలఁది జంగమభక్తుల నారాధించెడు నమ్మహానుభావునకుఁ దన్పుఁగంపెడంపుట యాతని నవమానించుట గాదే. వెతపింపఁబోయి వెతచినట్లు మీరాతనిఁ బరిభవింపఁబోయి మీరేయవమానితులైతిరి. శంకరదాసయ్యమహిమ మీరు వినలేదు కాఁబోలు! తాను జేయు జంగమార్చన కీశ్వరుఁడు మెఱఁగంది సాక్షాత్కరించి వరంబు వేఁడుమనఁ దనకేవరము నక్కఱలేదనియు నట్లు భగవంతుఁడు గోరుమన్నపుడు గోరకుండుట యాతని సధిక్షేపించుట యని "స్వామీ! మీరు కోరుమనుటయు నేఁ గోరకుండుటయు లోకవైపరీత్యమగును కనుక నాయందు దయ గలదేని నాకింగలపుఁగన్ను దయసేయు" మనెను తత్క్షణమయు ఫణవాహనుండాతనికి లలాటమందొక వేఁడికన్నుఁ బొందుపఱచెను. దానితోఁ బరమతవాదులఁ బూదిసేయుచుఁ బరదైవవిగ్రహములనుఁ దదీయాలయములను నాశనము సేయుచు నన్యమతశుండాలగండభేరుండాకారుండై వెలుంగుచున్న యాతనితట్టు దేరిచూడలేక క్షుద్రదైవతంబులతని కూసిగంబులు సేయుచు శునకములవలె నాతనిమడంబు ముట్టనుఁగాచుకొనియుండెను ఇట్లు లాతిజనులర్చించు గ్రామదేవతలను దనకావలి శునకంబులుగాఁగొని నయాశంకరదాసు ప్రభావంబు విని గని యోర్వలేక జగదేకమల్లుఁడను రాజు దనయుల్లంబున వెల్లిగొను

## జగదేకమల్లుఁడు శంకరదాసును శోధించుట

నసహ్యభావంబునఁ దనపురమున నొకవిష్ణ్వాలయంబు నిర్మించి యందు ముక్కు విగ్రహంబులను జేయించి పంచలోహములలోఁ బొదిగించి ప్రతిష్ఠించి నిత్యపూజానమస్కారంబులు గావించుచుఁ "ఈసీశ్వరు మెప్పించి ఫాలనేత్రంబుం గొనుట నిజంబయేని మీ శంకరదాసయ్యయీ యాలయంబున నెలకొనియున్న యత్యుగ్రజ్వాలానృసింహస్వామి దర్శ

నంబొనర్చి చలింపక మఱలివచ్చినఁ జాలు”నని యాతనిశిష్యులచే వార్తనంపెను. అదివినిశంకరదాసయ్య ముసిముసినగవుతోఁ దనశివభక్తులవెంటఁ దోడ్కొనివచ్చి—“వందేశంభుముమాపతిం సురగురుం వందే జగత్కారణాం. వందేపన్నగభూషణాం, మృగధరం వందెపశూనాంపతిం వందేసూర్యశశాంకవహ్నినయనం వందెముకుందప్రియం వందెభక్తజనాశ్రయంచవరదం వందెశివంశంకరం॥ శ్లో॥ బ్రహ్మముకారిసురార్చితలింగం నిర్మలభూసురసేవితలింగం జన్మదుఃఖనివారకలింగం నౌమిసదాశివనామలింగం॥ శ్లో॥ భూధరతనయాపూజితలింగం భూధరకాగ్ర్యకశోభితలింగం భూధరభిత్ప్రతతంనుతలింగం సాంబసదాశివనామలింగం॥ పంకజగర్భసమర్చితలింగపె పంకజగర్భసురావనలింగం పంకజగర్భవశీకృతలింగం నౌమిసదాశివనామలింగం॥ శ్లో॥ నారదముఖ్యానమస్కృతలింగం నారదముఖ్యమనోగతలింగం నారదముఖ్యపురస్కృతలింగం నౌమిసదాశివనామకలింగం॥ శ్లో॥ లింగాకారసదాచరలింగం లింగప్రాణసదాస్థిరలింగం లింగర్భావిధిసంగతలింగం నౌమిసదాశివనామకలింగం॥ అను లింగపంచరత్నంబులను జపించుచుఁ గన్నులుమూసికొని దేవళంబుతలుపులు దెఱచి చూచునంతలో నాభీకరనరసింహమూర్తి శుద్ధసతరలింగాకారంబై కనుపట్టినఁ జూచువామల్లుడును శివభక్తులు సత్యాశ్చర్యనిమగ్నమానసులైరి రాజునుశంకరదాసయ్య యుక్తులంబడి యాతని బహువిధంబులంబూజించి ధనధాన్యసమృద్ధునిఁ జేసియుంపెను

## దేవరదాసయ్య శంకరదాసయ్య ప్రాణంతుండగుట.

అట్లు జగదేకమల్లుఁడు శంకరదాసును శోధించుకాలమునఁ దేవరదాసయ్యయు నచట నుండినకతంబునఁ దానును శంకరదాసునకు సాష్టాంగంబొనరించి తన్నుమన్నించి రక్షింపుమని వేఁడుకొనెను. అదిగని శంకరదాసేమియు నెఱుఁగనివాలె “మీరెవరు? దేవరదాసయ్యగారా? మీరు మహానుభావులు, శాంతమూర్తులు నిరహంకారులు గర్వరాహిత్య

లరు దాసమూడామణులగు ఎప్పుడిచటికి వేంచేసితిరి? మాకొకేమి తెచ్చితిరి? కూలివానికిఁగొకయిచ్చి కొన్నతవుడేమైనఁ దెచ్చితిరా? పోనిండు, మీవంటిమహానుభావులు పుండ్చిపెట్టిన ధనమందేమైన నుడవచ్చును. త్రవ్వి చూడుఁ''డని దేవరదాసయ్యచేత నటఁద్రవ్వించగా నటనొకగని బయలువెడలి యందు బంగారుకన్నవేలును వేలయంతయు బంగారుటిసుకయు గన్పడెను. అంతదుగ్గళియు దేవరదాసయ్యయు పాదాక్రాంతులై లేవకున్న మీరిచ్చిన గంపెడుతవుడుకు బదులుపదిగంపల యిసుకగా నిపొండు. పేదసాదలననుగ్రహదృష్టిఁ వారలనాదరించి యారాధించుచుండుఁడు ఈయిసుకనాన బెట్టి యేసులు సేసి యొంటఁబెట్టి బంగరునూలు దారములొడికికనకచేలంబులం గట్టుకొండు. దాసులకింకు నెనరుగలిగి బ్రతుకుఁడు లెండు" అని యనేకవిధంబులఁ దృణీకరించుటయు దేవరదాసయ్య లేవకను ''పాపాత్ముఁడ, గర్వని, క్షమింపుము నీదాసులకో వేయవకాదు పదివేలవయంశనుబోలువాఁడనుగానను దీనాలాపంబులఁ బ్రతిమాలుచుండ నిద్దఱిని లేవఁదీసి సగౌరవంబుగా నింటికిఁబంపెను. దేవరదాసయ్య స్థితియెప్పటియట్ల యొప్పొంగుచుండె ఇట్లు దేవరదాసయ్య నహంకారంబున నవమానించిన శంకరదాసయ్యకు నహంభావదోషంబున నీశ్వరునివలనఁ బడసిన నేత్రంబులోపించెను గనుక, బసవా, శివదాసులెన్నఁడైన నహంకరించివచ్చునా మఱియువినుము.

## నిమ్మవ్వకథ

నిమ్మవ్వయను నొకయమ్మక్క పరమభక్తురాలు. వీరశైవాచారిణి. కుమ్మరిపురుషుపవలె సంసారమందుండియుఁ దల్లేపమేమియు లేనిది సర్వదా జంగమార్చనాసక్తురాలు భక్తులరుదెంచిన మంచిసంతసంబున వారలకు విందొనర్చుచుండును ఆమె కొకతేనయుఁడు పండ్రెండేండ్ల యీడువాఁడు కలఁడు. వాఁడు శివభక్తులయిండ్లకు గావిండ్లపై గాయగూరలు మోయుచు వారియావులం గాయుచు వారలిచ్చు వత్సరవేత

నంబుం దెచ్చి తల్లికి నివేదించుచుండును ఆమె తద్వ్రతంబున సర్వదా జంగమలింగసమారాధనా పరాయణాత్మకత్వంబున నట్లు కాలక్షేపము సేయుచుండఁగా, కాంచీపురంబున సిరియాలను నొకవీరశైవభక్తుఁడు

## సిరియాల కథ

నిత్యము నైమిత్తికముగ జంగమయ్యలకు షడ్రసోపేతముగా భోజనము పెట్టి వారలం దృప్తులం జేసి పిమ్మట తాభుజించుచుండును వీరవ్రతధారణంబు సేసి యెడతెగక వ్రతాచరణంబు సమధికభక్తితో జరుపుకొనుచుండువాఁడు. ఇంతియగాక జంగమదేవరలు కోరినవస్తువులు వారికిచ్చుచుఁ గోరిన యాహారంబొసఁగుచుఁ దృప్తిగావించుచుండును అట్టి వానిభక్తి లోకులు గనుఁగొనఁ గుతూహలంబుగలవాఁడయి యొకానొక దినంబున భగవంతుండగు పరమేశ్వరుండు జంగమయతివేషంబునఁ బొడసూపి సూత్రప్రోక్తరీతి నొసంగిన నన్నంబు గైకొని యగణ్యపదంబునందియున్న తాననంబునఁ బాపంబే యాతనిచే భిక్షంబు నిమంత్రితుండై యంగీకారంబొసంగక యున్న కొన్నియుచ్చకంపుమాటల నతనింగై వారబుసేసి ఓయి సిరియాలశెట్టీ, నిత్యము నైమిత్తికయ్యల కొయ్యనభోజనంబుపెట్టక నీవుభుజింపనని యొకవ్రతముఁ బట్టితివి. సంతసించితిమి. నేఁటికొక హాయనముసంది మే మొకవ్రతముఁ గైకొంటిమి. అది మాకుసరిపెట్టువారు కనపడలేదు మాంసంబులలో నరమాంసంబు మిగుల రుచ్యంబని లోకులువచింతురు. మృగమాంసంబుకను శార్దూలంబైతము విధివశంబున నెన్నఁడేని మనుష్యమాంసముఁ దినఁగలిగు నేని నాఁటనుండి మఱి మృగపలలంబునకాసపడక నరామిషంబునకే దారిఁగాంచి నరమేధంబు సేయుచుండును కనుక మాకును నరమాంసభిక్షనొసంగినవారియింటనే వారిచ్చిన షడ్రసోపేతభక్ష్య భోజ్యాహారంబులఁ గైకొందుముగాని లేనియెడల జలపానంబుసేసి యుపవసించెదము ఇట్టి

నాకోరికదీర్ప సమర్థుండెక్కడనుం గానరాకుండుట మేమూరూర నిట్లు కోమలబాలకామిషంబు రుచిసూడ నోరూరఁ దిరుగుచున్నారము. నీకట్టిసామర్థ్యము గలదేని మాకుభిక్షపెట్టుము కాదేనిఁబోయివచ్చెదము" అనుటయు నాశిరియాలుశెట్టి "స్వామీ! దీనికింతవిచారమేల. పండ్రెండేండ్ల బాలకుండొక సుతుండు నాకుఁగలఁడు. వానిమాంసంబున మీకుఁ దృప్తిగావించెదను, కొంతతడవిట విశ్రమింపు" డని యాతని నటనుంచి యింటికేఁగి నిజసతికపూర్వ జంగమాగమనం బెఱిఁగించి చేతులు పిసుకుకొనుచు నోరుతడఁబడఁ జెప్పలేక సెప్పఁబోవుచున్నట్ల నిలువంబడియుండెను ఆమెయాతనికైఖరిం గని "యేమి యనుమానించెదరు. చెప్పఁబూనినది వేగమయ్యానతిండు. మీమనంబునంగల గొఱఁతయే" మని గ్రుచ్చిగ్రుచ్చి యడిగెను అందుకా యిజమానుఁడు విషాదంబునం గుం గువానివలెఁ గితపతపసికోరిన కోరికయెఱిఁగించిన నమ్మహాపతివ్రత మహానందంబున లేచి భర్తృపాదంబులకెఱఁగి "స్వామీ! యింతవగచెదరు కోరినవాఁడు మహేశుండు. అట్టికోరికదీర్తు ననినవారు నాహృదీశులరగు మీరు మీయాత్మజునందు నాకుఁగల స్వాతంత్ర్యంబు మీకులేకపోయెనే. ఇఁకఁ దడయనేల? వైళంబగావింతము మీరు మ్మలికింపకుఁ" డని సంగళవ్వచేఁ బారశాలం జదువుకొనుచున్న బాలకు నోలింబిలిపించి తనయంకతలంబునఁ గూర్చుండబెట్టుకొని చుంచు దువ్వుచు ముద్దుమాటలఁబలికించుచుఁ దానును బ్రతివచనంబులు వలుకుచు వానిం బారాయత్తచిత్తుంగావించి వెనుకదిక్కున వాఁడియగు కరవాలంబు కేలంబూని యొండొకదెస దేనినో సూఁచుచున్నవానివలెనుండి నిమిష నిమిషముఁ దనవైపుదిరిగి చూచుచున్న భర్తను గ్రేఁగంటం దిలఁ దరుఁగుమని సైగచేసిననతం డట్లొనరింప నిట్లునుతుననూనయుంచి వంచనంపును మారితెలయొకచోడాటి లేక్కిన యంగంబునందలి మాంసపుకండలు వండుట కనువువడునటులఁ జిన్నచిన్న తు

నుకలుచేసి గరతుపాలాపూసి యుప్పు, పులుసులం బోదిః నేతవేయుంచి కమ్మనికూరచేసి మఱికొన్ని యితరభక్ష్యభోజ్య లేహ్యపానీయంబులగు చతుర్విధాహారంబులు సిద్ధపఱచి పూజాగృహంబున శివపూజాపరికరం బు లాయుత్తంబులుసేసి యాసన్యాసికై యెదురుచూచుచుండ నాతం డెప్పటికిని రాకయుండుటచే నాశెట్టినేఁ బోయిపిలుచుకొనివచ్చెదనని భార్యకుం జెప్పి యాచాయం జని సనిత్యొక వృక్షమూలంబునని మాలిత తనయానుండై స్నానాద్యనుష్ఠానంబులు కిర్చికొని యోగనిష్ఠాగరిష్ఠతను న్న యాయన్నంగని «స్వామీ! దయసేయుడు. సర్వంబు సిద్ధంబయ్యె తమరెచటికేఁగితిరోయని వెదుకవచ్చితి" నని మిన్నక విన్నవించిన నమ్మహానామహేశుం «డిగిదో వచ్చుచుంటిని. నాకై యింతయరయనే ల. ఇక్కడక్కడకేక యెక్కడన్నైన నేనయుండుదును. సంసారపరిత్యాగం బుసేసి సర్వత్రవ్యాపకంబౌనట్టి మావంటి భిక్షులకు నీవంటిగృహస్థు ముంగొంగుం బట్టిడిగా నంటుకొంటి చిత్రమటుకు దూలమున బుట్టి న తేనెపట్టు, సాలనున్న లేఁజపుటావు, గోడిపాతనుమూటగట్టిన దేవమ ణి, పెరటంగాండిన కల్పతరువు అట్టివాడవుగనుక నే నా హిరణ్యాక్షువ రమును బరిసావించితివి» అని యాతనివెంట గృహంబుఁ జేరఁగెను. ఆశెట్టియు దవముల్లాలు సువర్ణకలశంబునం దెచ్చియిచ్చిన నిర్మలోదకం బున నాజటివాదంబులుగడిగి యర్ఘ్యంబొసంగి యాసనాసీనుం గావించి యాతనికి శివపూజకై తానేపట్టపెట్టి పూజాద్రవ్యంబుల నచటనుంచి శివపూజగావింపుఁ డనుటయు నమ్మహానుభావుండు «నాకై యొడఁగూ ర్చిన పలలపదార్థంబుం జూపుఁ" డన సిరియాలుశెట్టి భార్య పాకపాత్రి తోఁ దెచ్చి ముందఱఁ బెట్టుటయు నద్దానిం బరిశోధించి «దీనండలకాయ మాంసమేది? అదియు బహురుచికరమైనది మాంసభుక్కులు మిక్కిలి యాసతోఁ గటికివాండ్రమ్మెడు మేకతలలనుగొనిపోవుట పట్టణంబులం దఱుచుగ నేఁ జూచుచుందును. అదిలేని యీమాంసము నాకేల" యని

లేఁచిపోవుచున్న యాభిక్షుని బ్రతిమాలి యాశిశుశిరంబుఁ దెచ్చి కనఁబఱచి "దేవరా! యిది కేశసంకలితంబు. కేశదూషితంబగు నరమాంసాహారంబుఁ దొల్లి యగస్త్యవశిష్ఠ మునివెట్టి యాతనిచే శపింపఁబడి నరాధముండయ్యె. ఈక్షణము యీతలవండించి తెచ్చెద" ననుసంతలో నాతని సతియును నతిశీఘ్రంబున వండి తెచ్చెను. అంత నక్కపట నిటలతల నయనుండు మఱియొక యుపాయంబుపన్నెను. "శెట్టీ! నీవును నీకుఁదగిన యుద్ధాంగియును నాయెడలఁ గనపఱచుచుండిన దృఢభక్తికిని, ఓరలలి వేగంబున ననుకూర్చు పదార్థంబులకును నామనంబతి కుతూహలకలితంబైనది. కాని, యొక్కపని గావలెను. అది యేదియనిన, నీకుడిప్రక్క నేనును నాయెడమప్రక్క నీవునుఁ గూర్చుండి నీయంగనయగు తిరువెంగడాటి వడ్డింప యిష్టగోష్ఠిసల్లాపంబులు నలుపుచు రుచులుగ్గడించుచుఁ దృప్తికరముగ భుజింప వలెను. ఇట్లయిన నాకు భోజనము పెట్టుము. కాదేని మేము పోయివచ్చెదము. నీక్షణంబు నీవగానునము" అని మాటల లేవఁబోయెను నా యిందువకాళికి బదులుసెప్ప నోరురాక వికవికలాడు మగనిం గని యాలాతనిం జేరి "యేల చింతించెదరు? మనచేతులతో మాముసంపుకొన్న తనయుని మాంసము భుజించుట మాతరియు తప్పగునా? జంతువధ సేయువారికిఁ దజ్జంతుమాంసము తాముభుజించినఁ బాపిన దోషము లేదని పెద్దలు సెప్పుదురు కనుక నిఁక సంతమాత్రము మనంబునఁ గొంకక నిశ్శంకతో నాతనియుండఁ గూర్చుండి భుజింపుఁడనియిద్దఱికిఁ బ్రత్యేకాసనంబులు బెట్టించి రజతపాత్రంబుల నమర్చినతుమాంస సహితంబుగా సమస్తపదార్థంబులువడ్డించి" తమాతగించుఁ "తవ నక్కపటకాళకంధరుండు తనమనంబున ఘనంబుగమెచ్చుకొని" యాతడు దేనికిని మెమడీయ లేదు. ఇఁకనాచేత వంచితుఁడుగాఁడు. వీనికన్న వీనిభార్యసాహసం బెక్కుడుగనున్నది. "సాహసంషడ్గుణంచైవ" యనునట్టుల స్త్రీలకున్న మనోనిబిడత్వము

పురుషులకుండమగదా?'' యని తలపోసి మఱియు నాతనికిట్లనియె "ఓనోయి శెట్టీ, యిఁ నన్నియును నమకూడినవి. మనభోజనము తయారా యి. కాని యింకొక గొప్పలోపముగలదు. దానింగూడ పేర్చెదవేని నే సుఖముగ నీతోడవిందారగించి యథేచ్ఛంబోదును లోకమున నెవ్వ రేనిఁ దమయింట నొకరికి విందొనరించినపుడు దనపుత్రమిత్రకళత్ర దాసదాసీజనంబుతో నానంది పడవలెనుగదా. నీకున్న కుమారులం బిలు వుము. వారలతో నారగింత''మనుటయు సిరియాఁలు కన్నీరుగ్రమ్ము చుండ దీనస్వరంబున "మహేశా, నాస్థితిమీరెఱింగియు నన్నిట్లు ము ప్పులఁ ద్రిప్పుటన్యాయము దేవా! నేనుదొలుదొల్తనే దేవరవారితో నాకొక్కఁడే కొడుకున్న వాఁడని వానిమాంసంబునమీకు విందొనరిం తునని నుడివి నీకి యట్లనెగావించితిని. చచ్చినసుతుఁడు మఱల నెట్టుల వచ్చును, ఎఱిఁగియుండి నేనేమనిపిలుతును? ఎటకేనింబడియుంటినేనిం బిలువఁగలను. పిలిచిన వాఁడెట్లువచ్చు? ఇఁకనిట్టిమీ దుర్భ్రమలు మాని మనస్ఫూర్తిగాఁ దినుఁ''డనియె అందుపై దొంగజంగమదేవర కోపిం చిన వానివలె మహోద్రేకముగా "ఛీ! నీవపుత్రకుండవు'' అపుత్రస్య గతిర్నాస్తి'' యనిశ్రుతులు ఘోషించెడి నీయట్టిగతిమాలినవాని యిం ట భుజించుటకన్న నాఁటికిఁ బస్తుండుటమేలు'' అనివిసువుకొనుచునికి మాఱుమాట సెప్పలేక కోమటిపిఱికి మనసునసూరకుండెను అంతనక్క ంతుమర్దనుండు దయకలఁచి మాతనిభార్యంజేరి "తరువెంగడాంబా! నీమగనికెంత సెప్పినను వినడయ్యెను నీవైననామాట మన్నించి నీచి న్నికొమరునిఁ బేరుపెట్టిపిలువుమమ్మా తల్లిపిలిచినరానిబిడ్డఁడుగలండా? బిడ్డలకు దేనికయిన నడ్డమున్నదిగాని, మాతాహ్వానమున కెచ్చటను నడ్డంబులేదు జననిపిలిచిన నో యని తనయుఁడుపరుగుపఱుగున పాఱి వచ్చును.'' అనియానతిచ్చునతనికి మ్రొక్కి మహాప్రసాదంబని తిరు వెంగడాంబ యిట్లని నలుదిక్కులఁ దిరిగితిరిగి కొడుకును బిలిచెను.

మృతుఁడైన సిరియాలుసుతుఁడు బ్రతుకుట.

"పున్నామనరకము నుండి తల్లిదండ్రులమగు మమ్ముద్ధరించెడు నాచిన్ని కన్నకొడుకా! నాపంచప్రాంజేంద్రబాలకుమారా! నవమన్మథాకారా! సకలసుగుణాగారా! సంసారపంకనిర్మగ్నపితరసముద్ధరణా సముద్ధనిర్భరానందకార్భకా, నిర్భరమశ్లోకశమునా, నాకన్నతండ్రీ నాసిరాలా, నాముద్దుపట్టి యీయయ్యయుడిశుజమును నాయెడమకన్ను నదురుచున్నవి మమ్మున్నరడిపెట్టక సీగజైంచెల ఘుఘుఘుల్లుచప్పుడుతో చప్పున పరుగెత్తుకొనివచ్చి నీముద్దుమోముజూడ నీడగాచియున్న నన్ను వెనుక పాటువవచ్చి కౌఁగిలించుకొనుమని నలుదిక్కులనాలుగుమూలలఁ బిలుచుచుపర్క నబ్బాలుఁడుపరుగెత్తుకొనివచ్చి తల్లింగాంచి దండంబువెట్టుటయు, నాపేరాలుఁడును దల్లియుఁదండ్రియుఁ గలుసుకొని నిజపరివారముతోఁ దివసికడసంబోవ సమకట్టియేఁగుసరికి నటనా పినాకియుద్బృశ్యుండై తటుణమ మూచువారల వెంగంచ రుద్రాక్షజటామకుటంబుతో నాగశిఖాపాశంబుతో నాకాశగంగాప్రవాహసంకలితజటాజూటంబుతో వామార్ధదేహాలంకృతశ్యామాదేవితో గజచర్మపరిధానంబుతో బ్రహ్మవిష్ణు రుద్రగణ ప్రమథగణ వీరభద్రాది కుమారవర్గంబులతో శూలవజ్రఖడ్గపరశ్వాద్యాయుధాద్యాలంకరిష్ణుండగుచు వృషభవాహనారూఢుండై నిరూఢభక్తపరిపాలదక్షుఁడగు కటాక్షనిరీక్షణంబులతోఁ బ్రత్యక్షుండై తనయెదుట నుదుటకెత్తంబడిన ముకుళితహస్తంబులతో నిలువంబడియున్న సిరియాలుని దత్స్త్రీపుత్రులంగాంచి యభినందించి తత్పరిజనంబులనె గాక సమస్తపురజనంబులను కైలాసంబునకుం గళేబరంబులతోఁ గొంపోయి యట నిజప్రమథగణంబులతోఁ గలుపుకొని సుఖస్థితినుంచెను. ఇట్లు భద్రరథుండను నారుద్రుండు కాంచిపురంబునంగల సకలజీవులం గైలాసవాసులంజేయ సిరియాలుశెట్టి ప్రమథగణంబులతోఁ గలసిమెలసి సంచరించుచు నొకదినంబున నందరువిన "నిజపు

త్రుంజూపి యీశ్వరునికి విందొనర్చి మెప్పించి మరల పుత్రునింబడియు టయోగాక పరిజనసమేతంబుగా గైలాసంబుం జొఱగొన్న నావంటిభక్తుఁడు ముల్లోకంబులం గలఁడే" యని గర్వంబునం బలికె. ఇట్లు చిరుతొండనంబికిఁ (సిరియాళు) గలిఁగిన గర్వం బపనయింపం దలంచి యించువిలుకానిం బరిమార్చిన యార్చిష్మన్నేత్రుండు తెలియనివానివలె నటించి యొకనాఁడు దరహాసముఖంబున నాతనిం గని నవ్వుచు "శెట్టీ, మనమొ

## శివుఁడు సిరియాళుశెట్టిం దోడ్కొని నిమ్మవ్వకడకు వచ్చుట

కమాఱు భూలోకంబునకుం బోయివత్తము రమ్మా యని చెయివట్టి యిద్దఱు జంగమరూపంబులు దాల్చి నిమ్మవ్వ సదనంబునకు రాఁగా నాయవ్వయుం గడుముదంబున వారలఁ గాంచి సంతసించి మద్గృహపావనంబు గావింపవచ్చిన భూరుద్రులను మీరు నాయింట భిక్షగైకొండని వారల నాసనంబులు గల్పించి శయ్యలం బవళింపించి యిందుఁ గొంతతడవు సుఖసుప్తు లగుండు. నేవంట సేసి మీకు స్నానంబునకు జలము సిద్ధము సేసి లేపెదనని ప్రార్థించి వారలఁ దనయింట విడియించి తాను వంట సేయుచుండె. వీరిద్దరును సుఖగోష్ఠిం బ్రొద్దుపుచ్చుచుండిరి. మఱికొంత సేపటికి నిమ్మవ్వ షడ్రసోపేతంబులగు భోజనపదార్థంబులు సిద్ధపఱచి స్నానంబునకు నీరు నాలవని ఘటంబుగాని నోటికి పానీయంబుంగాని రానేగెను.

ఇంతట నామెకొమరుండు పసువులఁ గాయుచుండి యాఁకలియగుటచే నింటికివచ్చి వంటయిలుసొచ్చి "అమ్మా! యమ్మా!" యని తల్లిని పదిసార్లు పిలిచి పలుకకున్న నెందుఁబోయెనోయని యొకతబుకులో పక్వంబులైయున్న రెండుబూరెలం దీసికొని తినుచుంబోవుచున్నంతలో నీరుదీసికొని వచ్చినయవ్వ వానింగని "యోరికుక్కా, భక్తులకొఱకు సిద్ధపఱచిన పాకద్రవ్యంబుల నంటి మ్మైలబుట్టితివా? ఇట్టి నీవంటి కొడుకుండి నేమి లేకనేమి" యని వానిం జావమొత్తి గాడిలోఁ ద్రోసివేసి

## నిమ్మవ్వ తనసుతునిఁ జంపుట.

యాశవముపైఁ దొక్కకప్పి శుచిస్నాతయై మఱల పునఃప్రయత్నంబు సేసి పరిశుద్ధపాకంబొనర్చి జలంబుంగొనివచ్చుటకై మఱల నేటికింబో యెను ఈనడుమ శివుఁడు సిరియాలుం దోడ్కొని గాడియొద్దకుంబోయి చచ్చినసుతునిఁ గప్పినతొక్కను గాలితోఁ దూలించి యాశవమును జూఁపి కంటివా, యీమగువసాహసము మనకై సిద్ధపఱచిన పదార్థం బుల పీనుఁగు స్పర్శించుటచే నవి యపవిత్రంబులైనవని గోతిపాలుగాఁ జేసి మఱల వంటసేసి మనస్నానంబునకు జలంబు తేఁబోయినది.' అని యవ్వ సేసిన సాహసకృత్యపుపూర్వోత్తరం బతనికిఁ జెప్పి యప్పటియట్ల నిద్రిం చువానివలె, వారిద్దఱుఁ బండుకొనియుండిరి అవ్వ యేతెంచి వారలను స్నానంబునకు లేపి "వేగమ శివపూజ గావింపుఁడు, ఆలస్యమైనది. మిగుల సొకలిగొనియుందురు గాఁబోలు "నేనిస్నానోదకం బచటనుంచి గృహం బునవారికి సివపూజా సామగ్రియంతయు సిద్ధముసేసి కాఁచియుండెను వారునుకృతస్నానులై ధౌతవస్త్రంబు లుధరించివిభూతిరుద్రాక్షలు ధరిం చి లింగపూజలుగావించి యవ్వ యొడ్డించినపదార్థంబు లారగించుటకు మున్నమిన్నేటి వాకదాలుపు నిమ్మవ్వంజీరి" అవ్వా! నీకొమరుండెంత కుమ న్నిచటికేతెంచి నిన్నుఁ బదిపర్యాయములు పిలిచినను నీవు పలు కకున్నికి నెటనోపోయెను. పాప మెంతయాకలిగొనివచ్చెనో, అట్టిబాలుని విడిచి మేముభుజించుట శ్రేయముగాదుగనుక వానింబిలిచి తోడ్కొని రమ్ము. మేము ముప్పురముఁగలిసి భుజించెదము. అంతదనుక మేముగా చియుందుము శీఘ్రంబుగ బిలువుమమా "యని యానతిచ్చిన నాయిం తియెంతయు దరహాసంబుతో" నోకటికంతా! నన్నేల మాయసేసెద వు. ఆఁడుదాననవియా నన్ను భ్రమింపవచ్చితివి ఈనీవేషంబులుమాను, నేను సిరియాలుచిరుతొండ ననుకొంటివా? సుతుఁజంపి నిన్ను మెప్పించి మఱలఁ దత్సుతునితో నీవునంగినకైలాసము నేనొల్ల. నాసుతుండు స్వ

కృతాపరాధా ఘనదోషంబులవమ్మగ్గ. వానిపాదంబులువనవాఁడు. పాతకుండ య్యె. అట్టి పాపిష్ఠికుమారుండు నాకేల. నేనువానిం బిలువను. వాఁడు రాఁడు. పొద్దుపోవుచున్నది. ప్రొద్దుఁ డఁగాని మీరు భుజింపుఁడు. నాకు తుపార్తమీకేల? పాపాత్ముఁడు నావక బ్రతుకునా? చచ్చినవాఁడుమర లవచ్చునా? వచ్చినను నేనుమెచ్చను. ఇఁకఁ దడయక సుఖభోజనము కానిం డని వారలఁ దొందరపెట్టనిమ్మవ్వ ధైర్యస్థైర్యంబులకు సిరియా

## నిమ్మవ్వకు శివుఁడు ప్రత్యక్షమగుట.

లంత్రస్తుఁజెంది మొగంబు వాల్చికొనియెను. తదతియునత్తఱిం నిర్భరనిర చింతారసనిర్మగ్నమానమానసుండై నిశ్చేష్టుండై యున్నకున్నతఱి నప్పరమేశ్వరుం డుమాసమేతుండై నందివాహనంబెక్కి ఫాలలోచనంబువిలసిల్ల నీలకంధరంబు బంధురద్యుతి నుతంబుగా హిమవచ్ఛిఖరంబుజట్టుగొన్న వన్నాకాలకాలజీమూతంబుపగిది నిగనిగలాడుచుండ నజహరిప్రముఖ నిఖిలగీర్వాణులును దమతమదేవీసమేతులై తోడనగుదేర రుద్రప్రమథగణంబులతోఁ జతురాభ్యహుండై నిజసాక్షాచ్ఛంభురూపంబునఁ బ్రత్యక్షుండై యెదుటనిలిచినఁ గని తయ్యంగన యిట్లనియె.

నీలకంఠా! యేమి యీనీవేడబములు. భక్తులమొఱ భగవంతుఁడుపడుపాట్లట్టివె తొల్లినొక కొంటెతనపు మాయవేషమున నాతెంచి భ్రమపెట్టి తుదకు నిజరూపుసూపి రారమ్మనిపిలుచుట, వరంబులు వేఁడుమనుట, యిదిమొదలగు పనులు నేనెఱుంగనిగాననుగాను. మానినినైనను సీమాతులకు లోనుగాను ఆకలిగొనిన స్తనంధయుడు తల్లిచనుబాలకపేక్షించి యేడ్చుచుండ నాతల్లిబాల్లిమాటలచే బిడ్డలయెండ రొకటిచేతఁబెట్టి లాలించి పాలుమ్మాలియేగుగతి, నాయింటఁగుడువచ్చి నాచేత త్రుంక్షుతశిరలఁ బిండితనంటలతో పాకంబుసేయించి సిద్ధమైయున్న భోజనమునుమాని, యిట్టిమాయారూపములం జూపిన నేఁబోనిచ్చువాననుగాను. తొల్లింటిభక్తులభంగి నేనీభక్తులకు లొంగి నీవిచ్చువరంబులం

బడసి యాలోకంబునఁ జిరకాలంబు బ్రతికి తుదకుఁ గైలాసంబుఁ జేరు దాననుగాను. మఱియు నిప్పుడేసీవెంటరమ్మని చీరినఁ జేరుదాననుగాను. ఇఁక లేనిపోని యనూనమానితాకారంబులం బూనక మానక తిన్నఁగఁ గూర్చుండి నేవడ్డించిన యన్నంబువంటకంబులతో నారగించి మఱిపొ మ్ము. నమ్ము. వదలను కదలనియ్యను" అని గట్టిపట్టుపట్టియున్న య న్నుమిన్నకోరిక దీర్పఁ గూర్చుండి దండిగభుజించి సిరియాలుం దనుమని యాతనిచింతదీర్చి ముఖంబెత్తి "నీవేల యిట్లు చిన్నవ్రావుచున్నావు? పన్నగభూషణు భక్తులచరితంబులు వినలేదె తొల్లి కాటకోటచండిశా దులొక నిమిత్తమునఁ దమతండ్రుల నాప్తులనెంతయుఁ గొంకక ఖండిం చి కండకండలుగాఁజెండి యావెంటనె సాక్షాత్కరించిన నాలీలన మఱి లవారలు జీవంబులంబొందలేదె?

## నరసింగనైనారుకథ

మఱియుపారభక్తులలో నొండగు నరసింగనయనారనువాఁడు భూరమణీకంఠహారతరళాయమానంబై మాననీయంబగు ద్రావిడ దేశంబునకు రాజైయుండి యొక్కనాఁడు రాణివాసంబుతో నుద్యాన వనంబునకేఁగి యందున్నపన్నగాభరణు మందిరంబునకేఁగి యందు నింతువేళకుం బూజించుటకుఁ బూలుదెమ్మని తోటమాలికాజ్ఞాపింప వాఁడు వాడనసద్యోనికృత్తంబులగు పూలగుత్తులగంపలో నిడి దేవ పూజకుఁగొనిరా నారాణియందొక పూవుందీసి తనముక్కున మూ సూఁడ నాపూలవాఁడు భూవిభుదేవి ముక్కుఁగ్రక్కునఁ గోసెను. అది గని తోటబోటులు ఘోకున ఘోషించుచుఁ బరువులిడి రాజునకావార్త నివేదించినభూపతి యావువ్వులకాపరిఁ బిలిపించి "రోరీ, మూర్ఖా, నీకు శివపూజావిధానంపు పరిపాటి తెలియదు శివపూజకు నాయత్తము సేయఁబడిన పూలగుత్తులలో నొకపూవుందీసిన చేతినిముందుగ నుమక న్నుముక్కునా చక్కఁగఁగోసితివి? ఛీ పోయని వానిం బంపి యింపుమాట

లతో సొంపుక త్తెంబిలువఁ బంపి 'యోసీ! నీవాపూవు నెట్టు చేయి జాపి తీసి
తివి మాతము చాఁ బ్రమాయని చేయిచాపించి యాకరంబుం దనకరవా
లంబునఁ బ్రకోష్టంబు నొద్దనుఁ దద్దయురయంబునఁ దెగనఱక నేమపరి
త్యక్తమై తెగినముక్కు ఁ దునకయు హస్తకమలంబును మఱలనయ్యె
వోట్లనతికి యవింగితజ్ఞవాలగు సీయాలికి నట్టిబుద్ధి పుట్టించిన దోషంబు
నాదిగాని మా మెరిగాదని యొసఁబఱచి యొప్పగించి గైనుమన నింకు
మనంబున మఱిమఱియుఁ బొంగుచుఁ జేసిన్నవాఁడు గాఁడె? మఱియొ
కనాఁడు పుడమితేఁడు దనచేడియ కొట్లనున్న ధాన్యమంతయు వెచ్చఁ
బెట్టినదనికోపించి గర్భిణియను ననుమానమైన లేక తలఁ దఱిగి మఱల
నాకృపచే నామె ప్రాణములం బడయలేదె? ఇట్టివిగా భక్తుల చర్యలు.
ఇఁక మన యన్వయోత్పన్నుఁ జేసిన తనయుని చప్పుడుగాని వెఱవునఁ జంపి
వెట్టియు నేఁ బ్రసన్నుండనై వరము లిచ్చెద వేఁడుమన్న మిన్నకుండి
మఱల ... నూనుని ప్రాణంబుల బడయువఁ ... నా? నిజ
మె ... నాత్రముఖ్య విష్ణుపంబు సేసి
నాయనుజ్ఞపైఁ జంపితివిగావ నేఁ బిలువుమన నీయుంగనపిలిచె. తనయుఁ
డు వనుదెంచె. నిమ్మవ్వయో, మన మెఱుంగకుండఁ గను మొఱఁగి ఛంపి
యదిగావున మనము పిలువమన్నను బిలువకయ్యె ఇట్టి భక్తులు, భక్త
రాండ్రు నవేలుగలరు కాఁబట్టి నేనె భక్తాగ్రేసరుఁడనని యహంక
రించి విఱ్ఱవీఁగరాదు" అని పరమేశ్వరుఁడు సెప్పనంతలో సిరియాలు
పెడతలవెట్టుకొని తిన యహంకారమునకు సిగ్గువడుచు దిక్కులు సూఁచు
చుండెను అప్పు డప్పరమకారుణికోత్తముండగు నమ్మత్తగజాసురారి
సిరియాలునూరార్చి యహంకృతి మాన్పించి నిమ్మవ్వసుతునకుఁ బ్రాణ
ములిచ్చి లేవఁ జేసి తల్లిని జెల్లివ ప్రాణంబులం గొల్లగొని యల్లపిల్లెడు
కొడుకునుం గలిపి కైలాసంబునకు రమ్మనిపిలువ నామె "నాకు ముక్తి
యక్కఱలేదు భక్తియ చాలును. చరలింగసేవ యొనరించుచు నీభూలో

నంబుననె యుండెద"నని పోనొల్లని యాయిల్లాలికి, నామెసుతునకుఁ జిరంజీవిత్వపదవి నొసఁగిన నాయవ్వయు సత్క్రియ లాచరించుచు పుత్త్రుండును దానును దమచరిత్రను లోకుల నేకవిధంబులఁ గొని యాడుచుఁ గ్రీడించుచుండ నిరంతరంబున జీవించుచున్నది. ఈసిరి యాలు నిమ్మవ్వలకథలు వినువారికి నాయుష్యము లైసనుతులు గలిఁ గి వారలుం దామును చిరజీవులై యుందురు. అట్లు శివుఁ డానతిచ్చినకథ విని సిరియాలు కైలాసంబునకుఁ బోనుంకించుటఁ గని మనుసిక దైవంబు పూనిక యాతనిగరంబునఁ దెమల్చి పట్టిరమ్మని జంగమవేషంబు లిద్దఱుఁ దాల్చి యింక యుభిక్షులఁ జూడఁదగి హాలాయుధపురమున కరిఁగిరి. మా ర్గంబున వచ్చువారల నల్లంతదూరమునఁ జూడఁగానే హాలాయుధుం డను

## హాలాయుధునికథ

నప్పుడమి యొకిమీఁదుల్లాసంబుతో నెదురువోయి యుగ్ఘనావాద్యములతో సఁగి గృహంబునకుఁ దోడ్తెచ్చి పుష్పహారంబులును పదార్థంబుల భోజ నతృప్తులఁ గావించి కుశలప్రశ్నసల్లాపంబులఁ బ్రొద్దుపుచ్చుచు, "హార మూర్తులారా! మీ రెందుండి యిటకేఁగుదెంచితిరి మద్గృహపావనంబు సేయ నిటకే చనుదెంచితిరా? మఱి యెందేనిఁ బోవుచు మార్గాయాసం బపనయించుకొన నిటకరుదెంచితిరా? భవద్దర్శనంబున మన్మనంబున కమితానందంబు వొడమినది. నాచేఁ బూజలందుచు నింకఁ గొంతకాలం బుండుం"డను హాలాయుధునికి హరునిభక్తుండు దక్షిణాస్త్రపాకటాక్షం బున నాతని నీక్షించి యిట్లనియె.

"భక్తాగ్రేసరా! మావంటిజంగమంబులను మీవంటిగృహస్థు లేగదా సర్వదా నిర్వహించెడివారు. మేమొకచో నుండెడివారము గాము భక్తులవలనఁ బూజింపబడుచు నెడతెగని సంచారంబున నూరూరఁ గల శివవ్రతధుర్యుల నిరీక్షించుచుఁ దిరుగుచుండెడివారము. మేము భక్త లెందున్నను వెదకి వారిండ్లకుం జనియెదము. వారును మమ్ముఁ దమ

ప్రాణలింగంబులని భావించి యనుభవించుచుందురు నీవెఱింగినతొల్లిం టిభక్తులలో నీలకంఠుడు కరికాలచోడుడు అర్యమయ్య, చంగళీమారఁడు ఏకాంతనాథుఁడు చేరరాజు, వాగీశనైనారు సోమాసిమారఁడు పళ్లనయనారు, మొదలగుభక్తుల గృహంబులమేమర్చనంబుల నందినవారమె. మమ్మెఱుఁగనివారును మాకుఁదృప్తిఁగలుగఁ జేయనివారును భక్తులీలోకంబునలేరు మేమూవినిజన్మించినది నిరాలంబపురము. మాజననీజనకులెవ్వరో మాకుఁదెలియదు మమ్మునాఁడినుండి పెంచిపెద్దలం జేసినవారు మీవంటిభక్తులే మాకుబాల్యంబునం దలయూటిసలుగిసి నీర్వోసి జలకమార్చిన దొకభక్తురాలు భక్తుండొకడు మమ్మును చిన్నప్పుడు కేలంగేల్పట్టి నడిపించె. మాకుముద్దుమాటలునేర్పి బుద్ధిగలిగించినవాఁడు మఱియొకభక్తుఁడు కట్టవస్త్రములిచ్చిన వాడొకఁడు. భోజనముదినిపించినవాఁడింకొకఁడు గంతులిడుచలమై దుండగంబున నొకనాఁడు మేముపశుతుల యాందోళనవలింపఁగోరినపు డొకభక్తుఁడు మాకిట్టియి సుముఖులం బొందుపఱిచి మాయుద్దు సెల్లించెను జడలు దాల్చివిరాగత్వమొంది భక్తసంచారంబు సేయఁగమకించు మాకునొక భక్తుండు తనకూఁతు నూతనవివాహితకొప్పగోసి మాజడలకర్పించి మమ్మునిజమైన ప్రస్తుతజంగమరూపంబునకుఁ దెచ్చినయచ్చపుభక్తుఁడు వేఱొకండు. ఇట్లుభక్తులవలననే సమస్తసదుపాయంబులం గనుచుమను చున్నవారము ఇంతయేల మొన్నశిరియాలుశెట్టి యీశ్వరునకొక గొప్ప విందొనర్చి తనబంధుమిత్రాప్తులగు పురజనంబులనందఱితోఁ గైలాసంబుఁ జూఱఁగొన్నవాఁడుగాఁడె? కంచిలోసిరియాలుఁడు భక్తసమారాధన సేయుచుండ నొకదినంబున శివుండాతనిమనంబులో తెరయఁగోరి తనదూతలననేకులఁబంప వారలవంపితిని పిలిచినంత చెఱుకుసమిచ్చి తృప్తులంజేసి యీశ్వరునింగెలిచె. మఱియు నాకంచిలోనే యుండునదియొక్క దినంబులెస తెగని వానఁగురిపించిన నెప్పుడును బదివేల జంగమదేవరలుం

డాకిపట్టణంబున నొకండును లేక యందరు నేఁగిరి. అంత సిరియాలు జంగమాన్వేషణుండగుచుఁ దిరుగుచుండ గొండవిలుకాఁడు జంగమరూపంబు నగ్నించి యాతని తనూభవుమాంసంబున విందుఁ గోర నతఁడట్లొనర్చ సంతసించి మఱల నాతని సుతు బ్రతికించి పురజనులందఱితో నాతని గైలాసంబునకుం గొంపోయె. అప్పుడు మేమచ్చట నేయుండి కన్నులారఁ గాంచితిమి. ఇది తథ్యము. ఇవంతయు వింతగాదు మేము చూచినదిగాని విన్నదిగాదు అట్టిభక్తులీభూలోకంబున నెవ్వరేనిం గలరే?" యని చెప్పుచున్న యప్పరమేశ్వరునకు హలాయుధుండు "ఏమీ! సిరియాలుని శివుడు జంగమరూపమున వచ్చి నీతనయుం జంపి యామాంసంబు నాకుఁ దినఁబెట్టుమని నిజముగాఁ గోరెనా?" యని యెఱుంగనివానివలె నడుగుటయు నాగట్టురాపట్టి మగఁడు" నిజమే మేముగంటిమని చెప్పితిని గాదా నీవు నమ్మవేనిఁ జూడుమాతని చరితంబు లోకంబున పద్యకావ్యముగాను దృశ్యకావ్యంబగు నాటకంబుగాను వచనకావ్యముగాను మహాకవులచేఁ జేయఁబడి బహుజనులచేఁ జదువంబడి వినంబడుచుఁ బ్రసిద్ధింపంబడి చూడఁబడుచున్నది మఱియు నాటకము చూచునపుడు పశ్యన్మహాజనులందఱు నిమతము తెనుఁగుంబులకలఁ గరింపఁ గనుచుండి యిట్టిభక్తు లెందును లేరని ప్రశంససేయుచుందురు. ఇంతియగాక పసుల కాపరిపిల్లకాయలు దమసామ్ములు మేయుచుండఁ వారందఱొకచోఁ గూడి సిరియాలుకథను పాటగాఁ బాడుచు నాటకమాడుదురు. స్త్రీలు తిరుగలిము దఱబండి విసురునపుడును, రోఁకటఁ దంపునపుడును సిరియాలు పాటయే పాడుచుందురు" ఇట్లని మఱిమఱి నెఱనమ్మకము పుట్టునట్టుల సిరియాలుకథ నుడివెడు నాయుడు పనాయకశేఖరుమాటలు విని విని తన మనంబున ఘనంబగు కోపంబంకురింప ముఖము జేవురింపఁ బండ్లు పటపటఁ గొరుకుచు. ఆహా! ఏమియాశ్చర్యకరమగు గాథ వింటిని దనుజుఁడు దినుమనుజమాంసమును శివుఁడు తినఁగోరెనా? కోరెను బోదయా విహా

నుండగు యామునివలె సుతుం జంపఁ దగ్రశీకెట్లు బుద్ధిపుట్టెను? పుట్టెనుటో రక్క సివలె తల్లియు నెట్లుల్లసితభావంబునఁ దనచేతులారఁ గన్నకొడుకు నుఁ జంపించెను తనతనూజుఁడైనను వానిం జంపుటకు వీనికేమి స్వాతంత్ర్యముగలదు? ఒకనిజీవంబును బోఁగొట్టి నొకనికిపు ట్ట్క గలదా? తుదకుఁ దినజీవమును దాను తీసికోలేము ఇట్లు నిజీవత్యాగము తనంత దాఁ జేయువాఁడాత్మహత్య యను పాపఫలం బనుభవింపఁడా. పరజీవపహంత యునట్లు యధికపాపభాక్కగును ఇంతకు నరమాంసముఁ దెమ్మని శివుడు గోరెను గాని సూనునిఁజంపుమని కోరి లేదుగదా? అట్టిచో శిబిచక్రవర్తి వలెఁ దిన దేహంబుఁ గండలుకోసి వండింపి పెట్టఁగూడదా? బిడ్డనిజీవముకన్నఁ దనజీవము హెచ్చగునా? పూర్వమొకకోఁతి తనపిల్ల కడుపున నటుకొని యుండఁగా నొక కాలిన పెనము దెచ్చి దానిపై నాకోఁతిని బలవంతముగ గూర్చుండఁబెట్టె నదికడుపుననున్నపిల్లను దిగజార్చి యాపెనముపైఁ బెట్టెనెచి దానిపై దాను గూర్చుండెను తనముద్ది కాలకుండున ట్లుల పిల్లనడ్డుపెట్టుకొన్నదిగాని దానిబాధ నివారింపఁబెట్టినదిగాదు కనుక నేమర్కటకిశోరన్యాయమునఁ బిల్లనిట్టిగాని తల్లిపట్టులేదు. అప్పుడు పుట్టిన పిల్లయైనను దన్నుఁదాఁ గాపాడుకొనవలెను గాని తల్లిగాఁపాడదుగదా? అట్టితల్లియో యీశిరియాలునాలియు కినికిరిసునుమాటలేక పాపభీతి రినంతయుఁ దోఁచె సుతునిఁ జంపె వాని భక్తియననెంత? అట్టి మూఢభక్తిం బరీక్షింపఁబోయిన యామూఢునెనము యొక్క దైవత్వమననెంత? ఇట్టి బహువ్యసనకరంబగు ఘోరకృత్యం బాచరించిన యాశివునకు సిరియాలునకుం బ్రమథగణంబులకు వెలినుమండోజనులారా! యనిమహాకోపంబున ఘంటానాదంబుసేసి బాహువులప్పళించి తోఁడనఁ దన సింహనాదంబున లోకంబునఁ జాటఁబంపెను అప్పుడు సిరియాలును దమపై కేమివచ్చునోయని భయపడుచుండ జంగమరూపంబున వచ్చిన వాఁడు గావమిమ్ము మన్నింపవలసివచ్చినది గాని, లేనియెడల మీరును

దద్బహిష్కారాహుస్తె” యని మాఁడిపలుచు శివుఁడు ముదిపిమతిఁ జెడి తొండమునిదిరి యూసరిచ్చల్లియైనట్లులఁ దాను దానవుండయ్యెను. రాక్షసులచే నుపాసనీయుండగు దైవంబునకు రాక్షసత్వమె ప్రాప్తించునుగాని దేవత్వమెట్లునిల్చును? నరాముఁడు సేయుకృత్యములు నరాదకృత్యములుగావా? కనుకనే యట్టికృత్యంబు సిరియాలుచేఁ జేయించెనని చిందులుద్రొక్కుచుండెను అదిసూచి సిరియాలును సిరియాలు నేస్తుండును సిగ్గునమొగంబులు వంచుకొని యొకమూల నొదిగికూర్చుండిరి అప్పుడు పినాకి తనమనసంబున దిగులొంది మఱియు హలాయుధుని నామవచనంబులఁ దానోడఁబడఁజేయలేమని శ్యామలాంబనుమనంబునఁ దలంచుకొనెను

అంతనా హిమవంతునికూఁతురు పెనిముత్తైదువయగు జంగమభక్తురాలి చందంబున నందంబగు మేన పసుపుబూసి కుంకుమబొట్టు వెట్టి భ్రూమధ్యంబున విభూతిరేఖవనర రుద్రాక్షమాలలు మెడఁదాల్చి శివస్మరణపూర్వకముగా నచటఁ బ్రత్యక్షంబైన, హలాయుధుఁ డెదు రేగి భక్తివందనం బాచరించి యుచితసత్కారంబుల లోనికిఁగొంపోయి యాసనాసీనంగావించిన నాయమ్మయు నాతనిసంబోధించి “ఏంటివా! హలాయుధా! విష్ణువు తనభార్యయగులక్ష్మిని వక్షస్థలంబున నిడుకొని కాపాడుకొనుచుండెను బ్రహ్మ సరస్వతిని ముఖమందు ముడ్చుకొని యావందించుచున్నవాఁడు ఇట్లయినను లక్ష్మీసరస్వతులకు జాతినీతులులే నిఖలజాతిపురుషులను దామువరించి వారితో వివహరించుచున్నవారు. అట్టివారలస్థితియె యట్లుండఁగా నీకలోకములో స్త్రీలకెక్కుడు యింగితజ్ఞతగలదనిచెప్పవచ్చును సర్వకాలసర్వావస్థలయందుఁ గందర్పహరుని యర్ధాంగంబునందుండి పరపురుషులఁ గన్నెత్తియైనఁజూడని పార్వతియొక్కతె లోకములో మహాపతివ్రతయనిచెప్పవచ్చును అట్టిపార్వతివటిదానను నేనునిన్నుఁ జూడవచ్చితిని. హలాయుధుండును శివభక్తాగ్రేసరుఁడు

జంగమభక్తులకును, భక్తురాండ్రకు నేమిగోరిననది యెల్లనిచ్చుచున్న వాఁడను ప్రతీతిలోకమంతంతటను వ్యాపించినది ॥ అనిచెప్పుచున్నయ వ్వార్యతిమాటలువిని హలాయుధుఁడు" భక్తులలో నధమాధముఁడను నేను నన్నిట్లునుతింపవచ్చునాతల్లీ! ఇచ్చుటకు నేనెవండను? మీభక్తి యమీకునను స్తంబులిచ్చును. ఇఁకేమిగావలెనో కోరుమమ్మా ॥ యని హలాయుధుండనెను. అంతనాయుగవయుని గజగమనంబునకు ననువగు పాదంబులు నేలమోపి లేచినిలువంబడి చేతులుమోడ్చి ఆవెంటనే సిరి యాలును లేచినిల్చి కైదోయిజోడించి నేలకొరిగి సాష్టాంగంబుగా న మస్కరింపుచు ప ॥ ఓయి హలాయుధా! నీవు శివపూజాధురంధరుఁడ వు పరమపవిత్రగాత్రుఁడవు లింగసంగితుండవు నీకష్టైవుండవు భక్తు లయెడను నిక్తుఁడవు ఇట్టి సుగుణశాలివిగనుకనే నీ .నేను భక్తురాలివే పుంబువ నన్నుమెచ్చితివి. (శ్రీయుతుకళింపిన కర్పూరపులంబులు వికసింపం జేసి నిఖిలాకార గాత్రంబుపైనుంచి" నన్ను విన్నము నిజమెత్తిం గిరెదను నునుమానిని గాను ఈశానుని వాము భాగంబునుండి నీవంటిభక్తులయొద్దకు నేయుమునుపు శ్యామలాదేవిని ఈజగమ రూపంబులకుఁ గన్పడి ముప్పొను చేతులు నిరించి నీకు సాష్టాంగ దండంబు వెట్టుచున్న యీభక్తుడైపిరియాలు అవ్వలనెవ్వగనివ్వటిల్లెడు మానుకొనిపోయిన యెడపువ్వులో చిన్నబోయిన మొగంబుతోఁ దల వాల్చుకొని నిల్చియున్నయమ్మహానుభావుఁడే సుమీ హాలాయుఁడు నీ దృఢభక్తికి మెచ్చి వీరిద్దఱునీవేషంబులవచ్చి నీకలొంగి నీచేనర్చింపంబడి యోడితమని సిగ్గుననీతో మాటాడనేరక నన్నుంపలంపుకొనిన నేవచ్చి యున్నరూపు నీకెఱింగించితి ఇఁకనీవువారలను గారవించిపమ్ముల నను పుము పోయివచ్చెదమనిన హలాయుధుండు లజ్జాననతవదనుండై ॥ శివా భవా, యభవా, మృత్యుంజయా, కాలకంఠా, భక్తపారిజాతమా శాక్తేయపశుపాలకా! పశుపతీ, మాయాజంగమరూపంబున నాసదనం

కుంకుండు భద్రరథారూఢుండై శూలవజ్రఖడ్గాద్యాయుధంబులతో జటాజూటంబులతో, నద్దానఁ జెలఁగొనియున్న గంగావాహినితో, పన్నగ శిఖాపాశముతో చంద్రచూడామణితో భసితవిభూతికోలతో రుద్రాక్షమాలలతోఁ గపాలభిక్షాపాత్రంబుతో నభయహస్తంబుతో నఢకాఁ దాలుత జంగమరాలిరూపంబున హలాయుధునికిఁ గన్పడి తోడ నయుక్తశక్త్యంబై యీశ్వరుని వామార్ధాంగంబునఁ దూరి ముసిముసి నవ్వులతోఁ దొంగిచూచుచున్న శ్యామాదేవితోఁ బొడసూపెను. హలాయుధుండును సవినయభక్తి నమస్కారంబులుగావించిన నించుకల్తునిఁ గొంచపఱచిన పంచముఖుండు "హలాయుధా! నీభక్తికిమెచ్చితి. రమ్ము. రమ్ము కైలాసంబున" కని యంతనిలువక సకలజనంబులతో నతండేలు నవపురంబులలోని సకలజీవులను నాలుగంగుళములలోతువఱ్ఱ నూళ్లతున్నను వెల్లవెల్లలుగాఁ దీయించి కైలాసంబున కుఁగొనిపోయెను. ఇట్లు పెరియాలునకు గురువచ్చిన యాహాభావమునఁ దెచ్చుటకు నిటలనయనుండు హలాయుధునిఁ దఁ గల్పించి, యాడఁగన్నాటకి సూత్రధారుఁ డీకపటనాటకమాడెను కాన నీకథవినువారును జదువువారును వినువారికిం జెప్పువారును హలాయుధునివలెఁ గైలాసంబు నొందెదరు. కావున నోబసవకుమారా! భక్తులకెందైన నసాంగంతర ముగలదునా?

⊰మరుదుండునికథ⊱

మఱియుఁ జెంగొండయను నొకపురంబున మరుదుండండను నొక మహాభక్తుఁడు గాపురముండెను అతండు లింగసంగతదేహుండు. భక్తార్చనారతుఁడు. నిర్వికారి. నిరహంకారి. నిస్తులుండు భక్తిభూషణుండు. ముక్తసంగుండు సత్యంగనక్తచిత్తుఁడు దైవికసామర్థ్యసంపన్నుఁడు శివానుగ్రహాదక్షుంబగు తపోమహిమగలవాఁడు. ప్రతిసంవత్సరము బహునిష్ఠతో శివరాత్రివ్రతముసలుపువాఁడు ఇట్టిమహానుభావుఁ

డగు నామిష్ఠునుండనయనారు తనయూరశివరాత్రిదీక్ష యేకాధ్వరమ్ముగా బండ్రెండువత్సరములు నిచ్చిలువచ్చుపుబత్తి నొనరించి పదమూఁడవ యేఁటఁ దిరువారూరనుగ్రామంబునకుఁబోయి శివరాత్రిదినంబున నందున్న వల్మీకేశ్వరుఁడను మహేశుంగొలువఁ దదాలయంబునకరిఁగి యచటనున్న శివభక్తులతో నిష్ఠగోష్ఠిం గాలక్షేపంబు సేయుచుండెను. ఆసమయంబున నాపురంబునఁ గలనంబియను నొకధనికుండు సంతతవేశ్యాలంపటుండు జారశిఖామణి తనపరిజనంబులిరు దెలంకులఁ గొలువ కవిగాయకజనబుల స్తోత్రపద్యగద్యగీతంబులఁ జదువుచుఁ బాడుచుఁ జేతుల మద్దెలల తాళంబులఁ గొనినవారు తాళంబులవాయించుచుఁ దమరాక దెలుపుచుఁ దోడ రాఁ దానొకయాందోళిక నెక్కి వేత్రహస్తులు దారిస్సేయుచు ముందునడవ శివభక్తులుగొండఱు ద్రవ్యాశచేఁదన్ను బహువిధంబులఁ గైవారంబులు సేయుచు దీవనలిచ్చుచు ననుసరింప మహావైభవంబుతో గుడికిఁబోయి వాకిటఁబల్లకి డిగి లోనికరిగి చూచెను భక్తులనైపు దిరిగిచూడక నిర్లక్ష్యభావంబునఁ దనయుంపుడుకత్తెను మనంబునధ్యానించుచు దానివిలాసంబులం దలంచుచుఁ దనలోఁ దానెనవ్వుకొనుచుఁ దననీడఁ దానెచూచుచుకొనుచు నతివేగంబున గర్భగేహంబులోనికిఁబోయి దేవునిఁ దనపడియిమ్మని యడుగుచుండఁగా నురుమిండనయనారదిగని యీఁడెవ్వఁడు దిగ్గజంబులవంటి పరమశివభక్తులిట్టు నుండవారలంగనక గౌరవింపక సగర్వంబుగానిట బోవుచున్నవాఁడు వీఁడెవండు భక్తులననాదరభావంబునం బరిహరించి గుడిలోనికిఁ బోవుచున్నవాఁడు. ఇట్టివీనిగర్వమును సర్వమంగళాధవుండెట్లుసహించె? శివుఁడలిగినభక్తుఁడు కాయఁగలఁడుగాని, భక్తుఁడలిగిన శివుఁడుగాయఁగలఁడె? చూతముగీనిపంతంబు. తత్క్షణమ్ము బైటకుఁదఱుముదు. ఇదివీనిసాహసమో లేక యీదేవునిమన్ననయో" యనివానిమెడబట్టి యర్ధచంద్రప్రయోగము సేయనుంకించునవసరంబున నాగుడితంబడి [పూజారి] పరుఁగుపరుఁగున

బాఁగుబాఁగు వానిజోలికిఁబోకుఁడని యామరుమిండఁడనయనారిపాదంబులంబడి సాష్టాంగదండంబువెట్టి చేతులుజోడించి" దేవా! వీనిమీ రోఁతయుం గరా ఈనల్మికేశ్వరునిముద్దఁడు. వీనితోనాదేవుఁడు ప్రీతిదినమునిష్టగోష్ఠిఁజరుపుచుముద్దుసేయుచు దినమునకువేయినిష్కంబులు వానియిష్టానుసారము భోగించుటకిచ్చుచుండును వీనివంటివిటుఁ డీలోకంబునఁగాదేలోకంబుననుండఁడని నానమ్మకము వీనివేశ్యకును వీనికినిదగవువచ్చినవు డీశ్వరుఁడు తగవరియై మధ్యనిల్చి హాస్యరసంబులగు సరససల్లాపంబుల వారలఁగొలుపుచుండును. వీనిజారత్వమును దానెట్లుసహించెనో ఆజారత్వమునకుఁదగినధనము దినమునకువేయినిష్కములిచ్చునని తోలుతమనవిసేసికొనియెయుంటిని. ॥శ్లో. దాసోఽమానధనాహంతి వేశ్యాధనాధికం ఆయూంషివినవాహంతి సర్వంహంతిపరాంగనా॥" అన్నటుల వేశ్యాలంపటునకెంతధనమునుజాలదు అందుకనియె దినమునకువేయుమాడలధనమిచ్చుట జారులనుశిక్షించుటకుజామాత వీనిజారత్వమునోర్చుట యాశ్చర్యము ఏమీ యాశ్చర్యమేమీ! దారువనమునిమానిసీమా ధనాపహారుండగు నమ్మాకసంహారకుండు వీనిజారగుణంబు సహించుట యొకవింతయగునా? జారుఁడుజారులనేగదా మెచ్చును. వారలనేగదా చేరదీయును" అనిచెప్పుచుపూజారిమాటలువిని ॥ఓహో యిట్టివాఁడా యీబూచులతేఁడు వీనిననఁబనియేమి ఇట్టివానిం జేరఁదీసి గర్వోన్నతునిఁజేసిన యాశంభునిదితప్పు కనుకనోభక్తులారా! నేఁటినుండి పంచశరసేవకునికి ననుంగుఁజెలికాఁడగు మనపంచశరారికి, వాని గణంబులకు వెలిబెట్టుదము లెండిలెండిమనముపోదము. గుడి[illegible]ందుండువలదని ॥ఘంటానాదంబున వాదువెట్టిభక్తులతోఁడం తానును వెడలిపోవుసమయంబున నాగచర్మాంబరుండు మొండగుసిగ్గుతో నాదేవళంబందుండనోడి, భక్తులుసూడకుండునట్లులును పూజారుల కనుమొఱఁగియు సూక్ష్మరూపంబున నంబియుఁ దన్ననుసరించి వెంటరాఁబయలు

వెడలుమార్గంబుగానక భక్తులుగనిన నవ్వాదరమునస్గున నగ్గలికంబగు
నెవ్వగముదిగదుక గర్భగుడినుండి సోమసూత్రద్వారంబున బయటవచ్చి
యంతటనుంటపదీపస్తంభంబుల నీడలందనువుదాచుకొనుచు మొగం
బునరుచేతమూసికొనుచు గోపురద్వారంబుదాటి గుడివెనుకకుఁజని యా
తెఱువునఁ జాటిపోవుచు మార్గమధ్యంబున నొకగండశిల చతుష్కో
ణంబులుగలది యడ్డుపడియున్న దానిఁగండ్రించి యారంధ్రంబున
దూరి యవ్వలనని వెనుకకుఁదిరిగి చూచుచునదిరిపడుచు బెదురుగుండె
యగలవాఁడై పోయిపోయి యెదురనొక నానావిధతరులతాగుల్మంబు
లను శుకపికాదివిహంగమమృదుమధుర రవంబులను పుష్పఫలసుగంధ
గంధవత్వంబునను హరిణశంకురామమరుశశాదినిర్వాచకమృగసంకుల
త్వంబునను మనోహరంబగు నుద్యానవనంబుగని యందుసందందుసంచ
రించుచుఁ దావచ్చినతోఁదానెఱుఁగక తిరుగుచుఁ గొంతదూరంబున
నిర్మలనీహారశీతలసలిలపూరంబును కమలకుముదశైవాలభారంబును హం
సకారండవాదిజలవిహగసంచారంబును మత్స్యకూర్మాదిజలచరవారం
బును మణిమయసోపానతీరంబును దేవతావిహారంబునగు నొకకాసారం
బుగాంచి దానితటంబుల నలుదిక్కుల నిక్కుజంబులగు జంబూ ప్లక్ష
సాల, రసాల తమాల తాల హింతాల పనస ఖర్జూర, పూగ నాగరంగ
నాళికేర నింబ రంభాది భూరుహచ్ఛాయలం గలయఁదిరుగుచు దివ్యుల
నొకసంతాన మహీరుహంబుఁగని దాని ధౌతమయకాంతింగని దూరం
బువనుండి చూచినదిగనుక దాఁపిడిచివచ్చిన గుడితానితొలుతభ్రమించి
విదానించి యందలిఫలపుష్పంబులంగని దేవభూజంబుగానెఱిఁగి దాని
నీడను విశ్రమించి యెదపై చెయ్యిడి బ్రదుకుజీవుఁడాయని యూపిరిని
గుడించుచుఁ గొంతవడికి శ్రమదీరఁగన్నులుమూసి నిదురించువానివలెఁ
బండుకొనియుండెను అంత నానంబి మనంబునంగల గర్వంబుపనయించు
కొనిభక్తులకోపంబునకు భయపడి భగవంతుఁడా చాటివచ్చినప్పుడు తన

గతియేమగునో యనుభయంబున నంబాసతితో నిట్లను "అయ్యా! నీకే లయిట్టి భయము నొంద యిందుల కే తెంచుట. నీకే యిట్టి భయమున్న నాగతియేమగును?" అని యడుగ నామృడుఁడు "నాయనా, యేమిచెప్పను భక్తులు నారూపము నేను వారిరూపమను. వారు నాకు వెరవరుగాని నేవారికి వెరతును వారిసంతోషము నాసంతోషము వారిదుఃఖము నాదుఃఖము వారినిఁబూజించిన నన్నుఁబూజించుటయు వారికిచ్చిన నాకిచ్చుటయె వారి తెనాప్రాణంబులు నేనేవారిప్రాణంబులు. నేనలిగిన భక్తులుగాయఁగలరు. భక్తులలిఁగిన వారిని నేఁగాయలేను భక్తులతప్పులు భక్తులే మన్నింపవలెను. భక్తులనుదూరుట నన్నుదూరుటయె. స్థావరజంగము లింగపూజలు రెండును శేయవలెను జంగమలింగపూజ లేని స్థావరలింగపూజయేల? అదినిరర్థకము భక్తులె జంగమలింగంబులు, స్థావరలింగంబు నేను నీవుస్థావరలింగని ష్ఠదృఢభక్తుండవు జంగమలింగభక్తవిముఖుండవు. విశేషించి జంగమలింగభ్రష్టవు. నేను భక్తవత్సలుఁడను. భక్తవిగ్రహుండను భక్తపరాధీన మనస్కుఁడను భక్తాశ్రితుఁడను. భక్తసేవకుఁడను. అదియెట్లన్న వినుము

బాణునికథ

తొల్లిబాణుఁడను భక్తవరుండు చతుస్సముద్రముద్రితమగు భూమినిఁబరిపాలించుచు సర్వంసహా సమస్తజనంబులకు వలయుపదార్థంబుల నిచ్చుచు నర్థిజనకల్పద్రుమ బనఁ బేరుపొందిన బలిచక్రవర్తి నూర్వురులెనయాలలో నగ్రసుతుండు దినమునకు వేయిలింగములు నాపూజసేయుచుండెడివాఁడు. అట్టివానికి నాపూజకే కాలము చాలకపోయియుండుటచే రాజ్యభారముఁ జూచుకొనవకాశము లేకుండుటచే నేనాతనిఁగరుణించి వానికి కాలమునందే నాసహస్రావృత్తిపూజ ముగియునటుల వానికి సహస్రకరంబుల నొసంగితిని. వానితోవాఁడు సహస్రావృత్తిశివపూజ నొకనిముసంబులో నొనర్చువాఁడు అట్టివానికీర్తి లోకమందం

తటను వ్యాపింప వానిఁజూఁచుటకు భక్తగణంబులు తదితరులు నయుత నియుతసంఖ్యలు బయలుదేఱ నారంభించిరి వారలతోఁ బ్రసంగించుచుండ నాతనిఁ బూజాభంగమగునను దలంపుననే నాతనిపూజ ముగిసి యతఁడు ప్రసాదము స్వీకరించువఱకు నాతనిద్వారముకడఁ గావలి యుండువాఁడను గానా.

### కరికాలచోడుని కథ

వెండియు ముదిగొండ యనుపురంబును బాలించెడి కరికాలచోడుఁడను చోళదేశపురాజు కావేరింగట్టి దిట్టతనంబున నింటికొకరుచొప్పున వెట్టితట్టలు మోసి మట్టి తెచ్చి గట్టువెట్టుఁడని నియమించినఁ బట్టువు భక్తికిమెచ్చి తానును బురజనులతోఁ బాటు వెట్టితట్టలు మోయలేదా? మఱియు స్వామిభృత్యసంబంధంబు దిగనాడి నంబియనువాఁడు వేశ్యనుంచుకొని నిశ్చయంబుగఁ జరించుచు స్వామిచేత నే యూడిగంబులు సేయించుకొనుచుండ నూరిలోనివారేమియు వానినాన వెట్టలేక యూరకుండిరి ననపవాద తనచే వినఁబడకుండ దాగియుండెడి కరికామదేవుని కథవిని నట్లకాపాడివచ్చితిని ఆకరికామదేవునివలెఁ గాక నే నీయూరిజనంబులతో వికటించక వారలలోఁ గలసుచుకొని యేకభావంబున మెలఁగుచుంటినిగానా? వేయేల? మీతాతకుమాతాతకు యచ్చియున్నాఁడా? నీమెడల నేనేల యింతభక్తి చూపవలె ననినీవడుగ బదులుసెప్పలేక నీభక్తికి మెచ్చియేకదా నేనన్నిపనులకొడఁబడి నీయూడిగంబులు సేయుచుంటిని నేఁడునీవు నాభక్తులలో నహంకరించి వారలధిక్కరించితివి ఇఁకనీవెట్లు బ్రతుకఁగలవు? నేఁగాయలేను "సంసర్గయాపాపగుణాభవంతి" యను లోకోక్తి సార్థకంబయ్యెను నీతోటిసాంగత్యంబున నాకు నాభక్తులలో దలవంపులాయెననుచు ననేకనిదర్శనంబుల భక్తులమాహాత్మ్యంబులును వారల దివ్యచరితంబులును నుగ్గడించు నాయుగ్గికను దేవరకు మ్రొక్కి" దేవా! దీనదయాపరమూర్తీ! నేనపరాధంబు సేసితి నన్నుమన్నింపుము.

భక్తులకు నాపైఁగినుక పొడమినది గనుక దాని నాభక్తులవలన నేఁటో గొట్టివారల ప్రసాదంబునకుఁ బాత్రుండనయ్యెద ఇఁక నెన్నివిధంబుల నయినను వారింబ్రతిమాలి మ్రొక్కి ప్రసన్నులం జేసికొనియెద" ననిబ యలు వెడలి పురాభిముఖుండై తాళంబులువాయించుచుఁ బడిపడి దండం బులంబెట్టుచు భక్తిచరితంబుల గీతంబులం బాడుచుఁ బురంబున కేఁగుచు నందరుభక్తులు విను తెఱంగున వేఱవేఱ భక్తులచర్యల ననివార్యసింహ నాదంబున నిట్లని వేఱవేఱ గణుతింపం దొడంగె నెట్లనిన.

## ఏణుమూరితి కథ

ఏభక్తుండు నిత్యముఁ ద్రికాలములయందు నిందుజూటునకుఁ జందనసమర్పణంబు సేత యొకనియమంబుగాఁ గలవాఁడై యొట్టకేలకు గంధసంపాదనమునకు దనకుధనంబు లేమి నిజమనంబున ధనసంపత్తియొ కసంపత్తియె భక్తిసంపత్తియ నిజముకుసంపది. అట్టిభక్తి నాకుఁ గొదు వయగుటనె గాఁబోలు సూలపాణికిసమర్పింప నాకు దివ్యగంధం బలవడ కున్నది. కాసి, నా దేహమంతె యు గంధంబుగానరగఁ దీసియీశునకర్పిం చెదనని తనకుడిమోచేయి గంధపుసానపైనుంచి లింగోదకంబున నరగ దీయు, దేహమున కేమియు నాయాసము లేక చేయియరగక రక్తముగా రక రంగుమారక దుర్వాసనగాక శ్రీచందన గంధంపు వాసనగలిఁగి ముద్దముద్దలుగా గంధంబుబయలు దేర నాచందనమును దండశూకభూష ణునకు సమర్పించి జనులందఱు సూచుచుండ దివ్యవిమానారూఢుఁడై కైలాసంబుఁ జూఱఁగొనెనో యట్టియేణమూరితికి దాసానుదాసుఁడను.

## దవలనంచి కథ.

తనప్రాణలింగమునకు నిత్యమును వేయివత్తులు చమురునందడి పి దీపసమారాధన సేయుటయె యొకనిత్యవ్రతముగాఁ గలయొకభక్తుఁ డుదీపమునకుఁ జమురుసంపాదించుటకు ధనంబు లేమిఁ దనువున లేనిమా నెమతియెందుగలదు? అట్టినాతనువును వెలిఁగించి దీపారాధనమొనర్తు

ననిఁ కేశపాశమును నిరవకాశముగ బంధించి కొనలననువుగ వెలిగిం చి నిశ్చలుండై యాదీపమును పాపతేనిసామ్ముల దొరకుసమర్పించి యుండఁజూఁడ విమానారూఢుండై యారూఢింగైలాసమును జూచిఁ గొన్న యాఁడకవల నంబికింటి పనులు సేయుబంట నయ్యెదను.

## గుగ్గులకులియారి కథ

ఏమహానుభావుఁడు నిత్యమును పనపాశాలింగమునకు వృకధూ పంబు సమర్పణసేయుచు నట్టిధూపద్రవ్యము ను సమకూర్చుటకుఁగా నిల్లునమ్మి పుస్తెపూసలుఁ గొదువపెట్టి తుదకుఁ దెగనమ్మి యదియుం గాలక చింతించుతఱిఁ దిరుపకుం డామనుపురంబు పాలించు రాజు తాను నట్టివ్రతంబుగైకొని పెట్టలేక చిక్కుపడుచుఁ జింతిచుచున్న యవసరంబు నఁదానట కేఁగి నిచ్చలుంగొల్లగ గుగ్గిలమిడిన నాధూపంబున నీకునిఁదృ ప్తిసేతునని యొప్పించి యాఁగుగ్గలముం దెచ్చి శివాలయంబున కేఁగి యందునాగుగ్గిలము ధూపమువైచి యొక కొత్త చీరఁ దెచ్చి దానిచేఁ దుచెంగులు శివలింగమునకుఁ బట్టుముడివెట్టి కడమ రెండు చెఱఁగుల నొకమంచి దామగలకత్తి నంటఁగట్టి యాకత్తిఁ దనమెడకుఁదగి ల్చుకొని "యోదేవా! యింతదనుక నిర్విఘ్నముగా సాంబ్రాణిధూప మునీకు సమర్పించు నేనిత్తఱినే నదియర్పింపలేక నాసిగ్గునేనపొందుచు నట్టి నాయసామర్థ్యజీవనమికేల "యని గొంతుతఁగుగుకోనుచున్నా" నని వెనుకకొఱుగ, నీశ్వరునికటాక్షంబునఁ దత్సాక్షాత్కారమును కై లాసనివాసంబును గన్నవాఁడయ్యెనో యాఁగుగ్గిలకలియారికి సేవకాధ మ్ముఁడనగుచున్నాను.

## అరివాలుని కథ

నిత్యమును శివపూజాకాలమునఁ గాలగళునకు మహానైవేద్య మురాజనమల బియ్యపుటన్నముగాని మఱియొకరకము బియ్యములోవం డిన యన్నంబిడనని యొకవ్రతంబుపూని కాలక్రమమునఁ బేదఱికము

నమునిఁగి యట్టిబియ్యములచే కూరమిఁగొడవలిపట్టి కూలిచేసి తనకూలి చేసినము౯గా నారాజనాలబియ్యమిచ్చు నిశ్చయంబు సేసికొని, యా తీఁగునఁ గొన్నిదినంబులుగడిపి తుదకి వియును దొఱకక వ్యాపకము సేసి మొదుదినంబులు తండులాభావంబున కటికియుపవాసంబుసలిపి యాఱవ నాఁడు చేరెడుబియ్యములభింపఁగా నవిమైన స్వామి నివేదనంబొనర్ప నని వేవేగనింటికిఁజనుచు మధ్యమార్గంబునఁ గాలుజాఱిపడి యాబియ్య ముమంటఁగలియఁ గనుఁగొనితనవిచారించి, "శ్రీ, బియ్యమైన సీతూనకకర్ప ణ సేయఁజాలని నాబ్రతుకేల" యని యొంటనున్న కొడవలిఁదీసి మెడ కుఁదగిలించుకొని కోసుకొనయత్నించుతఱిఁ బ్రమథగణంబులతో, ఫాలనే త్రంబుతో శ్యామలింగితవామాంగంబుతో నంగజదమనుండు ప్రత్య క్షమై కైలాసంబునకుఁ దోడ్కొనిపోవ పునర్జన్మరాహిత్యమగు శాశ్వ తపదవినందె భక్తుఁడు నిత్యశివైక్యమై మనుచున్నాఁడో యాంయరిపాలున కంగిని భక్తిపరిచర్యలుసేయు దాసులదాసులకుం దానుండెను

## మడిభక్తనయనారికథ

పాండ్యదేశమునందున్న యేమడిభక్త నయనారను భక్తుఁడితర వృత్తులనేమియు నెసంగిక వలఁగొని చేఁపలుపట్టు వృత్తి నవలంబించి జాలంబులోఁ జిక్కినతొలిమీలను శివప్రీత్యర్థంబుగా విడిచి రెండవత డవవారికినవె యమ్మి యాధనంబున జాగి మూర్చనలు సలుపుచుండ నొకతరి వైదుదినంబులు వేటసాఁగక డస్సివిసికి యాఱవదినంబున వలఁబుచ్చుకొనిపోయి యొకతటాకంబున వైవనందునొక బంగారుమీను చిక్కిన దానిందీసి మఱలనీటఁబడవైచి పునర్జాలవిసర్జనంబు సేయ మఱల నదియెదగులుకొన్న దానిబోవిడిచి యెన్నిసారులు వలవైచినను నాచేఁ పయే దొరకుచున్నందున నాఁడునుసైతముపవసించి యేడవనాఁడు వేఱొ కస్థలంబున జలచరంబులతో మిగులడంబుమీరిన యొక పెద్దసరోవరంబు న వలవైవ నాఁటిదినంబునను తొలినాఁటిపైడిమీనెచిక్కి తొల్త విడు

నంబడి, మత్స్యులవిడువంబడిన వలలోనదియె చిక్కువడి యిట్లెన్నిసారులు వలవేఁటయొనర్చిన నన్నిసార్లు నదియె తగులుచున్నందున నాఁటిదినంబట్లు యట్లనె సైఁచి పదునాఁ డష్టమదినంబున వలఁగొని వేఁటాడఁబోవుచు "నేఁటికినింబునఁ జేఁపలుదొరకవేని మఱివఁజేపట్ట" నని భీష్మించి విను చుట్టయు బ్రహ్మాది మహామీనంబులను దనమాయ యనెడివలలోఁ జిక్కువెట్టుచున్న యాపన్నగభూషణుండు భక్తియనువలలో భగవంతుండు చిక్కకపోఁడను నార్యోక్తి నిజంబుసేయ నాఁటివలలోఁ దానేనిజస్వరూపంబుతోఁ జిక్కువడి ప్రత్యక్షుండై భక్తునిఁగటాక్షించి ప్రమథాధిపత్యం బొసంగి కైలాసంబునకుఁ జేరిచిన నఖండసామ్రాజ్యం బనుభవించుచుఁ బ్రమథగణసేవితుండై యునుచున్నాఁడో యట్టియడిభక్తనయనారిం జేరి బ్రతికెను దశశత భృత్యవర్గమునకు నేను దశశతతకభృత్యుండను.

(ఏనాదినాథుని కథ)

విభూతిరుద్రాక్షధారులెల్లఱుఁ దనప్రాణలింగంబుగా భావించుచు నేలాపురంబున రాజ్యమేలుచు నమితశక్తివంతుఁడై పరరాజులగెలిచి వారలవలనఁ గప్పంబులఁగొనుచు రాజులకెల్లనుముక్కులోని ముల్లయియుండ నాతనిమీఁదికి నొకరాజు తనమంత్రిని బార్వతీశశాసనధురీణుం జేసి మేనెల్లభూతిఁబూసి యుద్ధంబునకంప నాతనితోఁ దలపడి మొదలిభూతిఁజూచి "నమశ్శివాయ"యని కత్తినేలఁబడవైచి "శివశరణు శివశరణ"ని పాదంబులపై బడిలేచి స్వామీ, దయచేసి పూజలఁగొనుండన నాసచివుఁడట్లు కాదు నీవుమాకశత్రుఁడవు నినుఁదలఁదునుము మని మారాజునన్నంపె"నని కరవాలంబెత్తి నఱుకఁదొడఁగొనునవసరంబున నాఖడ్గంబును పుష్పమాలయై మెడఁజుట్టుకొన హరశాసననిష్ఠాగరిష్ఠుఁడగు ఏవకానీశుఁడు నిజరూపంబునం బొడసూపి మోక్షమొసఁగి కైలాసంబునకుం గొంచునేఁగిన ఏనాదినాథునకు భృత్యానుభృత్యుఁడను.

### చేదివల్లభునికథ

వెండియు నఖండశివభక్తిధురీణుండగు చేదివల్లభుండు రుద్రాక్షభసితమండనుండై రుద్రాంశనుభావంబున నట్టివారల మన్నించుచు పరభూపతులను భండనంబునఁ జొరిగొనుచుండ నొకదిన తేదులు పదము ప్వ్రాజ బలవంతులగు త్రాయుధులు జేసి వారల దేహంబులకు శివచిహ్నంబులగు రుద్రాక్షభస్మంబులలంది పంత వారుంగాంచి మించుభక్తిని శివభావంబున సాష్టాంగదండంబిడ వారందఱుఁ దమనిగూఢాయుధంబుల నాతనిం బొడువ దేహంబునఁ బొడమెడు రక్తంబున కెంతయుఁ జింతింపక నిశ్చలమానసంబున వారల నిజగురుజంగమ రూపులుగా నెంచి మఱిమఱి మ్రొక్కుచుండ ఖండశశిమండనుండు సాక్షాత్కరించి మోక్షంబొసంగి యక్షయపదలింగల కాలము నిలిపినట్టి చేదివల్లభునకు నమస్కారంబులు సేయు నసంఖ్యాక దాసగణంబులలోఁ గడపటివాఁడను

### కరయూరిచోడునికథ

శంభుచిహ్నంబులం దాల్చినవారిని శంభుస్వరూపులుగాఁ గైకొనుచు పరధరారమణులపైఁ దనసేనలనంప వారువారల గెల్చిపోరులో నీల్గినవారిశిరములు ముప్పదిబండ్లపైఁ గొనిరాఁగ నందునొక బుర్రమీఁగుల రక్తసిక్తమై యూసవాలుపట్టి సలవిగాని కీలింగనుపట్ట నట్టిదుర్నిరీక్ష్యంబగు ప్రధానాంగంబునకుఁ దనతలను మెఱుఁగువెట్టెదనని తలఁదఱుఁగుకొని దానిపై శివార్పితముగా నుంచిన వానిసాహసంబునకు మెచ్చిపచ్చవిల్తుని సూఁను నిజరూపమున నచట నావిర్భవించి శాశ్వతపదవికిఁ గొంపోయిన భక్తవర్యుండగు కరయూరిచోడునకు నమస్కారంబులు సేయు నధమాధముఁడనగు గొల్లుపుకాఁడను.

### కలియంబినయనారుకథ

తనపనివాండ్రలోనొకఁడు తన్నుకను మెఱఁగి పాఱిపోయి లింగధారియై జంగమభక్తులం గూడి యేతెర వారలనందఱి కర్ఘ్యాద్యుపచా

డమున నెన్నంగ నులింగధారులు లేరు నేనెట్లు లలింగసంగతి దేహుండం గాంగలను? నాకది రుచింపకున్న"దన "నీకువలసినంత ధనమిత్తునట్లు సేయుము" అనుటయు "అదినాకక్కఱలేదన" నీకువలసినంత ధనమిత్తునట్లు సేయుము" అనుటయు "అదినాకక్కఱలేదన "నీతలందునిమెద"నని కత్తి దూసి తెగవ్రై చున వసరమునం గత్తి వేటు మెడపై బడియుండెడని మెసెను మృదుండు నిజరూపంబునం బొడసూపి "యోయీ! నీకుంగావలసిన వరంబుల వేఁడుమిచ్చెద" నన "దేవా! నీవరంబులు నేనొల్ల తొల్లియే నెలమ కాపురూపమున నే తెంచితి వ్రాయారూపంబున నె లింగంబు మెడ గట్టుకొనివచ్చినంగాని నీమోము నేంజూడ"నని తక్షణము శివకాపును లింగధారిగా నొనరించిన గిణపాలునకు నధము భృత్యుండను

## కుమ్మరిగుండయ్యకథ.

మఱియుం బెనుబెట్టయనుపురంబునం గుమ్మరిగుండయ్య యను భక్తుండొకండు గలండు. అతండు సంతతశివదీక్షామతియు జంగమార్చనాలాలసుండునై యొకనాడు శివాలయంబునకేఁగి యందునీశ్వరుని సేవించి తిరిగియింటికిం బోవు నవసరంబున నొకవేశ్యయన్నముదిని కంచము దొలిచి గిరగిరంద్రిప్పి యానీరు తానరుగుమీంద నిల్చి పైకిం బారంజిమ్మ టయు నాయెంగిలినీరు తనపై బడకుండ జేసికొనుటకుం జీకటిరాత్రియగుటచేం దప్పించుకొలేక "శివశివ" యని భగవన్నామస్మరణ మొనర్చుచుం బోవుచున్నయాతని గుండయ్యంగా నెరిగి లోనికింగొంపోయి సుగంధనూనెలందలయంటి పన్నీటజలకి మార్చి కర్పూరతాంబూలంబు విడె మొసంగి యుపచారములు సెప్పుకొని పంపుటయు నాతండింటికిజని భార్యతద్వర్తనం బెరుంగనిద్రై నను దనవంటిగంధంబువలన నాతనికి వేశ్యాలంపటము గలిగెనని యోచించి తన్నుస్పర్శింపవద్దన నామెతో సరసోక్తులాడుచు వేశ్య చేసినతప్పును దానికై యదిసేసిన యభ్యంగనమును దాయకు నివేదించి కొంగుబట్టంబోవ "నన్నా ముట్టవద్దు నీకును

నాకునింతటితోసరి" యని మట్టనీయకుండుటయు శివుండు జంగమవే షంబున నాతనియిల్సేరి పూజగొని తన చేతికమండలు నాతనిచే తికిచ్చి "యిదిభద్రపఱచి యుంచుము నేనుమఱలివచ్చి పుచ్చుకొని యెద" నని చెప్పిపోయి యాకొప్పెరమాయఁ జేసి మఱికొంత సేపటికి వచ్చి నాపాత్రినాకిమ్మనియడుగ గుండయ్య, దానిదాచిపెట్టిన పెట్టియ దీసిచూడ నదికనఁబడ లేదు భార్యనడుగ నామెయు నేనెఱుఁగననియె. అంత నామాయజంగము "మీ భార్యాభర్త లిరువురు నేకమయి నాకొప్పెర నపహరించి యేమియు నెఱుంగనివారివలె నటించుచున్నారా? ఇదే నాకమండలువు నీకుఁ దానము నాకొప్పింపకేని మిమ్మును తగవునకు రచ్చకీడ్చెద. కాదేని, మీ రుభయులు చెరువులోమునిఁగి స్నానముసేసి భార్యశిరంబుపై భర్తయు భర్తభుజంబుపై భార్యయుఁ జేతులుంచి యాకొప్పెర మీరు దాచలేదనియు నెటులమాయమైనదో మీరు నిజముగా నెఱుంగననియుఁ బ్రమాణము సేసితీరి నన్నొప్పింపుమనుటయు నాదంపతులు "స్వామీ! వేఱొండుప్రమాణము సేతుముగాని కొండొకల శరీరంబులు దాకను నేఁటికెనిమిదిపదులు సంవత్సరములనుంచి మేము భార్యాభర్తలమయు నొకరినొకరుఁ దాకక పరస్పర సంభాషణములే గాని స్పర్శలేకయే గాపురము సేయుచుంటి "మనమాయజంగము" కొను వప్రయాణంబులు నాకుఁబసలేవు. మీకిష్టమున్నదేని నేఁగోరినశపథంబుఁ జేయుఁడు లేనిమొదల రాజదండనంబున కొడంబడుఁడు" అని యీమొదలగు ననేకమాటలు చెప్ప వారలశపథంబున కొడంబడిచి మడుగున బుడకలిగువోయఁ జేసి కొండొకరులు శుద్ధజలంబులవార్చి "స్వామీ! మేము నిర్దోషులము మమ్ము నీజంగమదేవర నమ్మునటుల నీవె సాక్షివి. దక్షయజ్ఞవినాశనా! పాపనాశనా! సాంబసదాశివా! "యని యొకరిశిరంబుపై నొకరుహస్తంబుపై నొకరియొరచేయియుంచి పరస్పర స్పర్శనంబులు శేసికొనుటయు నాపటుజంగమదేవర తత్క్షణమే యదృశ్యుండై

నిజశివశక్తిరూపంబున దాక్షాయణీదేవీ సమాశ్రిత వామభాగంబుతోడను గంగాతరంగిణి సమలంకృత జటాజూటంబుతోడను, పంచశూకభూషణంబులతోడను, ఫాలనేత్రంబుతోడను, వృషభారూఢుండై, ప్రమథరుద్రగణంబులతో వాగీశలక్ష్మీశాదులతోడను సాక్షాత్కరించి గుండయ్యా! యెనుబదినంవత్సరము లేకనిష్ఠగా జరిపిన మీదంపతుల బ్రహ్మచర్యవ్రతంబునకు నేఁ దనిపితిని మీరిద్దఱునరిముదుసలులై తిరి మీరిపుడ నేఁ దరుణరూపవనంబు మఱలఁ బ్రసాదించితిని. మీరు త్రిదశవయస్కులరై త్రిదశుల భోలి యీలోకంబున మఱియెనుబదియబ్దంబులు యిష్టసుఖగోష్ఠిఁ బరస్పర సరససల్లాపసంభోగాద్యాచరణంబులఁ బరమసుఖంబనుభవించి యాపైని మీకెప్పుడు నాలోకంబునకు రావలెనను కోరికగలుగునప్పుడు నన్నుస్మరింపుఁడు మీకువిమానంబు నంపెదను దానిపై గూర్చుండి వచ్చినా ప్రమథగణంబులతోఁ గలసిమెలసి వారల కధీశులై యుండుఁడని పలుకుచుండగ యమ్మత్యు...... కు భృత్యాత్ముండను.

### పుసలనయనారి కథ

విక్రమ చోళుండు బంగారులింగంబునుఁ బానువట్టంబును జేయించి శివాలయమునఁ బ్రతిష్ఠించుట గాంచి తానునిజదేహాలయంబున నాత్మలింగంబును బ్రతిష్ఠించి మనఃపూజలుగావించి యీశ్వరప్రసాదంబు నొందిన పుసలనయనారికి దాసనుదాసుండను

మఱియు రాజ్యమునొల్లక జడలుదాల్చి పరమయోగియై మోక్షమొందిన తిరువాలునిబంటను తిరునావకరశుని నారాధించి యాతని కరుణచే నీశ్వరుని యథాస్వరూపంబెఱిఁగి సేవించిన తిరుకురుపికి బంటు బంటను రోహిణియు దానునై నాయూసంబునఁ బురహరప్రసాదంబు వడసిన తిరుప్పూరితిరుమూలదేవునికి భృత్యుఁడను సంతతభక్తపరాధీనమానసుండై వారలసేవయె ప్రధానవృత్తిగాఁ గలిఁగి మెలఁగిన చిరు

పులిదాసునకు దాసానుదాసుండను దీనముఖంబునఁ దనకొకసమయం బుని శివుఁడు లింగరూపంబునఁ గనఁబడిన సడిమెత్తింగి యాలింగమూర్తినిఁ జేతనిడుకొని యోదార్పుమాటలాడిన చిరుతనయునారికిం బాదసేవకులలో నధమగణ్యుఁడను ఇప్పటికిఁ గనుపించిన భక్తులవ శేషార్పుభక్తులిండ్లఁ బనులుసేయు వారికింబనిసేయు నౌకరునేన వర్తమానభక్తులకుఁ గైకర్యంబులు సేయు గింకరులకుఁ గింకరుండ ఇంకముందు శివభక్తులై పుట్టఁగలుఁగు భాగ్యంబుగలవారియింట నొంటరిబంటనై యుండఁగలవాడను ఈతీరున ననేకప్రకారముల భక్తులచరితంబులు పాడుచు నడుగడుగునఁ బడిబడిదండంబులిడుచు శాష్టాంగంబుగాఁ బొర్లు దండంబులుపెట్టుచు మఱియు దీనస్వరంబున ""మీభక్తుఁడ, రిక్తుఁడ, మీదాసానుదాసుండ, మీసేవకాధముఁడ, మీయడిమెడదాసుండను, నాన్యథాశరణుండ, మీరేనాపక్షు నన్నుఁగావరే, దీనదయాపరులారా శివభక్తాగ్రేసరులారా"" యనియరచుచుఁ దనవెంబడిఁ బంచశరుదనుండు పొంచిపొంచియరుదేర భక్తవరులాతనింగాంచి వెంటవచ్చు నీలకంఠుం బరికించి నమస్కృతులొనరించి యాతనింగాంచి తమలోఁ జేర్చుకొని వారలతో సర్వేశుండు మిరుమండని భక్తికి మెచ్చి సాహసంబునఁ దన్నావేశపెట్టినందుకు ముదముంది యదఱఁగైలాసంబునకుఁ గొనిపోయెను కనుక బసవదండాధీశా! భక్తులకుగర్వము తప్పానోకాదో నీవే సెప్పుమని పూర్వభక్తుల చిత్రచరిత్రకథ నమిషంబున బసవేశ్వరులకు గొన్నినీతు లుపదేశించి యాతనికిఁగలిఁగిన గర్వంబు బెడఁబాపి, వచ్చిన భక్తులకు మణిమయధనరాసు లొసంగి వీడుకొల్పిన బసవన్న పాదాక్రాంతుండై వీడ్కొని భక్తజనసమేతంబుగా నిజగృహంబునకేఁగి సుఖంబుండె

బిజ్జలరాజును పురజనులు నాతిండు కేవలము మంచుమలయల్లుండుగాని సామాన్యమనుజుఁడు గాఁడని శిరంబులువంచి హస్తంబుల

మోఁచి దండంబులవెట్టి తమతమ నికేతనములకరిగిరి. మాచయ్య తన భక్తిమార్గంబునకుఁ దానేఁగెను. ఈమడివాలు మాచయ్యకథ భక్తితో జదివెడువారును విన్నవారు నోరుకుఁ జెప్పువారును మాచయ్యవంటి ప్రభావముగల భక్తులై ధరలో ననేకవిధములగు సుఖంబు లనుభవించి యంతంబునఁ గైలాసంబుం జూఱఁగొందురు.





# బసవపురాణము.

## పంచమాశ్వాసము

---

### కిన్నరబ్రహ్మయ్యకథ

పుడమిపడఁతికి మెఱరతనదండలోని కొలికిపూసవలె నందగించెడి పోడూరను నొకపురవరమున కిన్నరబ్రహ్మయ్య యను నామంబునఁ బరఁగుచుండెడు భక్తుఁడొకఁడుగలఁడు. అతఁడుపరశైవుఁడు. భూతదయగలవాఁడు లౌకికవృత్తులనేకములు నేర్చినవాఁడు లోకపూజ్యుఁడు లోకవంద్యుఁడు. అఘటనఘటనాపటిష్ఠుఁడు భక్తపరతంత్రుఁడు లింగసంగతదేహుఁడు శివభక్తాగ్రేసరుఁడు బహువిధవృత్తులఁ దానార్జించిన ధనమంతయు భక్తాయత్తంబుసేయుచుండును ఇట్లుభక్తపరత్యాగము కొఱకుధనమునసంపాదించు నతఁడొకనాఁడు కిన్నరమీఁటుచు రాగంబు పాడుచుండఁ గిన్నరనారదాదిగాయకులటకేఁగి యాసంగీతమాధుర్యమున నోలలాడుచుండఁ ఖండేందుమౌళియు నాతనిగీతగానంబునకలరి బ్రహ్మయ్య నాదబ్రహ్మములయబ్రహ్మము రాగబ్రహ్మము దానమై యొప్పునని యప్పరమేశ్వరుండు దినదినమాతనికి నొకమాడయు నొక చిన్నంబునొకపాతికయు నిచ్చుచుండును ఈశ్వరునివలనఁ గొనుధనమునుసైతముభక్తులకే వినియోగపరచుచు నిత్యము జంగమపూజయొకవిధికృత్యముగా నిర్ణయించుకొని యాతండుకాలంబు గడపుచుండ బసవేశ్వరుల భక్తివాసనలు సర్వదిగంతరాళములవ్యాపించి మించుచుండుట గాంచి బసవనాయకుని దర్శనముసేయవలెనను కుతూహలంబున బిజ్జలరాజు నేలుబడిఁ బ్రధాననగరంబగు కళ్యాణపురంబునకరిగె. అట్లతని రాక

యుండకుముండె బసవేశ్వరులు తమలింగమూర్తియందు నిత్యశివార్చ నావిధానమునఁగనుఁగొని తాఁగనినయట్లు తన్నుఁగానవచ్చిన కిన్నర బ్రహ్మయ్యకుఁ గతిపయపదంబులెదురేఁగి సాష్టాంగవందనంబాచరించి యర్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి యాతనిపాదోదకంబు శిరస్సునఁజల్లు కొని బిల్వప్రసాదం బందుకొని కర్ణోపరిభాగంబున ధరియించి గృహం బునకుఁ దోతెచ్చి షడ్రసోపేతభోజనంబునఁ దృప్తునింజేసి తత్త్వచింతలు సేయుచు నిద్దఱుండిరి. ఇట్లియ్యిద్దఱుఁ దిద్దయుఁ బెద్దతికంబున సన్నగ రింబున నెకొనియున్న త్రిపురాంతకేశ్వరు నాలయంబునకరిగి, యం దుఁ గిన్నర బ్రహ్మయ్యమాత్రము గొంతతడవు మృడభక్తజనగోష్ఠి నుండఁగోరి బసవేశ్వరుల వీడుకొలిపి గోపురద్వారంబున భక్తగోష్ఠిని బ్రహ్మయ యుండునవసరమున నొకవిటుఁడు పండుగనెపంబునఁ దనవే శ్యకు సమర్పింప నొక కంఠక్రొవ్వుగల పెద్ద గొఱ్ఱపోతును వెలకుఁగొని దానిమెడనొక త్రాడుగట్టి వీధిఁగొనిపోవుచుండ నాలయసమీపప్రాం తమున వచ్చునంత నా మెండమెకము మింటఁడుగట్టినత్రాడుఁ దెగి యడి తప్పించుకొని యాలయంబులోని కరిగి గర్భగోవెలమఱుఁ గున డాఁగియుండెను దాని బట్టి నావిటుండును, లోఁడఁ జనుచు గుడిలోని కనఁగఁ గిన్నరబ్రహ్మయ్య వాని గని మృదువచనముల నిట్లనియె — "నాయనా! ఇఁకలోనికిరాక యిచట నేనిలువుము నీబారిఁబడిన యీ పోతులు దైవవశంబునఁదప్పి యీ మహేశ్వర నాలయంబుఁ బ్రాణభ యంబున మాశరణుసొచ్చెను. గాన దీనిఁజంపుట నీకున్యాయముగాదు. ఎంతమూర్ఖుఁడైనను శరణన్నవానిఁగాచును గాని విడువఁడు అట్టిస్థితి లో పశుపతిభక్తులు తమ్మశరణంబునొందిన పశువిశసనంబునకొర్తురే? నీవీనిఁ జంపనియను నీకువలయునేని. గొఱ్ఱయో గొప్పయో నీగొఱ్ఱవి లువ మాచేఁగొనిపొమ్ము ఇదియ మానిశ్చయ" మని పానిలోనని యెను అంతవాఁడు పకపకనవ్వి "కొవ్విన గొఱ్ఱపోతును పండుగ

వేటకై రొక్కమిచ్చి గొనితెచ్చి దానిం బోవిడుతునే? గుడిం జొచ్చినను, మడిం జొచ్చినను విడుచువాడను గాను నాగొఱ్ఱెను నాకిమ్మని జాగు సేసిన నాబోగిని కోపించుచును భయమున నెంతప్రేలినను దాని బ్రహ్మయ్య విడువకుండెను. అంత నాపిఱుఁడు డవచనంబున నిట్లని వితర్కించె—— ‘‘ఈదాసుఁడు దీని విడువఁడు వృథా విళంబము నాకేల? దీని కితఁడిచ్చిన వెలఁబెట్టి మఱియొక మంచి క్రొవ్విన గొఱ్ఱియనుఁ గొనిపోయి యాతెరవకొప్పించి దాని ప్రసాదంబు వడసెద నీతనివలన మిగుల ధనంబు గొనియెద’’ నని మిగుల కోపంబునఁ బోవువానివలెఁ బోవనుంకించువా నిం బిలిచి తట్టివేయుమాడలు దెప్పించి యిప్పించి యాచొప్పునఁ బంపివేసెను. వాఁడును మఱియొక మంచిగొఱ్ఱెనుగొని సానియింటికిం గొంపోయి ‘నాయికామణీ! యిదిగో సూఁడుము నీనిమిత్త మెంతమంచి పొట్టేలునుఁ దెచ్చితినో దీని వేటగాఁగైకొని పండుగఁ గావించి దాని మాంసంబున సుఖభోజనము సేసి యాపైన నాకు నీభోగభోజనము వెట్టించుము ‘‘అని మంచిమాటలాడుచున్న వానికి నామె’’ ఓరీ, నీగుండెతనము సాలును నలుగురితో నగుబాటు నీకును నాకునుఁ జేకూరెను. తొలుతఁ గొన్న పన్నగల ఒలిపిన వెలగల వేటఁ జెమ్మకొని యల్పక్రియమునకు విధిలేక కొన్నకీవిం దెచ్చి నామొగంబునఁ బాఱవైచితివా? నీతోటి విటులు నీయోలమిగిలి నవ్వుచున్నారు. నాతోటి వెలబోటులు నన్నుఁ గని నీవంటి యధముని యిని జేపట్టినందుకు నవ్వుచున్నారు గనుక నీచేతనైనఁ వాలు నెట్టితగటునె గొనిరమ్ము కాదేని నాతో పవనె పొమ్ము మఱిరా వద్దు నేటితో నీకును నాకును సరి. మఱిపొత్తు లేదు పోపొమ్మని మెడబట్టి గెంటెను వెలయాలిపొత్తు కలకాలముండునని నమ్మినవాఁడు మూఢుఁడుగాని యింగితజ్ఞుఁడుగాఁడు బుద్ధ్యపాయంబగు ప్రాయంబు నాపాయంబని తాయుంబుసతమని మదవతులవలపులఁలోఁ బడిన మిలమిలలాడెడి గండుమీన బులుగారె. రోయింతుల పంతంబులు నెఱవేర్చువా

రు అట్లు యీచొప్పఁడు తననాశంబునకే మఱలి యాగుడికిఁబోయి గోత్రంబట్టఁబోవ బ్రాహ్మణుగని "యోరీ! దానిఁబట్టకుము అది గోత్రపోతుగాదు వెలచూడలు సెల్లినపుడే యదివృషభంబై యంబాపతివాహనంబైనది ముట్టకుముట్టకు" మని యడ్డుపడనాబాపుడు వాలు వెతికి బ్రాహ్మణుని నఱుకనుఱుకు సమయంబున నాయనయుఁ దనచేతికరవాలమున వానితలదునిమె నదియు నీశ్వరునిగుడి వెనుకప్రక్కఁ బడియె అప్పుడచట నున్న యాబాపుని చుట్టములు మిగులదుఃఖించి రాజుపాలికిం బోయి "దేవా! యిదేమివింత మనపురంబున శివభక్తులు పెచ్చుమీఱి తమయిచ్చవచ్చినట్టుల పురజనంబు నాశంబు నొందించుచున్నవారు. వారల బారిఁబడి మేము బ్రతుకంజాలము వారలనీ పురిలోనుండనిచ్చుమమ్మేటికన్నఁ బొమ్మన్నఁబోదు" మని మొఱవెట్టుకొనిరి. బిజ్జలరాజు మిగులఁగోపించి బసవేశ్వరుల పాలికరిగి "బసవమంత్రీ! మీహరభక్తుల చరితంబులు విన చూడవెక్కసంబగుచున్నది. వారు హింసాదూరులని దయాపారులని సన్మార్గసంచారులని విందు నేఁడది చోద్యంబయ్యె మనశివాలయమున నొకభక్తుఁడు గోత్రపోతునకై పోయి యొకనితలదునిమెనఁట సంసారులప్రసంగంబు తనకేల? ఇట్టి యాగడములు మీకే దగును. తొల్లింటి భక్తులమార్గములు నిట్టియున్నవి. ఒకఁడు బాలునిఁ జంపె. మఱియొకఁడు శివలింగమును గాలఁదన్నెను. ఇంకొకఁడు తండ్రినిఁ జంపెను వేఱొకఁడు మాంసపుకండలు తినఁబెట్టెను వెండియునొకండు తనయాలినిచ్చెను ఇట్లెందఱో క్రూరకృత్యంబులు సలిపి యవి యెల్ల భక్తికృత్యంబులందురు. ఇతరుల ధర్మంబు లధర్మంబులందురు. మీయధర్మముల ధర్మంబులందురు. మీభక్తిమర్మంబులు మీకే తెలుసును ఇట్టిమారున్నచోట మావంటి రాజులు ప్రజాపరిపాలనంబు సేయ వెఱతురు కాన నికమీఁద మీరే రాజ్యమేలుఁడు. మేమెట కేనిం బోదు" మనెను. బసవేశ్వరుల వారదివిని "రాజా! దేవరవార ట్లనఁదగునా?

శివభక్తులన్న నంత మొరకులా? వారివంటి భూతదయాపరులు మఱిలేరు ఏవినవారు ముందు వెనుకల నారయక భక్తుల నిట్లు తూలనాడఁదగునా? ఎవ్వరెది సెప్పినను వినవచ్చును గాని విన్నంతమాత్రమున నమ్మ కూడదు అట్లు నమ్మి యాప్రకారము నడుచుపుడమితేఁ డిద్దీనననఁగొట్టంబునం గట్టుమన్నవానిపాటవాఁడు. శివభక్తునకును బోపునికిని గొఱియవిషయంబునఁ బ్రవర్తివిశేకలహ కారణమును విచారించి ముందెవరియందు దోషమున్నదో వారల శిక్షింపవలెను. మంత్రులనంపి యాకారణమారసిరమ్మని యానతిండు తొలితప్పసేసిన గుండగీఁడును దండితము. ఇంతకు నట్టివాఁడె తనతప్పునకుఁ దగినదండమును దానె పొందియుండెను ఇఁక మనము శిక్షింపనవసరమేలే" దనవుడు బిజ్జలేశ్వరుఁడు "మంచిది. కానిమ్ము ఇప్పుడె మంత్రులమూలమున సర్వంబునిర్వహించెద" నని యమాత్యులనల్వుర రావించి యాలయంబునకేగి వేఁగులవారిచందంబునఁ దొల్త గొంతవిచారించి పిమ్మట శివభక్తునిగోటియుక రారు గొనిరండని పంపెను వారును శివాలయమునకేఁగి యచటిజనంబుఁను రహస్యప్రకారంబునఁ గన్నెర బ్రహ్మయ భక్తువికారంబుగొంత యరసి యామీఁద నాతనియొద్దకుంబోయి నమస్కరించి "భక్తవరా! ఏమియీవింత. భూలోకమున శివభక్తుల హింసాపరులనియెడి కీర్తి బొందియున్నచో నేఁడు మీరు మాబొప్పనిఁ బోటులునకుఁగాను సంపితిరని యపవాదపలగుచున్నారు దీని నిజానిజములు మీనోటనె వినిరమ్మని యిమ్మహీపాలుఁడు మమ్మంపె. శీఘ్రంబ సెలవిండు. పోయివచ్చెద' మని విన్నవించిరి బ్రహ్మయ్యభక్తుఁడును "శివశివా" యని చెవులుమూసికొని కన్నులరమోడ్చి భగవధ్యానంబుఁ గీలించి "రాజమంత్రులారా! వినుండు. నేనీయాలయంబున హరకైంకర్యము సేసికొనుచున్నకాలమున నీబొప్పవిటుఁడు దనల ఁజకుఁగాను పండుగవేటకై యొకమంచిబలిసిన మెండపోతునుగొని మెడకుఁద్రాడుగట్టి యీడ్చుకొనిపోవు

చుండ గాలవశంబునఁ ద్రాడు తెగి యాగొఱియతల నఱకఁబడు నపాయంబుఁ దప్పించుకొని యుపాయంబునఁ గపాలపాణి యాలయంబుసొచ్చినఁదద్భక్తులు తన్నుఁగాఁతురని యెఱిఁగినదానివలె గుడిసొచ్చి వెనుకప్రక్కను డాఁగియుండెను. ఏటుఁడును దానింబట్టి మిట్టిపడుచు గట్టిపట్టుదలతోఁ బట్టఁబోవుచుండ నేగిన ‟యోయయ్య! యిది దేవాలయము. భగవద్భక్తులున్నచోటు భక్తులు భూతదయాపరులు పిపీలికాది బ్రహ్మపర్యంతముఁ బ్రతిజీవికిఁ దనజీవమందాశ సమానము నిన్నెవడేని నఱుకఁబోవునపుడు నీవుదప్పించుకొని పాఱిపోవుటకుఁ బ్రయత్నింపవా? అట్లనే నీతగఱును నీవుదన్నుఁజంపుటకుఁ గొనిపోవుచుంటి వని యెఱిఁగినదివ్రాలెనిటవచ్చి మాశరణుసొచ్చినది. మేముదీని విడువము వలసినధనమిచ్చెదముకొనిపొ”మ్మంటిమి వాఁడునుమాపట్టుదలసూచి ఇక వీరె తసొమ్మయిన నిచ్చితీరుదురుగాని గొఱ్ఱెను విడువరని నిశ్చయించుకొనిమాచే నేయిమాడలుగొని దీనివిడిచిపోయెను మఱికొంత సేపటికివాఁడాలి వచ్చిమాతోఁ బ్రసంగింపకయె గొఱ్ఱెంబట్టఁబరుగత్తి పట్టునప్పటికి మేము గని యిదియేమిరా, యయ్య, నీయాగడము ‟ముండయమూటయు దక్కె”నన్నలోకోక్తి వింటివా, ధనమునుగొఱ్ఱెనుగూడ దక్కించుకొనియెదవా? ఇఁకనీవు ధనమువాఁడవుగాని గొఱ్ఱెలువాఁడవుగావు మేముదీని వెల నీకొసగినతక్షణమె దీనిని లింగసంగతంబు గావించితిమి చూడుము దానిమెడలనున్న శివచిహ్నంబులు వానింగనియు నీవుఁబట్టభయము లేక చేతులెట్లాడినవి అదియుఁకమీఁద నీశ్వరునివృషభవాహనంబుగాని నిజముగాగొఱియగాదు కనుక నీకుజీవమందాశయున్న దానివిడిచి పొమ్మంటిమి వాఁడునిప్పుద్రొక్కినకోఁతివలె మండిపడుచు నొఱలోని కత్తిబైకిఁదీసి నన్నేయఁబోవుటయుఁ బ్రతిజీవునకు నాత్మరక్షణంబు ప్రధానకర్తవ్యంబుగావున నేనునునాకత్తినెత్తి యొక్కవేటున శిరఃకళేబరంబుల వేఱుసేసి నాతనువునేను గాపాడుకొంటిని ఆశిరంబును దేవా

లయమునకుఁ బృష్ఠభాగమునకును జేయున్నది మీరు ప్రాయిగనివచ్చి తొలితప్పవరిదో తెలిసికొని మీయినునకెఱింగింపుఁడు. వానికి నాకును వేఱునాళ్లులు లేరు. మీరునమ్మ రేని నాసిబంబు మీకుఁబ్రత్యక్షగోచరంబుకటకుఁగాను త్రిపురాంతకు చేత నె పలికించెద' నని యకులు సెప్పెను. అమాత్యులు జరిగినప్రసంగమును మహిపతి కెఱిఁగింప భూజానియనూనాశ్చర్యంబునొంది "యేమీ! తాఁజేసినపని చేయుట యేగాక దేవుని చే బలికించి తనమాటనిలుపుకొనునా? కానిమ్మదియుఁజూతము. రమ్మని మంత్రివర్గంబు తోడను బురజనంబుతోడను జనినిలుచున్నతఱి వారలతో నేఁగిన బసవేశ్వరులు కిన్నరబ్రహ్మయ్యకు నమస్కరించి చేతులుజోడించి యిట్లని స్తుతించెను శృంగారులకెల్ల శృంగారకుఁడును విరాగులకువిరాగిగను భక్తులకుభక్తుఁడుగను, దేవతలకు దేవుఁడుగను సత్త్వులకుసత్త్విగాను రాజసులకురజోవంతుఁడుగాను తామసులకు తమఃప్రధానుఁడుగను దీనులకుదీనుఁడుగాను ధనికులకుధనిగను బేదలకుఁ బేదవాఁడుగను సల్పులకల్పుఁడుగా మహాత్ములకుఁ మహాత్ముఁడుగా సజ్జనులకు సజ్జనుఁడుగా దుర్జనులకు దుర్జనుఁడుగా దొంగకుదొంగగాను సంసారికిసాంసారిగా నగుపడుచుఁ బ్రత్యక్షదైవంబలైయున్న యోకిన్నర బ్రహ్మయా! భూలోకహరా నీకునమస్కారము

తొల్లియొకభక్తుఁడు శివరాత్రినాఁడు పరాకున విటియింటికిఁబోయి లింగోద్భవకాలమున దాని కుచలీడనంబునకుఁ దలఁకొనుదనచేతుల నందొకదానినంటి యప్పటికి శివరాత్రి స్ఫురణకురాఁగా 'హరాహరా' యని యూఁదుగఁజచుకొని మనంబు శివపరంబుగాఁగా నామెకుచంబునె లింగముగాభావించి హరహరమహాదేవశంభో' యని కేకవైవ 'నో'యని యొకనాదము ప్రతిధ్వనిఁ బలికించ లేదా? చీమయందు భగవంతుఁడున్నాఁడా? దినమునకెన్ని మనకాలిక్రిందఁబడి మడియుచున్నవని సోదా చూచుట కొకచీమనుబట్టి పిడికిఁటమూసి "యోశంకర! పాపభయంకర!

భక్తసుఖంకర!” యని యొకపిలుపుబిలువ “ఓఁయి” యని వానిచెవి యొద్ద నుంచఁబడిన పిడికిఁటిలోని చీమనుండి ప్రతిధ్వనివినఁబడలేదా? మఱియు బాపూరి బ్రహ్మయ్యభక్తుఁడు జొన్నలరాశియందుభగవంతుఁ డున్నాఁడని చెప్పి యారాశియొద్దకుఁబోయి “పార్వతీమనోహరా, పరాత్మా, పరమేశ్వరా” యని యాహ్వానంబొనరింప “ఓ” యని దాని నుండి భగవంతుండు ప్రతిధ్వనియియ్యలేదా? అట్టిభక్తులకన్న నీవేలయలఁతివాఁడవగుదువు రాజును మంత్రులును బంట్లును పురజనులు నాబాలగోపాలము జూడవచ్చిరి గనుక యీశ్వరునిఁబలికించి కీర్తిచే నందఱము చుమనివేఁడుకొనెను. అప్పుడా యీశ్వరునికంఠధ్వని వినుటకు నందఱును విన నక్కడక్కడదాఁగియుండ నాగుడిపూజారియు మెల్లఁగుంచెక్కల దిప్పి తాఁజనియొకమూల నొదిగియుండెను బ్రహ్మయ్య యప్పుడు కన్నులరమోడ్చి యాలయంబు తప్పలుదట్టి శివాశివాశివా' యని మూఁడుతట్టులు తట్టునంతలో దడాలున తలుపులువీడి వెనుకకుఁ జెరువఁబడి ద్వారంబువెల్లడియయ్యెను అప్పుడు పురజనులు తొల్లి భక్తులకుభగవంతుఁడు తలుపులు దెఱచెనని వింటిమిగాని యిపుడుకన్నులార గంటిమి ఇఁకనితఁడు దేవునిమాట్లాడింపఁ గలఁడని కిలకిలమనుసంకులధ్వనులతోఁ జూచుచుండ బ్రహ్మయ్య “ఓయయ్యా! త్రిపురాంతకేశ్వరా నాయసత్యములువేఱులేవు నిన్నే నేఁగోరుకొంటిని నాచెప్పినది నిజమో యబద్ధమో నీవేచెప్పవలె నీయొక్క గంభీరకంఠనాదంబు విని నందఱు వేడుకపడుచున్నారు. కాన వైళంబ దెలుపుమో దేవా” యని బిగ్గఱగా నఱచుఁడు గుడిలోనుండి “నీవుచెప్పినదంతయు నావాంతమైన నబద్ధము లేక పూర్తిగానిజమోయీ” యను నాదంబువినఁబడి యాధ్వనియాతీరున నేఁడుదినంబులవఱకు నాగక యంతకంతకు హెచ్చుచుండెను ఇట్లేడహోరాత్రము వెస గినయాబాదంబు ప్రళయకాల గర్జనమువలెఁ దరతరము వృద్ధినొందుచుండ భూతప్రపంచంబంతయు సకలప్రళయం

బున కేమిహేతువో యని కల్లోలితమానసులై పరుగువిడ మొదలుపెట్టిరి వేధసంక్షోభంబునొందెను విష్ణుండు వెఱచిచనఁబోయెను దేవతలుభీతి చేత బ్రహ్మవిష్ణుల నాప్రళయంబుమాన్పుమని ప్రార్థింపనరిగిరి. ఆకాశము దిరుగఁబడెను చుక్కలుమొక్కలువ్రాలెను సూర్యచంద్రాదులు గతులుదప్పిరి. భూమి యుబ్బద్దలై పాతాళంబునకు మార్గమిచ్చెను. అందున్న బలియుఁ దాతయగు ప్రహ్లాదునిఁ దోడుకొని కైలాసంబునకేఁగి యటనీవార్తవిని భూలోకంబునకుఁ జూడవచ్చెను భూకంపంబుగలిగె ఇట్టి యుత్పాతంబులు పుట్టినంగని బిజ్జలుండు బసవేశ్వరులంజేరి యీ యమోఘగర్జానాదంబు మాయింపుమని ప్రార్థింప నాతండు బ్రహ్మయ్యయొద్దకుంబోయి సాష్టాంగదండంబు వెట్టి తొంటియట్ల పలుపల స్తుతించె నట్లన భక్తియనువలలో భక్తుఁడుచిక్కెను. చేఁపలవానికి చిక్కిన చేప తప్పించుకొను నుపాయంబులేక తనకుఁ దనజీవంబులె వానికిసమర్పించుచున్నది భగవంతుఁడన్ననో మాయాసహాయుఁడుగాన భక్తుననేక మాయోపాయంబులచే శ్రమపెట్టఁదలంచి వానినన్నిఁటినిదాటి యొకదానికిని భక్తుఁడు లొంగకపోవుటచేఁ దుదకు సర్వశక్తి సర్వసామర్థ్యములా భక్తులకిచ్చి తాఁదప్పించుకొని పాఱిపోయి దాగియుండును కనుక భగవంతునివలన బొందబడిన యఘటనఘట నాసామర్థ్యంబున నీభయంకరధ్వని నణఁగింపుమాస్వామీ, భక్తశిరోమణీ, మీయదివోమన్ దాసుఁడ'' నఁనుటయు నాబ్రహ్మయ్య భక్తుఁడును నర్పుకునియొద్దకుఁబోయి ''హాం'' యని యొక్కమాఱు నంతకు నిశ్శబ్దముగా నాఘోషమెటుపోయెనో తెలియక లోకంబులు సుఖస్థితిని దనరినవి. అప్పుడు బిజ్జలధరానాధుండును తనదండనాధులతో పురజనులతో బ్రహ్మయ్యకు సాగిలిదండంబువెట్టి ''పరమభక్తుఁడా! నీవిట్టివాఁడవని యెఱుంగక నీలో తరయుగమకించిన నాతప్పుమన్నింపుము నీమహాత్వముగనుగొన నేనెవ్వడను నీభక్తికిమెచ్చి బ్రహ్మదులెవ్వని నిజభావంబు గనుగొనలేకపోయిరో

యట్టిగట్టువిల్తుఁడె నీకుబంటయి నీయిష్టానుసారము మసలుచున్నాఁడు నీవుపలుకుమన. బలికి మానునున మాని నీవాడించినటుల బొమ్మలాట వాని చేతి బొమ్మవలె నాడుచున్నాఁడు ఇఁక నీశరణుసొచ్చితిని నన్నుఁ బాలుముంచు నీటముంచు నీదేభారమని మఱిమఱి దండంబులువెట్టి నిజపరివారంబులతో భోవనున్యక్తుఁ డగునంతకు నందరుసూచుచుండ గనే బ్రహ్మయ్య తనసామర్థ్యంబును నాటోపుని మఱలబ్రతికించి బుద్ధులుసెప్పి విశ్వసింగక భక్తులను భయపడుచు వారలసేవచేయుచు నీవు ను భక్తుఁడవై మనియుంతంబున నాయుంతకాంతకు నుపాతంబునకు విమానంబున నఖండతేజో విరాజమానుండవై యేఁగి ప్రమథగణంబుల తోటివాఁడవు గానందయుండుమని చెప్పి వెంటనె వానిదేహంబు లింగ సంగతంబు గావించి పంపెను రాజును బ్రహ్మయ్య ననేకవిధంబుల గారవించి తనపురంబున దిరంబుగనుండుమని కోరి సెలవుగైకొని చనియె. బసవేశ్వరులును గొంతవడి నాతనితో నిష్టాలాపంబులఁ గాలక్షేపము సేసి యాయనందనగృహంబునకు గొంపోయి యిద్దఱును సుఖగోష్ఠినుండిరి. ఈకిన్నరబ్రహ్మయకథ వినువారును జదువువారు నొరులకుఁ గథ రూపంబున నుడువువారునుఁ జిరంజీవులై యీభూలోకంబున స్వేచ్ఛ మనుగానుండి తమయిచ్ఛవచ్చినప్పుడు కైలాసంబున కేఁగుదురు

## కలకేతబ్రహ్మయ్యకథ

మఱియు శివపూజాపరుండును భక్తనిత్యసంతర్పకుండును లింగ సంగతానుభవాద్భుతవ్రతుండును గతకలుషుండును కనికలోష్టసమబుద్ధియు నగు కలకేతబ్రహ్మభ్యయను మహానుభావుఁడొకఁడుగలఁడు ఆతండు జీవన్ముక్తుండై నిరాశుండును, నిర్మోహుండును నిరహంకృతుఁడై యొకచేతఁ దగఁబుఁగొమ్మును వేఱొకచేతనొకగుదియును ధరించిశివుఁడే యీవేషంబున దినదినమునగు దెంచుచున్నవాఁడని భక్తులనుకొన నిత్యంబును భక్తులయిండ్లకేఁగి "అమ్మలారా! యక్కలారా, పరమతపతి

తులఁ దాకిపాడిసేయఁగల రుద్రునినిటలాగ్నివచ్చెఁ జూడుమా. మతేతర
జనకమలంబులనాళంబులతోఁ గూడ నూడుబెఱుకు వీరభద్రభద్రగజం
వచ్చెఁ దిలకింపుఁడు భూతలంబునఁగల భక్తులయిండ్ల విందుగొను పాపపు
భక్తాధముఁడు వచ్చెఁ గనుఁడు ప్రమథులముందునను సోదరుఁడను
దుగ్గళవ్వకు ముద్దుకొనుకును సంగళవ్వకు ననుజుండు నగువాఁడు సను
దెంచె'నని వారలతోఁ బలుకుచునవ్వించుచు నిత్యమును వారలొసం
గెడి తెంఘులాదిపదార్థంబులు దెచ్చి వారితో జంగమార్చనాసంతర్పణం
బుల భక్తతృప్తిగావించుచుండును. ఇట్లుండ నొక్కనాఁడొక శివభక్తు
డలసిసొలి యతనికడ కేఁగి యేమియుమాటాడలేక యాయాసంబునఁ
గొంతవడి యూరకుండుట బ్రహ్మయ్యగని యేలయీతయలసినాఁడవు.
ఇంతప్రయాసపడి యిటురాఁ గారణంబు సెప్పవచ్చునేనిం జెప్పుమనవుడు
నాభక్తుఁడు పెదవులార్చుకొని చేతులుపిసికికొనుచు నిట్లనియె ‘‘శంకరు
డు భక్తవశంకరుఁడును పరమేశ్వరుఁడుగనుక దనభక్తులకే కొఱంతయు
లేక వారికివలయుధనంబొసంగుచుండు తొల్లిసంబికి నిత్యమును బది
వేయి రూప్యంబుల నిచ్చినటుల నేడు కిన్నెరబ్రహ్మయ్యకు నిత్యమును
గొంత సొమ్మునిచ్చుచుండునని విని యాతనిదర్శనంబుసేసి యేమైన
నొకతృణముఁ బట్టుకొనిపోయి కుటుంబపోషణము సేసికొందమని పోవుచు
న్నాను. వారిమఠమిక్కడికింకయు నెంతదవ్వున్నదో” యనెను అదివిని
బ్రహ్మయ్య కోరికగలిఁగి శివునిఁదలచుటతప్ప నిష్కామసేవయొనర్చు
చుచుండవలెను నిష్కాములకువలయు భోజనపదార్థంబులు శంభుండె
యెవరో యొకగృహస్తుమూలమున నిప్పించుచుండును ఈతృణప్రాయ
మగుధనంబునకు నీవంత దవ్వరుఁగనేల? వలసినధనము నేనిత్తును గొని
పొమ్మనిచెప్పి తనయొద్దనున్న గుదియను గంటతోఁ దాటించిన గని
గళ్ళుమని బంగారుచినచిన్నవి పెదపెద్దవి కణికెలు జల్లున నేలమీఁద
నొకరాశిగఁబడెను. అదిగని బ్రహ్మయ్య జంగమదేవరనుబిల్చి నీకువల

యు నన్ని కణికెల నేర్కొమ్మని చెప్పినపై నాభక్తుఁడు, పడిసకుండనపు బంగారుకణికెలు దనసుమోయుటకు భారంబుతలఁచ దగినమూటఁగట్టి నాఁటికచట శివపూజఁ గావించుకొని మఱునాఁ డుదయమున మూట నెత్తిఁబెట్టుకొని తిన్నగా మోయలేక పడుచులేచుచు నక్కడక్కడదిం చుకొనుచు నెట్లకో యొకతీరున బసవన్నయున్న కళ్యాణపురంబునకేఁగి మోతదించి లోనికింజని బసవనమాత్యింగని యాతనికిఁ దాఁ దెచ్చిన ధనంబువిధ బతము నెఱింగించి యాధనంబు దనయింటికి మోచికొని పోవుటకు నొకరిద్దఱుపరిచారకులం బంపుమని ప్రార్థించిన విన్నబసవేశ్వ రులా బ్రహ్మయ్య యీవికి నచ్చెరునంది యాభక్తునకు ధనము మో యుటకు నిద్దఱునొకర్ల నిచ్చిపంచి తనమనంబుననిట్లు వితర్కించె— కలకేతబ్రహ్మయ్య యెంత భక్తుఁడోగదా ఎంత మేఁటిభక్తుఁడుగాకున్న మాకిన్నెరబ్రహ్మయ్య బత్తిసీసడించునా? అట్టిమహానీయుని దర్శనము నర్పి యాతనియనుగులంబడని జన్మమెందు" కని కిన్నెరబ్రహ్మయ్యను గూడఁదోడ్కొని యిద్దఱునని కలకేత బ్రహ్మయ్య సదనంబునకరిఁగి యాతని యనుగుఁదమ్ములకుఁ దమశిరంబులసోఁక సాష్టాంగనమస్కా- రంబుగావించిన వారలనిద్దఱు సగౌరవంబుగా నాదరించి యాసనంబుల నాసీనులంగావించి కిన్నెరబ్రహ్మయ్యంగూర్చి బసవేశ్వరులతోఁ గొం తప్రసంగబు సేయఁదలంచి యిట్లనిరి, 'బసవన్నా! మన కిన్నెరబ్రహ్మ య్యనుఁ బోలినభక్తులు లోకంబున నెవ్వరేనిం గలరె? తొల్లి న బిశివు నివలన దినదినంబును నిత్తెబత్తెంబునకు గాను వేయిమాడలు గైకొని నటులఁ గిన్నెరబ్రహ్మయ్యయు మినుపికయ్యవలన నిత్యమును గూడ యుం జిన్నంబునుం బాతికయు ధనముఁగొనుచున్నాఁడు. శివునిఁబలికించి నవాఁడు. మఱియుఁ గైలాసంబున కీబొంకితో నేఁగి మఱల నేతెంచిన వాఁడు శంభునివలనఁ బడిగొనుటయు నాతనిసాక్షిగాఁగొని గంభీరధ్వని తోఁ నాతనిచేసాక్ష్యమిప్పించుటయు, యథేచ్ఛగాఁ గైలాసంబునకేఁగి

మఱలివచ్చుటయు సామాన్యభక్తులు సేయఁగల కృత్యములుగావు. మఱియుబ్రాహ్మయ్య శివభక్తులనేకమంది నొందఁబువచ్చినను దృష్టిగా విందొనర్చుచుండును. బహువృత్తులచేఁ దానార్జించినధనమును శివుఁడి చ్చు ధనంబును నొకప్పుడుచాలక పోవునేమో. ఆధనంబునకుఁదోడు మావద్దఁగూడఁగొంత దనమ్మనగొనిపొమ్మను. వేనవేలుబండ్లకొలఁది ధనమూతనికిచ్చినను మాకేమియుఁగొఱతలేదు మీరిప్పటికేగి కిన్నర బ్రహ్మయ్యను బంపిచ్చెదంపుము తాఁజేయుధర్మకార్యములలో మా ధనమ్ము సైతము గొంతకలియనిమ్ము ఎవియోకొన్ని యల్పులవృత్తు లవలన మేమార్జించి పాతిపెట్టిదాఁచుకొన్న ధనంబేగాన మాకుశివుఁడు ధనమివ్వలేడు. ఇంతకాలముసుగాను భక్తులమై యుండి మేము తన్నెం తేఁబూజించినను మాపై నాయుమాపతి చిత్తకన్నువై చెను గాని తన యీశ్వరత్వము స్థిరపఱచుకొనుటకు మాకెంతమైశ్వర్యమివ్వలేడు. మే మడుగలేదనిచూనెను అడుగకపోయిన నివ్వవలెనని యాతండెఱుం గఁడా? కాంపమ్ము శివుఁడు పేదవాఁడు పేదవాఁడుకానిచో భిక్షాటనమేల సేయును? అతనిభక్తులము మేమును బేదవారమె పేదలమనిమమ్ము ననాదరభావముచేఁ జూడకుఁడు మాకునెన్నివేలబండ్లపై బంగరుగావ లెనో యన్నివేలుశకటంబులు నికటంబుగాఁ బంపుడు శంకరదాసయ్య కు ననుంగువెంకలమగు మాపుధనంబు లేదని మీరుమనంబున శంకింప వలదు నమ్మరేని జూడుడు. చిల్లరవృత్తులచే మేముసంపాదించి పూడ్చి పెట్టిన బంగారుధనమ్మని కలకేత బ్రాహ్మయ్యయటఁ బడియున్న యొక మట్టిబెడ్డను జేతఁబట్టిచూపెను అంతలోనదిబంగారు దిమ్మయైకను బడెను అదిచూచి బసవేశ్వరులును గిన్నరబ్రాహ్మయ్యయు కలకేత బ్రహ్మయ్యకుఁబునస్సాష్టాంగంబొనరించి పాదములపైఁ బడిలేవకున్న జి యునవ్వునవ్వుచు వారలలిద్దఱు లేవనెత్తి యాలింగనంబుసేసి మంచిమా టలనాఁటివినము వారల శివపూజలందన యింటఁ జేయించి బహుకరించి

పంపెను. కలకేత బ్రహ్మయ్యయుఁ దనయధాస్థితినుండెను అట్టిమహా నుభావుడగు కలకేత బ్రహ్మయ్యచరిత్రము జదువువారును విన్నవారును వ్రాసినవారును నిష్కాములై యీలోకంబున నెల్లసుఖంబులనుభవించి యంతంబునఁ గైలాసంబుఁ జొఱఁగొని మోక్షపదవి నొందెదరు.

## మోళిగమారయ్య కథ

సర్వదా శివభక్తుల నర్చించెడు పరిపూర్ణచిత్తంబు గలవాడును శుద్ధసత్త్వగుణోపేతుఁడుఁ దత్త్వజ్ఞానియు జీవన్ముక్తుఁడును, కామక్రోధ లోభ మోహ మదమాత్సర్యంబులనెడు పశ్యతోహరులకు నిపుణతస్కరులు జ్ఞానరత్నము నపహరింప గాఁచియున్నను దానిని వారిబారిఁబడనీక నిశ్చలమనంబను దృఢపేటికయందు దాచి కాపాడుకొను వాఁడును కాష్ఠకేతృవృత్తిని జీవించుచున్న మోళిగమారయ్య యనునొక శివభక్తతల్లజుండు గలఁడు అతండు నిత్యంబు నడవికేగి యొండుకట్టియల మోపొకటి మోపికొనివచ్చి యంగడినమ్మి తనమ్మేలంబున జంగమారాధనంబు సల్పుచు భక్తసంతర్పణ బు సేయుచునుండును ఇట్లాతండొనర్పుచుండ దన్మందిరమున నొకనాఁడు కొందఱు జంగమభక్తులారగించి బసవేశ్వరు గృహంబునకు మఱునాఁడుసని యక్కడ షడ్రసోపేత భోజనంబుఁగావించి భుజించుతఱి ((?))సవచుంత్రి! నీయింటఁగుడిచిన నానావిధరుచ్యంబులకు భక్ష్యభోజ్యలేహ్యపానీయాది చతుర్విధాహారభోజనంబును మోళిగ మారయ్య యింటఁదిన్నయాంబలికి సరిరా" దని యాతనితోననిరి అదివిని బసవేశ్వరులవారు మారయ్యయింటికిఁజని భుజించి చూడవలెనని మనసు పుట్టమిని నపుడయొక నిరుపేద జంగమవేషంబున మారయ్య యింటికేగి యాతండరణ్యమునకు బోయియున్నను తద్ధర్మపత్ని యర్ఘ్యపాద్యంబులుఁగొని యెదురుగాఁజని పూజింపసమకట్టుట యు నవిసేకొనక కొంతదడవుట మసలి మఱికొంత సేపున్నయెడల నెఱిఁగి

యున్నవా రెవ్వరేని విచ్చేసిన మొసలఁ దినగుట్టు బయలువడునను భయం
బునఁ దటాలున లేచి గుబుక్కున నొక్కదాటున శివపూజాస్థలంబునకే
గి యటఁగూర్చుండి "అమ్మా! మా లింగమూర్తి యాఁకొనియున్నవాఁ
డు మా శివపూజ యైనది. మహానైవేద్యము తరువాయిగనుక వేగముగ
నీయింటఁగల పదార్థ మేదియేని దడవుగానక నానిమిత్తము మఱల పీడ
కసిద్ధముగానున్నది. యింతయుం బలిమైనను సరే శీఘ్రముగవడ్డింపుమా,
తెమ్మా, రమ్మా" యని మారయ్య భార్యనడుగ నామెయు మిక్కిలి
భక్తితో నంబలియె తెచ్చి యొడ్డించిన మిగుల నాప్యాయముతో దానిం
దిని కడుపునిండినదనుటకు సూచకంబుగా తేనిచి కడుపుఁ దడవుకొనుచు
నాయమ్మనుమొక్కి శివపూజాస్థల బున లింగమూర్తి నలంకరించి నా
గాభరణము పడగవెనుక రెండుబంగరుమాడలుంచి లేఁచిపోయెను పో
వుచు. బోవుచు మారయ్యామహిమ కలరి "నేఁడుగదా జన్మంబు సార్థ
కమ యనది. ఈతనియీవికి కల్పవృక్ష కామదేను చింతామణి మేరున
గంబుల త్యాగంబుగ్రిందను మన్నది ఈతనియింటి చూరునుండి రాలు
ధూళి యెవని శిరంబునఁబడునో వాని శిరంబు శిరంబు ఈతనియింట గుడి
చిన యంబలియె యమృతము దాని నారగించినవారికి మఱిక్షుత్తృష్ణ
లుండవు ఈతండు రెండవ విశ్వనాథుండు ఈతనిధర్మపత్ని యన్నపూ
ర్ణమ్మ ఇట్టి భక్తుఁడిఁక నీభూలోకమున మఱియొకఁడుండఁడు. పేదవా
నివలె దానున్నను భక్తసమారాధనము దనయింట నలువదిగడియలు
నిరాఘాటముగా జరుగుచున్నది" అని యనేకవిధంబుల నాతనిం గొనియా
డుచుం బోయెను అంత మధ్యాహ్నముగాఁగా మారయ్య మోపు నెత్తి
నిఁబెట్టుకొని యింటికివచ్చి భుజించుచున్న మరికొందరు భక్తులంగని మ
హాసంతోషంబునొంది "నాయింట నెల్లవేళల నిట్టు భక్తులాసక్తితో విం
దారగించుచుండవలె" నని మనంబునఁ గోరుచు లోనికినరుదేర నాయమ
యెదురుగానేఁగి మోపుదింపి గోడకుఁ జేరవైచి యుష్ణోదకంబుల నాతని

పాదంబులు జానువులవఱకుఁ బిసికి కడిగిపథశ్రమంబు గొంపోవాయఁజే
సిన నొక్కింతతడవు కూర్చుండి లేచి స్నానమాచరించి శివపూజకుం
గూర్చుండి లింగమూర్తి నాగాభరణంబెసంగించి యభిషేకంబు సేయఁ
బోవుచు దాని చాటుననుంచిబడిన మాడలుగని యివి యెవ్వరుంచిరని
భార్యనడుగ నామెయు నవరిపడిచూచి యిందాక నొక భక్తుఁడు శివపూ
జఁ జేసెనతండుంచియుండవచ్చు" ననెను ఆతనిఁ బసవేశ్వరులుగా నెఱిం
గి మారయ్య మిక్కిలి సంతోషించి "ఏమి బసవని యౌదార్యము! తా
నుధనవంతుఁడు. మేము పేదలము మాడల మొగమె మేమెఱుఁగము.
గాన మాకు రెండుమాడలిచ్చి పోయెను ధనవంతులకు ధనహీనులయం
దెట్టి దయయుండునట్టి మంచి వెగదా" యని తాను శివపూజ దీర్చుకొనిభు
జించి యభిషేకంబొనర్చిన యాలింగోదకంబు దానప్పుడే తెచ్చి గోడకుఁ
జేరఁబెట్టిన నెూ దుకట్టియల మోపుపైఁ జల్లెప నాకట్టెలన్నియు బాగా
రుకనొకలయ్యె వానివన్నింటిని జి చిన్నతు కలుగాఁ గొట్టించి వెయ్యేసి
మాడలమొత్తన కొక్కొక్కతునకగాఁ జేసి బసవన్నయిచ్చిన రెండుమా
డలు నిద్దఱు భక్తులకిచ్చి కొముభక్తులకుఁ దాఁ దెచ్చిన బంగారుమోపు
వెయ్యేసిమాడల తునుకలు నొక్కొక్కరికి నొక్కొక్క వేయిమాడల
మొత్తుతుంపులవిచ్చి యంపెను వారందఱు బసవేశ్వరుల పాలికిం బోయి
మారయ్య యిచ్చినట్టి మాడలయెత్తుగల తునుకలం జూప బసవేశ్వరులు
సిగ్గుపడి తానిచ్చిన రెండుమాడలు నిద్దరుభక్తులయొద్దఁ దీసికొని వానికిబ
దులు వేమేసిమాడలిచ్చి తక్కినవారితో సమానధనవంతులుగాఁ జేసి
వారలనంపి దాను చిన్నమొగంబుతో మారయ్యయొద్దకరిగి యడుగుల
కెఱగి వంజలించి "బసవన్నా! యేలచిన్నబోయెదవు? నేనన్నతప్పు లేదా.
భాగ్యవంతుడవీవు నిర్భాగ్యులము మేము మమ్మెఱపి మాకుధనంబిచ్చితివి
మేలయ్యె దీనిలోపంబేమి? నీవంటి భక్తుఁడెందుఁగలఁడు? నేడుమాకిచ్చి
నటుల దినదినము నీకడకువచ్చు భక్తులకండజీ కట్టిచ్చుచుండుము. అప్పు

డుగదా నీభాగ్యము బయలుపడను నిన్నుమెత్తురు మడివాలయ్య మొదలుకులము మేము మమ్ము నీలోఁగలుపుకొనుము. నీయౌదార్యమునీ కుంచు మెచ్చుకోఁగలడు" అని యనుచున్న మారయ్య చరణంబుల నిరుచేతులంబట్టి శిరంబుననతిసేసి లేవనున్న బసవన్నను మారయ్యలేవ నెత్తి, శిరంబుమూర్కొని యాలింగనముసేసి ,,భక్తవరా! నీవుకలహం సవు, నేఁగాకంబను నీవు పరమువేదివి నేనయఃఖండంబను నీవుహస్తిని నేనుమశకంబను నీవురత్నంబవు, నేఁశర్కరంబను నీవుజ్ఞానివి, నేనజ్ఞానిని నీవువిరాగివి, నేనురాగిని. నీవుగుణివి, నేనిగుణహీనుండను. నన్నుఁగటా క్షించి తత్త్వోపదేశంబుసేసె భక్తిమార్గంబునం బురికొల్పుమా" యని యనేకవిధంబుల నుపచారంబులు సెప్పుకొని యాతనివలన ననుజ్ఞాతుం డై నిజపురంబునకరిఁగె. మారయ్యయుదినయథాస్థానంబున యథాస్థి తితో సుఖంబుండె ఈమారయ్యచరిత్ర వినువారును, జదువువారును మోక్షంబున నపేక్షితంబుగాఁ జూఱఁగొనుట కేమియాశ్చర్యము

## కన్నడ బ్రహ్మయ్య కథ

మఱియు శివభక్తులలో నగ్రగణ్యుండును జరవిరోపాసకుల లో మొదటివాఁడును పరశైవవ్రత ప్రధాన నియముండును బహిర్వ్యా గంత త్యాగ క్రమారాధితార్యాపతియు లింగార్పిత నిజధన శరీరుండు ను, జంగమ లింగార్చనా పరాయణుండును, భక్త సంతర్పనార్పిత మానసుండును, శివార్పిత సకలపదార్థ పరిత్యాగుండును, రెండవ శరం భుండని లోకవిఖ్యాతినొందిన కన్నడ బ్రహ్మయ్య యనునొక భక్తుఁడు గలడు. ఆతండు చౌర్యవృత్తియె దనకు ముఖ్యవృత్తిగా నవలంబించి తదా ర్జిత ద్రవ్యంబుల జంగమార్చనలు నియమంబుతో నెఱవేర్చు చుండును. దొంగతనంబునకు వలయు పరికరంబులు, కన్నముత్రవ్వ సాధనములు, చిన్నగునపము, కత్తెర, కత్తి, త్రాఁడు, తోరపడము, పలుక, నారస ము, కాటుకదోకి, కాటుక, యీటె, మంత్రాక్షతలు, యెఱ్ఱకాలినోచి,

నల్లపాల తలచుట్టు, కుక్కల నోరుకట్టు, ఒకటియట్టె చెప్పులు, పాదీ, సంచి యీ మొదలగు దొంగతనపుఁ బనిముట్లుగొని ప్రతిదినము గృహస్థుల యిండ్లకరిఁగి ధనంబులు దొంగిలించి తెచ్చి శివభక్తుల కిడుచుండును. తా దొంగతనంబునకుఁ జొఱఁబడిన యిండ్లు కాలవశంబున భక్తలయిం డ్లయ్యేనేని దీపంబులు వెలిఁగించి వారలలేపి మీయింటి దాసుఁడను. కాపురాయు కుక్కను మీ భక్తుండను. కన్నడ బ్రహ్మయ్యను నన్నెఱుఁగుఁడు. మీ ధనధాన్యంబులు భద్రబఱచుకొనుఁడు నేనున్నంత కాలము మీయిండ్లకు వచ్చిన భయంబు లేదు నేఁ గాచుచుండెద" నని తొలఁగి పోవును. భక్తులుగానివారల యిండ్లలో ధనకనక వస్తువాహనంబులంగొంపోయి శివార్పితంబుగా శివభక్త సమారాధనం బొనర్చుచుండు నిట్లుండ నొకనాఁడాతని యింటికి ననంతాకతంబగు భక్తసంఘాతంబు చనుదేర వారలకు విందొనర్ప ధనంబు కేమి, నన్యుల యిండ్లకుఁబోవ నింతవేగముగా సిద్ధముగానున్న బిజ్జలుని భాండాగారము దప్ప మఱియొక్కెడను దొఱకదని పట్టపగలు రెండుజాముల వేళ పరికరములం దాడెగి రాజగృహంబునకు దొంగతనంబున కరిఁగి తొల్లిబసవేశ్వరుల యింటికిం జని దొంగతనపు బనిముట్ల నాతనికింగూడ నొసంగి రాజధనముకొల్లకు కన్నము వేతమురమ్మని పిల్చి యాతఁడుతోడురాఁ గన్నము ద్రవ్వి లోని కరిఁగెను అచటఁ గన్నముత్రవ్విన మన్నంతయు నాతఁడడుగిడినచోట్లనున్న మన్నంతయు బసియాఱువన్నె బంగారమ్యెను. లోనఁగలపెట్టియలుఁ దెఱచి వలయు ధనంబుగొని మఱలి చనిము ఎచ్చటనాతఁడు దొంగతనము సేసినను నింతునంచులువిప్పి కొంతధనంబుఁగొనిన నాసంచులు మఱలభక్తియగుచుండును. కానసీతని దొంగతనమువలనఁ బ్రిజలకునష్టము లేదు. మన్ను బంగారగుట వలన మఱింతబాధ మె అట్లుబ్రహ్మయ్య ననిన నాతనిఁబట్టఁబోయిన భటులు పట్టలేక మగుడినరు దెంచి "స్వామీ! మన భాండాగారమునఁబట్టె

పగలు సిన్నడబ్రహ్మయ్య దోచుకొనిపోయెను వానికిసహాయంబు మన
బసవనమంత్రియు దొంగవేషముననెవచ్చి యచటమీరాక కెదురు
సూచుచున్నవాఁ''డని విన్నవింప రాజును మిగులసంతసంబున విచారం
బును బొరిఁగొనుచుండ బున ''నేఁడుబసవన్ననాఁడు దొంగిలెను. పట్టపగ
లు నాధనముకొల్లను గొల్లవెట్టఁదలంచినవాఁడు మఱిదేనికిసహాసింపఁడు
నన్నడిగినఁదనకువలసినంత ధనంబీయకపోదునా? ఏలయిట్టియప్రశస్తపుఁ
బని సేసెనో యనితలఁచుచు వచ్చి కన్నముఁజూచి మన్నుబంగారుకావి
డలుచూచి మార్గముననాతని యడుగులుబడ్డచోటను గన్నపుమన్నంత
యు బంగారపుమన్నుఁదిలకించి యాశ్చర్యపడి క్రోధంబుమాని ,బసవన
మంత్రీ! యేమి యీచిత్రము! ఈబంగారమేమి?'' యనియడుగ ''దేవ
రా! మీరెఱుంగరా ఈశ్వరునిరెండవరూపమటుల నుండెడువాఁడు
దొంగతనమెతనకు వృత్తిగాఁగల మోళిగమారయ్యయను భక్తుఁడొ
కఁడు దనయింటికి నసంఖ్యాతమహాభక్తులను దేర వారలఁదృప్తి సే
య భోజనపదార్థములకు ధనములేమిఁబట్టపగలు దొంగతనమునకుఁ
దగినపరికరములఁగొని బయలుదేరి మనధనముకొట్టు దోచుకొనఁదలచిఁ
నన్నుఁబిలిచిన నేను మఱుమాటాడ లేక యాతనివెంటనంటివచ్చితిని.
వచ్చుత్రోవలో నాతనిశ్రీపాదముద్రిత చిహ్నంబులంటిన యిసుకయుఁ
గన్నముత్రవ్వినమన్నును బంగారమై యిట్లుమెఱయుచున్నవి ఇఁకమన
పెట్టియలలోని ధనంబుగణించిచూతము అన్నియునిండుసంచులేగాని
వెల్తిసంచియొకటియు లేదుగదా. వానింగలిపి యీవెలితిసంచిలోని
నాణెములు జమాఖర్చుచిట్టాప్రకారము లెక్కపెట్టిచూచిన సరియుసరి
గానున్నది. దొంగయనుపేరేగాని యతనిదొంగతనమున మనకుఁగలిగిన
నష్టమేది? పై పెచ్చుమనకుమఱింత విలువలేనిబంగారము దొరికినది వింటి
వా రాజా! భక్తులచరిత్రము వారునిడచినదే త్రోవ పట్టినదేబంగారము.
వారొకప్పుడధర్మంబునఁ బ్రవర్తించిన నదియెపరమధర్మంబగును దాన

నెగడా “అధర్మో ధర్మతాం వ్రజేత్” అను నానుడి పుట్టినది. ఒకరికిఁ గష్ట
ము నిచ్చిన పనియే మఱియొకనికి సుఖముఁ గలుగఁ జేయును. ధర్మరాజు జూ
దమాడి తమ్ములతోఁడను, ధర్మపత్నితోడను వనవాసాజ్ఞాతవాసంబుల
నిడుమలం బడెను ఆజూదమున నెగడా దముని నారదు మహాదేవు సాక్షా
త్కారంబు గనెను రాముఁడు వేఁటాడి యాలిం గోలిపోయెను కన్నప్ప వేఁ
టాడి శివునిం గలిసె హింసవలన మాండవ్యమహాముని కొఱతవడియె.
ఆహింసవలననె చండేశ్వరుఁడు శివప్రసాదంబు వడసెను ఎరసతులం గూ
డిన వారందరు నరకమున యమభటుల పట్టుఁగోలలపాలైరి. పరసతిని
సర్వదా యుండుకొన్న నంబి యీశ్వరసాయుజ్యంబు నొందెను బ్రము
చ్చులు శిక్షాపాత్రులై యుండ గొటియ మృచ్ఛగుసూదకుంతు నఱకున
బడి వధ్యశిలకేమురేఁగుచు మహేశుభక్తుండై విడువంబడియె. మఱియు
“రాజ్యాంతే నరకం ధ్రువమ్” నుటకు బ్రతిహాతంబుగా సోడఁడును
బేహమరాయుడును రాజ్యాంతమున మోక్షంబు నొందిరి వారిలచర్య
లటు లునిమ్ము కన్నడ బ్రహ్మయ్య మాహాత్మ్యం బెఱింగించెద నాక
ర్ణింపుము - భక్తులాఁకొని యున్నాగాబు నకై తనయింటికే వేళవత్తు రా వేళ
నేయతెఁగు రాత్రియనక పగల క సాధనస పత్తితో దొంగతనమునకు
బయలువెడలును కన్నము ద్రవ్వి లోనికి రిఁగి యాయింటిలోని వారలు
ధరించిన శివచిహ్నంబులం బట్టి యవి భక్తులయిండ్లని తోఁచినఁ దొలఁగిపో
వును ఇతరకులగృహంబులైన నంపదిధనంబులు గొల్లఁగొని జంగమార్చ
నకు వినియోగించును. పట్టపగలరెండు కన్నము త్రవ్వినపుడుగాని, లోని
కేఁగి ధనసంచయంబుల గొనునపుడుగాని యితరుల కదృశ్యుండుగా నుం
డును. ఇంటికాపులు భక్తులైనవారికి గనఁబడి చెప్పిపోవును ఇతరులైన
వారలధనముఁగొని తాఁబోయినను వారిధనమెప్పటి యట్టులనుండును
గాని తఱుఁగదు. అది యేమి చిత్రమో నరనాథులుగాని, భాగ్యవంతులు
గాని, తన్నుఁబిలిచి లక్షలొసంగినను దొంగతనపుసొమ్ము గాని యాలక

లు గిడులు లక్ష్యము సేయువాఁడుగాఁడు. ఇట్లు కన్నడబ్రహ్మయ్య ప్ర
భావంబును చెప్పిన బసవేశ్వరుల బిజ్జలుండును సంభావించి తనధనంబును
మఱి యకుటిఁగాంచి సంతసించి వీడ్కొని నిజనివాసంబునకుం జనియె.
కన్నడబ్రహ్మయ్యయుఁ దాఁగొన్న ధనం బిలుసేర్చుటయు, నాతనిభార్య
మొసుగుపని మూటలందుకొని భద్రపఱుచును ఇట్లు సంతతజంగమా
ర్చనా పరతంత్రుఁడై కన్నడబ్రహ్మయ్య జీవవృత్తి నడుపుచుండెను అట్టి
బ్రహ్మయ్యచరిత్రంబు వినువారును జదువువారును కొదువలేనిసుఖంబు
లనుభవించి యంత్యంబున ననుపమమోక్ష సామ్రాజ్యంబునకుం బట్టాభి
షిక్తులగుదురు

## ముసిడిచౌడయ్యకథ

ముసిడియను నొకపురవరంబున చౌడయ్యయను నొకభక్తుఁడు క
లఁడు. అతఁడు సర్వశైవసంరెండవవీరభద్రుఁడు ఆచరితసకలపుణ్యకర్మ
ఫలత్యాగి అమోఘపరాక్రమశాలి శౌర్యానుగ్రహదక్షుఁడు విఘ్నాంతకు
నుఁడు. విద్యాసంపన్నుఁడు. అనఘుఁడు. జంగమలింగార్చనావినోది శ్రౌత
క్రియాపరతంత్రుఁడు సాంఖ్యత్రికవాసనారహితుఁడు ప్రాజాపత్య
బ్రహ్మచారి. ఖడ్గపాణియునగు నతఁడు ముసిడి యంతఁ నొకానొక
దినంబున వీరువారు నానాసకలజనంబులును బసవేశ్వరులభక్తిసామర్థ్యం
బులు పొగడుచుండుట విని యత్యంగన నతికుతూహలంబు గలవాఁడై
భక్తగణంబులతోఁ గలసి యరుగుచు ముందొక యరణ్యంబు గని
యందు విశ్రమించెను. ఆయడవినిముసిడిచెట్లు ఫలభరితంబులై బలిసివెలిఁగి
యొక్కొక మేరునగంబు భాతిఁ గన్పట్టుచుండె. తోఁడనున్న భక్తగణం
బులు చౌడయ్యపాలికింజని "దేవా! యీముసిడిపండ్లను శివార్పితం
బులుగానించి కడుపార మెసవవలెను నాసమాసుఁబోడమినది నీయా
నతికై నెదురుచూచుచున్నవార"మనిన ముసిడిచౌడయ్య ముసిముసినగ
వు మొగంబునలంకరింపఁ దనచేతికరవాలంబా చెట్లమూలంబులకుఁ

దగులనిచ్చి యొకరాపురాచి యథేచ్ఛఁగా భుజంపుఁ''డని సిలవ్రెసంగ భక్తులందఱా పంక్తులమెండుగఁగొసి లింగసంగతంబులుగావించి కడుపులనింక భుజించి "నేఁడుగదా ముసిఁడిచౌడయ్య నామము సార్థకమయ్యె''నని యాతనిఁబొగడిరి అంతమఱునాఁడచటఁగదలి చౌడయ్యయు భక్తులును కళ్యాణపురంబునకుంజనిరి. తొలినాఁటి తనశివపూజాసమయమున బసవేశ్వరులు తమయిష్టదైవమగు సంగమేశలింగమూర్తియందు చౌడయ్య స్వరూపమును బొడఁగని యాతండరుదెంచుచున్నవాఁడని యెఱింగినవాఁడు గావునఁ గొన్నియడుగులెదురేఁగి పాదంబులకుఁ బాద్యంబును హస్తంబులకు నర్ఘ్యంబునొసఁగి యింటికిఁగొంపోయి శివపూజచేయించి విందొనరించి కళ్యాణపురంబునఁ గొన్నాళ్లుండుమని ప్రార్థించి యీశ్వరభావంబున నాతనినారాధించుచుండెను ఇట్లుండఁగొంతొకదివసంబున వీరశైవము రాచాయలెల్లరు నాతనికింగళ్యాణంబు గావింపనూహించి యనేకనివనలిచ్చి పెండ్లికింబొమ్మని బహుమానంబుగావించి తామును తోడనే జనుమ వివాహంబునకానని గొనిపోవుచున్న సమయంబున మర్త్యనొక చతుష్పథమార్గంబున నొకతపస్వి మృతకళేబరమును వాహకులుపరేతభూమికిఁగొనిపోవుట చౌడయ్యగనిపెట్టి "ఔరా! యీమహాతపసిచే దీవనలనొందమి నీతనుఁగూడ రాము నాకీపెండిలి యేలయని యావాహనంబునాపి దింపించి ఖడ్గంబునూడఁబెఱికి యాతపసితనువునంటఁజేసి "మునివరా! గ్రుస్క నిక్కి లేచిర''మ్మనవుడుఁ గట్టినత్రాళ్లుదెగి యందుండి తపసిలేఁచి నిద్రమేల్కొనివానివలెఁ గన్నులనలుపుకొనుచు వచ్చి చౌడయ్యకునమస్కరించి నిలుచున్నవానింగని చౌడయ్య "యోయయ్యా! నీవుసాక్షాత్తు మనుసికయ్యపు ఏలయీనరవాహనంబున బయలువెడలితివి నీసంగడీఁడగు గుబేరుఁడునరవాహనుండని నీకునట్టికోరిక పుట్టెనా? ఇఁకఁజాలు నావాహకులంబొమ్మ్నని నాలోఁడనపెండ్లికరుదెమ్ము నీయాశీర్వచనరహితంబగు పెండ్లినాకక్కరలేదను

టయు నాతపస్వియు ముందఱనమునఁబోచ్చెను అంతమఱికొంత దవ్వు లనరుగుచో నచ్చటఁబసులకాపరిపిల్లకాయ లాడుకొనుచు డెను. యా పులమేయువిడచి యవిచెవరి తోటలపడప్పి వెడలునపుడు వానిమళ్ళించుచు పాటలుపాడుకొనుచు గెంతుచు జెట్టెక్కుచు విహరించుచు నొకవిష యంబునఁ దమకువివాదంబు గలిగిన నాటిగవ్వుఁదీస్సి నందలియొక పెద్ద పెయ్యలవాఁడందఱఁ బిలిచి యూరగవ్వకుసాక్షి యీబసవ పటవిటపియే యనుట చౌడయ్యవిని వారలం జేరఁజీరి "యోరి! పాపలారా, బసవమ ట్టియేమిరా?" యనియడిగెను అయ్యా! దీనికొక గాథగలదు తమతా తచే వింటినని మాతాతమాకుఁ జెప్పెడివాఁడు. వినవలదేని దవ్వు త్తా తండ్రితయు నెఱిగించెదనని యిట్లు చెప్పందొడఁగె

"పూర్వకాలమునందు రెండెవద్వాపరు బులు బరదర్పితములై యొండొంటితోఁబోరాడి యహోరాత్రములు మల్లయుద్ధముసేసి తుద కొకదాని చే తెరుశి యొరిగెను. అంతనిచట శివభక్తులొచచ్చినదాని నిట సమాధియొనర్చి దానిపై నిమట్టి మొలిచెచిరి నాటంగోలె నీమట్టి చెట్టునకు బసవమట్టియనిపేరు, దీనిఫలంబులు మాంసఖండంబులం బోలి యుండి మాంసపురుచి గలవియై యున్నవి దాని రసంబును (అనఁగాఁ జెట్టునరికిన వచ్చెడిపాలు) రక్తప్రాయంబు కడునెఱ్ఱగానుండు" నని చె ప్పెను. అదివిని చౌడయ్య నేను బసవనిచావువింటిని బసవనంతయుం డంబుగా మునుకుందునని వివాహంబునాకేల యని యొంటనున్నకత్తి దానిమొదలనరి "మట్టిమూలంబుననున్న యోబసవనంది! లేచిరా"మ్మ నెను అప్పుడు నాఁడు పూడ్పఁబడిన యావృషభంబు డంబుమీరి తొం టిరూపంబున గుబాలున లేచి యొకగంతువైచి చౌదయ్యను మూచుూ చి చెట్టుమొదల వాసనఁజూచి మూత్రవిసర్జనంబుఁ గావించి కాలుదువ్వి త్తోఁకయూడించి గంగిరఁదిరిగి మట్టిప్రదక్షిణించి ఘణిల్లుమని ఱంకె వైచి మున్నున్న తపస్విలోఁ దానును బురోగమనంబున వివాహంబు

నకరుఁగుచుండె ఇట్లు దపసియు నాఁబోతును గొలిచిరా వివాహంబుకే గుచు మార్గమధ్యమున నొకయతి దీర్ఘప్రసారితంబగు మహాసరిత్తుంగని యాకసంబున కెగయుచుండెడు నందలియలల కల్లోలంబులుగాంచి తొలఁగిపొమ్మని చౌడయ్య తననిస్త్రింశం బానదిసీళులం ఝళిపించి గంభీర ధ్వానంబునఁ బలుక నాకాశగంగ చే శివభక్తులప్రభావంబు విననేఁగనో యున్నటుల మిన్నంటకెగయునలలతో నొకపాయయు పొంగకత్తిచే జెలిమి సేయఁబోయెనో యన్నటుల గ్రుంకఁబాలో నింకిగాత్రేణ నూర్మికార హితంబగు నల్పప్రవాహంబుగల పాయయొకటియు గా త్రొడుపాయలై నడుచు నెడల్పుతోఁ బ్రవహించుచుండిన చౌడయ్య ముందునడుచుచు గత్తినెత్తి చూపుచు రండని పిలువ నందఱును నాయేఱు దాటి యవ్వలఁ జనినిలుచున్న చౌడయ్య తిరిగిచూచి నోటనుంజీఱ త్రుళ్లులేక మెల్లనఁ బొమ్మనియా నతిచ్చి మునివృషభులకును వృషభంబుసు మంగనడుపఁ గళ్యాణంబునకుం బోయి క్రియాలోపంబు రాక సకల మంత్రోచ్చారితంబుగా వివాహక్రియా నివర్తియొనరించి కల్యాణపుర పునరాగమనంబున ముందున్న ఋషివృషభములు చరితంబుఁ బరిజనులువిని యమందానందంబునం బొరలుఁ బురప్రవేశంబుగావించి యోగాభ్యాసప్రయోగ మంత్రఘోషంబగు వైదికవీధి నరుగుచుండ నొక బాలశశిమణి యాండనికినెదురై నమస్కరించి శతాయుఃపరిమాణపుగమ్మని దీవనబొందె నాఁటితేఱు సుఖంబుండి చుఱునాఁడరుణోదయంబున నరుణకిరణ తనయునాయాసంబునకుం బయనంబై పోవువాని నావాహనంబుతోఁ గూడ మోపికొనివచ్చి దానితలిదండ్రులు చౌడయ్య ముందఱఁబెట్టి నిన్నఁగడా యీబాలనీచే శతాయుఃపరిపూర్తిగా వరంబు వడసి నేఁడు మిడిసినది. నీయాశీర్వచనమె గురుదిప్పనయెడల నింక నెవ్వరి యాశీర్వచనము నిలుచును" అని యేడ్చువారలం గనికరించి తానాశవంబునొద్దకుఁబోయి మండలాగ్రంబున దాని తన్వగ్రంబు నంటి, బాలేందుముఖీ! ఏల యీలీలనిద్రించెదు పగటినిద్దర పద్మముఖు

లకుఁదగునా? కమలనయనవలన యనకమలంబులు పగటిపూట వికసించి యుండఁవలెఁగాని ముకుళింపవచ్చునా?" యనుఁడు నిద్రమేల్కాంచి సభా తినానాతి లేచి కూర్చుండెను అంతకుమున్న దానితలిదండ్రులు చేతులు జోడించి నిలుచున్న వారలతోఁ దామును కరకమలంబులు ముకుళించిరి నలువురకు నప్పటికిగతించిన వయఃపరిమాణంబుగాక ప్రత్యేకశతాయః పరిమాణాయువు నొసఁగి గమ్మునప్పురను లింగసంగత దేహులంగావించె అంత నాపురజనులు వీరువారనక యెల్లవారును వచ్చినవారివ్రణంబులు మఱలనొసఁగి వారలకక్షింప నాదత్వాష్వాసత్వంపి యోపుఁగాని యన్యులోపుకురే యని తన్నుఁగొనియాడుచుండఁ జేడయ్యయెప్పటి యట్లఁ దనయథోచిత వర్తనంబునను గట్టియెడఁ గొందఱు పరమతావలంబకులు తనులోఁ దాము చేడయ్య ప్రభావమునుగూర్చి ప్రశంసించుకొనుచు" సీతంబూదాడనాడుకొని పాపాస్మరణంబు నొందినవారి ప్రాణంబులు వారికిమఱల నియసేయుసమర్థుండుగాని, యెన్నఁడో సచ్చి కుళ్ళి కంపుగొట్టుచున్న మృతకళేబరమును పునర్జీవితుఁడుగఁ జేయఁజాలునే? చూతము" అని వారందఱుఁ గలసి యొకగోనెసంచి దెచ్చి దాని జింపి కాళ్లుచేతులు గన్నులు ముక్కు చెవులు,తల కడుపు, వీపు, వేళ్ళు, గోళ్ళు, మొదలగు నవయవంబులు గలయఁగట్టి లోనగడ్డికూరి యొక్కడక్కడఁ దాళ్ళతోఁ గట్టులుగట్టి యూరివెలుపల నొకపాడుగుడివెనుక బడవైచి వేర్వేఱ నొకరితోనొకరు చేడయ్యకు వినఁబడునట్లుగ "నూరికడనున్న పాడుగుడివెనుక నొకజంగమశవము కళేబరమున్నది. ఏనాడుసచ్చి యటఁబడినదో తెలియదు కుళ్ళి కంపుగొట్టుచున్నది ఎవ్వరునట సనవెఱతురు పాపమా గతజీవునికిఁ బ్రాణదానంబుసేసి చేడయ్య బ్రతికింప నోపునేమో?" యని సంభాషించుకొనుచుండ నందుఁ గొందఱు "మనమితరులవలె భయపడినలాభమేమి? మనము మతేతరులమైనను శవము జంగమమతశవము అదిగో శివచిహ్నంబు లగువిభూ

తిరుద్రాక్షాదులు గనఁబడుచున్నవి. దానిని చౌడయ్యతప్పఁ బ్రతికింపఁ గలఁడుగాని వానినొక విమానమున నెక్కించి మనమందఱము మోసి కొనివచ్చి యాయనయెదుటఁ బెట్టుదమని యనుకొనుచుండ నొకఁడు తన చేతికఱ్ఱతో దానిం బొడిచి "యారా! కుళ్ళుకుమ్మడికాయవలె లోలోనఁ గుళ్ళినదిగా. కఱ్ఱగుచ్చినంతనే బడినది ఎంతనీరు పైకిబుస్సనఁ గారుచున్నదో. కంపు కంపు బాయఁజాల" మనుచు నొకవాహనముఁ గల్పించి దానిపై నాశవమునుబెట్టి నలువురుమోసి చౌడయ్యకెట్టెదుర బెట్టిరి దానామహాత్మ్యుఁడుగని యిది భవ్యులుచేసిన మాయగాని మఱి యొకటిగాదు కానీ, దీనినిఁజూచి జనులందఱు వెఱఁగందనొక జంగమ మునిఁగాఁ బొందుపఱచెదనని దా నుంబోఁలు నవకరవాలంబు నేలనాని దాని నాశవంబు శిరంబున మోపి "సూబుధనుత నెలదాల్పా! యల్పంబగు నీరూపంబున నేలయడంగితివి? నిన్నుంగనని చట భక్తులెందఱు వేచియున్నారో చూడుము. ఈక్షణము వేగము లేచిరమ్మా" యనుఁడు నామాయాశవమె యొకయమానుష రూపంబున లేచివచ్చి చౌడయ్యపాదములపైఁబడి "భక్తపోషకా! నేనొకజంగమభక్తుఁడను తొల్లియేజన్మంబును లేక యిదియేనా తొలిజన్మంబుగా నీచేలన సృష్టింపఁబడిన వాఁడను సామరులగు భవ్యులు నన్ను గోనెసంచులతో నిర్మించి నీమూలమునఁ బ్రాణములు గలవానిఁగాఁ జేయుంపిన పున నేఁటినుండి నేను గోనెదాసుఁడను నామంబుతో నీకడ నీయనుగుబంటనై పరిచర్యలు సేయుచుండెద. నన్నుఁగాపాడి రక్షింపుమా" యని సాష్టాంగదండంబిడి లేవకున్న నాతని లేపి పరిచారకగణములో గలుపుకొని యామాయఁ గావించినపాపమతులగు పరమతాచారులను హాతులఁగావింప దలఁకొన నాతనికినద్రులై వారెల్లఱతిలజ్జావనతశిరస్కులై వేడుకొన్న వారలనుగటాక్షించి యితరమత చిహ్నంబులందీయించి లింగసంగతదేహులంగావించి బుద్ధిగలిగి మసలుకొం" డని బుద్ధిసెప్పిన వారలు అసమానధైర్యవీర్య

ప్రతాపధాముండవగు నోచౌడయ్యభక్తవరా! శరణాగతత్రాణకృపాణ ధురీణా! పాపచిత్తులము దుష్కర్మలము జ్ఞానవిహీనులము శివభక్తి విరహితులము నీయెడల నపరాధంబొనర్చినవారము "అన్యథాశరణం నాస్తి త్వమేవ శరణమస్మాక" మ్మని నీయడుగులఁ బడ్డవారము. మమ్ము రక్షింపుము నీవేమావాలిటి ఫాలాక్షుండవు మాయనేకజన్మను కృతపరిపాకంబున నీపరిచర్యసేసి నీదాసానుదాసులమై యిలఁగలకాలము మనఁగోరుచున్నార" మని యనేకప్రకారంబులఁ గ్రొవారములుసేయుచు చౌడయ్యకునమ్రులై యుండిరి. ఈమునిడిచౌడయ్య చరితము జదివిన వారును విన్నవారును వ్రాసినవారును వ్రాసితేని యీశభక్తులై సకలసు ఖంబుల ననుభవించి నిటలాక్షుని లోకంబునఁ దుదిని శాశ్వతపదవినుం దురు.

## సురియ చౌడయ్యకథ.

మఱియు సురియచౌడయ్య యనునొక భక్తుండు జితేంద్రియుం డును భూతదయాసాగరుండును విగళితసంసారబంధుండును శ్రద్ధానుష్ఠి తకర్ముండు సజ్ఞానసిద్ధుండును సంగవిహారదూరుండును నవవిధవార నశ్వరంబును కాగణమున్నందును మాయాప్రపంచవిర్వాంచితుండు నగుట రసాన్భక్తాజిహాద్రిగేయను లోకోక్తిననుసరించి గురులింగభావంబులఁ జరలింగంబులనారాధించుచుండును అతఁడుకళ్యాణపురంబుననున్న భ క్తులనాశక్తిశోఁ ప్రార్థించి గృహంబునకుం గొంపోయి పాలును నేయి యు పప్పుఁగూరలుఁ జాయఁబులును బెల్లుగు గారెలు బూరెలు నపూ పంబులు నరిసెలుఁ బంచభక్ష్యాన్నంబులు షడ్రసోపేతంబులగు నాహార పదార్థలం బౌత్రిలలో నొడ్డనసేయించి వారిలశివపూజలుసేయించి చేతు లుజోడించి శిరంబునఁదాల్చి "మహానుభావులారా! భుజింపుఁ"డని ప్రార్థింప హరభక్తులకు జంగమలింగమూర్తులు కడుపులకింపార భోజ నంబులు సేయుచుందురు ఇట్టుభక్తులకు శివపూజలుగావించి తానును

కూర్చుండి నిజలింగమూర్తిని బూజించునపుడు దానభిషేకమొనర్పక పూర్వమె యీశుని నేత్రములనుండి హర్షాశ్రులు జారుచు దేహమంతయుఁ దడుపుచుండును. సజ్జయుంకలి పువ్వులంగొని పూజి చుటకు ముందె నిజమనస్సరసిజము హరునిశిరంబునఁ దనరుచుండును. ప్రకధూపం బొగ్గియుండు వైవకమున్నె యీశ్వరునందలి వాసనలు పైవెడలును దీపము వెలిగించుటకు మునుపె యాత్మజ్యోతి భూతేశుముందట వెలుగుచుండును. పక్వపదార్థంబు లర్పింపకమున్నె దన ప్రాణముపహారమై యమరుచుండును ఇట్లు శర్వభిర్కిష్టుల లింగమునుమనోభావంబున నిత్యంశివపూజసలుపుచు నైవేద్య బొసంగు తిరుణమునఁ దనయొద్దనున్న సురియయొరఁబాసి ప్రాణమునకడ్డము నిల్పిన దానినందుకొని పూజా వేదికకోకములు బెట్టి "స్వామీ! నీవు నాచేతియన్నంబుఁ బ్రత్యక్షంబుగా స్వీకరింపలేనిచే నీసూరకత్తిచే గొంతుఁగోసుకొనియెదఁ దలచి యొకబంగరుపళ్లెంబున సకలపదార్థంబులుం బెట్టిచి వానింగలయఁ గలపి కళ్లుకళ్లుగాఁ జేసి యొక్కొక్కటి నొక్కవమునంబున మిక్కిలికంటి దేవరు నాహ్వానంబు సేయుచు నందియ్య నయ్యిందుశేఖరుఁడును జన చేయుసాఁచి యా ల్లంపుకొని యత్యాప్యాయముగ నారగించెను. ఇట్లుప్రతిదినమునఁ ద్రిసంధ్యలయందు సురియచౌడయ్యతోఁ జంగమ్రుచుండుడు ప్రత్యక్షముగా నాతని చేతిప్రసాదంబారగించుచుండె సంసారసంక్షోపహారావారంగతుండై యాతండుని డుమనంబున మొందగుభక్తిసలుపుచుండును. ఇట్లుపూర్వకాలమందు సైతము భవంతుండగు వేదండచర్మాంబరుండు భక్తవాత్సల్యంబున వారలయిండ్ల నారగించుచుండెడి వాఁడనివిందుము కరికాలచోడుఁడను కాలకకంఠుఁ భక్తుఁడొకడు దొల్లి మెట్టగాఁగాఁగిన మీగడపాలు మున్నూటయిరువదిపుట్ల నూతనతులుం బులవించి యందుకుందగిన శాకంబులను ముప్పందుముమిరియాలతోఁ బాకంబు సేయించి పళ్లెరంబులలో భక్తినునిచి యాయుధహస్తు

డై యాశేషముం దటఁబెట్టించి యారగించుచప్పుడు వినవలయునట్లు వినఁ
వినఁబడని నో మెడఁగోసుకొని చెద ననియు వినయముతో నిలుచున్న
యాతనికి శ్రుతిగోచరంబగునటులు బుడబుడఁబీల్చి జుఱ్ఱినచప్పుడును
మిగిడయుఁ గాయగూరలును నమిలినధ్వనియుఁ బిప్పినముసి వైచిన
స్వనంబునుఁ గలుగ॥ జేసె యారగించెనట మాదర చెన్నయ్య తొలిదిన
సమున ఘనముగ భక్తితో సీశున కంబళివెట్టి మఱునాఁడు నట్లే చేయున
ట్టి యామెంగలిపాత్ర నిత్యము నంబలి ద్రాగుపాత్రగా నుంచుకొమ్మ
న నది యాతనియందలి యాదరంబున సంబాధపుండఁగాఁ గిఱించె ననిపిం
దుము. మఱియు ద్రాక్షారామమున వీరకోడన్న తాభుజించుచుఁ దన
కుమిఁగల జలినైన కడి సగము రెండి మఱిచెన మనసొప్పక దానినొకచి
న్న పల్లెరంబున నుంచి తనదాసిచేత నీశ్వరాలయంబున కనుప నదిసని
యెడి మాయక్క నిన్నఁదినుమని యు పీరబైకొ" మ్మని యంది
య్యా! మహేశ్వరిండా కొంత ప్రసాదంబుకొంచు మామెంగలిమ్ముగ్గ దిని యా
పాత్ర నాలోపల చిలుపలఁ బడనైచునని పెద్దలు సెప్పఁగ విందుము ఇ
ప్పుడుండటఁ గను గొనుచుండి నుఱియు చౌడయ్య చేతి కల్లందుకొని
భక్షింపలేఁ? అట్టి యీనుడియ చౌడయ్య కథ వినువారును, జదువు
వారును వ్రాయువారును, నొరులకు వినుపించువారును, వ్రాసినపొత్త
ములను బత్తితోఁ బూజించువారును సద్యోముక్తిం గందురు.

## తెలగాణొమ్మయ్య కథ

శివభక్తియుక్తుడును బాపహితుఁడును చివక్సినిర్దళితశుభా
శుభకర్ముఁడు కారణజన్ముఁడు నిస్తులయశుఁడు వీరశైవుఁడు సంగరహి
తుఁడును సతతజంగమలింగార్చనాసక్తుఁడును కిరాతపురారి యీరూపం
బున నవతరించెనో యనునటుల శివసారూప్య శరీరచిహ్నుఁడునగు తెలఁ
గుబొమ్మయ్య యను భక్తుఁడుగలఁడు. తండసమానదానవిద్యాపరా
క్రమధురీణుండై శివభక్తిపరతంత్రుండనై లోకహితార్థంబు జన్మించి

నవాఁడుగావున నిత్యజంగమలింగపూజావిధానుండై కళ్యాణపురంబు ననుండును

ఆతం డట్టులనుండఁగా శ్రీశైలంబున శివానందుఁడను నొకముని పుంగవుండు తపశ్చరణైకవృత్తి నొకయాశ్రమంబు కల్పించుకొని తపోనిష్ఠనుండ నాతనియొడ తెల్లఁ బుట్టుబలిసి నీలాద్రివలె నగుపడుచుండెను. అచటికొకనాఁడు గంధర్వులుతమ భార్యలతోఁ గూడి స్వేచ్ఛావిహారంబులుసలుపుచు నాతోవనాకాశగమనంబున నేఁగుచుఁ గొండవలెనున్నతంబుగాఁగన్పట్టు నాతపసిపుట్టంగని యిదియేమొచిత్రము. ఇచ్చటనున్నది కొండగాదు కేవలము డుత్పయునుంగాదు లోనబురబురగఁ బుకు వినబడుచున్నది ఇదియొక కదలమెదలలేని యొక మెలుగుగొడ్డయియుండునని తమలోఁ దామనుకొను సమయంబున నచటనున్న యామునిశిష్యుండు తనగురువును భల్లూకవనివారస్సుఁడున కలుషించి ''యో యుగంధర్వులారా! మీ కైచరగమనంబునకు గర్వించి క్రిందుమీఁదు గానక మహానుభావుండగు మాగురు నిమ్మృగప్రాయునిఁగా మాటాడుచున్నవారు. మీగర్వమె మిమ్ములఁదినుచున్నది నేఁటిమొదలు మీరండఱు నాలుబిడ్డలుసహా మృగంబులై యరణ్యములఁ దిరుగుచుండుఁడు'' అనికఠినంబుగాఁ బలుక నాతనికి గంధర్వులు నమ్రులై ''మేము తృణీకారభావంబున ననలేదు అమాయకంబుగా కట్టుగనఁబడినది కనుక మమ్ముక్షమింపు'' మనవుడు ''వాఁడు నావాక్యంబమోఘంబు బ్రహ్మలిఖితమైన నొకప్పుడు తప్పవచ్చునుగాని నాశాపంబు దప్ప'' దనెను వారు మోక్షణంబుఁ బ్రసాదింపుమన నాతండు మీరెల్లరు కళ్యాణపురపరిసరారణ్యంబున మృగంబులరై తెలుగు బొమ్మన్నయ్యచే వేటాడంబడి మీరుమీగంధర్వకులంబడసెదరు. పొండ'' నవారు తక్షణమ మృగజన్మంబులనొంది పూర్వజ్ఞానసంపన్నులై యెప్పుడు బొమ్మన్నయ్య వచ్చు నెప్పుడు మనకీశాపవిమోక్షణం బగునని యెదురుసూచుచుండ

టు రెండు చెక్కలగునటులగా ఖండించిపాఱవైచెదను. నీవంటిమూర్ఖులిం దుఁ బ్రయోజనములే"దని వానితోఁ గఠినముగాఁజెప్పెను. అంతనా జైనుఁడు చిఱునవ్వునవ్వి "ఓయామూఢుఁడా! నీమూఢభక్తి విడుపుము, జ్ఞానమార్గమువలంబింపుము. "నిస్త్రైగుణ్యేపథివిచరతాం కోవిధిః కోని షేధః' అనెడు శంకరసూక్తివినలేదా? మేముగుణరహితులము. గుణా వలంబకులముగాము. గుణాతీతులము. మాగురుబోధ నీవువినలేదు గాఁబోలు! మేము విగ్రహారాధనసేయము. మాది కేవలము సమాధ్య వస్థనుండు ధ్యానమతము. మనోనైర్మల్యముప్రధానముగాని, బాహ్య నిర్మలత్వమేల? పాడుపట్టినపాత్రకు బైనితోమిశుభ్రపఱచినటులనె నీబాహ్యపవిత్రప్రవర్తనము నీవంటిమూఢభక్తుఁడొకఁడు చెప్పుకాలి తో నీశ్వరునిపైనున్న నిర్మాల్యముఁదీశెనని వింటిను. నీవెఱుఁగవా? భ్రాంతిలేక నిశ్చలమయిన మనసుతో నేమిచేసిన నదియెల్ల జనసహ్యము మగును ఇంతయుశివాయుంబునకు నీయధికారమేమి? ఇదెసర్వజనగ మ్యంబు ఎవరిభక్తిమార్గమునవారు పోదురు మాభక్తిమార్గమిదియ· ఇట్టి నీ చెడుగును సెగులుసుగుము కాదేని నీతల నీశ్వరార్పణముసేసి ముజ్జలఁబడయుము. అట్లైననీసాహసము నీశ్వరునిఘనతయు లోకంబు నకు వెల్లడికాఁగలదు" ఇట్లని జైనుఁడనునంతలో నేకాంతరామయ్య "ఛీ! వీరిజాపుట యెంతపని కానీ, నీకు తల శివునికిచ్చి ముజ్జలఁ బడ యుమనెను, అదియెంత! ఒక్కసారి నాశిరంబుఖండించి హరాయుని సమర్పించి ముజ్జలమొలిచినశిరంబు గలవాఁడనై వీనిచెప్పు నిర్బంధవం వెన్వరును నన్నాటంకపెట్టలే"రని మనంబుననను కొని వానింజూచియిట్లె నెను "ఓరీ! జైనాధమా, నీవుకోరినదియొక దుర్ఘటకార్యముకాదు శివభక్తులకసాధ్యములు లేవు శిరమిచ్చి తెచ్చుకొనుట యొకగొప్పకాదు తొల్లిజంబూనగనుమారా నొకభక్తుఁడు, మహాకాలుండను పేరుగలవాఁడు మహాకాలుండగు శివునికి శిరముసమర్పించి తిరిగిపొందలేదా? అవ్వార్త

గోవిందభట్టునాఁబడు నొకభక్తుఁడు విని తలదేవునికిసమర్పించి మూఁడు నాళ్లకు వేఱొకతలను బడయలేదా? అదివిని మొదట దవంకయ్యయను నొకభక్తుఁడు నవ్వి "ఆ! యిదియేమివింత నఱుకఁబడిన తలమూఁడునాళ్ల

మొదట దవంకయ్య తనతలనఱికి శివునికిచ్చుట

కాతిరిగి మొలచుట! ఈమూఁడుదినములు శివుఁడచట లేకుండెనా? నఱుకఁబడిన తలగలమొండెము నచ్చికుళ్లలేదా? నొంటనే మొలువవద్దా? అయినను భగవత్సర్పితము సేసినతలను మఱలఁగొనుటగూడునా? నేనట్లు గ్రహింపను. మఱి యెన్నితలలు భగవంతుఁడు మొలిపించునో" అని యెల్లఱుఁజూచుచుండఁ దనతలఁ గంఠమ్మకత్తిచేఁ జుఱుకునఁ గత్తిరించి శివునిపాదంబులపైఁ బఱచినఁ దక్షణమునటియొకతల మొలిచెను. దానింద్రిరిగి ఖండించెను తక్షణమునటియొకటి మొలిచెను. దానినిసైత ముఖండించెను వేఱొకటియుప్పుడ మొలిచెను ఇట్లు మొలిచినకొలఁదిఁ దలలనఱుకుచుండెను నఱికినకొలఁదిఁ దలలు మొలచుచుండెను ఇట్లునఱుకుటకు భక్తుఁడువిసువలేదు. నఱుకఁబడినతలలుభూమిపైన కుప్పకుప్పలుగాఁ బడియుండెను. ఎప్పటికప్పుడు మొలిచినతలయొక్కటె యట్టిపై ట్టిదూపులఁ జూచుచుండెను భక్తునిచేఁ నఱుకఁబడిన తనతలలు నజీవంబులై యీశ్వరసన్నిధిని నిలువంబడి నవ్వుతలయు, వెక్కిరించుతలయు కలవఁబోవుతలయు పాదములపైఁబడుతలయు శిరంబునవిలుచుతలయు ప్రదక్షిణమాచరించుతలయు దండమిడినటుల నేలకొఱఁగుతలయు స్తోత్రముసేయుతలయు పరిహాసోక్తులువలుకుతలయు నై యనేకవిధంబులనుండఁ దుదకునొకతల పార్వతిపాదంబులకు మ్రొక్కి "అమ్మా! చూచితివా, ఘోరయత్యాసామర్థ్యము. నఱికినకొలఁదిఁదలలు మొలిపించుచున్నవాఁడు నిర్లక్ష్యముగావాఁడు నఱుకుచునెయున్నవాఁడు తుదకు మేమీఘోరకృత్యముఁజూడలేక విసువుకొనుచున్నాము గానియాభక్తునికిఁ నీభగవంతునికి విసువుదలలేకయున్నది. నీవైన నీతలపంతంబులు

మాస్పృంపవేతల్లి'' యని మొఱవెట్టును. అప్పుడులోకమాతయుభూతే శునితో “మనభక్తునితో మనకింతపంతమేల. భక్తుఁడునుతపాత్రుఁడు. నిజముగఁగన్నతనయుఁడె, పుత్రాదిచ్ఛ త్రిరాజయ'మ్మని తమరెఱుంగరే? ఇఁక నీతలకాయలనెల్ల నంతర్ధానంబుసేసి భక్తునితో నీకుసేతోఁడిటనని చెప్పిమందలించి వానిశిరంబుతో వానినుంచుకుని నియోగింపు''డని మనవిసేసెను. మనోనాయకివాక్యను గారవించి యక్కాలకంఠుఁడు వరకటము చేయువట్టి మఱిఖండింపనీక నీవు నేనోడితిపని యట్టని తలలన్నియుఁ దనశరీరమున నంతర్ధానంబును సేసి నీభక్తినిదఱిచిచూడ నాకలవిగాదని నిజపరాజయంబు నంగీకరించి భక్తుని సమాధానపఱచె. చూచితివా, జైనా! భక్తులసామర్థ్యము ఇదియునుంగాక భయంకరాకారులగు ననేకుల మిూజైనులను మాభక్తులు పరిమార్చిన చరిత్రలు గలవు చెప్పెదవినుము

## తిరునావుక్కరసి కథ

తిరునావుక్కరసియను నొకజైనమునియుండెను అతని కొక్కప్పుడు దేహమునం దొకశూల (కడుపునొప్పి) పుట్టెను. అదియెన్నిమందులు తినినను కుదురలేదు లోకమునఁగల మందులు మాకులు మంత్రములు తంత్రములు కడుపునొప్పిని మాన్పలేదు ఓర్వలేక యాబాధపడుచుండు నాతనిసోదరి వచ్చిచూచి శివమంత్రప్రభావంబున శివభక్తులాదరమున నిచ్చు తీర్థప్రసాదముల నీశూలకుదురునుగాని, యన్యథా దీనికి నివారణోపాయంబు లేదని యన్నకుబోధించి యతనిని శివభక్తిపరాయణునిఁ జేసెను. అతండును చెలియలిమాటలు గైకొని శివభక్తులశరణుసొచ్చి వారిపదరజంబు శిరంబునఁదాల్చి వారిచ్చిన తీర్థప్రసాదంబులుగైకొని నంతటఁ దనబాధిమాని యనాయాసంబున నిరామయదేహుండై చెల్లెలింబిలిచి “నీకతంబున నాశూల నివారణమైనది. నేను బ్రతికితిని. ఇఁక నేసర్వదా శివభక్తుఁడనై దాసానత్వంబుదానున భక్తులసేవయే

నొకనాఁడు శివపూజార్థంబు బిల్వపత్రిఁ గొనుటకు నరణ్యంబున కేఁగి నా
తని గని మృగంబులు "ఈతఁడె బొమ్మయ్యగా నోపుఁ గాదేని వీనిం గని
న మనకు నానందము వొడముచున్నది" యని యనుకొనునవసరమున
నందొక వృద్ధమృగంబు బొమ్మయ్యపాలికిం జని దండము వెట్టి "అయ్యా
మేము గంధర్వులము ఒకమునికుమారుని శాపవశంబున నివ్విధ హ
రిణ జన్ములమై మృగరూపంబులఁ బడియుంటిమి మా ఖేచరగమనంబు
గంటె. నీచే వారితులమై మా కుణాంబునొందెదము ఇదియ మాకుపర
మావధిగా నాతండు నియమించెఁ గావున మమ్ముఁ బరిమార్పుము
నా మాటనిజమనుట కొకనిదర్శనంబు గనవలెను పెఱవేటకాండ్రకు
మేము దొరకక నీచేతియాయుధపాతంబునను యీ దేహంబులం విడిచి
దివ్యదేహులమై ఖేచరగమనంబునఁ గైలాసమార్గంబున నరిగెదము.
కనిపెట్టు" మనవుడు బొమ్మయ్యయు విజయోగిదృష్టిచే సర్వంబును
సత్యంబుగా నెఱింగి నల్లెయని పురంబునకుం జని మఱునాఁడు వేఁట
కాండ్రం బిలిచి "రేపు మనము వేఁటకుం బోవలెను మనపురంబునఁ గల
వేఁటకాండ్రసంఘము బిలువుఁడు రావివారల నుండించుతునని దప్పువేసి
చాటింపించి తానును చిత్రసాయకములఁ ధరియించి పచ్చంట్టుపంచగట్టి
ఖండువా మీఁద వైచి తమతమ సన్నాహంబులతో వేఁటకాండ్రును
తోడ నడువఁ జనిచని ముందల సాలరసాలతమాల హింతాలాది వృక్ష
జాతంబులతోడను హంసకారండవాది జలవిహంగములతోడను విల
సిల్లు సరస్సులతోఁ దుర్గమగు నయ్యరణ్యంబుఁ గని మృగయావినోదం
బునకుం దిగి వేఁట కుత్తరువీయ వారలు గుక్కల గొలుసులు విప్పి వదలి
యాయుధంబుల నేయ సమకట్టిరి ఒక్క మృగమైనను దొరకక బొమ్మ
య్య కెదుటికిఁ బోవుచుండెను అతండు గురిపెట్టి వాఁడిఁ గోలుఁ బుచ్చుచుం
డెను. ఇట్లు తమచేత నొకజంతువైనను దొరకకపోవుటయు నవియెల్ల
బొమ్మయ్య చేఁ జచ్చుచు వెంటనే దివ్యరూపంబులు దాల్చుచు ఖేచర

గమనంబులఁ గైలాసంబున కేగుట వారుచూచి యవికారణజన్మమృగ
ములని యూహించిరి బొమ్మయ్య దినమున కేడేసిమృగంబులఁ జంపి శివ
పురంబున కనుపుచుండగా బొమ్మయ్య వేఁటాడురీతిఁ జారులవలన విని రా
జును బసవేశ్వరులును గలిసి యరణ్యంబున నాతనివేఁటసూచి యరుదం
దుచుండిరి అప్పుడు బసవేశ్వరులు రాజుతోడను పురజనులతోడను
"గురుధ్యానమను బిండివాలమున సంసారసింహంబును బరిమార్చి భక్తి
సమూడరమను ముద్గరము పూర్వజన్మ దుష్కృతములను భల్లూకముల
నడంచి గుర్వాజ్ఞయనుఖడ్గంబున శ్రమపుండరీకంబు నాశంబుతో ని
ర్మూలంబు సేసి సుజ్ఞానమను దీక్షాపిచే నజ్ఞానమను వరాహంబుగ్రుచ్చి
ఘెత్తి భక్తియనుతోమరమునఁ బ్రపంచమాయ యను మనుబోతు
గ్రుళ్లడంచి నిత్యప్రసాదంబను వింట నింద్రియంబులను వేళ్లను పాఱఁ
దోలి నిర్మలశివనామస్మరణమును కిరాపిచే లోకజాలంబను మిండకాని
గండడఁగించి భావప్రాక్తియను నీషణత్రయమును హరమహిమయను
పట్టణంబున, పరమతవాసులను మృగంబులం జంపి యిట్లుబహిరంతర్మృ
గయావిహారుండగు బొమ్మయ్య కాటవి మృగంబుల నరనిమిషంబులో
దునుముట యొకయాశ్చర్యమా? వెనను బ్రకృతిననుసరించి దినమున కే
డేసి చంపెను" అని బొమ్మయ్య మహత్త్వంబుం గొనియాడుచుండ
బొమ్మయ్యయును యథాస్థితిం జనరె. ఈబొమ్మయ్య చరితంబుఁ జదువు
వారు విన్నవారు వ్రాసినవారు శాశ్వతసుఖసంపదల ననుభవింతురు.





# బసవపురాణము.

## షష్ఠాశ్వాసము

—— ∘ ——

### ఏకాంతరామయ్యకథ

మఱియు మహాశీలాక్రమశాలియు యథావిధి సదా సమర్చిత శూలియు, జైనమతమేఘపటల ఝంఝామారుతుండును, జితేంద్రియుండును, భవిసంస్పర్శనసమాలాపాది వ్యాపారదూరుండును నిర్భీతుండును, పరమతావలకప్రహారణగుణోదారుండును రౌద్రరసవీరభద్రుండును వీరశైవమార్గప్రచారుండును శంభుపదసేవానావధానుండును రహస్యభక్తిసంయుక్తమానసుండును ధైర్యశౌర్యౌదార్యగాంభీర్యాది సమస్తసుగుణోపేతుండును స్వచ్ఛందయోగమార్గగమనప్రవీణుండును నగు నేకాంతరామయ్య యను భక్తుఁడొకఁడు గలఁడు అతఁడు ప్రతిదినము శివపూజానంతరము ప్రమథగణలోకంబునకరిగి వారలతో నిష్టాగోష్ఠినుండి మఱల పూజాసమయంబునకు భూలోకంబునకేతెంచి, పూజానంతరమున దిరిగ యచ్చోటికి నేగి యీప్రకారంబున నిత్యత్రికాలశివపూజాసమయములందు భూలోకమున శంభుపూజాసక్తుండై, తదితరకాలముల నుగ్రుని ప్రమథగణలోకంబున తద్గోష్ఠినుండుచు నుభయలోకంబులకు గమనాగమనంబులు యథేచ్ఛగా సలుపుచుండును ఇట్లుండ నొకనాఁడు చంద్రచూడుఁడు భూలోకమున నడుగంటిన శివభక్తినిమఱల నుద్ధరించి వృద్ధిసేయుమని నందికేశ్వరు నియోగించి యంప నతండు బసవావతారంబునఁ గళ్యాణపురంబున బిజ్జలరాజుమంత్రియై యున్నవాఁడని యాతనికీర్తి ప్రతాపంబులు విని తద్దర్శనార్థము కల్యాణకటకమున కరిగి తనరాక బసవేశ్వరు లెఱుఁగక మునుపె యొక దేవాలయంబున కేగి యందు శివలింగ దర్శనస్పర్శనపూజాధ్యానాది క్రియాలోల

త్వంబునఁ గొంతప్రొద్దుపుచ్చి బయటవచ్చునవసరంబున నొకజైనుఁడు శివాలయంబులోనికిఁ జెప్పుకాలితోఁ జనుచుండఁ జూచి "యోరీ మూర్ఖా! పాపాత్ముఁడా! పశువా! యేమిరా నీయాగడము. చెప్పుకాలతో నాలయములోని కేగుచున్నావు ఛీ! భక్తిహీనుడా! నీముఖముఁ జూడరాదు తక్షణమూ జోడవతల విడిచివచ్చి స్వామికభిముఖముగా నేలనొత్తిఁగి సాష్టాంగదండంబువెట్టి యోయీశా! యభవా! నేనజ్ఞుండను మూర్ఖుఁడను నేనెఱుఁగక సేసినయీపాపమును క్షమించి నన్ను రక్షింపుము అనివేడుకొనిపొమ్ము అట్లయిన నీయెడల నీప్రాణంబులుండును. కాని నా చేతియీకరారంబు. జూచితివా? దీనితో నీశిరం నర్కుచు సద్గురుకటాక్షంబున లింగధారణంబు స్వీకరించి మనియెద"నని చెప్పి యావెంటనే పగలూపెను (దీనికేయిప్పుడు కడపజిల్లాలోనున్న ప్రొద్దుటూరంగుగు) గ్రామమునకుంబోయి యచ్చటనున్న యొకశైవగురుగాంచి నమస్కరించి "దేవా! నన్ను మీకింకరుగాఁగైకొని నాకుశివజ్ఞానోపదేశంబు సేసి రక్షింపు"డని నిలుచున్న యాజైనగురుంగాంచి యాశైవగురుఁడాతని గుణాంగుణధర్ములఁ జేయుసమట్టి తొలుదొల్తఁ బంచాక్షరీమహోపదేశంబుసేసి దానిని యథావిధానంబున న్యాసపూర్వకంబుగా నుచ్చరింపఁజేసి దీక్షయొసంగి పూర్ణకలశోదకంబుల నభిషేకంబొనర్చి లింగప్రాజగావించి యాతనిదేహంబు తల్లింగసంగతంబు గావించి లింగము ప్రాణముగా నెఱుకగనిపి పాంచభౌతికదేహాభిమానంబుం జెడఁగొట్టి లింగదేహాభిమానం బుపదేశించి వాయుమయంబులగు ప్రాణంబుల చాంచల్యంబును పృథ్వీమయంబగు దేహంబుల యస్థిరతము నగ్న్యాప్యోమయంబులగు క్షుత్పిపాసల స్వరూపంబును తన్నివారణోపాయంబులు నాకాశమయంబగు తృష్ణాగరిష్ఠత్వంబును శమదమాదుల దానినడంచుమార్గంబును జ్యోతిర్మయంబగు జ్ఞానదీపప్రభావంబును దానియఖండ తేజోవిరాజత్వంబును కామక్రోధలోభ

మోహ మదమాత్సర్యంబులను నరిషడ్వర్గనామకాంత శ్శత్రుస్థితియు జ్ఞానరత్నంబునపహరింప వారలార్గురు సర్వదా వేచియుండుటయు శత్రువులకుఁ దస్కరులకగమ్యంబగు దుర్గంబున ధనగుప్తియొనర్చి దానిఁగాఁ పాడుకొనునటుల గృహస్థాశ్రమ దుర్గగుప్తిని జ్ఞానధనసంరక్షణోపాయంబును మఱియు ననేకంబులగు శివరహస్యంబులును దేటతెల్లంబుగాఁ దెలిపి యాత్మలింగార్చనా విధానంబులును వీరశైవులకు సర్వంబును లింగార్చనమెయనియు లింగవీక్షకన్న వేరుదీక్షలేదనియు లింగదేహాలింగప్రాణులే వీరశైవులనియు ననేకంబులగు తత్పూజాద్రవ్యవిశేషంబులును వేళావిశేషంబులును భక్తపరిపాలనలాలనాదికంబులును సవిస్తరముగాఁ దెల్పి యనల్పశివభక్తునిఁగా నొనర్చుటయు నాతిరునావుక్కరసియు వీరశైవుండై విభూతిరుద్రాక్షలు ధరియించి యథాకాలశివపూజలు గావించుచు భక్తులనారాధించుచు శివదీక్షాపరతంత్రుండై యుండఁ దక్కినజైనులు వీఁడు మనమతము విడిచి శివమతము నవలంబించెను గాన వీని నేనుఁగు కాలఁ ద్రొక్కింతు" మని కాలుసేతులుగట్టి యేనుఁగు కట్టెదురఁబడవైచి మీఁద నేనుఁగును డీకొల్పిన నది తొండమున వానినెత్తి కౌఁగిల నొక్కవారకు మెల్లనఁ దొలఁగించి చనియె గాని వాని మొడలికిఁ గిందిత్తైన ధూళియుండునంత నెత్తి మఱలమెల్లగ దిగవిడచెను గజాసురారిభక్తుల నొకసామాన్యగజం బెల్లుబాధింపఁగలదె? ఒక్కపర్యాయము చంపుదమని విషభోజనము బెట్టిరి అదియుజీర్ణమై శరీరమునకు మఱింత మొక్కవకాంతిఁ గలిగించె విసపుమేతరిబత్తులకు విసమమృతంబు గాకుండునె? నీరింజంపక విడుతుమాయని యనేకకట్టియలం దెచ్చి యగ్నిరగిల్చి మంటగావించి యాపెనుమంటలో వానిఁబడవైచిరి ఆమంటయుఁ జప్పనఁ జల్లారియానిప్పులన్నియు నీరయెను. అగ్ని దేవుని లలాటమున నేత్రముగాఁ ధరించిన యాపావకాక్షుని భక్తులదహింప కాకి కాగ్ని కెల్లుదీక్షుత్వంబు వర్తించునె? ఇఁక వీఁడు దెసను జానాడు. "అగా

ధమగు బొద్దనబావిలోఁ బడవైతమని యిట్లు గావించిరి. ఆబావిలోని నీరంతయు నింకి యందున్న రెండు గొప్పనాగుఁబాములొక్కదానితోఁ కనొకటి యంటఁగరచి పట్టి గట్టుననుండి యడుగువరకు నిచ్చెనత్రాడు వలె వ్రేలాడుచు నాతనికి దృగ్గోచరంబయ్యె. వాఁడా త్రాటినిఁబట్టి పయికెక్కివచ్చి మజల వారలకు శివబోధ యొనర్పఁజొచ్చెను. మహా గంగ జటాజూటమం దిముడ్చికొని దానిచుట్టును నాగపాశమును శిగపా

శముగాఁ జుట్టుకొన్న యాగట్టువిల్తుని దాసులకు కూప గంగ యడంగు నుగాదె ? మఱియు నాగపాశుని భక్తులను నాగపాశమె రక్షించును గాదె. ఇచట నాగపాశ మెవానిని పయికెక్కించెను. ఇట్లెన్ని మార ణోపాయములను వాఁడు చావకుండుటఁజూచి వారెల్లరు "మనమింతిం తలుగాని మహామారణ కృత్యంబులఁ బజఁగించియు నాయించు విలు కాని దాసానుదాసునిఁ బంచత్వంబు నొందింపఁ జాలమైతిమి. ఇఁక వానికిఁ బరమభక్తులమై వాని మతమునె యవలంబించి కూడియుండు ట మనకును శ్రేయస్కర" మని వారందఱు నమ్రులై చేతులుసాచి శిరంబును వంచి సాష్టాంగ దండంబులువెట్టి వారల జైనచిహ్నంబులు విడనాడి శివచిహ్నంబులు ధరించి శివభక్తులై వానిలోఁగూడి సంచరిం చుచుండిరి.

ఇట్లు బహుజైనుల శైవులఁజేసి జైన సమయ కోలాహలుండ ను బిరుదంబు వడసి తిరునావుక్కరసి మహాశైవ మరోద్ధారకుఁడై తా నొక మతబోధకుఁడై తన జైన శివభక్తగణంబులోఁ బ్రమదగణంబు తో బైలువెడలిన సాక్షాచ్ఛంభుండునుం బోలెఁ బయిలువెడలి యనే క నిదర్శనంబులు మహాత్మ్యంబులు ప్రజలకుఁ గనఁబఱచుచు మతబోధ కుఁడై యొక యాశ్రమంబు గల్పించుకొని యొకమతాధికారియై యుం డె. వింటివా, జైనాధమా ! యీ జైనమువి పడిన యవస్థయు నుజల

శివభక్తానుగ్రహంబున వాని మహోన్నత దశయు. నీవు నట్లయగు మని చెప్ప యేకాంతరామయ్య మఱల నిట్లనియె.

## తిరువదాందారి కథ.

ఓరీ! వేఱొకయాశ్చర్యము చెప్పెద వినుము. తిరువానూరను గ్రామమున నొకభక్తుఁడు జాత్యంధుఁడు సదాశివాభిషేకరతుఁ దిరువదాందారియనువాఁడు తనభక్తిరసంబు వెల్లిగొన నభిషేకార్థము నీరు మోపి తెచ్చుటకు గ్రుడ్డివాఁడగుట నోపిక లేక శివాలయముప్రక్క నొక బావిత్రవ్వుకొందుమని నిశ్చయించుకొని తట్టయుఁ బాఱయుఁ గొని శివాలయంబుప్రక్క నొకయిమ్మగుతావు నేర్పఱచుకొని మన్నుద్రవ్వ నారంభించి త్రవ్విన మన్ను దూరముగా మోసుకొనిపోలేక చుట్టును గట్టుగా వేసుకొందునని యూహించి తానావరణగావించిన బావికిప్రక్క నొక రాటయు లోన నొకరాటయు బాతి యారెంటికి నొకత్రాడుగట్టి యాత్రాటియూఁతవాలున దానింబట్టి యదేదారిని మన్ను మోయుచు బైట తట్టతోఁ జిమ్ముచు నిట్లు మిగులనోపికతోడను శ్రద్ధాభక్తులతోడను నూయి ద్రవ్వుచున్నవానింగని జైనులనేకవిఘ్నములు లేని యవివిఫలంబులగుట నారాటలనూడఁబెఱికి త్రాటినినఱికి బైటబాఱవైచిన నా యందభక్తుఁడు మిగులఁగోపించి భగవదనుగ్రహంబునఁ బ్రత్యక్షదృష్టి బడసి జైనులనెల్లం బాఱఁద్రోలి వారివసతులమూలనొటుఁగఁజేసిన యి రువదాందారి యాశ్చర్యచరిత్రమును వినలేదా? వినకున్న నిపుడు వింటి వగదా! ఇకనైన బుద్ధిదెచ్చుకొని బ్రతుకుము. మఱియొకచిత్రకథఁ జెప్పెద వినుము.

## వళ్లనైనారునకు పార్వతిపాలిచ్చిన కథ.

శ్రీశాలిక్షేత్రంబున నొకశైవబ్రాహ్మణునికి నీశ్వరపుత్త్రుండగు కుమారస్వామియంశచేత జనించెనను ప్రఖ్యాతిగల యొకచిన్నవాఁడుపు ట్టెను. వానికిఁ బిళ్ళనయనారను పేరువెట్టి తలిదండ్రులు మిగులగారా

బమునఁ బెంచుచుండిరి. ఒకనాఁడు తండ్రియాబిడ్డ నెత్తుకొని యొకసరో వరతీరంబునకుఁజని తనయునట తటంబునఁ గూర్చుండఁబెట్టి తానులో నికిదిగి స్నానమాడుచుండెను. ఆకాశమార్గంబున నాతీతవిమానంబు నఁ బార్వతీపరమేశ్వరులు భూలోకవిహారంబు సేయుచు నాసరస్సునొద్దకు వచ్చిరి. పార్వతియాచిన్నవానింగాంచి వానిని సుతప్రాయంబుగాభా వించి భర్తంజూచి "స్వామీ! యాచెరువుగట్టున నాడుకొనుచున్న పిల్లవానింగాంచితిరా? వాఁడుమన కుమారునాకారంబున నామనం బునకుఁ గనిపించుచున్నవాఁడు. వానింజూడ నాకుఁ బాలిండ్లఁ బాలుచే పుచున్నవి. ఒక్కపర్యాయము వానినెత్తుకొని ముద్దాడిపాలిచ్చి వైళం బిమళ్ళివచ్చెదను. అంతదనుక తమరీవిమానంబునిచట నాపుఁడు." అని ప్రార్థించి వేగదిగివచ్చి యాపాపనెత్తుకొని శిరంబుమూర్కొని యడ్డాలనిడుకొని పాలిచ్చి యంతఁబోక యొకసువర్ణపాత్రంబునఁ గొన్ని పాలుపిడికియిచ్చి మఱలిపోయి విమానంబెక్కి భర్తృసాన్నిధ్యముం బొందెను. అంత స్నానంబు సాలించి కొలనువెడలివచ్చిన తండ్రి మొగ ము గాండ్రించుకొని మిగులఁగోపముతో "ఓరీ! నీకీపాలమునంత నెవ రిచ్చిరి? నీకుఁబాలిచ్చిన యామగువయెవ్వతె? తెలియనిపాలఁతుల పాలట్లు ద్రాగవచ్చునా? ఎవ్వరేమోసమొనరింతురో. ఇప్పుడునీకుఁ బా లిచ్చిన యావాలుఁగంటిం జేర్కొంటివేనిసరి లేనిచో నాచేనీక్షణము నీవుమడిసెదవు" అని యత్యుగ్రదృష్టితోఁ దన్నడుగుచున్న జనకునకుఁ దనయుండు భయముచేవడవడవణఁకుచు "నాయనా! నాకున్ స్తన్యమి చ్చిన యామచ్చెకంటిఁ జూడుము. అదిగో! విమానమింకనక్కడ నిలుచు న్నది. ఆపరమేశ్వరునియర్థాంగమున దేదీప్యమానమై వెలుంగుచున్న యాయంగనంగుర్తింపుము. ఆమెయేనాకుఁ బాలిచ్చినది. ఆలోకమా తయే నాకుఁబాలిచ్చి నాదేహంబు లింగసంగతంబు సేసి కొన్ని సంగతులు సెప్పి సనియె" నని కొడుకు సెప్పునంతలో నాపుడమిఱేఁడు విమానంబు

ను దానియందున్న పార్వతీపరమేశ్వరులను కన్నులారఁగాంచి నేలనుం డియె వారలకునమస్కరించి యందుఁబార్వతికి మఱిమఱి మ్రొక్కి యక్కొమరునంసపీఠంబున నెక్కించుకొని నిజాలయంబునకుంజని జరిగి నవృత్తాంతంబంతయు నేకాంతంబున దనయింతికిం దెల్పి యిద్దఱు నమంచానందంబున నందనునతిప్రేమమున బెంచుకొనుచుండిరి. పార్వతిస్తన్యపానవిశేషంబున వానికి జ్ఞానోదయంబయ్యె.

అంతనొక్కనాఁడు రెపకడనబ్బాలుండు ఖండపరశునాలయంబునకుఁబోయి యటభక్తిపారవశ్యంబున నాడుచుబాడుచు గంతులువైచు చు నీశ్వరునుతించుచున్న వానికిఁ బార్వతియొకనురియయు నొకసువర్ణమయమగు తాళములజతయు నిచ్చిన నాసూరకత్తిని ముల్లనుధరించి తాళమువాయించుచు నారదాదులగానంబును మించురాగజ్ఞానముతో గానంబొనరించి యీశ్వరునుతించిన నాతండునుబ్రీతుండై యసమాన హేమసింహాసనంబును ముత్యాలపల్లకియు శ్వేతఛత్రము నక్షయనిధియునొసంగెను.

ఇట్లాపళ్ళనయనారు శంభునివలన దినదినమునకుఁదలంబెక్కయు క్కజంబగు మొక్కవోని ధైర్యగాంభీర్యాదార్యాదిగుణంబులచేతనైనసకలవిద్యాపరిపూర్ణుఁడై భేరీకహాళాదివాయిద్యములతో సంచారంబ్రారంభించి యుత్తుంగచోడుని శివభక్తునిఁజేసి రెండువేలబౌద్ధులను శైవులుగామార్చి వారలచే సేవలనందుచు జైనమతస్థులకు తలలువంచునట్లుచేసి మధురానగరపురాజుభార్య శివభక్తురాలగుట నామెపిలుపింప నచటికేగెను.

అప్పురంబుననున్న జైనబౌద్ధులందఱుఁగూడి రాజసముఖంబునకుంబోయి "రాజా! జ్ఞానసంబంధియనుపేర నొకబాలుఁడువచ్చి వేదబాహ్యులరని మనలదూషించుచు బౌద్ధులనాశంబు దెలుపుధూమకేతువని పల్లెలోవిఱ్ఱవీగుచు దిరుగుచున్నవాఁడు. వానినెట్లైన నూరువెడల

గొట్టవలె" నన్న రాజును దూరమాలోచించి ప్రజలంగని వారలనోదార్చి "యుత్తుంగ పోమని గురువఁట యూపిల్లవాఁడు ఎంతవాఁడుగాక పోయిన నంత రాజునమ్ముఁడగును. అట్టివానినేదైన వాదముననోడించిపరిపుటయొప్పఁగాని యూరక యెట్లుపంపనొప్పు" ననియెను.

అంతఁ బదునెనిమిదివేల జైనమునులాతనితో వాదించి యోడిపోయిరి. వారావేలుమొగంబులతో చాటకువచ్చి యాతని వంచించునుపాయంబుగానక యర్ధరాత్రమున నాతనిచిన్నయింటికి నగ్నిదగిల్చి దానిఁ బరశురామప్రీతిగావింపనిశ్చయించుకొని రాత్రియగుడు నిట్లనే మండుచున్నకొఱవిదెచ్చి యాతనియింటినడి కొప్పునఁబెట్టిరి. అయగ్నియునాతని గృహంబు దహింపనోల్లక ముందఱవచ్చి నిల్చినఁ జూచి "యోహవ్యవాహనా! నాగేహంబు దాహంబుఁగావింపవచ్చితివా? యనియాతండుపలుక నగ్నిదేవుండును చేతులుజోడించి "స్వామీ! నే నట్లుసేయనోపుదునా? మీప్రభావంబునాకుఁ దెలియదా? తొల్లిదక్షాధ్వరవిధ్వంసనంబునందు వీరభద్రుండు మదీయజిహ్వలుగోసి నన్నువిహ్వలుంజేసె నాతనియనుంగు సోదరుండవగు కుమారుఁడవీవగుట నే నెఱింగియు భవదీయగృహదాహకకృత్యంబున కొడంబడక మీయాన శిరసావహించి నెరవేర్పవచ్చితిని; సెలవి"డని భయభక్తులతో నిలుచున్నయనలునిగని" యోదహనా! నాశక్తిసామర్థ్యంబుల వెనుకటిగఁ దలఁతువుగాని యిప్పటికి భూపాలుదేహంబును బొంది యాతనికిఁ దాపోద్రేకంబు గలిగింపుము" యనెను. అంత నాహుతాశనుండా రాజు మేన మితిలేనిమంటలెత్తింప బాధకుఁదాళఁజాలక తేఁడు కుయ్యో మొఱ్ఱోయని రోదనంబుసేయ నాతని భార్య మంగయక్కగనిరాజాజ్ఞ వడసి జ్ఞానసంబంధిం చి పిలిపించి రాజుతాపంబుఁబాపుమని నాతిల్లనయ నాదిట్లను. "ఈమూగినజైనులందరు నొకయెత్తు నేనొక్కరుండ నొక యెత్తు ఈభూజాని సర్వాంగంబుల దేహమంతయు వ్యాపించిన యీ

బాధ నగము శివమాస్పదఁ దక్కనసగము మీరు పోఁగొట్టుఁ’’డని నీరు మంత్రించి యారాజునొడలికి దక్షిణభాగంబునకు లేపనంబు సేయించిన దక్షిణమయామంట లెత్తుటమాని యా భాగంబు నీటఁ దేలినటులఁ జల్ల గానుండె వామపార్శ్వమంతయు నింతింతనరానిపాగ లేని మంటమండు చుండెను. అప్పుడుజైనులందఱు నొక్కుచ్చుమ్మడిఁదమతము మంత్రంబుల జలంబులుమంత్రించి ప్రోక్షించి తుదకు శుద్ధిస్నానంబుసైతముఁగావించిరి మంట వినుమడింబెఱుఁగుచుండెను. తుదకు నెకిమీఁడు జైనులాదఱు వినుచుఁ గనుచునుండఁగ్రైదోయిసంధించి ‘‘పల్లవయనారీ! నీవుమహాను భావుఁడవు సామాన్యమానవ బాలకుఁడవుగావు పార్వతీప్రియసుతుండ గు కుమారస్వామివే నీవు నాఁడు కృత్తికలుగని విడిచిన యాపదాన ను బరమేశ్వరిగాంచి చేరఁదీసి పాలిచ్చి తక్షణమసమగ్రవయో విశే షంగావించి యఖండదైవత్వంబొసంగి యాతని దేవసేనానింగావించి వానిచేఁ దారకాసురుంజంపించెఁగాదె? నేఁడట్లనె యొక సామాన్య జైనమతస్థుఁడగు శాపనయ్యకు నర్భకుండవుగా నుదయించిన నిన్నుఁ గని నీకుఁబాలిచ్చి జ్ఞానవంతుంగావించి యమగంటిన శివభక్తిని నీచే మరలభూలోకంబున నెలకొల్పఁడలంచియె యిట్టిమహానుభావంబు నీ కొసఁగినది. నీయ జ్ఞనాయున్ని దేవుఁడె శిరనావహించినపుడు నే నెంతటి వాఁడను. నాబాధమాన్పి నన్నురక్షింపు’’మని పరిదేవనంబు సేయఁగ నికరించి భస్మంబు మంత్రించి యాతని దేహంబున వామభాగంబునకు బూయించిననదియుఁ జల్లనయ్యె. అంతనా భూపతియు, నాతని సతియు పిళ్లనయనారునకు సాష్టాంగదండంబు లాచరించి యాతనియాజ్ఞ శిరం బునందాల్చి శివమతంబవలంబించి లింగధారణంబుఁ బొంది వీరశైవు లైరి. అవుడుపిళ్ళనయనారు జైనులనెల్లఱఁగాంచి ‘‘యింకనుమమ్ము మాడ్కనఁజాలెడువార లున్న యెడల శీఘ్రమయ్యుండుఁడు. గడంగుఁడు తెలివిహీనంబుల నిప్పుడయానంబులఁగావించెద’’ననిచెను. అందు

తాజైనులు లేచి "అయ్యా! మాకును మీకును మాటలువేయేల? ఒక్కటేశపథము వినుఁడు! మాచిన సర్వజ్ఞనామమును మీశివనామము ను వేఱ వేఱఁ జీట్లపైఁ బంచాబ్దంబులబాలకునిచే వ్రాయించి యగ్ని ముఖంబునఁ బడవైతమందుఁగాలినవి మోసినవి. కాలకున్నవి గెల్చి నవి దీనికి మీరొడఁబడెదరా?" యనిరి

అంతట పిళ్ళనయనాథు "సరే! దానికేమియు సందియము లేదు. కుక్కపల్లు బంగారు రేకున రాచినమాత్రమున బంగారు రేకు యైన వెలితివచ్చునా? కావడిభారము సరిపెట్టుకొనుటకు నొకతలఁ బాలును రెండవతల తాయియుఁ బన్నిన కావటిబరువులో తాయి తాయియుఁ బాలుపాలునె యగునుగాని తాయిపాలగునా? అట్లనె జిననామము శివనామ మగునా? కానిండు! మీరుకోరినట్లె సేతమని యొక బాలునిచే శివ జిన నామములు రెండును రెండు తాటి యాకు తునకలపై వ్రాయించి రాజుచేతి కియ్య నాతఁడది యగ్నిముఖ మునఁ పడవైచెను. తత్క్షణము జిననామమున్న తునక చుఱచుఱఁ గాలిపోయినది. శివనామమున్న తునక కాల్చిన బంగారు రేకువలె మఱింత వన్నెదేరినది. అదిచూచి జైనులు తలచచ్చి తోఁకచావని పామువలెఁ దోఁకలాడించుచు "అయ్యా! యొక పందెము నందేమి గలదు. మూఁడు పందెములు గెలువవలెఁగదా. యీసారి యేటిలోన వ్రాయించి కావేరీ ప్రవాహమునఁ బడవైతము పాఱిపోయిన తునక యోడినది. యేటికెదు రీఁదుతునక గెల్చినది." అనుటయు "నట్లనె కానిం"డని మఱల నొక బాలునిచే జిన శివనామములు వ్రాయించి కావేరికిం జని యందుఁ బ్రవాహమధ్యమునఁ బడవైచిరి. జిననామ మున్నయాకుముక్క మీఁదమీఁదనే తేలుచుఁ బ్రవాహము వెంబడి ని బాఱిపోయెను. శివనామమున్నతునక కప్పదాట్లువైచుచు నేటికి నెదురీదుచుఁ జనుచుండెను. చీల్లుగొని కావేరికి బోవునపుడు పళ్ళనయ

నారు రాజుంగని ॥ఓరాజా! మీజైనులసంగతి నాలోచింప ॥నన్ను గొట్టినవాఁడవు మాయన్ననుఁ గూడఁగొట్టుమా చూతమను సామెత చందంబున నున్నది. వీరాడినదాట పాడినదిపాట యగుచున్నది. వీరే యేశపథంబులఁ గోరుచుందురో వానికెల్ల నేనోడబడుచుండుట వలన నీర లింకయు నెన్నెన్నో యిట్టిమాయోపాయమును పన్నుచుందురు. ఎన్ని జైనులమాయలు మంత్రములైనను శంభుమంత్రమునకు సాటి కాఁగలవా? కనుక యీసారి శపథమేమన నోడినవారు తప్తలోహ శూలంబులం గొఱఁతలువడుటయె యని యొప్పించినవాఁడగుట నటుల నేటికెమరిదు శివనామముగల తునకల తునకలం దీయించి తనజయము భొప్పించి వారల పరాజయంబు స్థిరపఱచి పనునెనిమిదివేల జైనులనం తకు ముందు నిడియాలను రాజుసేయించి యుంచిన సూదిమొనగల యినుప గాలులఁ గాల్పించి వాటిపై నందఱం గొఱఁత వెట్టించెనుగదా. ఇట్టులాపళ్ళనయనారి తిరువూరు మహాత్మ్యంబు నిలుపుట నీవువినలేదా? ఓరీ! జైనా! యింకను బెక్కుమాటలు పేలెదవా. అట్లయిన మఱియు వినుము.

నిడుమారునికథ

నిడుమారుఁడను నొకభూపతి తానేలు దేశంబునం దెక్కడను జైనులఁ గాపురముండనీక యందఱ శివభక్తులంజేసి తానును శివభక్తా గ్రేశరుండై రాజ్యమేలుచుఁ దన దేశంబునం దక్కఁ దదితర సీమ యందెయు జైనమత భూయిష్టమగుటకు మనంబెనరోసి యెట్లు వీరల నీశానుభక్తులం గావింతునని పరితపించుచున్నతఱి నాజ్ఞానసంబంధి యను పళ్ళనయనారు జైనులజయించి చోడభూవిభునిఁ దనకింకరునిఁ జేసికొని యనేకవేలమంది జైనుల నినుపతొట్టియల దింపించెనని విని తత్క్షణము జైనులనెల్ల రావించి వారలతో నిట్లనెను. ॥ఓవేదబాహ్యు లగుతావలంబకులారా! మీరింతకాలము మాప్రజలకు మీశాస్త్రమత

మును బోధించుచు సర్వజ్ఞనామధేయుండగు శర్వునివిడిచి సర్వజ్ఞశబ్ద ము జినునియందు వర్తింపశేయుచు బౌద్ధమతబోధసేయుచు సజ్జ్ఞాన మార్గంబునకు వారలండ్రిప్పుచు బాధుచేయుచున్నవారు మాజ్ఞాన సంబంధియను శివభక్తుండు జైనులనేకవేలనుజయించి చోడరాజును దనవశముచేసుకొని జైనుల నినుపత్రొట్టియల దింపించినవాడని వినలే దా ? ఇక్క మీకు బ్రతుకునందాశయుండెనేని మీరందఱుశివభక్తులై నుండుడు కాదేని మిమ్మినుపశూలంబులగుదియించెద" నని చేత నొక భీకరకరవాలంబుబట్టి యిట్టట్టుదిరుగు నతనింగాంచి జైను లీవి డుమారుడిక మనలను దప్పకలోహశూలంబులం గుచ్చునుగాని విడు వడు వీనిచేనట్టి ఘోరంపుజావు చచ్చుటకన్న శుభప్రదమగు శివమత ము నంగీకరించుటమే" లనితలపోసి యందఱుశైవమార్గానుగులైరని నీవు వినలేదా ? యోజైనా ! యల్లచెల్లతిరువాలూరను నొకనగరంబున జినమతలోద్రేకంబు వెచ్చువెఱగి యతిశయిల్లుచుండ నందొక్కవీరశై వుడు నమనంబియనువాడూరెల్ల దిమ్మరియాచించి నేయిదెచ్చి యా నేతితో దినమునకువేయివత్తులు ప్రత్యేకదీపంబులు శంభునకువెలిగిం చుచుండువాడు అట్టివానివ్రతభంగముసేయ సమకట్టి జనులింటింటికి బోయి యెల్లవారలకు "వీడు మీయిండ్లనేయిగొంపోయి యూరుబైట నున్నపాడుగుడిలో దీపములువెలిగింతుననుమిషచే నేలపాలుగావించు చున్నవాడు. తానునుభవింపడు మీకుంచడు. కాన వీనికింక నేయిబో యకు" డనిచాటిచెప్పిరి. అందుపై బ్రజలకువానపై ననూయజనించి మఱి యాజ్యంబుపూజ్యంబు పూజ్యంబని చెప్పదొడంగిరిగాని యొక రైననొకబొట్టయిన నీయరైరి. అతండు నేయిదొరకనందుకు దిగునొం ది భగవంతునిగూర్చి యిట్లని ధ్యానించిమొఱవెట్టెను గట్టుపట్టిచేప ట్టినయోదిట్టా ! నాదిట్టతనంబివెఱుంగుదువు వేయింటికినొక్కదీపంబు దక్కువయైనను మఱిబ్రతుకను. దానికిబదులు నాశిరంబుఖండించి నా

లో వెలుంగుచున్న యనంతజ్యోతి నీకునర్పించెదను. ఇందుకుదప్పితి నేని నీయుడుంగరాన" యనిసాష్టాంగంబుగా మ్రొక్కి వేడుకొన్న భక్తవత్స లుండగు భగవంతుండును వానిదృఢనిశ్చయం బెఱింగినవాఁడుగావున దయ గాంచి ప్రత్యక్షమై యాతనికోరినవరమిచ్చి శివభక్తి యోవైశ్యరాజా! నీకేల యీరూపుదరిగి నేతికై ముష్టియెత్తుట ? నేనిచ్చెదనైన నను నాభక్తులను మహదైశ్వర్యసంపన్నులం జేసెదను. వారలనిచ్చమెత్తి నీవు నీదీపంబులు దినమునివేయిగాదు లక్షలుగోట్లు వెలిగించినను తర గనితంపుఁగా నీరుగానునాస్నానవాపియుండ నీకునేతికిఁగొఱతయేల ? ఆసూపవానందలినీరంతయు వేయికన్న మిక్కుటస్ఫుటముగాను కాంతిమం తముగాను దీపంబును వెలిగించును. కనుక నేటినుంచి దినదినముస్నాన వాపి యుదకంబుతో దీపంబుల వెలిగింపుము. నీకార్యంబు పూజ్యంబగు న్నవారలతో ప్రబ్బులన్నియు నశించును" అనిచెప్పి యంతర్ధానమునొందె ను. అంతనాతఁడు సంతసమంది స్వామికిమనసా యనేకనమస్కారంబు లొనరించి నిత్యమును కూపోదకంబున దీపంబులు వెలిగింప నవితొల్లి టికన్న పదియన్నతంబగుకాంతితో వెలిగెను. మఱునాడుదయము గాని మస్తులునిద్ర మేల్కాంచి నంతలో నెవరిగోష్ఠంబున నున్న పశువులు వారి గోష్ఠంబులనే కాష్ఠప్రాయములై నిలిచినవి నిలిచినట్లుగానె, పడి నవి పడినట్లుగానె కిక్కురుమనక నొక్కసారిచచ్చినట్లు పడియుండెను. అదిచూచి పౌరులు తమదోషమును దామగ్రహించి యాభక్తునిపాలి కింబోయి తమ్ముక్షమింపుమని మించినభయభక్తి వినయంబులతోఁ బ్రార్థించిన నాతండును ననుగ్రహించి వారియాలప్రాణంబులు నొసంగి వాడనేగాక చచ్చిపడియున్న యెనుములు, మేకలు, గొఱ్ఱెలు, మున్నగుపశువులపోదుపుల నన్నిటిబ్రతికించి వారలకు శివదీక్షయిచ్చి మన్నించి యంపెను. ఇంటివా యోశివైకదురంధరా! మఱియు నొ క్కవిశేషంబు,

## సామ్యతొండనికథ.

చోళదేశంబున శాతమంగయను బౌద్ధజన సమృద్ధంబగు నొక పురంబు గలదు. అందు సామ్యతొండఁడను నొక శివభక్తుడు తన పూర్వజన్మఫలంబున నొక జినకుటుంబములోఁ బుట్టి భక్తి పెంపున జైనుల భయంబున శివుని-గూర్చి యిట్లని ధ్యానించెను. "ఓశివా భవా! భవానీపతీ! నీభక్తి నాకుఁ గలిగినందునకు లాభమేమి? బాహ్యభక్తుడనై నేమెలంగిన మావారు నన్ను బ్రతుకనీరు. మనంబున నిండగు భక్తిగలిగి, యది లేనివాడుగా నెల్లు మెలగుచున్న నీభక్తుఁడనగు నన్ను భక్తిలేని తలిదండ్రుల గర్భమున నేల ప్రసవింప జేసితివి? దీన నీకుఁగల లాభమేమి? అయిన నివియునొక మేలుకొఱకే యని నేననుకొనియెద నీయందు గూఢభక్తి గలవాడనై పైకిభక్తి లేని వాఁడుగ నటించుచు నీయనుగ్రహము నాపై బ్రసరించి యూపాపాత్ములగు జైనులునీవు నిర్మూలించి నీబాహ్యభక్తి లోకమున బహిరంగవ్యాప్తిం బొందుపర్యంతము నికుశత్రునివలె నటించుచు బ్రతిదినమున నీత్రికాల శివపూజా సమయంబుల నిమ్మఁ బుష్పంబులఁ బూజించుటకు మాఱుగా నిన్నెపైని మూడేసిరాళ్ళు రువ్వుచు నిట్లు శిలాపుష్పంబుల నీపూజఁ గావించుచుండెద. అది మావారి కత్యంతామోదప్రదంబగు" నని నిశ్చయించుకొని యట్లుసేయుటకు నైదుదినంబులవఱకు ననువుగాక యాఱవదినంబునఁ బోలినయేదుదినముల రాళ్ళు ముంకూరువ్వ పిమ్మట నాఱవదినమున విసరం దలఁచి రాళ్ళు వెదః యేఱితెచ్చి విసరివిసరి వేసరి "యోభగవంతుఁడా! నీపై రాళ్ళువిసనాచేయి నొప్పి యెత్తినది గాని నీవుకదలమెదలక యట్లెయుంటివి నారాళ్ళు నీకుఁదగుల లేదా? తగిలినను లక్ష్యపెట్టవైతివా? ఈసా నీవు తుళ్ళిపడి లేచి పాఱిపోవులాగున పెద్దఱాయి నీతలపైఁ బడవైతు"నని యొకచాపఱాయి యెత్తి విసరనుంకించు నవసరమున శివుఁ

నిజరూపంబుతో మునిగణపతి సేవింతుండగుచు నెదుట నిలిచి తాయి యున్న చేయిపట్టినిలిపి "నీసాహసంబునకు మెచ్చితి. వైరమునఁ బ్రాసన్నుండ నగునంత వేగము భక్తిని బ్రసన్నుండఁగాను నీకుఁ గోరిన పదవి నిచ్చెద నడుగు" మనెను. అంత నాసామ్యతొండడు "స్వామీ! నీయఖండ లింగాకారమును బ్రహ్మయు విష్ణుండును జూచి, పాదములు నూతునని బ్రహ్మ పాతాళంబు నడుగుపర్యంతము దిగి చూచి కానలేక మఱలివచ్చి చూచితినని యబద్ధమాడి భూలోకమునఁ బూజలేనివాఁడయ్యె. శిరంబుఁ జూచెదనని పైకెగసిపోయిన విష్ణువు చూడలేక తిరిగి వచ్చి చూడలేదని నిజమొప్పుకొని నీకత్యంత భక్తుడై నీయనుగ్రహంబునకుఁ బాత్రుండయ్యె. అట్టినీలింగాకారము స్వరూపమిట్టిదని వేదంబులుద్ఘోషింప లేకపోయెను. సమస్తలోకములవారు వచ్చి దానిని దర్శించి చేతులుమోడ్చి యొంతతభక్తిసమగ్రులై పూజింప మొదలు పెట్టిరి. సనకసనందనాది మహాయోగులైనం దమ యోగదృష్టినిఁ గన నేరని నీయసమానచిన్మయలింగమూర్తి యాకారము స్పష్టముగా నేఁడు చర్మచక్షువులఁ గనఁ గలిగితిఁ నింతకన్న వేఱు వరమేమున్నది. దేవా! నీకు దూషణభూషణ తిరస్కారంబులు సమానంబులు ఇతర పదవులకన్న నాకిప్పుడున్న యీపదవియె చాలును ఈ దేహము తోడనే నీలింగమూర్తి సేవఁ గావించుచుఁ దరించెద. ఈసీమపై నాచే యెత్తఁడిన యీరాయియె యనేక పావురంబుల నాకారంబున నీగుడిచుట్టు గూళ్ళలో నివసించుచు దినదిన ప్రవర్ధమానంబై స్త్రీపురుష భేదంబుగు నాకృతులు గలిగి పార్వతియు నీవు నెట్లు జోడువిడువక యేకదేహులై కలసియుందురో యట్లనే మగపావురాయియు నాసతియు జోడుగట్టియు జంటవీడక సంతతిం గాంచుచు వృద్ధినొంది ప్రాతస్సాయం సంధ్యాసమయంబుల బైట సంచరించుచు నీకీర్తిం జాటపలుకుచుండునుగాత! నేను నీయథావిధి ప్రకటపూజలు సలుపుకొనుచుండెదను

ఈ నీమతంబునకు విరుద్ధమతాచారులును వేదబాహ్యులునగు జైను లంగడ తేర్పుము" అని యిట్లు ప్రార్థించిన భక్తునికోరిక ప్రకారము సర్వ ము నట్లనేచేసెను. జైనులు నచిరకాలంబునఁ దమలోఁదామీ సాహ్య తొలఁగుడు దప్ప దక్కినవారందఱు మడిసిరి పిమ్మట శివభక్తి ప్రాబ ల్యము గలిగెను. ఇట్లు సావ్యతొలఁగుడు శ్రుతిబాహ్యంబును నరకకూ పాయనంబునగు మీమతావలంబకుల నిట్లునిర్మూలించుట నీవువిన లేదు రాజైనా"యని చెప్పి మరలనిట్లనియె

## కోపూరి బ్రహ్మయ్యకథ

జైనాధమా! ఇంకను వినుము కోపూరిబ్రహ్మయ్యయను నొక శివభక్తుఁడు తానున్నవీటఁగల జైనులకుందనకుఁ నొకవాదము గలుగ హేతూదాహరణంబుల వా లను నచ్చఁజెప్పవారలు సమాధానముఁజెప్ప లేక యోడి యాలుబిడ్డలుతోడను దాసదాసీజననామంతాదిబంధువుల తోడను వెఱచి పఱవఁగడఁగి, యంతనొక వటమహాకుహంబుంగాంచి శివభక్తునింజేరి యీ వటవిటపివి వేళ్ళతోడను శాఖలతోడను నాకులు పిందెలు కాయలు ఎ ప్పటి తోడను దానినాశ్రయించి యుండు జీవకో టులతోడను భస్మమాత్రావశిష్టంబు నీవుసేతువా? మేమట్లోనరింప వు పునర్జీవితంబుగ నొనర్తువాయని యడుగి నతండు నాశంబునొం దించుట మాపనిగాదు నశించినదానిని పునరుద్ధారణంబుఁగావించుట యె మాగురువాజ్ఞయన నందఱుంగూడి యతిప్రయాసంబున మంత్రం బుల నామఱ్ఱిచెట్టును దాని యందున్న జీవరాసులతో భస్మంబుగా ంప నాబ్రహ్మయ్యయు నింతభస్మంబు మంత్రించి యాభస్మంబుపై ల్లి యాన్యగ్రోధమును సమగ్రముగ తొంటియాకారంబున నిలువజేసి ఱునవ్వునవ్వుచున్న యాతనిసామర్థ్యంబునకు వారలోడిపాఱిపోయిరి గారివసతులనెల్ల బ్రహ్మయ్యతీసికొని శివభక్తులకిచ్చెను. పాఱిపోవుజైను

లఁబట్టి తెప్పించి యమపురికి తిథులుగాఁ బంపెను. ఈకథవినలేదురాజా నా' మఱియువినుము

## దేవరదాసయ్య కథ

భొల్లచెలువనునొక పురమున పురజనులుపది వేలమంది తన్ను సేవించుచుండ నొకజైనుఁడు దేశింగుబల్లహుండనురాజునకు సమకై యేడునూర్ల జైనాగ్రహారము లేర్పఱచుకొని మహాజైనభవనముచే జైనజనసంతృప్తిఁగావించుచుండెను ఆ దేశింగుబల్లహుండను రాజుభార్య శ్రీసంగళదేవి దేవరదాసయ్యకు శిష్యురాలై శివదీక్షఁబొంది తనభర్త జైనమతస్థుఁడై తనయాచదార్యాయ జైనులపాలు సేయుచుండుట గనిపెట్టి జైనులనోడించి భర్తను శివమతస్థునిఁగాఁ జేయుటకు నిశ్చయించి నిజగురువగు దాసయ్యకు దయసేయుమని యొకకిమ్మవ్రాసిపంపెను అతఁడును జైనులతో వాదించివారిని, రాజును శివమతస్థులుగాఁజేయుటకుఁ దన శిష్యవర్గముతో భొల్లచెలువపురమునకు విచ్చేసెను అప్పటికే జైనగురువునొద్ద పురజనులిరువదివేవురుశిష్యులు పోగుపడి యతనిచే వినయములఁసేవించుచుండిరి. దాసయ్యవచ్చువార్తవిని జైనులువిని మార్గమధ్యమున నాతనికెన్నియో యంత్రతంత్రములఁ గల్పించిరాకుండునటుల బ్రయత్నములు సేసిరిగాని దాసయ్య వానినన్నిటి సంహరణ చేసుకొనియెదుర పురమునఁ బ్రవేశించెను దేవియు నాతనిరావించి పంచనమస్కారములు చేసి యొకభవనమునొసగానిచ్చి వారికిగావలయు సదుపాయముల జరుపుచుండెను ఇట్లు దాసయ్య తన శిష్యులతో చ్చయనుండుట జైనగురువు రాజునకెఱింగించి యాతనిరాక తమ జైనులకుఁ ప్రతికూలము గనుక నాతనిఁ బురము వెలువరింపుమని రాజునకు విన్నవించెను. రాజును తనభార్య యొద్దకు నంతఃపురంబునకేగి „ దేవీ! లోకము భార్యాభర్తలిరువురు నేకమార్గానుసారులైనవారి సంసారము యుక్తముగానుండును గాని, భిన్నమతస్థులైనవారి కుటుంబస్థితి „యెద్దెండకు నెనుపోతు

పీడకులాగు నెద్దును నెరుబోతును బూన్చఁబడిన బండియొక్క దుర్గతిని బొందియుండును నీవు నామతమవలంబించుట శ్రేయస్కరము. భార్యకు భర్తయే దైవము పతిదైవికయగు భార్యయె పరమపతివ్రత. నీవట్టిదానవేని నామతమునవలంబించి యీదాసయ్యను శిష్యసమేతముగా బంపివేయుము జైనులు విన్న నతనికిబ్రమాదము పుట్టును." అని చెప్ప భర్తవాక్యములు విని భార్య యిట్లనియె — దేవా! యీ మతవిరుద్ధము మనయిద్దఱికిని నడుమవచ్చినదికాదు మనవివాహము నాటినుండియు నున్నదే. మీరునన్ను వివాహమాడునపుడు నామతమును నేను విడువక దానినే పరిపాలించునట్లును మీరంగీకరించి యిట్టిసంధయము ముందు నాతోఁగావించి పిమ్మట వివాహమైతిరి. శ్లో॥ గురుత్యాగీ భవేద్రోగీ మంత్రత్యాగీ దరిద్రతా । గురుమంత్రోభయత్యాగే రౌరవం నరకం వ్రజేత్" తనియెడు సకలాగమశాస్త్ర సారసంగ్రహ మనియెడు మంత్రశాస్త్రప్రమాణమును మీరు వినలేదా? మీజైనులకు గురూపదేశము మంత్రజపము దేవతారాధన గురుశుశ్రూషాదులు లేవు కాఁబోలు! మీరునాకు దైవస్వరూపులేగాని, యీవిషయములో మీయాజ్ఞనే శిరసావహించి గురుమంత్రముల రెంటినివిడిచి రౌరవనరకమును జూడఁజాలను. మీజైనమతమునకుఁ బుణ్యపాపములు లేవు. స్వర్గనరకములులేవు దేహత్యాగానంతర మాజీవుఁ డేమగునో వారు స్థిరాంతము అనంతరము సర్వము శూన్యమని మీసిద్ధాంతము శూన్యమగుటయు జీవుఁడును శూన్యుఁడవునని కాఁబోలు వారిసిద్ధాంతము. అట్టిశూన్యసిద్ధాంతమతమును నేనవలంబింపలేను. ఇంతకు మీయాజ్ఞదాటుటకు నామనసుపడకపోయినను మనవివాహమునాఁటి సమయప్రతిపాలనమువలన నాకాదోషములేదు. మీకు నేను సర్వదా దాసినే, మతమునువిడిచి మఱియొకమత మవలంబించుట మీజైనులకుదోషములేదుగాని, మాశైవులకు మతత్యాగమొక్కటి మహాపాతక

ములేదు. ఒకలాగైన మీకునునాకును ప్రీత్యవాయముండదు. మాగురువులురాక నేను. మీజైనులవాదించి శైవమతసిద్ధాంతము సేయుటకే. మీగురువులుగెల్చిన మాగురువుగారిని వారిశిష్యులను మీమతములోనికి చేర్చుకొందురు. మాగురువులుగెల్చిన మీయునుమీగురువులును వారియితరశిష్యులును శివదీక్షపొంది శైవులుకావచ్చును. అట్లయినమీకునునాకును మతత్యాగదోషము కలుగదు. ఎవరోడినవారన్యమతమువలంబింపవచ్చును. గనుక వారికివీరికి వాదము జరిపింపు" డని భర్తను బహువిధముల బ్రతిమాలి యట్టివాదమునకు జైనులనొప్పించి వారికి దాసయ్యగురువునకు వాదము సభాభవనమున స్థిరపరిచెను.

ఇట్లుభయవాదులను మధ్యవర్తులను ప్రోగుచేసిసభయందుగూర్చి యుభయపక్షములవారును దమతమ శిష్యప్రశిష్యసమువాయముతో సింహాసనీనులైయుండ నిజజైనగురుసేవసేయుచు రాజును తనసైవగురుసేవసేయుచు రాజభార్యయు చెరియొకసింహాసనము నలంకరింప జైనులకు దాసయ్యకు వాదమారంభమయ్యె అందుజైనులకు మతగ్రంథములు, శాస్త్రసిద్ధాంతములులేవు వారికి తంత్రవాదము నింద్రజాలాదిమాయలు ప్రధానములు వారిది ద్వైతమతమునుగా దద్వైతమతముగాదు. కేవలము శూన్యవాదమతము. ఇట్టిజైనులతో దాసయ్యవాదమునకుఁగడంగి తొలుతసగుణప్రకారమును పిమ్మటనిర్గుణప్రకారమును వెనుక వేదాంతసిద్ధాంతమును తదుపరి జీవాత్మ పరమాత్మస్వరూప నిరూపణమును తరువరి జీవదేవస్వరూపములును వారి వారి శాశ్వతాశాశ్వతత్వంబులును కట్టకడను శివమతప్రాధాన్యమును, లింగస్వరూపమును లింగసంగతదేహపారిశుధ్యమును మున్నగు ననేకవిషయములు వారికిఁదెలుపుచుండ సభికులు తలలూఁచుచు వారుసేయుటతో ధలక్చ్చెరువందుచు జైనులమూకీభావముఁగని నవ్వుచుండిరి "దిక్కాలాద్యనవచ్ఛిన్నానంతచిన్మాత్రమూర్తయె స్వానుభూత్యేకసూనాయ

యువులను మనస్సులేకహృదయమను నంతరింద్రియమును నాలుగుభాగములుగ విభజించి మనోబుద్ధిచిత్తాహంకారములను నట్లుభాగములుగా విభజించి వానియధనమందా యవయవములనుంచి వానిచేత నాయాకర్మలఁజేయించుచు నిట్లుస్థూలదేహమును గావించి దానిచేకర్మలుచేయించుచుండును. పైని చెప్పిన మొదటిపదియు తరువాతిపది వాయువులను కడపటినాలుగును కలిసి యిరువదినాల్గును ప్రకృతులనఁబడును. ఆప్రకృతులే నిర్గుణబ్రహ్మముయొక్క స్వరూపము. ఈ యిరువదినాల్గుతత్త్వములేతపు సూక్ష్మాంశలచే నీస్థూలదేహమం దంతర్వ్యాప్తమైలింగములేక లింగదేహముఅను పేరఁ బరఁగుచుండును. స్థూలదేహము నశించునుగాని యీసూక్ష్మదేహము నశింపదు. దానియొక్కబహిర్గమనమె మరణమనఁబడును. మరణించిన దేహముయొక్క లింగము దేహాంతరములనొంది తనస్థూలముతో దాఁజేసిన కర్మలఫలము ననుభవించుచుండును. ఈసూక్ష్మలింగదేహము భిన్నమగుటయే మోక్షము. అప్పుడే సూక్ష్మదేహముననున్న తేజస్సు మహాతేజస్సునైక్యమగును. సూక్ష్మదేహమున తేజోమయంబున నుండి పరబ్రహ్మము కర్మసాక్షియై సూక్ష్మదేహ లింగదేహము నధిష్ఠించి యుండియందున్న పై యిరువదినాల్గు తత్త్వములను తనప్రకృతియే జీవుఁడనుపేరఁ గావించు కర్మల నీక్షించుచు నాయాకర్మలఫలముల వానిచే ననుభవింపఁ జేయుచుండును. ఇట్లు సూక్ష్మరూపమున లింగదేహము నందుండి స్థూలదేహమునకు తానధిపతియై యుండును గనుక నీ లింగదేహమునే జీవుఁడందురు. ఆజీవుఁడు స్థూలదేహము నందుండుట వలన స్థూలదేహముగల మనదేహమె దేహియనబడును ఇట్టి దేహములనేకములు గలవు. ఇవి భూచర, ఖేచర, జలచరము లని మూఁడు విధములు. ఈమూఁడువిధములకు దేహములకు—“ఆహార నిద్రాభయ మైథునంచ సమానిచేష్టాని నరోమృగాణాం” అన్నటుల పై చర్య

లన్నియు సమానములే ఏనుఁగు మొదలు నుసము (చిన్నదోమ) వఱకు నున్న దేహములు వానియందు లింగసజ్ఞగల సూక్ష్మదేహమున్నవి పైనజెప్పిన నిర్గుణబ్రహ్మము తన యిచ్ఛామాత్రమున "ఇచ్ఛామాత్రం ప్రభోస్సృష్టిం" అన్నట్లు సృష్టించి యందు మానవ దేహమందు గల జీవునికి తక్కిన యన్ని దేహముల యందున్న జీవునిపై నాధిపత్యమిచ్చి యతనివశము వానినిఁ గావించి వానికాహారాదులు నియమించి యితరాహారపదార్థములను వానిలో వానినే బలిష్ఠభూతములకు బలహీనములభూత మాహారముగా నియమించి మానవదేహ జీవునికి స్వతంత్రశక్తి యొకటి యధికమిచ్చెను. ముక్తాయుక్త విచక్షణజ్ఞానము నధికముగాఁ గలుగఁజేసి భావనాశక్తియుఁ గలిగించెను. ప్రతిజీవుఁడును "ఆత్మవత్సర్వభూతాని" యను న్యాయమునఁ దాఁజూడని భూతము యొక్క స్వరూపము తనస్వరూపమువంటిదే యనుకొనుట స్వాభావికము. మనలో కొందఱిప్పుడును కాశీయెన్నడు పోనివారు శ్రీకాశీ ప్రశంస చేయుచున్నప్పుడు చూడనివాఁడు తనయూరివలెనే యని యుండుననుకొనును అట్లనే మానవజీవుఁడు జననమరణములయందు తనకు స్వతంత్రము లేకపోవుటచేఁ దనకన్న నధికుఁడు మఱియొక జీవుఁడున్నాఁడనియు, నట్టివాఁడె పరబ్రహ్మమనియు దేహమనంబులం దలంచుచుండును పైనవివరించిన సృష్టి రెండువిధములు అనఁగా స్త్రీ పురుష భేదరూపములుగాఁ జేసి యారెంటి సంస్పర్శలవల్ల మఱలఁ బ్రజోత్పత్తి యగునటుల నిర్ణయింపఁబడెను కనుక కొందఱు పరబ్రహ్మస్వరూపమును పురుషరూపముగాను కొందఱు స్త్రీరూపముగాను భావింతురు. "యాదృశీ భావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ" యని యేరూపముగలవాని భావింప బడునో ఆరూపముగానే వారి దృష్టికి గోచరమై వారుభావించిన కృత్యములను చేయుచుండును. కనుక మనవలెనే సంసారాదివ్యవహారమును పరబ్రహ్మమునం దారో

పింపఁబడినవి. త్రిమూర్తులు, త్రిశక్తులు నిట్టి భావితరూపములే పర బ్రహ్మమేరూపమని యెవరుభావింతురో వారికారూపముగానే గనఁబ డి వారివారికృత్యములనరసి వారికి మోక్షమిచ్చుచుండును ఇది సగు ణపరబ్రహ్మస్వరూపము శివుఁడె యట్టిపరబ్రహ్మస్వరూపియని మావా దము అశివుఁడు శాశ్వతుఁడు జీవుఁడును శాశ్వతుఁడెగాని, స్వతంత్ర శాశ్వతుఁడు భగవంతుఁడు అస్వతంత్ర శాశ్వతుఁడు జీవుఁడు. అట్టిస్వతం త్రుని ఆశ్రయించి తద్బలమున జీవుఁడును స్వతంత్రుఁడగును అట్టిశివు నినిర్గుణస్వరూపము ననస్సునభావింపలేక సగుణస్వరూపమును భావిం చువారుశైవులు సగుణములోనే భేదములుగాని నిర్గుణములో భేదము లేలేవు శివపూజ విగ్రహస్వరూపపూజయుఁ గేవల లింగస్వరూపపూజ యునన రెండుతెఱఁగులు రాజునకుపచారములు నౌకరులెట్లుచేయుదు రో అట్లె దేవునకుపచారములు దేవునిసగుణభావము విగ్రహాకారము నభావించి చేయుదురు రాజునకు కోటవలెనే విగ్రహాకార దేవునకు గుడి శివపూజలో విగ్రహస్వరూపపూజకన్న లింగస్వరూపపూజయం దు ఫలమధికము గుళ్ళలో సాధారణముగా శివుఁడు కొన్నిలింగాకార ముతోను కొన్నియంగనిరూపణముగల విగ్రహాకారముతోను సేవా ద్యుపచారములు గొనుచుండును. ఈశివుఁడని దానియందుండు లింగా కారమును సర్వదా తమయొడలియందు ధరించువారు వీరశైవులు. ,,దేహోదేవాలయం ప్రోక్తం, జీవోదేవస్సనాతనః। త్యజేదజ్ఞాననిర్మా ల్యం సోహంభావేన పూజయే'' త్తను సిద్ధాంతముచే తమదేహమునె యొకదేవాలయము ను అందున్నజీవుఁడె శివునిగాను భావించి ,,ఆత్మా త్వం గిరిజామతిః పరిచరాఃప్రాణం శరీరంగృహం। పూజాతేవిషయోప భోగరచనా నిద్రాసమాధిస్థితిః। సంచారఃపదయోః ప్రదక్షిణవిధి స్తోత్రాణి సర్వాగిరో। యద్యత్కర్మకరోమి తత్తదఖిలం శంభోతవారాధ నం'' అని వీరశైవులు జ్ఞానమార్గమున ప్రత్యేకపూజలేక తాముచేసిన

నమశ్శాంతాయ తేజసే" అని దైవము తేజస్స్వరూపము దానికి నామ రూపనిష్పత్తి లేదు అఖండ తేజోమయస్వరూపముగాని యవయవసమ నిత్యవిగ్రహస్వరూపముగాదు సర్వాంతర్యామి, సర్వబహిర్వ్యాప్తియుఁ గలది దైవస్వరూపము పంజరములోని చిలుకవలె నొకానొకప్పుడు తేజఃస్వరూపమైన దైవము జగదంతర్వ్యాప్తినొంది యుండు పంజర మువలె నొకానొకప్పుడా దైవమె లోకముల నావరించి బహిర్వ్యాప్తి నొంది యుండును. అట్టిదైవము నాశ్రయించి తదనుగ్రహము వడయుట కు దిక్కాలాది నిర్ణయములు లేవు. అనఁగా నొకదిక్కునఁగాదన్ని దిక్కు లను వ్యాపించియున్నది తేజస్సు ఒకగదిలో వెలుఁగుచున్న దీపము యొక్క కాంతి యాగదిలో నున్నదిక్కులను పూర్ణముగా నెట్లువ్యాపిం చినదో యట్లనా దైవతేజస్సంతటను వ్యాపించియున్నది ప్రొద్దుపోఁగానె లోన దీపముంచి తలుపులు బిగించి మూయఁబడిన గదిలోఁ దెల్లవారువర కు నేకకాంతితో వెలుఁగునటుల వెలిఁగింపఁబడిన దీపముయొక్క వెలుఁగును జూచుటకు నారాత్రి యిన్నిగంటలకని నియమమున్నదా ? ఏనిమిషమందుఁ దెఱచిన నానిమిషముననే చూడవచ్చును ఆ వెలుఁ గేదిక్కున నున్నదని నియమమున్నదా ? అన్నిదిక్కుల నేకరీతిని వెలుఁ గుచున్నది. అట్లనే మన యజ్ఞాన చక్షువులకుఁ (చర్మచక్షువులకు) గనఁబడక జ్ఞానచక్షువులచే నెన్నఁగాఁ జూడనొప్పు. దైవతేజస్స్వరూప ముఁ జూచుటకు కాలనిలయము లేదు దిక్కు నిర్ణయము లేదు ఏకాల మందయినను నేదిక్కునందయిన నేకరీతిగా నది పూర్ణముగ వెలుఁగు చున్నది. జ్ఞానోదయమైన తక్షణమె గనిపించును. మఱియు నాదైవతే జస్స్వరూప భావము గుర్తెఱుఁగుట స్వానుభూతి ప్రమాణము. అనఁగా నెవ్వరెంత మాత్రమెఱుంగుదురో యంతె. చెరువులోనున్న నీటిని దెచ్చుకొనుట కెవ్వరెంత పాత్రఁ గొనిపోవుదురో యంతియె నీరువచ్చు నుగాని యధికము వచ్చునా ? పెద్దకుండ, బిందె, గూన, కాబు,

గోలెము, పిడత, చట్టి, తుదకొక యుద్ధరిణె వీనియందేది చేతఁ బట్టుకొనిపోయిన దానెడు నీరె గ్రాహకును. అట్లనే గురుబోధామృతవశమున నెవ్వరికెంత యనుభవము కలుఁగునో యంతయె యనుట. దీనికొక యుదాహరణము — నలుగురు గ్రుడ్డివాండ్రు గజస్వరూపమును దెలుసుకొనఁగోరి యొక మావటివాని నాశ్రయించిరి. వాఁడా నలుగురినిఁ గొనిపోయి పంచుకొనియున్న యొక యేనుఁగును జూపి నలుగురిని గజమునొద్ద విడిచెను. అందులో నొకనికి దానికాలు దొరికినది. అది తడవిచూచి యిదియే యేనుఁగు రూపమనుకొనెను మఱియొకనికిఁ జెవిదొరికెను వాఁడది తడవిచూచి యదియె దాని స్వరూపమనుకొనెను. వేఱొకనికి తుండము దొరికెను. వాఁడది తడవిచూచి యదియె దాని స్వరూపమనుకొనెను ఇంకొకనికి దానికడుపు దొరికినది వాఁడది తడవిచూచి యదియె దాని యాకారమనుకొనెను పిమ్మట మావటివాఁడు వారి కేనుఁగును చూచితిరాయని వారు చూచితిమని యొకఁడు కాలు తడవిన వాఁడు రోలు వంటిదనెను. మఱియొకఁడు చెవితడివిన వాఁడు చేటవంటిదనెను. వేఱొకఁడు తుండముఁ దడవిన వాఁడు రోఁకలివంటిదనెను ఇంకొకఁడు కడుపుఁ దడవిన వాఁడు గాదెపోణక వంటిదనెను. ఇట్లెవ్వఁ డేయవయవస్పర్శము నొందెనో వాఁడు దాని పోలికను చెప్పుచుండెను గాని యట్టివాడే సర్వావయవములను స్పర్శించి పూర్ణముగాఁజూచినయెడల రోలువంటి కాళ్ళును, రోఁకలివంటి తొండమును, చేటవంటి చెవులును, గాదెబుట్టవంటి కడుపునుగలది యేనుఁగని చెప్పును అట్లనే యద్వైతతేజస్స్వరూపమును గురుబోధవలనను, తనచక్షుర్దృష్టివలన నెంతగ్రహించునో యంతయె వానియనుభవ మనఁబడును కొందఱు కొంతకాలము మాత్రమనుభవింతురు మఱికొందఱు మఱికొంతయధికకాలమనుభవింతురు. కొందఱుయోగులు ప్రాణాయామాది వాయువినోదనమున నైక్యానుసంధానపరులై యట్టియైక్యమును తమతమయ

భ్యాసానుసారముగా కాలపరిమితినిబట్టి నిలుపుచుందురు. సర్వదాయట్టి యభ్యాసము చేచేయుచు "యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్యకర్మణా" మనియెడునియమము జరుపుకొనుచు నభ్యసించువారు తమయోగబలమున మృత్యువును సైతము జయించి సర్వకాలములయందు చిరంజీవులై యుందురు మార్కండేయాదు లట్టివారే. ఇదినిర్గుణ పరబ్రహ్మస్వరూపము ఇక సగుణస్వరూపమువినుఁడు. అట్లు సర్వవ్యాపకత్వమును, సర్వశక్తత్వమును, సర్వతంత్రస్వతంత్రమునుగలిగి, కాళ్ళులేక నడచునదియు, చెవులులేక వినునదియు కన్నులులేక చూచునదియు, చేతులులేక చేయునదియు మనస్సులేక యాలోచించునదియు నిట్లు వాక్పాణిపాదపాయూపస్థలను కర్మేంద్రియములైదును, త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములైదునుగాఁ బదియు మనస్సును పదునొకండవదియునగు నింద్రియములేనిదయ్యు నాయాయింద్రియములు గావించు కృత్యములగు వాచకకరణగమన మూత్రమలవిసర్జనాది కార్మిక కార్యములును, స్పర్శ, రూప, శబ్ద, రస, గంధంబులకు ననుభవకార్యములను జేయునిర్గుణబ్రహ్మము చిద్విలాసమునకై భూతసృష్టిసేయు నిచ్ఛగలిగి యాకాశాది పంచభూతములను సృజించి యవియు, వానితన్మయంబులగు శబ్దస్పర్శరసరూపగంధములును, ననుసీపఁబడియును వసప్రకృతి గా నేర్పఱచి యందుభూతపంచక సమ్మేళనమున వానివాని సూక్ష్మాంశలచే దేహమునొక స్వరూపమేర్పఱచి యాశరీరమందు ప్రాణాపానవ్యానోదాన సమానములను ప్రధానభాగములుగాను, నాగకృకరకూర్మ దేవదత్త ధనంజయములను తత్సూక్ష్మభాగములుగా వాయువును పదిభాగములు చేసి యందుంచి యావాయువులచే దేహమునువిగ్రహమున కేర్పఱుపఁబడిన పైని చెప్పిన కర్మేంద్రియ జ్ఞానేంద్రియ కృత్యములను జరుపుటకు నవయవములను పేర నాపదియంగంబుల నిరూపించి వానిచే నాభూతకృత్యంబులగు తనాన్మత్రరను భూతాత్మకదేహముచేతఁ జేయించుచు నాపదివా

ప్రతికార్యము వారికి సమర్పణచేసితిమను తలంపును సృష్టిపఱచుచు రు. అట్టివారిలో కొందఱు మహోదార్థ్యము కొంచెము తక్కువగాఁగల వారు లింగాకారము సూక్ష్మముగా నొకశిలతో నేర్పరచి దానికి గుడికి మాఱుగా నొకకరండరూపమగు నొకమహారజత తామ్రాదిలో హములతో నేదైన నొకదానిచే వారివారివిత్తానుసారమొక బహిరావ రణమేర్పఱచి యాసూక్ష్మలింగము నాయావరణమునందుంచి దానికి లింగకాయమని పేరిడి (లింగకాయమనఁగా గుడియు నందున్న దేవు డును) దానిని, హృదయము జీవుఁడును పరమాత్మయునుండు తావుగా వున హృదయగతమగునట్లు మెడలో నొకసూత్రముతో గ్రుచ్చి వ్రే లఁగట్టుకొని నిత్యకృత్యములను దేవునికి నివేదించుచుందురు ఇదియె ప్రధానమగు వీరశైవమతము. ఈవీరశైవులకు సమస్తము తమమెడ లోనున్న లింగమూర్తియె"

ఇట్లని బహువిధములుగా సోదాహరణముగా సశాస్త్రయుక్త ముగా వీరశైవమతసిద్ధాంతమును చేసియు, జైనులకది యెంతమాత్ర ము బోధపడకుండుట "ఓ జైనులారా! మీకీ సిద్ధాంతము లేవిధము బోధపడవు. వలసిన నిదర్శనములు చూపెదను. చూడఁగలరా" యనియడుగ వారు వీని నెట్లుచేయఁ జూపవలెనని యూహించి యొక కర్కోటకాది మహావిషసర్పము వంటి విషముగల శుద్ధస్వచ్ఛమగు తెల్లత్రాఁచుపాము నొకదానినిఁ బట్టితెచ్చి యొకకుండలోనుంచి దాని పైని మూఁకుడు మూఁతవేసి సభలోనికిఁ దెచ్చి "మీశివుఁడు సర్వాం తర్యామి యంటివిగదా యీకుండ యందున్నాఁడా? అట్లున్నయెడల దీనినుంచి మీలింగమూర్తి యాకారముతో నున్న శివునియాకారము ను పైకిఁదీయు'మని గంభీరముగా బలికి ఇఁక నీ యుపాయమున నాతఁడు తప్పక మరణించునను ధైర్యముతో ననిరి.

ఆకుండ యందున్న పాము బుస్సుబుస్సుమని బుసకొట్టుచుఁ జప్పుడు పైకి వినఁబడునట్లు రోఁజుచుఁ దోఁకతో కుండను గొట్టుచు లోపల గడబిడఁ జేయుచుండుట సభాసదులందఱికి వినఁబడుచు నందు పామున్న సంగతి వారికి గోచరమయ్యెను. వారందఱు దాసయ్యతో" నిజముగా దానియందు పామున్నది. సాహసింపవద్దు. దానికాటుదగిలి విషముచే బ్రాణహాని సంభవించును వాదమింతటితోఁ జాలును. ఎవరి మతము వారిదె గాని యొకరిమతము నొకరవలంబింపనక్కఱలేదని దాసయ్యను బోధించుచుండిరి. రాజుభార్యయుఁ దనగురువున కోటమి సంభవించునని చిన్నబోయిన మొఖముతోఁ జూచుచుండెను. రాజుబహు గంభీరముగా దనగురువు గెలుచుననుధైర్యముతో భార్యముఖముచూచుచుండెను. అప్పుడు దేవరదాసయ్య సభాసదుల నవలోకించి "యీకుండయందున్న లింగమూర్తిని నేను బయటఁదీసెదను. నిజముగా నిందున్నవాఁడు సర్వాంతర్యామియగు మాలింగమూర్తిగాని పాముగాదు. అదియె నిజమైనయెడల నీరాజును వీరిగురువును వారియితరశిష్యప్రశిష్యులును నాకు శిష్యులై శివదీక్ష గైకొనియెదరా ? ఈవిషయము మీరుస్థిరపరిచితిరేని నేనీప్రత్యయమును మీకందఱికిఁ గనఁబఱతు"నని యె. అంతనాసభికులు జైనగురువును రాజును దానికొప్పుకొనువారుగా నియమించి యొప్పుకొంటిమని వారిచేననిపించిరి. అంత దాసయ్య నిశ్చలచిత్తంబుతో "శివశివేతిశివేతివా, భవభవేతి భవేతిభవేతివా। హరహరేతిహరేతివాహరేతివా। భజమనశ్శివమేవ నిరంతరమ్మ"ను శివమానసబోధ శ్లోకముననుసరించి సర్వదా సర్వకాలసర్వావస్థలయందు శివమతస్తత్వరుఁడై సమస్తచరాచర జంగమస్థావర స్వరూపములనెల్ల శివస్వరూపముగా భావించువాఁడు గనుక తొల్లియొక శివభక్తుని బలవంతముగా విష్ణ్వాలయమునకు రాజుతోడ్కొనిపోయి మీశివునకునమస్కరింపుమని విష్ణువిగ్రహము నగుపర్చి బలవంతపెట్టుటయు నాతఁడు

శివం దేశంభు ముమాపతిం సురగురుం వందేజగత్కారణాం। వందేపన్నగ భూషణం మృగధరం వందేపశూనాంపతిం । వందేసూర్యశశాంకవహ్నినయనం వందేముకుందప్రియం। వందే భక్తజనాశ్రయంచవరదం వందేశివం శంకరం॥ అని ధ్యానించుచు కన్యలుమూసి తెఱచుసరికి నక్కడ విష్ణువిగ్రహము లేక లింగాకారము పానవట్టసమేతముగాను సోమసూత్రముతోను ప్రత్యక్షమయినటు లనేక ధ్యానశివనిష్ఠాపరాయణులయిన శివతన్మయత్వంబున నిశ్చయముగా

1 బ్రహ్మమురారి సురార్చితలింగం । నిర్మలభాసురశోభితలింగం।
జన్మజదుఃఖవినాశనలింగం । నామిసదాశివ పన్నగలింగం॥

2 భక్తజనార్చితపావనలింగం । భక్తహృదంతరభాసురలింగం।
భక్తమనోరథపూరకలింగం । నామిసదాశివ పన్నగలింగం॥

3 భక్తగణాశ్రయభావితలింగం । భక్తజనావన భావనలింగం।
భక్తజనస్తుతవర్తితలింగం । నామిసదాశివ పన్నగలింగం॥

అను నీమూడుశ్లోకములచేత ధ్యానించి యొకబిల్వదళము చేతఁబట్టి

॥ త్రిదళం త్రిగుణాకారం త్రినేత్రంచత్రియాయుధం । త్రిజన్మ
పాపసంహారం ఏకబిల్వం శివార్పణం ॥" అని కుండమూఁత మూఁకుడు కొంచెమెత్తి యాబిల్వదళము దానిపై నిడినంతలో నదివరకున్న బుస్సురోఁజుట మొదలగు సందడిలేక కుండనిశబ్దమయ్యెను అదిచూచి సభికులును రాజభార్య దాసయ్య గెలుచునేమోయని కొంచెము ధైర్యపడనాగిరి. రాజును జైనులును తమకోటమి రాఁగలదేమోయని పోటమొగములు వేసిరి. ఇట్లు బిల్వదళము సమర్పించి దాసయ్య యొక్కపర్యాయము హుంకరించి పంచాక్షరీ మంత్రోచ్చారణపూర్వకంబుగా ॥నమోరౌద్రలింగం నమస్స్వచ్ఛలింగం । నమశ్శుద్ధలింగం నమోబుద్ధలింగం । నమోజైనలింగం నమశ్శైవలింగం । మమప్రాణలింగం నమస్తే నమస్తే" అని స్మరించుచు మనస్సాష్టాంగ నమస్కా

తపూర్వకముగా మూఁకుడుమూఁతఁదీసి క్రిందబడవైచి పడగఁబట్టి పా మునుబైటఁదీయఁగా నందఱుఁ జూచుచుండ నాపాము సర్పాకారము గా బైటవచ్చి దాసయ్యచేతిలో మండివేసి కూర్చుండుటకు చుట్లుచుట్టు చున్నదేమో యనునట్లు గనిపించి తుదకు తనిచేతికి సరిపడు లింగుపాన వట్టమునై చేతిలోనిమిడెను అదిచూచి రాజును జైనగురువును సిగ్గుప డి దాసయ్యకు సాష్టాంగదండము పెట్టి తత్క్షణమె శివదీక్షఁబొందిరి. తక్కినజైనులందఱు నొక్కమాఱు దీక్షబొంది లింగధారణముఁగావించి రి.ఇట్లు జైనులువేయుపశ్నల కుత్తరములిచ్చి గెల్చినయూర్ధ్వాటిక శుద్ధ స్వచ్ఛలింగమూర్తినచట నుత్తరేశ్వరుఁడను నామమునఁ బ్రతిష్ఠించెను. ఓసీ, జైనా! చూచితివా, మా దాసయ్య మీజైనులనెల్లగెల్చి వారి యేడునూఱువసతులు త్రిప్పించి శివభక్తులఁ జేసెను వింటివా వానిప్రభా వము, మఱియు వినుము సెప్పెద.

## నాచిదేవయ్య కథ

మాయిడిగెయను పురమున నాచిదేవయ్యయను శివభక్తుఁడుం డెను అతఁడప్పురముననున్న జైనులనెల్లఁ బొరిగొనకగాని యీశ్వరుని కుపహారంబియ్యనని బిక్కుమనలికి యాపురంబు విడిచిచని పండ్రెండు దినంబులలో పండ్రెండు శివభక్తులఁ గూడఁబెట్టి వారును తాను నామాయిడిగె పురంబుపై దాడివెట్టి ముట్టడించి యప్పురంబుననున్న జైనులఁ బొరిగొనుటకు వారుదక్కఁ దక్కిన యూరివాలనోపాలమును వారిపై దాడిపెడలుఁడని చాటించి పురప్రవేశంబుసేయ నందున్న జను లలో శేవినులను పేరుగల యొక జాతివారు లేచి భక్తనముదాయము ను నిలిపి వారు పదిమందిమాత్రము పీరావేశంబున జైనుల నెదుర్కొ ని బాహాబాహి కేశాకేశిని ముష్టాముష్టినిట్లు మల్లయుద్ధంబునఁ గొం దఱిఁబరిమార్చి పిమ్మట నాయుధహస్తులై తమశిరంబులు దామనతికి కొని వానినెడమచేతం బట్టుకొని కుడిచేత నాయుధంబు ధరించి వీరా

లాపంబు లాకసంబుముట్ట చిట్టచివర కొక్కఁడును మిగులకుండునటుల నందఱు జయినులం గడతేర్చి తమ్ముఁజూచి జైనులు భయంబునఁ బాఱిపోవుచుండఁ గాంచి పోనీయక క్రీడావినోదంబున నేఁడు నూఱు జైనవసతులలో జైనప్రతిమలున్న తావుల నాప్రతిమల తలలూడ్చి దానియందున్నలిపి యార్చి యందొక్క శివలింగంబును ప్రతిష్ఠించి యిట్టి జైన నిర్మూలంబుచేసి యాపగుగును తమతలలు మఱల నట్టల పైఁబెట్టినమాత్రంబున నవియంటుకొని వారు జగజ్జట్టులన ప్రమథగణ ప్రధానులై తత్పట్టభద్రులైరి నాచిదేవయ్య మహాత్త్యంబు చిరకాల మునాఁటిదికాదు దరిమిలాదే నీవువినలేదా ? అని యడుగుచునిమ్ము. పాటివేల్పులని మీరు పాటించి కొలుచు మీ మేటివేల్పుల పాటులం జూచితివా ? పశువులగుమిమ్ము మాభక్తులు పఱచుపాట్ల కిదియొక వోద్యమా ? మీరింకను మాచే పంచత్వంబునొంద నర్హులు మఱి యొకటి వినుము

## సోమన్న కథ

హుళిగిరయను పట్టణమున సోమన్నయను నొకభక్తుఁడు వర్తమానభూత భవిష్యత్ జ్ఞానసంపన్నుఁడై శివభక్తి పరిపూర్ణుఁడై ప్రతి దినము ముప్పొద్దును శివలింగదర్శనము చేయనిది భుజింపనను నియమముగలవాఁడై యట్లసేయుచునుండ నాతనికిఁ గన్నులుడుకులెత్తి తెరవలేక గుడికిఁబో నశక్తుఁడై మూఁడుదినము లుపవసించెనుగాని కన్నులు కుదురలేదు. ఆపురమున నాతఁడొక్కఁడు దక్క దక్కినవా రందఱు జైనులే. వారుగుమిగూడి యొకనాఁడాతని వంచింపనెంచి దు రాలోచనసేసి యాతనియొద్దకుఁబోయి ,,సోమన్నా ! యేలయిట్లు దిన దినము నుపవసించెదవు ? 'అయురన్నం ప్రయచ్ఛతి' యనివినలేదా ? అన్నగత ప్రాణమన్నములేనిచోఁ ప్రాణహానివచ్చుఁ గనుక నేఁటిని న్ను శివాలయమునకుఁ గొనిపోదుమురమ్ము. నమ్ము. మఱియుందఱెసెు

శయ్యూరివారము ఒకరికొకరు సహాయము చేసుకొనకలేర" దని నమ్మించి యాతని చేయిఁబట్టి యందఱుఁ దోడరా నొక దాఁకపొన్న చెట్లవనములోనికిఁ గొంపోయి యట నొక జైనగురు ప్రతిమఁబుఁజూపి చేతఁదడివించి యిదిగో ! మీగుడిలోనికి వచ్చితిమి మీశివుని స్పర్శింపుమని చేతికా ప్రతిమ నందించెను వాఁడా ప్రతిమను దాఁకి లింగమూర్తియాకారమునఁ దన చేతికిఁ దగులునంతలో "శాంతం పద్మాసనస్థం శశధరముకుటం పంచవక్త్రం త్రినేత్రం। శూలం పాశం చ ఖడ్గం పరశుమభయదం దక్షభాగే వహంతం। నాగం పాశం చ ఘంటాం ప్రళయహుతవహం సాంకుశం వామభాగే। నానాలంకారయుక్తం స్ఫటికమణినిభం పార్వతీశం నమామి" యని ధ్యానించుచుండెను జైనులందఱొక్కపెట్టునఁ "గో" యని ఘోషించి "చాలుచాలు ! మాజినేశ్వరుఁడు మెచ్చుకొని నిన్ను మాలోఁగలుపుకొనెను నేఁటినుంచి మాలోనొకఁడవై జైనుఁడవై బ్రతుకు" మనిరి అవివింతో ద్రొక్కఁబడిన త్రాచువలె బుస్సుమనిలేచి "ఛీ ఛీ ! పాపాత్ములారా ! నేను మీజినేశ్వరునకు గినేశ్వరునకు మ్రొక్కితినా ? శివాలయమున శివలింగమూర్తికి మ్రొక్కితిని రండీ యాలయంబులోనికి లింగమూర్తి దర్శనము మీకుఁ గావింతు" నని బలిమిని కన్నులు తెఱచి చూచునంతలో దానున్న పోలి యాలయముగను తాస్పర్శించిన జైనప్రతిమయే శివలింగమూర్తిగాను, చూచువారి కన్నులు మిఱుమిట్లుగొనినట్లు ప్రాదుర్భావమొందిన నాయాలయంబును లింగాకారమును జూచి జైనులాశ్చర్య భయపూరితులైరి. అదియె కదా నేటికిని సోమనాథదేవళమై హిందూదేశచరిత్రలో బ్రసిద్ధికెక్కి మహమ్మదీయుల దండయాత్రలో గొల్లపెట్టఁబడినది. ఆసోమన్నని మానుషప్రభావమునకు మాజినేశ్వరుడె సాక్షి. మందుమా సోమన్న మీజనులకెట్లు గర్వప్రాయచిత్తము సేసెనో! ముందేలి కంకణమున కద్దమేల? మఱి యొక వినుము.

## వైజకవ్వకథ

పరమగేయను పురమున వైజకవ్వయను నొకశివభక్తురాలుండెను. ఆమెభర్త జైనుల నాశ్రయించి వారిమతమవలంబించి వారిలోఁగలసిమెలసి తిరుగుచుండును. అతఁడొకనాఁడు జైనసమారాధనము సేయఁదలంచి, యింటవలయుషడ్రసోపేతములగు భోజనసామగ్రి సమకూర్చి వంటచేయించి జైనులఁబిలువనరిగిన నతనిసతియు బహువిధపదార్థభోజనప్రయత్నమంతయుఁజూచి "బాహ్యులకొఱకు నాయాహారపదార్థబాహుళ్యమంతయు వృథకదా? శివభక్తుఁడొకఁడైనఁగనఁబడకూడదా! ఒక్కఁడైననుదొరికె నేని వానికిముందు భుజింపఁబెట్టి యులికి వేసి పిమ్మట జైనులకుఁబెట్టుదు"నని శివభక్తులకొఱకుఁ బఱవరించుచు నెదురుచూచుచుండెను. భక్తమనోరథపరిపూరకుండగు భగవంతుడు తనభక్తురాలికోరికఁదీర్పుటకై యొక మునివేషమున రుద్రాక్షకిరీటభసితత్రిపుండ్రరేఖలతో నెదుటపడి "శంభో! శంకర! మహాదేవ! పార్వతీవల్లభా!" యనుచునిలిచెను వైజకవ్వయాతనికి సాష్టాంగంబొనరించి లోనికిఁదోడుకొనిపోయి తొందర తొందరగా "స్వామీ! నాతుగఁడు దుర్మార్గుఁడు జైనులను బిలువఁబోయెను. అతఁడు రాకమునుపు స్వాములవారు భిక్షగైకొని తృప్తిగాభుజించి విజయంచేయుఁ"డని వర్ధింపఁగా నాకపటముని యటుఁదినుటకారంభించి నిమిషమాత్రమున నామె యొడ్డింప నాప్రయత్నమంతయుఁ దాభుజించి జైనులకొక బలుస్సాకైన లేకుండునటులఁ జేసి యామెభర్తవచ్చువంతలో నదృశ్యుండయ్యెను భర్తవచ్చిమఱుఁగుపడినమునిఁజూచి మఱిఁగానలేక భార్యపైఁగోపించి "యోసీ! దుశ్శీలా, నామతమునకు విరుద్ధమగుమతమవలంభించుటయెగాక నన్ను వానికొంపగూలెనన్నటులనే నతిప్రయత్నమున సుపాధించినరుచ్యంబులగు భోజనపదార్థములన్నియు నొకమునివటుపాలగావించి వాని నెందుదాచితివిచూపవే, లంజా, లండీ, బంకులాడీ, ఱ

కుమగనికిఁ బెట్టి వానినిదాఁచుకొంటివా! పూర్వము సప్తమహర్షులవంటి యేడుగురు బైరాగిమతస్థులు తమభార్యలు వ్యభిచరింతురని వారలఁ దమ కమండలువులలో దాచుకొని మోయుచుందురు వారొకయూరనొక గృహస్థునియింటి కతిథులై యేగి యరుగుపైఁ గూర్చుండ గృహమేధి యింటనున్న వారికి లెక్కప్రకారము విస్తళ్ళు (భోజనపాత్రలు) కుట్టి యు బైరాగుల కేడు విస్తళ్లు కుట్టఁగా వారు యజమానునిఁజూచి "అయ్యా! మే మేడుగురము కాము పదునలుగురము మేము గృహస్థధర్మమునందున్న వారము. మాభార్యలు మాతోనున్నవా" రని కమండలువులలోని భార్యలను బయటవెడలించి చూపిరి. ఆవాస్తవ్యుఁడదిగని యాశ్చర్యపడి పదునాలుగు విస్తళ్ళను కుట్టెను ఆభార్యలేడుగురా భవనభర్తంగని నమస్కరించి "అయ్యా! మే మేడుగురమె కాము మఱియేడుగురు మాతోనున్నవారు. వారు మామనఃప్రియులు. మేము కులటాధర్మ మందున్నవారము. కులటయనగా తన వివాహితభర్తకు శుశ్రూషసే యుచు నాతని కేలోపములేకుండ నాతని సంరక్షణసేయుచు దదాజ్ఞాబ ద్ధయై లేశమైన నాతనియందు నాదరభావము లేక కర్మవశంబుననైన జా తిభేదమున నొండొరుల స్త్రీపురుషజాతులు భిన్నములైనందున వానివ లన నింద్రియసౌఖ్యము వడయలేక దానికొఱకొక సజాతీయుడగు పురు షు నేర్పఱచుకొని వానితో నొక్కరాత్రిపూటమాత్రము భర్తృశు శ్రూషపూర్తియై భర్తృపదసేవ నొనరించి యందువలన నాతండు నిద్రింపగనే మేము మేలుకొని మఱల వానిని దాచుకొనుస్త్రీ. మే మట్టికులటలమె. మీపురుషులు మాకొప్పులలో నున్నవారు చూడుమని కొప్పువిప్పిచూపిరి. అందు నేడ్గురుపురుషులుండుట జూచి యాశ్చర్యపడి "మహామాయా మహాసత్వా మహాశక్తిర్మహామతి" యనునటుల మహా శక్తిస్వరూపము స్త్రీయని చెప్పినవాడు వెఱ్ఱివాడా? "కృతేతు రేణు కాశక్తిః । త్రేతాయాంశక్తిర్జానకీ । ద్వాపరే ద్రౌపదీశక్తిః కకా

శక్తి గృహేగృహే" యనుటయును వాస్తవము. ఆమహాశక్తు లెట్లుతము కొప్పులలో అంకుమగల దాచికోయట్లనే నీవును నీయంకుమగని కొప్పులో దాచితివా" యని కొప్పునట్టియూడ్చి అచ్చుకులాగి యీమహాశక్తినిజూచితిరా యేనూరు జైనులకు జేసిన ప్రయత్నమంతయు నొక్క అంకుమగనికిబెట్టి వానిని దాచుకొన్నది ఇట్టిశక్తికట్టి భోక్తాంశగల పురుషుడెగావలె గాని నేనేపాటివాడను. మాఁడుదు నేడు దీనియాపుమాపెద" యని కాలఁజేతఁదన్నుచు, నేలనీడ్చుచు, చెట్లురాయుచు నరుగుపైనుండి నేలఁబడవైచుచు పొర్లించుచు బొర్లించుచు నోడలరక్తధారలు గారుచుండగా నిష్కరుణముగా బాధించుచుండెను గాని యామహాసాధ్వి తృణమాత్రమైనను భయము లేక క్లేశమునొందక తొల్లిప్రహ్లాదుఁడు తండ్రిసేయు ఘోరణప్రయత్నముల నన్నిటిని సైచినట్లు తనమగడు సేయుశిక్షలుసైచి "పార్వతీశా! శంభో! శంకర, దీనదయాపర, భక్తపరిపాలకా నీవాపిని కాపాడు భారము నీయది" యని ధ్యానించుచుండెను అప్పుడు సాక్షాత్కారింపగు భవానీభర్త తొల్లిపట్టన్వచేత సంగబెముక్తతిని రావజట్టికి తట్టుపట్టుకొనిపోవు మన్ను మోసిన వందమున నందమగునొక బుడుతవడుగు వేసముదాల్చి యానమ్మగ్దములో నాయవ్వాకడ్డుసాచ్చి యామెపై భర్త చేయుగ్రుద్దులు దెబ్బలుమున్నగునవి యామెకు దగులకుండునటుల సేయుచు నడచుచుండ జైనులువానినిగని "యోరి వడుగా! కడకుఁబోరా' యని యతనిపై దెబ్బలు వేయజొచ్చిరి ఆదెబ్బలువానికిఁ దగులక రాజభటులకు దగులుచు వారలచ గోలచగజేయుచుండుటయు నానైజకవ్వాకొకటియుఁ దగులకుండుటయు జైనులలోనొక బుద్ధిమంతుడు గనిపెట్టి యామెకు నీవ్రెనరింపు శిక్షలన్నియు బూడిదెవేల్పున నేయిచందము య్యో ఈమెదైవభక్తియుక్తురాలు. నీవ్రెల్లనియెడల నీమె నొలఁగఁబోమ్మనుము గాని వృధాయాసము గలుగఁజేయకుమని యామెభర్తకు బోధించి వానిచెలిపిడికిఁచి "అయ్యన్నా!

నీమగడు నినొల్ల డాండేనిబో" మ్మని విడిపించెను. అంత నాకాంతాతు గి నిశానమయుంబున నెందుబోదునని దారింబోవుచు నటనొక జైనా లయం బొకటి గనఁబడినది. శివాలయుంబని భావించి యామ్రబవేశించి యందున్న జినప్రతిమ నొకదానిని లింగాకారమనుకొని యాలింగము ను కౌగలింపగా నదినిజముగ లింగమూర్తియును జైనాలయము శివా లయమునైనవి. ఇట్లు వైజకవ్వభర్త శివమత విరుద్ధమార్గప్రచారియై తన్నువిడనాడినను దాను శివమతస్థురాలై తొల్లి మునులభార్యలలో నాలాయునియు ననసూయుయు భర్తలచేవిముపంబడి శంకరుభక్తురాండ్ర సద్గతినొందిలటుల నీమె యునట్లు సద్గతినొందెను. మఱియొక్క విశేషము.

తిలకవ్వ కథ

తొల్లి తిలకవ్వయను నొకవనిత శివభక్తురాలైయుంట నామె మగడుకని తానవలంబించిన జైనమతము నేలయవలంబింపగూడదని తలవిరుద్ధమార్గస్థురాలగు నామెనువధింప నుంకింప భయముననామె పాఱిపోయి యొక దేవాలయముసాచ్చి యందున్న లింగాకారము వెనుక డాఁగెను. వాఁడును తోడఁ వెనుసని యామెనులాగి చంపువాఁడై కేశ ములను బట్టిలాగగా మగవాఁడైపోయెను. శివభక్తిప్రభావము చూ చితివా ? అట్లనే భక్తిప్రాబల్యముచేత వైజకవ్వ శివుని దనవశముచే నుకొన్నదని జనులాడఁగ నేడుప్రత్యక్షముగ జూఁచితిమి. ఆవైజకవ్వ నిర్మ లభక్తికి మెచ్చి ప్రత్యక్షమైన యీశ్వరుఁడు వైజనాథుడనుపేరుతో నేటి కిని బరివనిగపురమున వెలసియున్నవాఁడని జనులు బహుముఖంబులనా డుకొనుట నీవు వినలేదురాజైనుఁడా ? పూర్వుల చరిత్రములిట్లున్నవి. వారిదాక యేల ? ఇప్పుడు మాయాటోపమడచుటకు మేమేచాలుదుము. మహారాయుమియ్యనేకులవాదములకు బిలువబంచి గెలుచుట చూచు చున్నావుకావా ? ఇట్లనిపలుకుచున్న యేకాంతరామయ్యకు జైనుడిట్ల నియె——“శిలామతమె యాదిమతమని నిదర్శనములతో స్థిరపఱుపగల

చేసి యట్లుసేయుము. కాదేని మానముద్గ్రహించి యూరకుండుము,"
అనుటయు రామయ్యవానితో "ఓరీ, జైనాధమా ! నీకేమి నిదర్శనము
కావలెను. పన చూపెదను మీజినేశ్వరుని ప్రతిమ శతఖండములై
కూలిపోవు నింతకన్న మఱేమికావలెను ?" అనివానిని మఱికొందఱు
జైనులను తోడ్కొనిపోయి యాప్రతిమదిక్కు తీవ్రదృష్టితో జూచున
రికి నదినూఱువ్రయ్యలై యొఱగిపడెను. ఇటులనె జైనుల పదునేను వి
గ్రహములను రూపుమాపి వానిని గొనువజైనులనుద్దేశించి "యోరీ !
చూడు మిదిగో నిప్పుడే నాశిరంబీశ్వరునకు సమర్పించి యేడుదినము
లట్లనెయుండి మరల నాశిరంబు నేను బొందెద నట్లుసేయకుంటి నేని
మొదటిదమకంటుకు శిష్యుడను గాను ఈశ్వరభక్తుడనుగాను. ఈయూర
నున్న మీజైనులనెల్ల శూలదోలి నామదినిశ్చయించితి" నని బిగ్గఱగా
జెప్పునంతలో జైనులందుకొప్పుకొని యొకవంక నిలిచిరి. బసవేశ్వరులవా
రును వానిభక్తిదార్ఢ్యమున కచ్చెరువంది వానికడనె నిల్చియుండెను.
బిజ్జలరాజును చూచుకుతూహలముతో వచ్చి చూచుచుండెను. పురజ
నులెల్లఱును గూడ నేలయీనినట్లు వచ్చియుండిరి. అప్పుడు రామయ్య
యొకవాడియైన కత్తిని గుడిచేతఁబట్టి యెడమచేతఁ దనకేశపాశముబ
ట్టుకొని పెద్దయెలుంగుతో "ఇదిగో నాశిరం బర్పించుచున్నవాఁడనని"
యందఱకు నివఁజెప్పి కుడిచేతిఖడ్గముతో నొక్కవేటున దనశిరంబు
దేహమునుంచి బాపి యెడమచేతబట్టుకొనెను. అప్పుడు మొండెమట్లనె
నిలిచి మందహాసముచేయుచుండెను. బసవేశ్వరుల వారేకాంతరామ
య్య యంతభక్తుడు మఱిలేడని పొగడెను. పురజనులందఱు కెవ్వునఁ
గేకవేసి "భళిర ! యేకాంతరామ నీభక్తికి నీవేసాటి" అని చప్పట్లు
వాయించుచు తాళములుగొని యవివాయించుచు గీతములంబాడుచు
నాట్యమాడఁదొడఁగిరి ఏకాంత రామయ్య మొండెము కుడిచేతఖడ్గము
ను దాచేత శిరంబును బట్టుకొని మందహాసముసేయుచు నడుగుతప్ప

కలయుకుననుగుణ్యముగా నడుగులు వేయుచు సింహనాదము సేయుచు
నాట్యమాడుచుండఁగని యుండఱు నమందానందాశ్చర్యరస నిర్మగ్నులైరి.
ఇట్లు దినములవఱకు నా యేకాంతరాముని మొండెము స్థితిలోనె
యూరెల్లఁ దిరిగి యేడవనాఁ డుదయమున శివాలయమునకరిగి తోడ
నేగిన యనేకజైనులను ఎలచేతనున్న కత్తితో సైగచేసి సరిగానిలుచుం
డని చెప్పినటుల వారికి ద్యోతకమగునటుల నొనర్చి వారట్లు నిలుచుండఁ
దా చేతనున్న శిరమును మీఁదికెత్తఁగా నా శిరము జైనులను బిగ్గఱగా
"ఓ జైనులారా! చూచితిరా నాప్రభావము. నేనన్న యేడుదినంబులు
గడిచినవి. మఱల నా మొండెమునకు నేనదుకుకొని మీకు బహుగా
ముచ్చటించెదను చూడు"మని వారలు చూచుచుండ కబంధమునకు శిరం
బు తగిలించిన నది కొంచెము మొఱగియున్నను తొందరచె నట్లనె యంటుకొ
నిపోయెను. పిమ్మట నేకాంతరామయ్య మరల మందహాసము చేయుచు
"ఓ జైనాధములారా! చూచితిరా, నాశిరంబును మఱల నేఁ బడసితిని
ఇది కొంచెము మొఱగియున్నది. అది నా బుద్ధితక్కువవలన నట్లు కాలేదు.
పాపాత్ములగు మీముఖములు చూచుటకు నాకిష్టము లేదని లోకులకెల్ల
ను వెల్లడిసేయుటకొఱకె నేనట్లు జేసితిని. ఇఁకనైన సిగ్గుపడి జయపత్రి
కయిచ్చి లేచిపొండు" అని యందఱు మందలించి యాలయంబులోనికరి
గెను. జైనులు సిగ్గుమొగంబులతో జయపత్రిక రాజుచేతఁ బెట్టి తాము
ను శివభక్తులయి యాపట్టణములోనే యుండుమని మొఱ్ఱపెట్టగా నే
కాంతరామయ్య యనుమతిని రాజు, వారలఁ దనకళ్యాణపురమున నిలి
పెను. కోలలుకొసిన పామువలె నోడినవారెచటనున్న నేమని రామయ్య
వారల నుండుడనెను. బసవేశ్వరులవారేకాంతరామయ్యను రెండవ
యీశ్వరునిగా భావించి సేవించి యాతనివలనఁ దత్త్వోపదేశమును బొంది
యాతని సేవించుచు దనయొద్దనే యుంచుకొనెను. రాజును పరమాశ్చ
ర్యభరితుండై యేకాంతరామయ్యను బసవేశ్వరుల కప్పగించి "బసవ

మంత్రీ! యీరామయ్యసేవ నాకుమాఱుగా నీవే సర్వదాచేయుచుండుము ఈతఁడెమనకు ప్రత్యక్షదైవము పరశివుండు. మనసంగబసవేశ్వరుఁడు" అని చెప్పి యంతిపురంబున కరిగెను. జైనులు రామయ్యకు బాదాక్రాంతులై శివభక్తులై యాతనినే శివునిగా భావించుచు సాప్రాలునని నివసించియుండిరి. ఈయేకాంతరామయ్య చరిత్రము విన్నను కోరికతో వ్రాసినను పెరభక్తులకుజెప్పినను మారీభయాపమారక రోగభయమును చోరభయమును క్రూరమృగభయమును దుష్టవిషసర్పభయంబును శత్రుభయమును నానావిధమగు ననారోగ్యభయము నపమృత్యుభయమును తొలంగిపోవుటయెగాక యట్టివారలాయురారోగ్యైశ్వర్య పుత్రపౌత్రప్రపౌత్ర సంతతితోఁ దముయిచ్చవచ్చినంతకాల మిచట సుఖవృత్తినుండి పిమ్మట స్వచ్ఛందవృత్తిని దివ్యవిమానముపైనిఁ దమ పూర్వాపదవంశస్థుల నూటయొక్కతరములవారిని వారివారి సకలపరివార సమేతముగాఁ గైలాసమునకుఁ గొంపోయి యచట శాశ్వతపదవి ననుభవించుచుందురు

(పోద్దలదేవు బాచయ్యకథ.)

మఱియు నీ ధరామండలమున బిజ్జలరాజునొద్దనే పోద్దలదేవు బాచనార్యుఁడను మంత్రిపుంగవుఁ డొకండుగలఁడు అతని సుగుణాతిశయములు నతిశయోక్తిలేక వర్ణించు టిమన్న నొక గ్రంథసంపుటము సాలదు అతిశాంతచిత్తుఁడు, ఇంద్రియనిగ్రహుఁడు, అరిషడ్వర్గమును జయించినవాఁడు, వేదవేదాంగపారంగతుఁడు, బుద్ధియందు బృహస్పతియు, భాషయందాదిశేషుండును, తపశ్శక్తియందు విశ్వామిత్రుండును భోగమం దింద్రుఁడును, దానమందు బలిచక్రవర్తియు, బ్రహ్మజ్ఞానమందు సనకసనందనాదులును, వేదములందు బ్రహ్మయు, పురాణములయందు వ్యాసమునీంద్రుఁడు, తర్కమందు గౌతముండును, వ్యాకరణమందు పాణినియు, జ్యోతిషమందు సిద్ధాంతవేత్తృకర్తృత్వముల

కధిష్ఠాతలగు నృసింహ సూర్యచంద్రాదులును, వైద్యశాస్త్రమందు ధన్వంతరియు, రతిశాస్త్రములయందు వాత్స్యాయన కొక్కోక జయదేవులును ఛందోనీతిశాస్త్రమందు కవియు, సర్వజ్ఞత్వమందు నందికేశ్వరుఁడు, ఏకలింగనిష్ఠయందు భృంగియు, రౌద్రంబున వీరభద్రుండును, సాత్వికంబున గణపతియు, రజోగుణంబునఁ గుమారస్వామియు, కీర్తియందు పృథుదధీచ్యాదులును తనకీడుగారనఁ బ్రసిద్ధికెక్కినవాఁడునై యేకశివాచారతత్పరుఁడై, వీరశైవప్రధానుఁడై పరమతావలంబక మత్తేభ మదకంఠీరవుండునై కల్యాణపురమునందె బిజ్జలదేవుప్రధానమంత్రియై యుండి ప్రతిదినమునను, సౌరాష్ట్రనగరమునకుఁ బోయి రాత్రిశివరాత్రిగా బాలించుచుండును పామరులకు యేఁడాదికొక రాత్రి శివరాత్రిగాని, శివభక్తులకుఁ బ్రతిరాత్రియు శివరాత్రియే. ఇట్లుండ నొకనాఁడు నిజమైన శివరాత్రియగు టెంచిన బాచయమంత్రి రాజనుమతిచెఁ బోవలెనని యెంచి ప్రభుసముఖమునకుఁబోయి, సౌరాష్ట్రనగరంబున కేగి శివరాత్రిఁ బాలించుకొని వచ్చెదనని యనుజ్ఞనడిగెను. రాజు మంత్రింగని నేఁడు నీవు పోవుట కెంతమాత్రము వీలుపడదు. పనిచాలగలదు, ధనధాన్యభాండాగారమున జమాఖర్చుచూచుకొని మనపురమున శివరాత్రిపనులు చూమూళ్ళు జరిపింపవలసియున్నది అదియంతయు నీతలన పెట్టినవాఁడను. నీవుపోయిన నాపనిజరుగదు. ఒక్కొక్కతడవ నొక్కపనిగాని రెండుపనులొక సమయమున సమకూడునా? ఒకటి రాజసేవ కాకున్న దైవసేవ కావలెనుగాని "అవ్వ బువ్వ" యనునటుల రెండును కావలెనన్న నెట్లుసమకూడును? బాలెంతరాలికి లంజెతనమెట్లు సేయనగును? బాలెంతితనము దీరిన వెనుకఁ గదా ఆలలంజెతనములోనికి దిగవలెను. అట్లైన నీరాజసేవపూర్తిగా నెఱవేర్చి శైవసేవకుఁబొమ్ము కాదేని మాయొద్దకొలువు చాలించుకొని పోవలెనన్నఁ బోవచ్చును. నీస్థాన

మూన తుత్రియొకనిని నియమించుకొని పనిజరుపుకొందును. ఇంత మేల! ఆసౌరాష్ట్ర శివుఁడె చటికివచ్చె నేని నీవ్రుక్కురుండవు కాదు మనమందఱము మహావైభవముతో నిటనే సేవింతము" ఇట్లని యూఁతిమ్చు నృపవాక్యములువిని బాచరాజు తనమనంబున నొక్కింత విచారము కలిగించుకొని యీరాజాపకలబుద్ధి విన్నవాఁడు నామతవిరోధు లెవ్వరో యీతనికి బోధించిరి లేనియెడల నిట్లాడునా? ఇతనిమాట పెడచెవిఁబెట్టి నాకు, బోవఁదగదు. అట్లు సేసితినేని మూర్ఖుఁడ ననిపించు కొందును. గనుక రాజు సెలవిచ్చినట్లు సౌరాష్ట్రవిభుఁడు నేఁడిచ్చటికే వచ్చి నాచేత కొలిపించుకొనును కాదేని నన్నుఁ దన సదనమునకుఁ గొనిపోవునుగాని నానియమము చెఱచునా?" అని ధ్యాననిశ్చయముతోఁ బోక నిలిచెను ఇట్లు నిలిచి ధనధాన్యముల జమాఖర్చు వ్రాసుకొనుచు ధనము లెక్కపెట్టుచు ధాన్యము శివాలయంబులకు వంటవారికి వారి వారి మామూళ్ళప్రకారము కొలిచి పళ్ళుకొలఁది ఇచ్చుచున్న బాబామాత్యునొద్దకు నొకభూపచిత నొక నందికేతనముగల చేటుబట్టివచ్చి యాలేఖ నతనిచేతికిచ్చె "నేను సౌరాష్ట్రసోమనాథుని పరిచారికుఁడను. నేఁడు శివరాత్రి. స్వామివారిటకు వేంచేతురు నాయంసంధ్యాసమయమున నిట నామూలగాదె బుట్టక్రింద సోమనాథలింగమూర్తి యావిర్భవకుగును. గనుక నాగాదె నొకమూలకుఁద్రోయించి కనిపెట్టిచూచుచుండుఁడు. మీకు చూచుచుండఁగానే తటాలున నొక్కమారు లింగాకారము గుబుక్కునఁ బైకిలేచి నదోభిషేకోచితముగా సోమసూత్రసహితముగా నమరియుండును తప్పక నేఁటిసాయంకాలము సోమనాథుఁడిచటికరుదెంచును. కాచియుండుఁడో కల్యాణపురజనులారా!" యని మేఘగంభీరస్వరంబునఁ బురజనులకెల్ల వినఁబడులాగున నొకసింహనాదంబు సేసి యందఱు చూచుచుండఁగానె యదృశ్యుఁడయ్యె. పురజనులందఱదిగని "యోబాబామాత్యా! యీవచ్చినవాఁడు కేవలపు

నుష్యమాత్రుఁడుగాఁడు. పరిచారికవేషమునఁ బురహారుండగు సోమ నాథుఁడే యిటకేతెంచి తన భవిష్యదాగమన ప్రకారంబు మనకు వెలి బుచ్చి వెళ్ళిపోయినవాఁడు. ఏలయట్లు నిశ్చేష్టితుఁడవై యోచించెదవు? తప్పక స్వామివిచ్చేయును. భక్తవత్సలుఁడగు భగవంతుఁడు భక్తుల యిండ్లకుఁ బోవుట యొక గొప్పపనిగాదు. మును గుండయ్య భక్తికిమె చ్చి వానియున్న సదనమునకుఁ దాఁబోయినవాఁడుగాఁడే యీశ్వరుఁడు? నీభక్తికిమాత్ర మేమిలోటు? అంతకన్న వేయిమడుంగులెక్కుడని చెప్ప వచ్చును. ఏలయన స్వామి యితరభక్తులయిండ్లకుఁ బ్రచ్ఛన్నవేషమునఁ బోయి వారికిఁ దననిజరూపు చూపక సేవచేయించుకొని పిమ్మట సా క్షాత్కారములఁ జూపెను. నీవిషయములోనో, ఇపుడో వచ్చుచున్నా ను. నానిజముగులింగాకారమున నాక్షాత్కరించెదను. కాచియుండు మని ముందుచెప్పి పిమ్మట వచ్చుచున్నవాఁడు. గనుక నీపుణ్యము వంటిపుణ్యము మఱియెవ్వరును జేసియుండలేరు. లౌకికవ్యాపారము వేగఁ దుదముట్టించి స్వామిపూజకు వలయు పదార్థముల నాయత్తప ఱిచి గాదె బుట్టఁదొలఁగించి స్థలశుద్ధిసేసి నీవును నీమిత్రులును నాఁటి మంత్రులును రాజును కాఁచియుండుఁ''డని వేవిధంబుల నాతనిఁగొని యాడుచుండ లెక్కడమాఖర్చు వేగము పూర్తిచేసి రాజునొద్ద సెలవు తీసికొని పురములో శృంగారింపఁబడి జనంబుల కాజ్ఞాపించి బిల్వపత్రి పుష్పఫలాదులను గొనితేరఁ దగువారల నియమించి గాదెచుట్టు దీసి న స్థలమునలికించి ముగ్గులువేయించి పంచవర్ణచూర్ణమున రంగ వల్లిగావించి స్నానకృత్యంబునకుఁ దాఁ జనునంతలో సూర్యాస్తమ యమై యపరగోళపరిపాలనార్థమై రవి యేగెను అప్పుడు బాచయ మంత్రియు నితరమంత్రులును, బసవేశ్వరులవారును రాజును పుర జనులును (స్వామి యెప్పుడువచ్చును. ఎప్పుడు మేమంచవలము నేక ముఖంబుగా శృంగారాసీత శుద్ధజలంబుల లింగోద్భవకాలము పర్యంత

మభిషేక మొనర్చి హాలాహలభక్షణ మాత్రమునఁ గలిగిన తీవ్రతాపో శమనంబు గావింతు"మనుచు నొకరినిమించి యొకరుఁ సూచుచుం డఁగా నాకసంబున దేవదుందుభు ల్మ్రోఁగుచుండఁగా వానిధ్వనులు "అదిగోవచ్చె నిదిగోవచ్చె" నను ధ్వనులు వినఁబడులాగున వారి మనంబులకుఁ దోచుచుండ నొక్కలిప్తమాత్రమున నందఱు సూచు చుండఁగానె తనకై యలంకరింపఁబడిన గాదె బుట్టక్రింద భూభాగ మున భూమిబ్రద్దలు సేసికొని యేకశిలాస్వరూప సోమనాథలింగమూ ర్తి లింగాకారముపైకిఁ దోఁచి కనిపించెఁ జూచినవారెల్ల రాశ్చర్య రసనిమగ్నులై చేతులుసాచి మ్రొక్కుచుండ ముందుగారాజు సమీ పించి లింగమూర్తికి సాష్టాంగదండ ప్రణామంబొనరించి నిలుచుండ బురజను లొక్కరొకరే యేగి మ్రొక్కుచుండ నాయాశ్చర్యకృత్యము నకు బసవామాత్యుం డమందానందమునొంది బాచామాత్యు ననేక విధంబులఁ గొనియాడెను అప్పుడందఱు నేకముఖంబునఁ "యెల్లిసిద్ధ రామయ యను భక్తుఁడు శ్రీశైలమున కేగి శ్రీమల్లికార్జునస్వామి వారి ననేకవిధంబులఁ బ్రార్థించి తనయున్నచోటునకుఁ గొంపోవఁ గలిగెను గాని యిట్లురమ్మని తాను పిలువకుండనే యిదిగోవచ్చెద నని ముందు కింకరకృత్యంబుగా వార్తనంపి పిమ్మట గాదెబుట్టయున్నచోట నావిర్భవించునట్లుగా నిట్లు తనయున్నచోటికి నీశ్వరు రప్పించుకొనిన మా బాచామాత్యునివంటి భక్తపుంగవులు మరెందుగలరు ? అని బాచరాజును కీర్తించిరి. అంత రాజా సోమనాథునకు గొప్ప యాల యము మణిస్తంభరత్నగోపుర కుడ్యమంటపసింహాసన ద్వారాదులతో గడురమ్యముగాఁ గట్టించి నిత్యభోగపూజాభిషేక ధూపదీప నైవేద్య ములకుఁ దగువసతి నేర్పఱచి యనేకులఁ బూజారుల నియమించి తాను ప్రతిదినముఁ దద్విధం బరయుచుండెను,

ఇట్లు పరమతసాగర కుంభసంభవుండగు బాచామాత్యుని లోకు లెల్లరుఁ గీర్తించుచుండ రాజు శివకేశవులయందు దనకుఁగల సమత్వంబు లోకులకుఁ దేటపడునట్లుగా నాబాచయమంత్రి వీరశైవత్వము నట్టె యెఱుంగఁబడునట్లుగాను తక్షణమె యొకవిష్ణ్వాలయముఁ బ్రతాపనారాయణపురమునఁ గట్టించి యందు బ్రతాపగోవిందుఁడను పేర నొకవిష్ణువిగ్రహంబు చెక్కించి మంచిముహూర్తమునఁ బ్రతిష్ఠగావించినమొల్లరు సేవించుచుండ దానచ్చటఁ గొలువుదీర్చియుండి నలుగడలంగల యధికులకించి వచ్చియున్న యందఱి తనపురజనులతో నిట్లని ప్రసంగించె "అందఱు వచ్చియుండ మనబాచరాజచ్చటికి రాలేదు. కతంబేమియై యుండు? తాను వీరశైవుఁడనియా? యీగుడి మేము నిర్మించి ప్రతిష్ఠించినట్లు తానెఱుఁగఁడా? ఎఱిఁగినేని విష్ణుమతస్థుఁడు కాకపోవుటచేఁ దనశైవమునకు హానివచ్చుననియా? లేక మాకొలువు చాలించుకొనెనా?" యని యనేకవిధంబులఁ బలవించి కటకటంబడుచుండ విని బసవేశ్వరులవారు రాజుతో నిట్లనిరి

**బసవేశ్వరులవారు బిజ్జలరాజునకు ఘంటకర్ణాది శివభక్తుల చరితంబు సెప్పుట**

ప్రభువతంసమా! బాచయమంత్రి చరితంబు సంపూర్ణముగా దాఁ దెలియక నిట్లాగ్రహపడుట న్యాయమా. ఆతండు లెక్కకొలువేల చాలించుకొనును? మీరానతిచ్చినపని యెన్నఁడేనిఁ జేయక జవదాటెనా? మీయందనాదరభావము గనఁబఱచెనా? వీరశైవులకు ముఖ్యమగు శివరాత్రిదినమున దానేటేట దినదినము నియమముగాఁ బోవుచుండెడి సౌరాష్ట్రసోమనాథుని దర్శనమునకు మీరువద్దన్న తక్షణము మానివేసి మీయాజ్ఞానుసారముగా నాభగవంతు నెమనపురికి రావించి సర్వదాయాతని దర్శనము మనకెల్లర కబ్బునటులచేసిన మహానుభావుఁడు. అట్టి వీరశైవుఁడై యుండి కరలింగపూజానిష్ఠులగు శివభక్తులలో న

గ్రగణ్యుఁడై తన మతమునకు విరుద్ధముగాఁ బరదైవదర్శనమున కెట్లువచ్చును. అట్టి వీరశైవులు పరదైవ ప్రశంస చెవులవిందురా? ఇట్టియాకారములం గనులఁ గందురా? వీరశైవుల చరిత్రంబు తావకమనోగతం బయ్యెనేని గాక బాచయామాత్యు నిట్లు నిందింపరు. వినలేదా, తొల్లి బాచేశ్వరుఁ డేకశివాచారపరాయణుండు, శివనామోచ్చారణ శివపూజ శివదర్శనము తప్ప తుదకు శివుని యర్ధాంగి యగు దక్షసుతను సైతము లక్ష్యము సేయనివాఁడు శివుని వామాంగమునఁ బార్వతి యుండుటచే నాభాగము తనకుఁ బూజార్హము గాదని స్త్రీరూపమగు నావామభాగము మాని పురుషరూపమగు దక్షిణభాగ లింగమూర్తినే తన కరమున నిడుకొని పూజించుచు శివదర్శనమున కాలయమున కేగునపుడు వామభాగ సమీక్షణంబు మాని దక్షిణభాగమునకె పోయి యాదిక్కు నమస్కరించి దర్శించి వచ్చుచుండెను. ఇట్టిది కదా యేకలింగ శివదీక్ష మఱియు ఘంటాకర్ణుఁడను నొకభక్తుఁడు తన రెండుచెవులకు రెండుగంటలు వ్రేలఁగట్టుకొని వాని సర్వదా మ్రోగునటులఁ జేయుచు నితర దైవనామంబులు తత్ప్రశంసలుఁ దనచెవిని బడకుండ నేకశివాచారతత్పరుఁడై శివభక్తి సమగ్రత్వంబున ముక్తిం గొనఁడె? మఱియు నఱువదిముగ్గురు తొంటివీరశైవుల కాచార్యుండై మహేంద్ర మంగళపురమున యరియమాఖ్యాతఁ గీర్తింపఁ బడు నొక వీరశైవుని చరిత్రము బహుచోద్యము. దానిఁ జెప్పెద వినుము.

ఆతండు శివనామముఁ దప్ప నితరదైవనామము దనముందటఁ నేరును నక్కాణింపఁగూడదు. అట్లుచ్చరించిన వాని తలఁదునిమెదనని యొకయుగ్రవ్రతము బట్టియుండెను. అట్టివాని యింటికొకనాఁడొక బ్రాహ్మణభిక్షుఁడు భైక్షార్థంబు శివనామోచ్చారణంబు సేయుచు నరిగిన నాయింటిగృహస్థు గని తానుస్వయముగా భిక్షఁగొనివచ్చి యత

ని జోలిలో వైచుచుండఁ గొంతయన్నము నేలపడియెను. అదిచూచి యాభిక్షుఁడన్యదైవ నామోచ్చారణంబు సేయ నరియ ముందుగుర్రై కోప మాపుకొనలేక యట తనచేతనున్న యొకభీకరదర్వీ కరమునఁ (తెడ్డుతో) గడుపుమీఁద గ్రుచ్చికొట్టె. ఆదెబ్బతోడనే యాభిక్షుక బ్రాహ్మణుడు తక్షణము మృతినొందెను అపుడు పురినున్న బ్రాహ్మణులందఱు గుమిగూడి "యేమి వీనియాగడము "బ్రాహ్మణోనహంతవ్య' యనిశత్రులు చాటుచుండగా వీఁడిట్టి దుర్నయంబుచేసి పాతకమున కొడిగట్టెను. వీని రాజునకొప్పింతము. బ్రహ్మహంతకు రాజదండన మవశ్యకర్తవ్య మని రాజునొద్దకుఁ బోయివిన్నవించిరి రాజాతనిఁ బిలిపించి "యేల యిట్టిపని సేసితి' వని యడుగ నాతండు "నేఁజేసినది బ్రాహ్మహత్యయె నైనను నేనెందు కట్లుచేసితినో యాశివునికే తెలియునుగాని మీకుఁ దెలియ'దనెను అందుపై రాజుకోపించి "యా చచ్చిన బ్రాహ్మణునితోఁగాబు వీనినిఁజంపుఁడు పొం'డనెను. అంత నాతనిఁ జంపుట కాయుధహస్తులై రాజకింకరులు రాఁగని యావీరశైవుడు "నన్నుఁజంపుటకు మచుపుటకు నా యీశ్వరుడు కర్తగాని మీరట్లుసేయఁ గలుగుదురే' నే మీచేతఁ జచ్చువాఁడనే?" యని వీధి వెంబడిఁ బఱతెంచు నెడ నొకశివాలయము గన్పడిన నందుఁజొచ్చి "స్వామీ! శివ' శంకరా' హరా' భవా' "అన్యథా శరణం నాస్తి త్వమేవశరణం మమ'యని దేవా' నీవీరశైవమతస్థుఁడనగు నేను నా చేసిన శపథమునకు వెలితిరాకుండ బ్రాహ్మణుఁడైనను శంకలేక నేఁజంపి నావ్రతపరిపాలనంబు సేసికొంటిని అట్టిపాపిష్ఠిబ్రాహ్మణునితోఁ బాటు నన్నును వీరుసంపఁ జనుచున్నారు. నేనే తెంచి నీశరణంబు సొచ్చితి" నని "పాహిమృత్యుంజయా' పాహిమృత్యుంజయా! పాహిమాం పాహిమాం పాహిమృత్యుంజయా'' యని మొఱవెట్టి నిలుచుండ, "పరమతావలంబకుఁడగు భవితో సమానముగా వీరశైవ

మతావలంబకుఁడవగు నీవు పావనస్థుండవుగావు. నాయురమ్మునఁ బాఱు' మని తక్షణంబు విప్పెను ఆబ్రాహ్మణుఁడందుఁ జనఁదొడఁగ నరుదెంచి భటునుబోవంబోవ నొకయెడ సరియచూఖ్యఁ డదృశ్యుండై యాతని యుత్తరీయము మాత్రము మారెకు చెంగు పన్నగభూషణుని భూషణములపైఁ గప్పపడి యగుపడెను. దానింజూచి భయపడి రాజకింకరులు మఱలిపోయి రాజున కాసంగతి విన్నవించిరి మాపీరశైవుల కదియె నిదర్శనము. మఱియువినుము

## వీరశంకరయ్యకథ

వీరశంకరుఁడను నొకభక్తుఁడు స్వప్నమందైనను పరమతదైవ బోధల వినని యొకగట్టివ్రతము బట్టియుండ నొకానొకదినమున రాత్రి కలలో నొకగాద్దుని తానంటుకొనినట్లు కలగని విచారించి యన్యమతచండాలుని స్పృశించిన యీశరీరము కుక్కముట్టిన కుండ వంటిదికాదా! యీకళేబరమేల దీనిఁ గాల్పనాయని పొద్దునలేచి నిశ్చయించుకొని తక్షణము శ్రీశైలమునకుఁబోయి తన యవయవముల దా ఖండించుకొని యినుపకాగులలో నూనెఁ గ్రాగవెట్టి బాగుగా మరిగిన నూనె మొసటిలో దుమికి యుడికె ముద్దయై మహాన్మాయియై పోయెను. మఱియు వినుము

## శివవెంకమంచయ్యకథ

శివవెంకమంచయ్యయను శివభక్తుఁడొకఁడు శ్రీ కాశీపట్టణము లోనివసించియుండి ప్రతిదినము తాను ముప్పొద్దు శివపూజాసమయములందుఁ దనచేతి పదివ్రేళ్ళను ఖండించి శివునికి సమర్పణచేసి మఱల వానినెప్పటియట్ల పొందుచుండును ఇట్టిమహిమగల వీరశైవుఁడై పరవాదుల గెల్చి శివమతప్రతిష్ఠాపనముచేసి శివుఁడెదైవముగాని వెఱదైవములులేరని యొకయేనుఁగుపైని జండావేయించి చాటుచుండఁడివాఁడు ఇతరమతస్థులదిచూచి సహింపలేక యుండఁ నొక విష్ణ్వాలయము

నొద్ద గుంపుగూడి మంచయ్యను వాదమునకు రమ్మని పిలిపించిరి. పిలువఁబడి పోకున్నఁ బరాజయమని తలంచి మంచయ్యపోయి వారలేమే వాదములుచేసిన వానివానిలో వారితో వాదించి గెల్చినవారు సహింపలేక మాకు నీచదువులతోను నీవాదములతోను నిమిత్తములేదు ఏదైననొకనిదర్శనముఁ జూపినయెడల మేమందఱమీ శివభక్తులమయ్యెదమనిరి. అందుకు మంచయ్య "మీకేమినిదర్శనముకావలెను? ఒక్కటిచూపించెదను నమ్ముదురా? అదియేమన మీవిష్ణుదేవుఁడు వచ్చి శివునికి సాష్టాంగనమస్కారము చేయునటులఁ జేసెదను చాలునా" అనెను. అందుకువారందఱుఁ జిన్నఁబోయిన మొగంబులతో నూరకుండిరి. అంత మంచయ్య సాంబసదాశివపరబ్రహ్మమును మరియు ధ్యానించి తద్దాసులను సంస్మరించి శ్రీవిష్ణునుద్దేశించి ఓకృష్ణా సర్వజగదాధారుండగు సర్వజగద్భర్తయునగు సర్వమంగళాభర్తకు నమస్కరించుటకు వేగముగా లేచిరమ్మా" యని యొకకేకవేయునంతలో విష్ణుగుడిలోనుంచి శ్రీబిందుమాధవస్వామి యందఱుఁగనుచుండ తనప్రత్యక్షవిష్ణురూపముతో వక్షస్థలస్థిత లక్ష్మితోడను సమస్తాభరణములతోడను వచ్చి ముందుగా మంచయారాధ్యులకు దండముపెట్టి పిమ్మట శివాలయమునకుబోయి విశ్వేశ్వరునకు సాష్టాంగనమస్కారంబు గావించెను. అందఱు బరమాశ్చర్యము నొందిరి. ఇట్లు సాక్షాద్విష్ణువు శివభక్తులయందు దనకుగల గౌరవము గనపర్చి "శివభక్తః ప్రభుర్మమ" అనెడు లోకోక్తిని స్థిరపఱిచెను. ఇదియొక యాశ్చర్యముగాదు. "దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనంతు దైవతం తన్మంత్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణోమమదేవతా" అని బ్రాహ్మణవిషయములో నిజము తాన చెప్పెను. అట్లనె శివభక్తప్రశంసలో "పశవ స్సర్వలోకాశ్చ పశూనాంపతిరీశ్వరః। పశిప్రాభక్తవశగస్సన్నాథక్తాః ప్రభుర్మమః శివభక్తః ప్రభుర్మమ, తస్యభక్తః ప్రభుర్మమ అనిపాఠాంతరము)

అని భక్తులయొక్క యుత్కృష్టత నంగీకరించెను. మఱియు లక్ష్మి యొకనాఁడు శ్రీమహావిష్ణుని "స్వామి! అంతర్బహిర్వ్యాప్తి గలిగి సమస్తజగంబులకు నీవేకర్తవు భర్తవునై యుండఁగా నిన్నే సకలదేవమానవులు ధ్యానింపవలెను. నీకన్న వేఱుదైవము లేదుగదా! నీవెవ్వరిఁ గూర్చి సమాధినిష్ఠలో నుండి జపము సేయుచుందువు? అని యడుగ యడుగ స్వామి లక్ష్మికి యిట్లనియె "దేవీ! నాయిష్టదైవమెవరో చెప్పుమంటివా? అయి తెవినుము "మహాదేవం మహేశానం మహేశ్వర ముమాపతిం। మహాసేనపతింవందే మహాభైరవనాశనం" అని సర్వదా నేనాపరమాత్మునిఁ డగు శివుని ధ్యానించుచుందును ఆశివుని మహాత్మ్య స్వభావ్యాప్తిగాఁ జెప్పుటకు వేనోళ్ళు చాలవు ఇంతయేల, పదునెనిమిది పురాణములలోఁ బదిపురాణములు కేవలము శివమాహాత్మ్యమునే దెల్పుచుండును వాయుపురాణము పద్మపురాణము అగ్నిపురాణము మొదలగునవి యాయాదేవతలును గూర్చి వారే సర్వోత్కృష్టదైవములని బోధించుచు నాయామతోద్ధారకులకు నాధారము లైనవి ఇన్నిపురాణములలో నాప్రశంస గలవి రెండు మూఁడుండు నుగాని యెక్కువలేవు ఇంతకు నేను కర్మకులోనై యున్నవాఁడను. అవతారాది భేదములచే జననమరణములకు లోనైయున్నవాడను. అయితే నాతపోబలము చేతనే నెప్పుడెప్పు డెందునిమిత్తమే యే యవతారముల నొందితినో నాకుఁ దెలియును మర్త్యులది యెఱుఁగరు గనుకనే నేను మానవులకు దేవుఁడనైతిని. జననమరణములులేక యాద్యంతశూన్యుఁడై సర్వదా యేక శివస్వరూపమున వెలుఁగు చున్నవాఁడు గావున నీశ్వరుఁడు దేవులకు దేవుఁడుగనుక పరమేశ్వరుఁడ య్యెను. ఇది లక్ష్మీనారాయణ సంవాదము. అట్లువిష్ణువు కాశీవిశ్వనాథుని యాలయములోని కందఱు నూఁచుచుండఁగావచ్చి స్వామికి సాష్టాంగపడి మఱిలేవక యట్లనె యుండిపోయెను ఇప్పటికిని విశ్వేశ్వ

రాలయములో లింగమూర్తియెదుట సాష్టాంగనమస్కారముచేసియట్లె
నె పడియున్న యొకవిష్ణువిగ్రహము కనుపించును. ఎల్లరు చూతురు
గనుక భూమిని శివభక్తుల మహాత్మ్యమును తెలిసి చూడఁగూడదు.
తెలిచినవారికి పాపము సిద్ధించును. భక్తులలిగిన నింద్రాపులయిన చెడు
దురు. వారు కటాక్షించిన బరమసుఖముల గనుదురు

శంకరిదాసయ్య ప్రశంస

శంకరదాసయ్య యనుభక్తుఁడు రెండవశంకరుఁడై శంకరునిమె
ప్పించి మూఁడవకన్నుబడసి యగ్నినిభంబగు తన్నేత్రమున నన్యదైవ
మతావలంబకులను తదారాధన విగ్రహములను జూచుసరికి నవియుఁ
వారు నీఱైపోవుచుండును అదిసహింపలేక బల్లహునిదగ్గఱనున్న జగదే
కమల్లుఁడునాఁబడు నొకమాయావి యెదురుకొనిన వానిం దీవ్రదృష్టితో
గనుడు రాజును, రాష్ట్రజనులును, చూచి యాశ్చర్యపడునట్లుగా నామ
ల్లుని నీలదేహము దహింపఁబడి బూడిదెయయ్యె నేఁటికిని నిదర్శనముగా
నాబూడిదె గనిపించుచుండలేదా ? రాజచూడామణీ ! భక్తులమెడ
నెన్నడు దోషములేదన్న సంగతి నీకును దెలుసును ఇక నిట్టిపెక్కు
మాటలేల ? బాచనమంత్రి యాధిక్యమైన భక్తియింకను గనరాదు.
నీవు వలదన్న బోవుటమాని సౌరాష్ట్రసోమనాథుని మనప్రోలికిఁబిలిపిం
చుచున్నవాఁడుగదా. తమకొట్టులో ధాన్యము మీనౌకర్లకుఁ బళ్ళుపె
ట్టునప్పుడు కొలిచి పోయ్యడమెగాని వారలపేరులు జాబితా వ్రాయఁడు
కవిలెనిండ పంచాక్షరీమంత్రమె వ్రాసినింపును. నీవడిగినప్పుడు తప్పక
పనివారిపేర్లతోఁగూడా జమాఖర్చుచెప్పి సొరనుద ప్పలేకుండునటుల
బేరీజు కనఁబఱచి నిలువ సరిగా. గనిపర్చుచుండలేదా ? ఇది నీవెఱిం
గినదైనను నేఁజెప్పవలసివచ్చినది. ఇఁకమీఁద నాతనిమహాత్మ్యం బింక
ను నీవు నాలిదూరకాలంబునఁ జూడఁగలవాఁడవని యిట్లు బిజ్జలరాజా
నకుబసవేశ్వరులవారు నచ్చఁజెప్పి బాచయనురక్కనివర్తమానముంచెను.

అకబురువిని బాచయ తనమనంబున నిట్లని వితర్కించె—
"బసవన్న నన్నుఁగూర్చి రాజునకె తెచెప్పెనని భూమీశుఁడు పకులమా
టలను నమ్మి నన్ను పదేపదే తలుచుచున్నవాఁడు. అక్కడి వారందఱు
నన్ను వాదమునకు రమ్మని పిలుచుచున్నవారు వాదమునకు నాహ్వా
తు డనై యనాదరణాంబునఁ బోవకుండుట చనదుగానఁ బోయివచ్చెద
గాక" యని వితర్కించి తక్షణముబయలుదేఱి యుచ్చోటికిఁబోయి యచ
టనున్న శివభక్తులకు నమస్కరించి చిన్నఁబోయిన మొగఁబుతో నిలు
చున్న బాచామాత్యునిగని రాజు మిగుల గోపదృష్టితో నాతని కిట్లనె
ను. సకలలోకనాథుఁడగు విష్ణుమూర్తి ప్రతిష్ఠనేగావింప నీతోటి మం
త్రులాదఱు బోయినప్పుడు నీవేలయచ్చోటికి బోలేదు. ఇదియేనా కొలు
వుగొలుచు తెఱగు ?" అనిపలుకు రాజునుసైత మొకమొాస్తరు కోప
దృష్టితో నీక్షించి యందఱు వినుచుండ నిట్లనియె

⊰ బాచయామాత్యుఁడు శివునికన్న వేఱుదైవము లేదని నిరూపించుట ⊱

"పుట్టుచుగిట్టుచు భవనాగరమున నీదుచు కష్టసుఖము లనుభ
వించుచుండు నితర చిల్లరదైవములను కర్తలని భర్తలని లోకంబు
లకు నీవేర్పఱచెదవు. సమస్తలోకములకు కర్త, భర్త, హర్త, యెట్లు
మాచినను నాత్మాత్ము భవానీభర్తయు, మృత్యుహర్తయు సృష్టికర్తృ
కర్తయునగు నాయాదిశివుఁడునక్క దక్కినవారికట్టి యాధిపత్యములు
గలుగనేర్చునే ? కర్తలకు గర్తయు భర్తలకు భర్తయు, హర్తలకు హ
ర్తయు నగు సాంబసదాశివుఁడు గాక కొందువ వారు కర్తలనువారినోట
బురుగులురాలవా ? విష్ణువె "మమకర్తా మహేశ్వరః" అని స్పష్టము
గా నొప్పుకొనుచుండుట వినియు శివునికి విష్ణువల్లభుఁడని నామాంతర
మున్న సంగతి శివసహస్రనామములం గనియు జగత్కర్తృత్వము ము
న్నగునవి విష్ణ్వాదులయం దారోపించుట మూఢతనముగాదా ? సృష్టికర్త

బ్రహ్మ యగునందు మేని తన శిరము శివునిచే ద్రుంపబడినప్పుడు మఱల మొలిపించుకొనఁగూడదా? విష్ణువందమా, తనకొడుకును జావకుండ గా పాడుకొనఁగలిగెనా? జైనబుద్ధులు దైవంబులగుదురా? వారు త్రయీ సిద్ధాంత దూరులు కేవలపశువులు. ప్రతిమార్భకులు. నిజమైన దైవ మాహాత్మ్యమును వారు కనిపెట్టలేకపోయిరి. మదపుటేనుఁగు వెంబ డించినప్పుడు భయంబున బాటియొందైనను జొరనగును. గాని, జైనదే వాలయములో మాత్రము దూరగూడదు. మాయవలన సృష్టియగుచు న్నదని యొకసిద్ధాంతముకలదు అట్లగుట నామాయను దైవమనవచ్చు నా? ఒకవేళ ననుటకు వీలుపడినయెడల దానికె దైవమని పేరుబెట్టఁ గూడదా. మాయ యనుటయేల? బ్రహ్మయు విష్ణుడును దైవంబులు కానేరరు. వారు శివునియధికారమునకు లోబడినవారు. బ్రహ్మముఖ తః పుట్టినవయ్యును సోమకాసురునిచే నపహృతంబులయిన వేదములు తత్కాలమున నతనియొద్దలేమిం జేసి వారు వేదబాహ్యులైరి. ఇట్లుపైన జెప్పిన యైదుగురు (అనగా బ్రహ్మ, విష్ణు, జినుఁడు, బుద్ధుడు, మాయ) దైవతములుగారు జగత్కర్తృత్వము వీరికిలేకపోవుటచే వా రినిమించిన యీశివవాడీశ్వరుడు తత్కర్తృత్వము వహించి షడ్దర్శన ములచే గీర్తింపబడుచున్నవాడు. (దర్శనమనగా శాస్త్రము) షట్శాస్త్ర ములును వేదమున కంగములు ఆవేదాంగములే యీశ్వరుని ప్రతిపా దించుచున్నవి. వేదములనేయేల యీశ్వరునిఁగాఁజెప్పి సృష్టికర్తృత్వ మావేదములకేల నిర్ణయింపగూడదు? అవి సోమకాసురుని యపహార ణంబునకు లోనైనవి. భూమిని దైవమందుమేని మలమూత్రములకు నది నెలవైనది. జలము దైవమందుమేని యొకయతి యరచేతిగుంటలో నది యిమిడిపోయినది. అగ్ని దైవమందుమేని సర్వభక్షకత్వంబున దూష్యభావంబునొందె. వాయువు దైవమందుమేని విశ్రుతియై యొక మూలనడఁగియుండు. ఆకాశమును దైవమందుమేని దానికిని బ్రాళ

యుంబుగలదు. ప్రమథులు దాని నాక్రమింతురు. సూర్యచంద్రులు దైవములందుమేని వారలకొకచోట నిలుకడలేదు పోనిమ్ము! సర్వజగద్భూతకోటి కంతరాత్మగా నున్న జీవాత్మనే దైవమందుమేని దానికి లింగదేహాధిష్ఠత్వంబున జన్యజనకభావంబులు గలిగియుండును ఇంతకు సర్వంబును కర్మవశము కర్మచేతనె జన్మకలుగును. కర్మచేతనె జన్మరాహిత్యముకలుగును. కనుక నాకర్మమునే దైవమందుమేని జడత్వప్రతిపాదితం బగునది దైవమెట్లగును? కర్మ యనుభవయోగ్యముగాన నొకరిచే ననుభవింపబడునది దైవశబ్దవాచ్యత్వమునకు సరిపడునా? కర్మనుచేయువాడొకడు ననుభవించువాడొకడు నుండినతెను. చేయువాడె కర్తయు ననుభవింపబడునదియె కార్యము లేక క్రియలేక కర్మయె యనబడును కర్మనుచేయు కర్తకు సృష్టికర్తృత్వము గల దైవమందుమేని దక్షుడు యజ్ఞముచేసియే యనికారమునొందెను? తుదకు దన శిరముగోల్పోయి చీమిడిగారుచుండు గొఱ్ఱెశిరము నరికించుకొనెను. "అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మశుభాఽశుభం" అను వాక్యము కర్మానుభవావశ్యకత్వ ప్రతిపాదకముగాని కర్మకర్తృత్వావశ్యకత్వ ప్రతిపాదముగాదా. దీనికొకదృష్టాంతము—ఒకియూరనొక బ్రాహ్మణుడు తన నలుగురుకొడుకులను దనయవసానకాలమున బిలిచి తాంబఃడుకొనుమంచమునకు నాలుగుకోళ్ళక్రింద ధనముదాచియుంచిన సంగతిజెప్పి నలుగురును త్రవ్వుకొని దానివలన జీవింపుడనిచెప్పి మరణించెను తండ్రికుత్తరక్రియలు పూర్తిచేసి కొడుకులు నలుగురు ప్రత్యేకముగా నాలుగుకోళ్ళక్రిందను త్రవ్వుకొనుటకు కోళ్ళు వేఱువేఱుగా నెంచుకొనఁ యెవరికి దొరికినది వానిదేగాని యితరులకు వంతులేదని నిర్ణయించుకొని త్రవ్విరి. ముగ్గురికి సూచనసంచులు ధనముదొరికినది నాలుగవవానికొక తాటియాకుముక్క దొరికె దానియందు "నా భుక్తి" యని వ్రాసియుండెను. ధనముదొరికినవారు ముగ్గురు బహుసంతోషముతో వ్యాపారము

చేసికొనుచు గొంతకాల మనుభవించుచుండిరి. తాటియాకుముక్క దొంగిలినవాడని పట్టుకొని యొకయరణ్యమార్గమున బోయిపోయి సాయంకాలముసరికి నొకరాజపట్టణము చేరుకొనెను ఊరుబైట నొకచెరువునొద్ద స్నానసంధ్యావందనాదులు దీర్చుకొని యొకపాడుదేవళములో బ్రవేశించి యందుదూర్చి గోపురములో బండుకొని నిద్రించుచుండెను ఆరాజున కొకకూతురును, ప్రధానమంత్రి కొకకూతురును షరాబుధనాల పోలిశెట్టి కొకకూతురును కొత్వాలు హీరాసింగు కొకకూతురును నలుగురు కూతుండ్రు దేసిలిండ్రికదియె యేకపుత్రికవిషయముగానుండి మిగుల గారాబముతో బెరుగుచుండిరి వారందఱు దమ సవయస్కుడగు ద్వితీయమంత్రికుమారునితో గలసి పాఠశాలలో జిన్నప్పకాలమున నాతనియందు మోహముగలవారై యీడువచ్చి చదువుచాలించుకొన్నసమయములో దేనితలిదండ్రులకది చెప్పక మంత్రికుమారునితో దేశాంతరము పోదలచి యందఱు నొకదినము రాత్రి ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థయామములలో పురమునందున్న శివాలయగోపురములలో తూర్పు, దక్షిణ, పశ్చిమోత్తర గోపురములలో మంత్రికుమారుని వచ్చియుండుమని యానవాలుచెప్పి సాంకేతమేర్పఱచి తాముదానైయుండిరి. ఆసాంకేతికదినమే యా "నాభక్తి" బ్రాహ్మణుడు పోయినదినము. మంత్రికుమారుని చదువు, తండ్రియాదినమునఁ దాను స్వయంగాఁ బరీక్షించుచు తెల్లవార్చినందున నాతఁడు సాంకేతికస్థానమునకుఁ బోవ వీలు లేకపోయెను. ఆయాడుపిల్లలు నలుగురికి నాసంగతి తెలియక తమతమ సాంకేతికముల ప్రకారము రా నారభించి యందుతొలుదొల్తఁ గొత్వాల్ హీరాశింగు కూతుఁరు తూర్పుగోపురమునకువచ్చి చీకటిలో నున్నయాబ్రాహ్మణుని తనకరస్పర్శవల్ల దగ్గఱదీసికొని నిండుతమకముతో నున్నదె కావున స్వేచ్ఛగా మదనక్రీడసల్పి యావైని చేతనున్న మైనపువత్తి వెలిఁగించి వాని మొఖము

జూడ వింతముఖమాయెను. మనస్సువిఱుచుకొని యింకఁ బశ్చాత్తాపము వలనఁ బనిలేదు వీనినివెంటనె తఱిమి మంత్రికొమారుని రాకకెదురు సూతునని వానిని నీవెవ్వఁడవని యడిగెను వాఁడు తనపేరుచెప్పక చేతనున్న తాటియాకుముక్కను చూపెను వెంటనె దానియందున్న "నాభుక్తి" యను దానితోసరిగా "క్షీయతేకర్మ" యని తనచేతి నున్న చేగంటముతో వ్రాసి తాఁదెచ్చిన ఫలహారపదార్థములలో కొన్ని వానికిచ్చి వెంటనేపొమ్మనెను. వాఁడు దక్షిణగోపురములోనికి బోయి పండుకొనెను ఆచ్చినది మంత్రికుమారుఁ డొకయడుగు వెనుక ముందుగా వచ్చునను నాశతోఁ గాచికొని పండుకొని నిద్రబోయెను. తొలిజాము గడచెను రెండవజామున పోలిశెట్టికూఁతురు దక్షిణగోపురమునకు వచ్చి కొత్వాలు కూఁతురువలెనే జరుగవలసిన పనులన్ని జరిపివేసి వానిముఖముచూచు నంతలో నిశ్చేష్టురాలై స్వయంకృతాపరాధమునకుఁ దన్నుఁదానె నిందించుకొని వాఁడు తనచేతికిచ్చిన యా తాటియాకు ముక్కపైని "నాభుక్తి క్షీయతేకర్మ', యని చదివి కొత్వాలుకూఁతురు తనవలెనే భ్రమపడ్డదని గ్రహించి మంచిది తనకు సహవాసికురాలామె యున్నదిగదా యని ధైర్యమునుపొంది "కల్పకోటి శతైరపి" యనివ్రాసి తాఁదెచ్చిన ఫలహారములలో గొన్ని వానికిచ్చి పంపివేసి మంత్రికుమారునిపై యది యాసతో గాఁచికాచి నిద్రించెను రెండవజాము గడిచెను. ఆబ్రాహ్మణుఁడు పశ్చిమగోపురమునఁ బండుకొనియుండెను ప్రధానమంత్రికూఁతురు తనసాంకేతము ప్రకారము వచ్చి పండుకొనియున్నవానిని లేపి మంత్రికుమారునిగా భావించి తొలియిద్దఱవలెనే తాను తొందరగా మదనక్రీడాసుఖము ననుభవించి తానును వారివలెనే వానిముఖముచూచి వాఁడిచ్చిన తాటియాకుముక్కలో వ్రాసియున్న భాగము "నాభుక్త క్షీయతేకర్మ కల్పకోటిశతైరపి" యని వ్రాయబడిన తనచెలికత్తెలరెండు వ్రాఁతలనుచూచి యావ్రాఁతలను

బట్టి వాని చెలికత్తెయలుగా గ్రహించి ధైర్యముతో "అవశ్యమనుభో
క్తవ్యం" అని వ్రాసి వానినంపివేసి తాను మంత్రికుమారుఁడు వచ్చునను
నడిరేయాంతలో గాచికాచి నిద్రించెను. అంత వాఁడును పోయి యుత్తర
గోపురమున బండుకొనెను మూడవజాము గతించెను నాలుగవ యా
మమున రాజకూతురు తన సాంకేతికము ననుసరించి వచ్చి పైముగ్గురి
వలెనే తానును తొందరగా నిండుతమకమున గండువయసున నున్నది
గావునఁ దొలుదొల్తనే సురతసుఖము ననుభవించి యాపిమ్మట వారి
వలెనే వానిముఖముచూచి వాఁడు తనచేతికిచ్చిన తాటియాకుముక్క
నుచూచి దానియందు వ్రాయఁబడిన మూఁడులిపులనుజూచి తనచెలికత్తె
యలు ముగ్గురును, దాను నొక్కనోమె నోచితిమని యనుకొని విచా
రించవలసిన పనిలేదని ధైర్యముతో దానియందు వ్రాయఁబడిన "నా
భుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి। అవశ్యమనుభోక్తవ్యం" అను వేఱు
వేఱు విపులలోనున్న భాగములకు సరిగ దానును "కృతం కర్మ శుభా
శుభం" అని వ్రాసి శ్లోకముపూర్తిచేసి మఱియొకసారి చదువుకొని
మఱితాను నిదురించక వానితో నిష్టాగోష్టిగా సరససల్లాపములాడుచు
వానినే తన భర్తగాభావించుకొని తాను పద్మినీజాతిస్త్రీ గనుక అది
తనకు సహజముగా లభించిన తెల్లవాఱుజామున సుఖమును మఱల
మఱల వానితోడ ననుభవించుచు భయపడుచున్నవానికి ధైర్యముగ
లుగఁజేయుచు "మేము చేసుకొన్నకర్మ మాకనుభవింపక తీరదు ఇం
తకు నీవు స్వచ్ఛమగు బ్రాహ్మణజాతివాఁడవు. మాపూర్వపుణ్యము
ఫలించినది మేమునోచినది మంచినోమె తక్కువజాతి వారమయ్యు
నక్కువజాతివాఁడవగు నిన్ను వివాహము గాంధర్వవిధానమునఁ జేసి
కొంటిమి. ఇఁక మాతల్లిదండ్రుల యనుమతంబున నిన్ను మేమునలుగు
రము నేకముహూర్తమున వివాహమై మాయింట నిన్నిల్లఱికముంచు
కొని యారాజ్యమంతయు నీయిచ్ఛావిలాసముగా బరిపాలించుటకు నీకి

చ్చెదను భయపడ" వద్దని యనేకవిధంబుల బురికొలిపి భయముదీర్చి
తెల్లవాఱిన వెనుక నాగుడిపూజారి వచ్చిన వెంటనె యాతనిచే దనతండ్రి
యగు రాజుగారిని, తన చెలికత్తియల తండ్రులగు ప్రధానమంత్రి, పోలి
శెట్టి, కొత్వాలు వీరుమ్ముగ్గురిని దేవాలయమువద్దకు రమ్మని వర్తమాన
మంపి యాబ్రాహ్మణుని స్వామివెనుక దాచి తామునలుగురు స్వామి
సమక్షమందునిలిచి మనస్సులో "స్వామీ? నీయెదుట మేము చేసిన
పాపకృత్యమునకు మమ్ముక్షమించి కామినులము గనుక కాముకకృత్య
మును జేసితిమి సురతసౌఖ్యముయొక్క యుత్కృష్టత మేము వేఱుచె
ప్పనక్కఱలేకయె యొకనిముసమైన నెడములేక సర్వదా దాని ననుభ
వించుచు పౌరుషము సగము గోల్పోయి మన్మథునిదహించన వాఁడవ
య్యు వాని బాణములయొక్క ధాకకు నీవును దాళలేక భూధరాత్మజా
ధరామృతమున బ్రతికి సగమాఁడురూపును గలయర్థనారీశ్వరుఁడవై య
నవరత సురతలంపట సుఖస్థితి యందున్న నీవే స్వానుభవముగాన నోదే
వా! మాతండ్రులు నుమ్ముక్షమించి మాయధాకర్మఫలప్రాప్తుండగు
భర్తతో మమ్ముఁగూర్చి పెండ్లిసేయునట్లు ననుగ్రహింపుమని ప్రార్థిం
చుచుండిరి. అంత రాజును ప్రధానమంత్రియు, పోలిశెట్టియు, కొత్వా
లును జేరకడవచ్చి యతినిష్టాగరిష్టత్వంబున ధ్యానయోగావలంబకులై
యున్న తమబిడ్డలం గాంచి వారు కన్నులు తెఱచు పరకు నట్లనే కాచి
యుండిరి వారుకన్నులు విప్పిచూచి యందఱునేకముఖమున నొక్క
సారి రాజుగారికి సాష్టాంగదండంబు వెట్టి "శరణు శరణు" అని ము
మ్మారుపలికిరి. పిమ్మట ప్రధానమంత్రి కూఁతురును, పోలిశెట్టికూఁతు
రును, కొత్వాలు కూఁతురును తమ తమ తండ్రులకుఁ బ్రత్యేక నమ
స్కారంబులు గావించి వారును బ్రత్యేకముగా "శరణు శరణు" అని
ముమ్మారు పలికిరి. "మీకభయము, మీభయము తీర్చెదము. నిజ
ము చెప్పుఁడని వారడుగ నందఱితరపున కడసారిది కొత్వాలు కూఁతు

రు ముందుగాఁ దాబడ్డదిగా స్పష్టముగాఁ జెప్పి పిమ్మటఁ దక్కినము గ్గురివృత్తాంతమును నిజముగా యున్నదియున్నటులఁ జెప్పి తాటియకు ముక్కను తాము చేసిన శ్లోకము పూర్తియఁ గనబఱిచి యాపిమ్మట "నాభుక్తి" గాడినిదెచ్చి రాజుపాదములపై బడవైచిరి. బ్రాహ్మణుఁ డగుటచే రాజముందుగా తానే వానికి నమస్కరించి వానియాశీర్వాదమును గ్రహించి, తక్కిన ముగ్గురునట్లనే చేసిన యికమీరు తప్పు చేసితిరని మిమ్మును శిక్షించుట గతజలసేతుబంధనము. ఇంతకు మీరు వరియించిన వాఁడు నవయన్నుఁడగు రూపయౌవన సంపన్నుఁడును విద్యాపరిపూర్ణుఁడునగు బ్రాహ్మణుఁడుగాని హీనజాతి మానవుఁడు గాఁడు. విష్ణుశర్మవలెనె మీకును వీనివలన వరరుచి, భట్టి, విక్రమార్క, భర్తృహరివంటి బిడ్డలుంగని యీరాజ్యపరిపాలనము చేసికొనుచు మాయనంతరము సుఖముగా నుండుఁడని వానికి వారలఁజెండఁజేసి క్రమముగా కొద్దికాలములో వారు వానప్రస్థాశ్రమమునకుఁబోయిరి" కాఁబట్టి చేయఁబడిన కర్మయొక్క యనుభవ్యతయె యావశ్యముగాని కర్మచేయుట యావశ్యకముగాదు చేసినను చేయకపోయినను సరే గాని చేసినకర్మ మాత్రమనుభవించక తీరదు. గాన సాధ్యమైనంత వఱకు సత్కర్మనే చేయుచుండవలెనన్న "ఏకఏవరుద్రో నద్వితీయః" అని శ్రుతులు ఘోషించుచున్నవి. కనుక కర్తలకు కర్త, మదనమద హర్తయగు సర్వమంగళభర్తగాని మఱియొక్కఁడు తగఁడు. హరిపుర స్మరదజనురాదులు కారు. వీరందఱును బశువులు. పశుపతి శివుండు. నియంతృయంత్రతపారతంత్ర్యంబున కార్యకరణప్రవర్తకులై యవాంతరకర్మలం జేయువారై చెప్పినపనుల సేయువారలాపనులకు, తత్ఫలంబులకుఁ గర్తలుకాఁగలరె? కర్తలుగాఁజాలమికి మర్త్యత్వంబునను సకలజనాది మతములకు విస్పష్ట ప్రత్యక్షప్రమాణములను జెప్పెద నాలింపుఁడు. గోరుమీఁటుదానికి గొడ్డలియేల? ఒక్కనిదర్శనమః

చూడుఁడు. శివాలయము యొక్క గోపురము శిఖరము మొదలగువాని యందు విష్ణ్వాది దేవతల యాకారములు వారివారియవస్థాంతరములతోఁ బ్రతిమలగాఁ జిత్రింపఁబడినవో లేవో యోచింపుఁడు అనేక శివాలయ గోపురములపైని కృష్ణుని రాసక్రీడ, జలక్రీడ గోపికావస్త్రాపహరణము మొదలగు చిత్తరపు లున్నవో లేవో గమనింపుఁడు వీనిఁ బట్టిచూడ వారు శివుని పరిచారకులు గారా? విష్ణ్వాలయముపై నెచటనైనను, శివప్రతిమ యొక్కటియైనఁ గందురా? మఱియు నీక్రిందిక్రమమున శివునకు నితర దేవతలకుఁ గల తారతమ్యములు చూడుఁడు. దానింబట్టి శివున కితర దైవము లెల్ల సరియగుదురో మీరే యూహింపఁ గొనగలరు.

| శివుఁడు. | | ఇతర దైవములగు బ్రహ్మవిష్ణ్వాదులు |
|---|---|---|
| 1 అప్రతిమాకారుఁడగు లింగమూర్తి | — | ప్రతిమాకారులై చరించువారలు |
| 2 నిర్మలనిత్యనిష్కర్మదేహుఁడు | — | దుర్మలదుష్టదుష్కర్మదేహులు |
| 3 శుద్ధ ప్రబుద్ధానిరుద్ధదేవుఁడు | — | ఉపప్రసిద్ధ బౌద్ధ జినులు |
| 4 చావుపుట్టువులు లేని దేవదేవుఁడు | — | చావుపుట్టువులుగలవారు |
| 5 బ్రహ్మాదిమూకారపశువులకుఁ | — | బ్రహ్మవిష్ణుపురోగులకు |
| బతియగు పశుపతి | — | పశువులు |
| 6 విష్ణుకంకాళధరుఁడు శంకరుఁడు | — | శంకితమనస్కులింద్రియకింకరులు |
| 7 ప్రళయకారకుఁడు | — | ప్రళయభీతులు |
| 8 మునిగణార్చితపాదయుగళుఁడు | — | మునిశాపహతులుభీతులు |
| 9 సకలలోకపూజ్యుఁడు | — | అర్భకులు. అర్చకులు |
| 10 మూఁడుకన్నులుగలవాఁడు | — | రెండుకన్నులుగలవాడు |
| 11 హాలాహలాగ్నిసంహారకుఁడు | — | హాలాహలాగ్నిదగ్ధులు |

| | | |
|---|---|---|
| 12 త్రిపురదానవభంజనుఁడు | — | త్రిపురదానవబాధితులు |
| 13 అంధకాద్యసురసంహారకుఁడు | — | అంధకాద్యసురభయార్తులు |
| 14 బ్రహ్మకపాలము నుధరించినవాఁడు | — | బ్రహ్మను తండ్రి |
| 15 విష్ణునివెన్నెముక ధరించినవాఁడు | — | ఆవిష్ణునిఁబూజించువారితరులు |
| 16 అవతారాదిభేదములు, జనన మరణములు లేనివాఁడు | — | అవతారాదిభేదములు గల వాఁడువిష్ణువును తదితరులును |
| 17 సమస్తమునాక్రమించిన మహాలింగమూర్తి | — | ఆలింగమునె చిహ్నముగా ధరించువారు |
| 18 పరమేశ్వరుఁడు | — | కేవలమీశ్వరులె |
| 19 సర్వజ్ఞుఁడు | — | అసర్వజ్ఞులు |

ఇట్టి తారతమ్యము లెన్నెన్నియో గలవు సమస్తపురాణ సమస్తాగమ సమస్తవేదనాద పరిశోధకుఁడను మహాతార్కికుఁడును సూత్రభాష్యకారుఁడునగు హరదత్తాచార్యులవారు కంచిలో వైష్ణవులకు శైవులకుఁ గలిగినభేద బుద్ధికి ననుగుణ్యముగా శివాధిక్యమును స్థిరపఱచి వైష్ణవులకు బుద్ధిచెప్పి శివదూషణ మెన్నఁడును చేయకుఁడని బోధించి శైవులకు వైష్ణవులకు సమాధానపఱచిన శివోత్కృష్ట హరిహరతారతమ్య శతశ్లోకియను గ్రంథమున అష్టోత్తరశతప్రశ్నల సమాధానపూర్వకములుగా నున్నవి. వానిఁగనిన శివునియాధిక్యత స్పష్టముగా గలదు.

మఱియు హర, సర్వేశ్వర, భవ, పరశివ, పరమేశ్వర, మహాదేవ, పశుపతి మొదలగు నుత్కృష్టనామంబు లితరు లెవ్వరికిగలవు ? ఇంతియగాదు. "తద్విష్ణోః పరమంపదం" విష్ణు నిదిపరమపదమని, విష్ణునిపరదైవమనియు జెప్పుచుండు వేదమె "పశ్యంతి సూరయః" అని శివుని విష్ణువంటి కృతార్థులె చూడఁగలరుగాని యితరులు చూడలేరని చెప్పుచున్నది. అట్టి వేదప్రమాణము నెఱింగియు గొందఱు మందభాగ్యులు తమయజ్ఞానంబున సద్గతికి బాహ్యులై కుతర్కంబుల గొన్ని నమ్మచు

శివునిఁగాక యన్యదైవముల సేవించి ముక్తిఁగానలేక స్వర్గాదిలోక
ములఁ జననమరణంబుల నొందుచున్నారు రాజా! అట్టివాని విశేష
భాషణములతో మనకుఁబనియేమి? మఱియు వినుము. విష్ణునకు
జననమరణములు లేవియెడల వీరశైవుఁడగు మాభృగుశాపమున నవ
తారాదుల నేలనొందుచున్నవాఁడు? మఱియుఁ బితామహునకు
లలాటంబున శివుండును గుదంబున విష్ణుండును, జనించిరి. దానంజేసి
విష్ణునకు నధోక్షజనామంబు నెగడెనని సామవేదప్రమాణము ముఖ
సంభవుఁడు పెద్దయగు నాగుదస్థానంబునఁ బుట్టినవాఁడు మేటియగు
నా? ఇదియేల! ఇంద్రావరజుండై యదితిగర్భంబున వామనరూపం
బునఁ బుట్టలేదా? ద్వాపరంబున బాదరాయణుండని వ్యాసరూప
మున జనించినవాఁడు గాఁడా? "వ్యాసా నారాయణస్సాక్షాత్"ని
శ్రుతిప్రమాణములు గలవు ఈకలియుగమున కృష్ణనామంబుతో నెగ
డుచున్నవాఁడు. గాదె. ఇంతయేల విష్ణ్వాలయములలో విష్ణుపదము
గోరి తపస్సుచేసెనే? వారల కావిష్ణుపదము నిచ్చువాఁడు శివుండె. విష్ణు
నిమాయలు వానిపాట్లు వానికే తెలుసును. మున్నొకముని వక్షంబునఁ
దన్ను వానికాలు గోకయందున్న నేత్రమును బెరికివైచి వక్షస్థలంబున
దాపువలనఁ బడినమచ్చయె యిప్పటికిని గనుపించుచున్నది. మున్ను
దుర్వాసుఁడు రుక్మిణీకృష్ణుల నొకబండికిఁబూన్చి వారలచే నదిలాగిం
చుచుఁ దానుబండివాఁడై కశాఘాతంబుల వారలవీపుల నొప్పింపఁడె?
మఱియు నుపమనుపమన్యుఁడను ముని మహాతపముఁ జేసి పాలకడల
నీశ్వరునిచేఁ బడసి క్రోలుచుండ నమ్మున్న యాదినారాయణుండు గళం
బునఁబడఁ గాండ్రించి యుమ్మివేయఁడె? జలంధరుండను రాక్షసుఁ
డంబరమున విష్ణునెదిర్చి గెలువఁడె? జరాసంధుఁడు దన్ను వెన్నుదవిలిన
నోడిపాఱి సముద్రమధ్యమున నగరంబుఁ గావించుకొనఁడె? మృగ
చండాల గర్దభః" అనిమృగజాతి చండాలంబగు గర్దభము నాశ్రయిం

చి కూయుకుండఁ జేసికొని తనప్రాణమును గాఁపాడుకొనలేదె ? గజాసురాది రాక్షసులు విష్ణునియుద్ధమున ననేకపర్యాయములు పాఱిపోవు నట్లు చేయరె ? వారిని శివుఁడెగదా సంహరించెను విష్ణుమూర్తి దధీచిపైని జక్రప్రయోగముసేయు నాదధీచి వీపాగి చక్రమును విఱిచివైచి తన్ను వెన్నడింప బెదరిపాఱిపోయిన వాఁడుకాఁడె ? దేవాసురులు పాలకడలిఁ ద్రచ్చి యుదుగఁబొడమిన విషమును భరింపలేక మొగమొగములు సూచుకొనుచు శివుని బ్రార్థింప నతండా విషమును దా గళమం దిడుకొని వారల కమృతంబొసంగ దానినారగించుటకు విష్ణువు మగతనములేక యాఁడుదై పోయెనో లేదో మీరే చెప్పుడీ ! బలిని వంచనచేసి భూమియంతయు నాక్రమించిన పాపమున విష్ణువు భూమియందుండుటకుఁ దావులేక సముద్రమధ్యమున నుండుటకుఁ బోయెనుగాదె ? భృగుసపత్నిని జంపిన దోషమున నాతని శాపమునఁ దాను భార్యావియోగమునొంది యావిరహమును వేయి సంవత్సరము లనుభవించి తుదకు భార్యలేకుండఁగనే రాముఁడవతారము నాలించెను గాదె ? వాలిని మాయచే చాటునుండి బాణమేసి చంపిన దోషమునకుఁ దాను కృష్ణావతారమున ఘోరారణ్యమున నొక్కబోయవాని యలుఁగుదెబ్బరని ప్రాణములు విడిచెనుగదా ? వెన్నదొంగిలించి గొల్లభామల మాతులకుఁ జూపి వారితో జారత్వము సల్పినవాఁడు గాఁడా విష్ణుఁడు ! నంది కేశునితో నెదుర్కొని విష్ణుడాతని నాసానిలముచేతఁ దూలింపబడ్డవాఁడె కాఁడె ? మఱియు తానె దైవమని విఱ్ఱవీగుచు నాది మహాలింగమూర్తి నిజరూపుఁడు గానలేక పోయెను గాదె ? ఇదిగాక సంతానముకొఱకు నిష్ఠతో ననేకయుగములు మేఘరూపమున సేవించుచు శివునిఁగూర్చి తపంబొనర్చిన వాఁడుగాఁడె ? మత్స్యమును బరిమార్చి దానిపేగులు తలఁదాచినట్లు హాగ్నమును బరిమార్చి దానికపాలమును హారముగా శివుడు ధరిం

చేను. ఈమత్స్యకూర్మములు రెండును విష్ణునియవతారములుగావె ? విష్ణువు శరభరూపమునఁ జిత్రభ్రమణం బొనర్చుచుండ శివుఁడా శరభమును బరిమార్చి దానిచర్మమును ధరించెనని శరభాధ్యాయమునఁ జదువలేదె ? ఆదివరహము దంష్ట్రము శివునిహస్తమున నున్నది గాదా ? త్రివిక్రముని వెన్నెముక హరునిచేత ఖట్వాంగమువలె నున్నదిగాదా ? ఈ యాదివరహమును, త్రివిక్రమమును విష్ణురూపములుగావా ? మఱియు విష్ణునికన్ను శివునిపాదములపైఁ బడియుండ లేదా ? విష్ణునిదైవమని యెట్లు గొలువవచ్చును ఏమన విష్వక్సేనుని శిరము శివుడు శూలమునఁ బొడిచి మీఁదికెత్తిన నట్లనే యుండి వ్రేలాడుచుండలేదా ? శివునియెదుట విష్ణునిదేహమంతయు నెత్తురువరదయై పాఱలేదే ? దానం జేసె గాదె శివునికి హరహరుఁడను నామంబు ప్రసిద్ధంబయ్యెను. "హరిహరంతం" అని వేదప్రయోగమును గలదు. "యజ్ఞస్యశిరచ్ఛిన్నం" అని శ్రుతిప్రమాణము కలదు. యజ్ఞధ్వంసి శివుడు యజ్ఞపురుషుఁడు విష్ణువు గనుక యజ్ఞధ్వంసకాలమున వెన్నునిశిరముఁ పన్నగభూషణుఁడు దుంపలేదె ? ఆదిమహాయజ్ఞమున మదాంధుఁడైన విష్ణువు శివునిచేత శిరచ్ఛేదము నొందలేదె ? ఆతఁడన నేల, శివుని చేత దెబ్బతినని వారం గు నెవ్వరు గలరు ? మఱియు నాసమయంబున శివప్రేరితుండై యొకయక్షుఁడీ భూమిపై నొక తృణంబువైవ దాని నెవ్వరైన నెత్తజాలిరే ? బ్రహ్మకైదు శిరంబులు గలుగుకాలమున నాబ్రహ్మ యాటోపము మాన్పుటకుఁ బంచముఖుఁ డాతని పంచమశిరంబును పుటుక్కునఁ ద్రుంపఁడె ? మఱియు మృగరూపమునఁ గూఁతుఁగవయఁబోవు బ్రహ్మశిరంబును శివుఁడు మృగవ్యాధుఁడై ద్రుయలేదె ? ఆబ్రహ్మమానసపుత్రుఁ డహంకరింప నాతనినుష్ట్రసంజాతునిగా శివుఁడు సేయలేదె ? మఱియు వ్యాసుఁడు చేయిమీఁదికెత్తి విష్ణునివేఱదైవము లేదని చెప్పుచున్నతఱి నాతని భుజమేమయ్యెనో

శివకీర్తనములను గ్రంథమున వినలేదె? రావణుఁడు కైలాసము నెత్తు నప్పుడు పార్వతి కంపింపఁగా శివుఁడా పర్వతము నంగుష్ఠముచే నొత్తఁగా వానిపదిశిరంబులందుఁ జిక్కుకొనవాఁడుశివునిఁ గీర్తించి యాయుపాయ మును బాయఁడె? మన్మథుఁడు శివునిపై మోహరించి భస్మమయ్యెనుగా డె? దానికిసూచకముగా నేఁటికిని కామదహనమును నుత్సవము జరుగుచు న్నది. దక్షుఁడు గర్వించిశివనింద చేయుటనెగదా వానితలగొట్టబడి గొత్త్రె పుత్త్రె యతుకఁబడినది భృగుమహాముని యరకాలఁ గన్నుగలిగి సకలలో కముల నే నీకన్నుచేఁ జూతునని గర్వించిన శివుఁడాకన్నుఁ బెఱికివైవఁడె? శివదూషణము సేయుటనెగదా వీరభద్రుఁడు పూష్ణునకుఁ బండ్లురాలఁ గొట్టుటనేనే జగత్ప్రాణుఁడనని విఱ్ఱవీఁగుటనెగదా గాలికి శివుఁడు కాళ్ళు తెగగొట్టెను శివద్రోహిదక్షునివీట నాహుతులు గ్రహించుటనె గదా యగ్ని జిహ్వలు, బాహులు గోలుపోయెను ఇంద్రునిచేయియు నదితి ముక్కును, వీరభద్రాదులు ఖండింపలేదె? చంద్రునిఁ గాలంజమరడె? సరస్వతికి ముక్కును, స్వాహాకు చన్నును గోయలేదె? వారట్లు యజ్ఞ మునకు వచ్చినందుకు ఫలముగా నట్లు చేసెను. మఱియు, గర్వంబున యజ్ఞభాగములకై వచ్చిన చిల్లరదేవతల నెట్లు చెండాడెనో వినలేదె? లోకమునంతయు నొక్కమాఱు ముంచివైతునని గర్వముగా వచ్చు గంగాప్రవాహమును మెల్లమెల్లఁగాఁ గరపల్లవంబున గ్రహించి జగ ద్రక్షణార్థంబు జటాజూటమున నిముడ్చికొనఁడె శివుండు? భూమినంత యు నొక్క పడగపై మోయుచున్న శేషుని నొక్కచిటికెన వ్రేలి యుంగరముగాఁ దాల్పఁడె శివుఁడు? మఱియు నాకసమంతు నొక దాని నొకటి గలయక చిత్రభ్రమణంబులఁ గ్రీడించు కఱకురక్కసుల పురంబులు మూఁటినొక్కటిగఁ జేర్చి విష్ణుని బాణముగాఁ జేసికొనియు బాణమున వారలమూఁడుపురనొక్కసారిమర్దింపఁబడె? మఱియు నుదధిమథన సంజాత హాలాహలము జంబూఫలంబుక్రియ గళంబున నుంచుకొన

వే? అంధకాధిరాక్షసుల బెక్కండ్రవధించి లోకములగాపాడఁగాదె? ఇంత లేసిపనులకుఁ బ్రత్యేకము శివుఁడే కావలెనన్నమాటలేదు. అతని చతుర్గుణాంబునందొక్క చిఱుబ్రాయపు బాలుఁడొక్కరుండ బ్రహ్మాండంబులనన్నిటి నొక్కవోటికిఁ బ్రోగుచేసి మంటపెట్టఁగలండు. అట్లుగావున మాశివుని బోలు దేవుఁడొండను లేడని నిశ్చయముగా నొక్కి చెప్పఁగలను రాజా! ఇంకొక్క సంగతి చెప్పెదవినుము. శివుఁడొక్కడె నిత్యుఁడు. విష్ణ్వాదుల నిత్యులనుటకు నొక్కనిదర్శనము చాలదా? యేమన విష్ణుని వెన్నముకను బ్రహ్మయొక్క శిరంబును శివుఁడు చేత దాల్చినవాఁడనుటలో ఆయుద్ధతి నట్లుచేయుట నెగగా వారిలయత్పత్తిక్తిని నాశనంబునకును శివుఁడె కర్తయనుటకు సందేహము లేదు భూమీశా! యింకొక రహస్యము వినుము విష్ణువు పమన్యుఁడను మునిచేత శివదీక్షబొంది యింద్రనీలలింగమును సజ్జలోనిడుకొని యెల్లపుడు మూఁడువేళల మిక్కిలి శ్రద్ధతో లింగమూర్తి పూజ సేయుచుండును. శివుని వేయికమలములచే విష్ణువు పూజించుచుండఁగా నతనిభక్తిగనిపెట్టుటకు శివుఁడండు నొకకమలమును మాయసేసిన దానికిమారుగాఁ దనకన్ను వెలికి వాడములపై బడనైచి ఆఖరునామముగను నేత్రపుష్పము భర్తిచేసెను దానికిమెచ్చియెగదా శివుఁడు చక్రమును తానుదాచిన కమలమునె కన్నుగా నొసంగెను. దానికిఁగదా విష్ణునకు గమలాక్షుఁడను నామముగలిగెను. కమలాక్షుఁడనగా బద్మమువంటి నేత్రము గలవాఁడని గాదు దానివ్యుత్పత్తి. అట్లయిన నందఱికన్నులు పద్మములతోడనె పోల్పఁబడును. దానవిశేషమేమున్నది? పద్మమె నేత్రముగా గలవాఁడని దానిభావము. ఇంతియగాకను విష్ణువు మత్స్యావతారమున పన్నగాలంకారుని మత్స్యేశ్వరుఁడను నామంబున బ్రతిష్టించి బహు నిష్ఠతో బూజించినవాఁడు కూర్మావతారమున సాగరఫేనమున కూర్మేశ్వరుని బ్రతిష్ఠించి యర్చించినవాఁడుగాఁడా? అన్నియేల సమ

స్త్రావతారములలోఁ బూర్ణావతారమగు రామావతారమున ముందుగా సేతువుగట్టి యందు రామేశ్వరుని బ్రతిష్ఠయొనర్చి తాను పూజించి యాపైనిగదా రావణునితో యుద్ధముసేసి వానిగెల్చెను. అంతకుముందు విష్ణువు శ్రీ రారామంబున రామేశ్వరునుపాసింపలేదా ? ద్వారకానగరమున గోవిందేశుఁడని కొడుకునకు బేరుపెట్టుకొని కృష్ణుఁడు శివునిఁ బూజింపఁడే ? మఱియును లంపూరి బ్రహ్మేశ్వరుడని పూజించుచున్నవాఁడుగాదె ఇట్లని యింద్రుండు నింద్రేశుఁడని శివునిఁ బూజించుచున్నవాఁడుకాఁడా ? వ్యాసుఁడు శ్రీకాశిలో వ్యాసేశ్వరుఁడని లింగప్రతిష్ఠఁజేసి వ్యాసకాశీయును తనపేరిట కాశిలో బూజించుచుండలేదా ? వీరువారుననక యెల్లవారును వారణాసియందు దమపేళ్ళ లింగంబులం బ్రతిష్ఠించి బూజించుచున్నవారుగదా ? కావున శివునకుదక్కఁ దక్కనవేల్పులకు కర్తృత్వము నుపాస్యకత్వము గలదా ? శివుఁడే యర్చితుండై యభిమతార్థంబుల నిచ్చుచుండును. ఇది సకలశాస్త్రపురాణాగమ నిగమసంసిద్ధము. దేవతలకుగాని, మనుజులకుఁగాని, యక్షరాక్షసులకుగాని యెవ్వరికైనను శివుఁడిచ్చిన వరము లేమొండు. విష్ణు బ్రహ్మలిచ్చినవి యరుదు

కాళిదాసు శివునకుఁ దనరెండు కన్నులతోనున్న శిరంబె పూర్ణాహుతిగా నొసంగుచు నిట్లు తొమ్మిదిజన్మముల నఖండశివపూజయొనర్చినందున నాతనికి శివుఁడు సర్వతశ్చక్షుస్సంపన్నమగు సర్వజ్ఞతం బొసంగె శివనాగమయ్య చేసిన యఖండపూజకు మెచ్చి ప్రతిసోమవారమును దర్శించు దివ్యచక్షుస్సుల నాతనికిచ్చుచుండెను. మయూరుఁడు సూర్యనారాయణమూర్తిని సేవించినను పోని కుష్ఠరోగమును పోఁగొట్టి యాతనికి దివ్యదేహమిచ్చెను బాణుని వాఁకిట కావలియున్న యీశ్వరుఁడు వానికిఁ గృష్ణునిచే ఖండింపఁబడిన సహస్రబాహువుల మఱిల మొలిపింపలేదా ? దండి తన్నుఁ గీర్తింపఁ విష్ణునిచేఁబూని నేత్రరోగ

మతిచిత్రముగా శివుఁడు పోగొట్టఁడా ? తనకుధూపమర్పించిన యోబ
శయ్యను చేతిగంటతోఁగూడా తనపురికి శివుఁడు గొంపోవఁడా? దేవ
రదాసయ్యకు ధననిధి యొసంగలేదా ? సుస్మరి గుడయ్యకు నిండు
ప్రాయ మొసంగలేదా ? ప్రమథులు చూచి యాశ్చర్యపడు వడుపున
కరికాలచోడవిభుని పురమునఁ బైడివాన గురిపింపలేదా ? బసవనికిఁ
గనకగద్దియ యొసంగలేదా ? మున్ను నిమ్మవ్వకు నేడుదినములు తట్ట
మోసి పనులుచేయలేదా ? జక్కయ్యచేతఁజచ్చిన వనమృగములను
తనపురికి గొనిపోలేదా ? కుమారపాలభూమీశ్వరుండు తన్ను భయకర్మ
లచేత నర్చింపఁగా వాని యాత్రతంత్రములతో తనపురికి గొనిపోలే
దా ? అటులనె ఏల్లనయనారను మహాత్ముని తనపురముతోఁగూడ
కైలాసమునకు గొనిపోయినవాఁడు గాఁడే ? పరగొంత పెరుమాళి నం
డలు చూచుచుండఁగాఁ గైలాసమునకు దీసికొనిపోవఁడె ? శంకరదాసు
పన ప్రోలఁబాడఁగా మెచ్చుకొని తానుతాళమువేసి తనపురికి గొం
పోఁడె ? నేఁటికిని గనబడుచున్న షోడశమహాపీఠములను నిలుపలేదె?
తెరసగణమువారను పదిమండ్రి వీరత్వమున జైనులను బాణనోల వారి
పౌరుషమునకు మెచ్చి వారికిఁ గైలాసమొసఁగఁడె ? మృగమును వే
టాడఁబోయి దానికై గాచి తెల్లవారుదనుక మేలుకొనియున్న చెంచు
వానికి నాఁటిదినము శివరాత్రియగుటచే జాగరణఫలము వానికొసగలే
దా ? తొంటిచనిన శివభక్తుల చరితము లిట్టివియెన్నియో కలవు
వానినన్నిటి నేల యిప్పుడు మఱల మఱలఁ దలపోయవలెను.

శివునికి సమానులు గలరనుటయు యేకాత్మవాదమునుగూర్చి
యెల్లప్పుడు గట్టిగ చర్చించుచుండుటయు శివుఁడెక్కువ విష్ణువెక్కువ
వాఁడా, శివశబ్దములో విష్ణుశబ్ద మంతర్భూతమనుటయు ఈశ్వరునికెని
మిది యాకారములు గలవనుటయును, దుష్టులను లోకోత్కృష్ట భక్త
సంతతితో సరిపోల్చుటయును వారి కష్టతరణత్వములను వినుచుండుట

యు మనోపాతకములని శిష్టులా చెంతకుబోరుగాన నో భూపాలా! నన్ని పుడు పిలువబంపిన హేతువున నేనిటకువచ్చితి నావలనఁ గల ప్రయో జనమేమి ? అజ్ఞకుబద్ధుఁడనై దోసిలియొగ్గి యున్నవాఁడను సెలవిమ్మ నుటయు, రాజుపరమతస్థుల మోములు చూచెను. వారను తలలు వంచి పెదవులు దడుపుకొనుచుఁ గొయ్యబొమ్మల పోటులవలె నిలువఁ బడి యొకరిమొగము నొకరు చూచుకొనుచు నోటమాట రాక నిలు వున నిశ్చేష్టులై నిలుచుండిరి అట్టిపరవాదులను రాజునుగాంచి తాఁ జేసిన పొరబాటునకుఁ దనలోఁదానే సిగ్గునొందుచు చిన్నబోయిన మొగ ముగలఁవాడయ్యెను. కుక్కమొఱిగి చెబ్బతిన్నట్లు క్రొవ్వునఁదార్కికు లు వితండవాదములు సేయుచు బాచనను మనుష్యమాత్రునిఁగా భావించి యాతనియెడ ద్రోహముదలఁచినవారు దమలోఁదామె సిగ్గు జెంది తమతప్పునొప్పుకొని బాచయ్యను కేవలము సాక్షాత్కరుఁడగు రుద్రునిగాఁ దలఁచి మెుకుటు నొప్పుకొని దండములువెట్టి తారుమారులు త్రోవలఁ బాఱిపోయిరి వారట్లు పాఱుటఁజూచి బిజ్జల రాజును సిగ్గుతోఁ దనయంతిపురికి బోయెను. అప్పటనున్నయార్యులెల్ల రుఁ దన్నుఁ గీర్తించుచుండఁగా బాచయమంత్రియు బసవేశ్వరులవారును, శివభక్తులెల్లరును, తమతమ యునికిపట్లకుఁ జేరిరి.

ఈషాడ్డలదేవు బాచయ్య పవిత్రవిచిత్ర చరిత్రమెవ్వరు భక్తి శ్రద్ధలతో శివభక్తసభాంతరాళము నెల్లరు వినునట్లుగా వక్కాణింతు రో యెవ్వరిట్లు నుడువంబడు మహానుభావుని ప్రత్యక్ష నిటలాక్షుని బాచయామాత్యుని యుత్కృష్టచరిత్ర శ్రద్ధతోడను, భక్తితోడను, వించురో యట్టివారు యమధర్మరాజునకు వాహనమైన యెనుబోతుమె డలో దృఢమైన త్రాటితో గట్టబడిఁ యామడలకొలఁది దూరమునకు వినబడులాగున గణగణమని బిగ్గఱగా ధ్వనిచేయు ఘంటానాదమును స్వప్నమందైనను వినక కైలాసమున నందివాహనముపై నుమానసమేత

ముగా సకలపరిగణసమేతుఁడై స్వారి వెడలు మహాదేవుని వెంట నాతని ప్రమథులతోఁ బాటు సకలవైభవముల నొందుచు సత్యోత్సాహముతోఁ గైలాసలోక సంచారులై భూలోకమందలి శివభక్తులంగని మెచ్చుకొనుచు మూఢులంగని వీరెప్పుడు శివభక్తులై యీలోకమున మాతోసరిగాఁ గలసిమెలసి మసలుచుందురనుచు వారలకు శివభక్తి గలుగు మార్గములు పరులమూలముగా గనబఱచుచు 'లోకాస్సమస్తాస్సుఖినోభవంతు'' అని కోరుచుందురు.

---

# బసవపురాణము.



## సప్తమాశ్వాసము

### శివనాగమయ్యగారి కథ

పరమారాధ్యుడును భక్తిరసపుసూనపీయూషనిరంతాస్వాదితతమోదిత హృదయుఁడునగు బసవుఁడు యాతాయాతజంగమ సంఘమున కందరాని ప్రతిపత్తులనర్పించి యిష్టార్థంబుల నేర్చి, యభీప్సితంబులదీర్చి నాబంతులగూర్చుచుండుటయు శివనాగమయ్య యాతిథ్యమగ్రేసరమై నిత్యమంగళప్రదుఁడగు బసవుని పరిపాటికి సాటిలేని కపటముగా నుండెను. అసూయాపూరితులును, విద్యాగంధవిహీనులును, విమతులునగు విప్రులీమంగళహృదయుని, భక్తజనమధ్యస్థుని పరమానందము, శివనాగమయ్య నూత్నస్నేహోత్సాహము, విలో

కించి యనమంజిన మైత్రిగాసూచించి భక్తిపూజ్యుఁడగు బసవనిప్ర
ఖ్యాతికి వైరఖ్యాతిఁ బూరింప నదనుగా నెద గొని బిజ్జలుని పజ్జకేగి
లజ్జనుజ్జగించి జ్యావతీ! పరాధీనులకడ, యిష్టులపై నిష్ఠురములు కష్ట
మానష్టము వెట్టును! అయినను పత్యాత్మము పరమాపదము మా చెప్పి
నచో నొవ్వులు తవ్వులై ముప్పులుప్పతిల్ల జేయునే యనుఁడు. వినికి నిర్దు
ష్టమగు దృష్టి ప్రామాణ్యముకదా! బసవుఁడు భక్తాగ్రేసరుఁడు, పార
మార్థికుడు, లింగావిష్టుఁడని నమ్మకఁగొంటముకదా! వారిప్రమత్తత
జిత్తగింపుఁడు అగ్రాధమవర్ణంబుల నిర్ణయింపఁజాలక, చాలక యా
రాధ్యులవంకఁగొనక నంబిసెంబలుల నతిథిసత్కారంబుల నంతమెరు
గని మెంచిమించి పురవీథులన పాంక్తేయుల రీతి నస్పృశ్యులపగది,
నబ్రాహ్మణ్యమునట్లు మముగాంచ కైంకర్యము కూలి మొగ్గుబెట్ట
నేటికి కుమతిపరిజుష్టముగా శైవసామ్రాజ్యమునక చెల్లినది జియ్యా!
బసవుని రప్పించి మొట్టయెదుట యీవర్ణసాంకర్యము, కైంకర్యముగా
దనియు, మతినాశంకర్యమనియు మందలించినఁగాని సందర్భము లావి
ర్భవింపవని పల్కి యుల్కి బిజ్జలుఁడు సజ్జనాపవాదంబు నాదరింపక
యు గాదన జాలక, నేలికవడువున గడువుండక నండకు రమ్మని బసవు
నాజ్ఞాపించుటయు, ప్రభుచిత్తాయత్తుకును, భక్తాయత్తచిత్తుకునగు పర
మార్థవిద్ధుఁడగు బసవఁడుత్రాసమేల, మేలయని శివనాగును శైవంకర
మగు శిబికారోహణమొనర్చి భక్తుఁపరిచర్యల నెరిగించుచు నేతెంచిన
సంచితపుణ్యుని బసవుని యాలించి తిడిగించి నృపాలుడీ యన్యాయంబు
నమాంగళ్యమేమి, అని ధిక్కరించుటయు, భక్తసాయుజ్యుండగు పూ
జ్యుఁడు దిగులుమాని పనిబూని! ఒజ్జాబిజ్జలా! నాస్తికులరీతి, పామడు
లవలె స్త్రీవిద్యావిష్టులభాతి, జైనబౌద్ధుల మాడ్కి జాడ్కిఁ రాని వై
ష్ణవవర్ణాచారములు (శివ శివ!) పట్టుబడినట్లు జాతివైషమ్యముల త
ర్కింప సంపత్కరించునే! ఆరాధ్యున కన్యాత్వమారోపింప జెల్లదు.

అణిమాదుల కధ్యాత్మికచింతయే స్వభావము. అష్టాదశసిద్ధులకారా ధ్యుఁడే యాత్మగ్రాహము ద్వంద్వాగ్రుఁడగు ప్రణుతసిద్ధుఁడీ శివనాగమయ్య. అట్టియెడ జన్మకాష్టికమగు వర్ణనిర్ణయము బూనెదవా పూర్వాశ్రి యుండగు గొడగరమాచనార్యు స్వర్గధేనుజానువున నీసర్వాశర్వరాజ్యం బును హేయమన్న నిమ్నజాతియే యగు. కామధేను సంతాన ముగా జూపించు నీలోక సంతానమున కంతరాయము శేయనీయనో న్నమిన్నలకే తెన్ను లెన్నుటసన్న కాదు యజ్ఞాచారమగు పిష్టి, స్వర్గసం యోగంబగు పశుకాండలో దుండగమున్న దన్న హోమశేషమారగించు న శేషమనీషిబృందంబున కీవర్ణసాంకర్యదోష మాపాదింపవగును. శై వారూఢమున ప్రవర్తక నివర్తకమను మతద్వయభేదము లుత్పన్నమై నవి అందు తొల్లిటిదిభవజన్మ జడము ప్రాకటశివసంస్కృతుఁడు నివ ర్తుఁడు, భక్తిజ్ఞానవైరాగ్యంబగు వర్ణంబెసముత్తీర్ణము. శైవులు నిరా కృతులుగాని పరాకృతులుగారు పురాకృతమగు జడలోకము, మూఢ త్వమునుఁజేసి తిరస్కరించిన సంచితార్థములు శైవసంధానమున కను సంధానము లేయని నమ్మిన నాసిద్ధాంతమంత రార్థముకాని వ్యర్థముకా దు గారవరా! భైక్షజము లేల! భక్తనరు లేల! శివనాగుని సాగమ నమే శైవ నుగమన మనజాలక మనజాలర యీలీలవిమతులు ప్రేలజోల మాలునే! కరికిపంది, హరికినుక్క, హేళికిఖద్యోతము, చంద్రునకునక్షత్ర ము, క్రందలుగంగకు సముద్రమునకుకుల్య, కామధేనువునకు గార్దభము, కల్పమునకుగచ్చ, సరిపోల్చుట తగువరులపనియగునా! ఒక్కశివభక్తు నకు వేయిజన్మబ్రాహ్మణ్యము నాణ్యముకాదని వాదించి మోదింప నా దరింప బోధమతియై సంగతియై యనంతఫాలాక్షు సత్సభాభ్యంతరాళ మునకుండి శ్రీపతిపండితయ్య స్థూలనిర్మితదుకూలమునఁబోలన లోకా లోకసంహారకమును, సర్వభుక్త్వమునగు హరుని త్రినేత్రమున నిము త్పన్నమైనకీలలఁ దనకేలనవలీలఁబట్టి పరిశోధింపలేదా! ఆరాధ్యులప్ర

క్క వ్రాలినమషికంబులకైన నీజాతిబ్రహ్మకూటంబులు సాటికావు, ఇందుకు తార్కాణ మొక్కగాదార్థంబుకలదుగా?

## కల్లిదేవయ్యగారి కథ

తొల్లి హేలాపురంబను గ్రామంబున యశోధనుండును రుద్రాపరావతారుండునగు ప్రసిద్ధభక్తుఁడుండెను ఆతని నామధేయము కల్లిదేవరయ్య. తద్గ్రామంబున నీశ్వరాలయ మొకటి గలదు ఏతదాలయమంటపమున నాగ మొండు శైవసాన్నిధ్యము గల్గి వెడలుభక్తులఁబట్టి సాయుజ్యంబు నొందించుచుండెను. సామాన్యులాశాపాశబద్ధులగుటచే పాపపరిదమని యెంచునిహంబునహించి పాపసంహారమునకు భయభ్రాంతులై మరపరివేశంబునకు జంకివంకలఁబోవుటయు విని భక్తాపాయ భుజంగగారుడమణియగు దేవయ్య శైవసాక్షాత్కార మొనరింప పరివారలు వలదని వారించిన సారించక మండపప్రవేశ మొనరించుటయు యథారీతియని దుష్టభుజంగము జంగముదేవర పాదములు పాదాక్రాంతమైనట్లు బిఱ్ఱుగఁగుట్టి విషభుక్కని తక్కువగా మక్కువకుని లింగదేహమును భంగపఱుప తెఱపిలేక చాకలించుటయు నెల్లరువిలోకించి కించమాని విగతపాపరూపంబును జేపడిచూచుచుండ దేవరమహత్వంబు సహత్వంబుగా నాచచ్చినపామును తనయిష్టదైవతాలంకారమని బాలిగొని పునఃప్రాణప్రతిష్ఠ జేయుటయు నీవార్త యాబాలగోపాలము జనవిద్ధూరమై యప్రతిమానశక్తి సారూప్యమానోపించుచుండెను. అంతగృహదాసి నర్ఘ్యంబునకై యుదకంబుదే భాండముగొని తటాకంబునకేగుచుండుటయు జనసమ్మర్ధమగు మధ్యేమార్గంబున నొకవిప్రుని కరస్పర్శచే నామె 'శివశివ' అని యాకుండను దండగబెట్టె విభూతిధారణమైనవెనుక నూత్నభాండోదకము గ్రహించుటయుఁగాగల యాచారంబులకందలి విప్రులొక్కవడువున పంకించి కట్టుగానొక్కపెట్టున నేకాం

తమునసున్నను మాకాంతప్రియమానసుండగు దేవరన్వై దాడివెడలి మీదాసియే భార్యసికి మాసంపర్కము విప్రస్పర్శ యోతవిషమైనదో వింటిరా. మాతాకిన దీనికి దురాచారమంట మీపాటిచేసి యీబోటి నిమాట యెత్తమెతిమి యిట్టిసంప్రదాయములు వేదోక్తమా, శ్రుతివక్తమా, పురాణోదితమా, ధేమమా, యుజమానులకడ నిర్ధారణచేసి విడుచుట సంభావ్యమనుటయువిని పరతిరస్కారగమొల్లని సల్లలితహృదయుడయ్యు దేవరప్రతివాదుల వర్ణితివ్యాముసహ్యాముకాని మానసమున భూవరుల నుద్దేశించి ఆర్యా! వితర్కము లేల! మిమ్మంటరాదంట శైవశిద్ధాంతము. భక్తావాస స్థితపుర్కాలికిని మీపోకుతగదు అట్లుంగాక (బ్రహ్మణి చరంతీతి (బ్రాహ్మణాః) పరమార్థముసాకారము పరశబ్దముత్కృష్టపదంబు గావున శశిఖండభూషణున కాయర్థముసార్థకము కావున వ్యాకరణోక్తముగా సంస్కరించిన [శైవంపరమోత్కృష్టం, ఉత్కృష్టంపరమ్ ఏవా, ఏవమ్ బ్రాహ్మణోశ్శైవం, శైవాఏవై బ్రాహ్మణాః ఏతానైశైవంవేదా!] అనుప్రమాణభాష్యములు స్ఫురించును. బ్రహ్మతబండనకు వాసి సహజకోపోద్రిక్తులై దేవరా! మన్నించుచుండుమనియూ యీదురాలాపము శైవేతరమెల్ల వేదబాహ్యమనియు శైవేతరులు శునులనియు నీయుత్కృష్ట అట్టియెడ సర్వతోముఖమును శర్వాంతరార్థకమునకు సోదహరణముగా ప్రయుక్తంబగు నొండుస్వరయుక్తంబులగు బుక్కులు సల్లపింపుచునుటయు భక్తవశంకరుండగు శంకరుడు కాలభైరవాంతర్గమనుండై ప్రత్యుర్థులు వ్యర్థకుడ దేవరపాలబడుటయు నాయింటిజాగిలము వేగిరము ద్వైవాదత్తనుగు వైదికాసనము లంకరించి దేవరయావర్తములకెల్ల ప్రత్యాపన్నములు సమర్థించగా గన్నవిన్న విప్రవరులెల్ల తెల్లబోయిరి. అంత విజయోత్సుకుడగు దేవరవిప్రులఁ దిలకించి ,కూపస్థమండూకములక, గాని యీయబ్బురమేల! సర్వసిద్ధియగు సిద్ధరాయని పురంబున నొకసారమేయ మపారవేద విద్యా

ప్రసక్తమైయున్న దానిగురువింత వింతకాదు ఇట్టిభక్తాంకితముల జల్లు గొన్నలాలాజలంబులైన ముట్టకట్టడిజాతికి చెల్లునే తొల్లి శైవుం డొక్కరుఁడు కోటివేన విప్రులకు మేటియను మాప్రత్యక్షసిద్ధాంతమున్నది. అది మీకగమ్యము కానోపును అని దేవరధిక్కరింప ప్రతివాదిభయంకరుఁడగు నప్పటి బాడనల నిరాకరింపనొల్లని బకుగుబావలా పడదేవర పాదాక్రాంతులై పండితవాక్యము రిత్తవోవునా! నేర్చిన యంతకునీతి మనీషులముందు మామాట సత్యమైనను లోటుపడకున్నేని గ్రహానుగ్రహసమర్థుల ప్రత్యర్థులగు వాక్యపరంపరయే పటిగానిమాసత్యసూక్తి వాదనబలములేమిచే సామెతకాదు దేవర శైవమహత్త్వముత్కర్షించి మూఢతార్కికుల సిద్ధాంతముల గస్తిచేయనెంచి విప్రసాయకులారా! శునకమన్న గిలిపిరి జంతుసారూప్యార్హులు కారని నేతెలియనైతిని అంతకు నీచాతినీచమై పరమాత్ముల పాదధూళిసోకినమాత్రాన యుత్కృష్టమగు జడమునైనగాంచి సాదృశ్యము గొనసగును ఇదిగో యీపాదరక్షకు సతుల్యమైన యుత్తములిందెవ్వరుందురో! యని తులాభారమువేయ భక్తపాదరక్షకైన నావాదవేదబృందము సాటి రాజాలక దేవరప్రపర్శనమునకు శైవాదర్శమునకు విమర్శచేయలేక సిగ్గుజెంది వగ్గవీగి యథాయథలైరి

## బిబ్బబాచయ్యగారికథ.

నృపాలోత్తమా! సత్త్వమాని శత్రుభావమున శైవోత్తముల నుత్తడీకొనిన మూఢులగతి రిత్తవోవునే! తొల్లి విప్రాగ్రహారంబని పేరందిన గొబ్బూరను గ్రామవిశేషముండు. అందు శైవతత్త్వరమానసుండును, భక్తజనాగ్రగణ్యుడును నిరంతర జంగమార్చనాతత్పరుఁడునగు నొకమహామహుఁడు వెలయుచుండు. అతనినామధేయము బాచయ్య స్వగ్రామంబుననే కాన దూరభారంబున నెంచక

పరిప్రాంతము లెంకి దవ్వేన నారాధనపేరువిన్న పులకితగాత్రుఁడై యయ్యో భక్తసంవాసాప చూ రూపంబు నగ్రహారంబుపై పడి యుండ్లదహించెను మేకలమూడ్చెను, కొట్టములముట్టడించెను, మిద్దెలగూల్చెను, గాదెలగాల్చెను, వేదపాఠశాలల నేలమట్టమొనరించెను, గేహసీమలు పేరుమాసెను, దేహళులు మట్టిగొట్టెను. రాజవీధులు బగ్గముపాలయ్యెను, బజారులు హజారములు బట్టబయలయ్యెను, గ్రామాశేషమిట్లు భక్తునిశాపవశమున ముట్టుకొనుటగాంచి బాచన యపారభక్తియుక్తుడు అట్టివానితిరస్కరించుటచే నొండొరుగాక సమూలాపాటము సంభవమయ్యెను. హాస్యమునకై యగ్గిదాకిన కాలకుండునా! అదిగో! యింటిపశువులాధారహీనమై యల్లాడుచున్నవి! వత్సహీనమై, వగచుచున్నవి. స్త్రీలుపాతలులేక రోతబుట్ట జేతులజేతములమోచి విలపించుచున్నారు! శిశువులు వ్యసనముతో నున్న మాతల నదుతల నుబ్బిన వేడిబొబ్బల నుబ్బరముల బొబ్బ బొబ్బయని భ్రమసి సొమ్మరిల్లుచుండిరి. అంతకు నిష్కారణవైరమే కారణభూతమయ్యె. గతన్నాస్తి పూర్వకృతమునకు వగవనేల! ఇంతటికిమేల్కొని బాగుపడుట ధర్మమని యన్యోన్యము సంప్రతించుకొని వాదముడిగి సాదరమున నాదయూపరు శంకరహృద్వరిసరిసరసకు జేరి కరములు శిరములజేర్చి, పాదములప్రవాద మొనర్చిఁ దిక్కెమని యొక్కమ్మడి దుక్కముగ దురవదురు పాపులుతీరని మాహాత్మ్యమునకు బాచను సహజకోమలహృదయుడు, శరణాగతభక్తవత్సలుఁడు మెల్లనిజూపులజూచి తెల్లని చిఱునగవు వెల్లనిమోమున జిలుకాడ, చల్లనిమాటల వెల్లుగానాస్వాసించి పరామృశించి తేర్చి యూరార్చి మందలించి గర్వభంగమగునట్టు లార్యా! ఇదేమి వెతండికము. తృటిపూర్వమున నంటకూడదంటిరే! మఱుక్షణము మాపుల్లెల, పాతల రోతగొనక బూసికొందురే! అగ్నివర్ణముల స్వాశ్యాల విమర్శించుటలు శెల్లుతు. దర్శింపనొల్లునే! పామరలోకంబున

కగుజాతివైషమ్య మేలలెందు. సర్వశివంకరుండగు గౌరీపతి జలవెలగా నెంచి, తద్భక్తుల ననురక్తుల ముక్తిసంగుల భంగపుచ్చ మచ్చరమూను ట దేహమ్ముపై గినిసి తను వినాశమొందుటగు.అట్లైనను సాయుజ్యమగును గాదన్న చొక్కానిభ్రమలేల' అని నిజమహత్వమున నారుద్రాగ్ని నుపసంహరించుటయు నయ్యది లక్కపండువలె, పవడమురీతి బాచని శంఖహస్తముల జేరుకొనియెను. తెల్విగొన్న బాపలు సామర్థ్యంబున గాంచ ఉగ్రహారము చెక్కు చెదరకుంటయు ఏతద్వృత్తాంతమంతయు కలగాంచెను బాచనిశైవ సందేశమున కమితానందమంది స్వయంకృతాపరాధములకు వగచుచు క్షమార్పణవేడి బాడబులెందే చనిరి. ద్విరకిత భక్తియుక్తుడై యాకర్ణాంత నిజవిశాలఫాలభాగంబున విభూతిదాల్చి రుద్రాక్షలురుతలేల, పట్టిసముఁజేబట్టి, చర్మంబుకటిబెట్టి లలితాలంకృతమును శైవమందిరంబు రగు శిబికకు పట్టువులఁగప్పి పడ గలదిప్పి విభూతినరిచి, మల్లెలపూదెవి మంచిగంధముపూసి మారేడుల మూసిప్పిగ్గమైముగ్గమైనుప్రసిద్ధమై నందికేశ్వరు బేరుకొనని యుల్లాసము ద్దగువెల్లయెద్దును పాదమున కందెయులు కొమ్మున పానుగొట్టములు నరుత రుద్రాక్షపేరులు నంకమున పడగలు ప్రక్క త్రిశూల లాంచనము పార్శ్వమున పన్నగాలంకారము లలాటమునఁబైడిపట్టము కంఠమున శేగంట ప్రకాశింప దవ్వుల శృంగారంబుగదోచు రాకేందుబింబమో యనునట్లు శకటమ్ముబూన్చిన యమంగళతూర్యనాదంబు లుప్పతిల జం గమార్చనలపాల్గొని భక్తభుక్తశేషంబు లపారముదంబున నెత్తిబత్తి మెయి బండిలోనిడి పరమేశ్వరుని భజనచేయుచు బోయి తత్ప్రసాదంబున తోడిభక్తులదనిపించు బాచయ్య యమాయక స్వభావమును గాఢవిశ్వాసమును నిగూఢభక్తిని గ్రహింపజాలక ఆయూరి వేదవాచ్యులమని యగ్రేసరులమని యగ్రజులమని యపభ్రమించు పండితులెల్ల మత్సరబుద్ధులై యొక్కనాడానందపరవశుడై సాటిదేవరుల యుత్సా

హామునఁ బాల్కొని పరవశుఁడైన బాచనివేచని వెరుచబాపలు అంత్యజా! నీకెంతపొగరు. చచ్చుడిపూటములకూడి అగ్రహారముర చ్చల విప్రులమచ్చలనిట్లు సైపులేని కైపున మైలజేయ జెల్లునే, ఆహా! పుల్లెలబువ్వకు మడిగట్టి యీపోడిముచ్చెలగాండ్రతో నోడలెఱుగని సివమూనుటంతయు కైంకర్యమేగాబోలు నేర్చుబోతివిలే అని యెగతాళిశేయ భక్తహృదయము జలింప బాచడాగ్రహయుత్తుఁడై పదార్థవాదులగు సోదరులారా! ఇదే గొప్పప్రసాదము కాదందురా! శైవలోకము హసించుగాక తమకింపక డాయుఁడన విప్రులు మాటగాయని విలోకించునంతలో భుక్తశేషాన్నముగాదె, కుంకుమరాశివలె, బాలసూర్యకిరణవితతియట్లు కోమలలతికాగ్రములట్లు నరుడావిప్తములగు సూక్ష్మణువులు దృగ్గోచరమగుటయు చెనుకీయుని కోపావేశంబున బాచడా సిప్పకల గ్రహించి రుద్రపూజ్యమగు మందారదళములట్లు భ్రమించి వెలయ రాజకణంబులజిల్క యొడలంటి గడ్డములుకాలి పట్టలంటుకొని పేదబాపలు కచ్చులువిచ్చుకొని దోవతులూడ్చి యాత్మసంరక్షణార్థమన్న భయమునకు దాళలేక జంగములవ్యథాదూలిన గాలిసోకునకు ముక్కుచు దవ్వేగియుంటయు నిష్టభక్తపరివృతుఁడై బాచడు యథాపూర్వకముగా మంగళగానతత్పరుఁడయ్యెను

(మాదర దూడయ్యకథ)

పవిత్రగణాధిపభక్తులకు యుక్తుల వంచించు సంచితంబు సామంజస్యమగునేపో! భక్తాగ్రణుల మానసికశక్తుల గ్రహియింపక కొఅమాలిన బేలుపోకలసాకున వర్ణభేదములెంచు కుత్సితుల తలదన్ను వన్నెలపున్నముగొన్న వెన్నెలదాలుపు వేలుపుగొలుపు కథ నుదాహరించెద విందువుసుమ్ము, విప్రవర్తమను బ్రహ్మవాటి పరిసరిని పేదయు శంకరపదారవిందధ్యాన నిరంతరాయమానుఁడగు నొక బడుగు మాలడొక కుటీరమున జంగమార్చనల సల్పుచునున్నంతకు పరమేశ్వరునిపై

భారముంచి సత్కాలక్షేప మొనర్చుచున్నంత నొకనాడు నడురేయి యింటికేగ దారితప్పి యెందేచ ంగనుగొన బ్రహ్మవాటవాసియు సర్వాంగకుష్టయు నగు నిప్పుడు పరిభూములగున్నమ్మరి చీకటిచాటున క్రిందుమీఁదు తెలియగక దూడయ్య యింటిపొంత నంతులేని పుంతలోఁదిగి పడి లేచి యిల్లు జేరి పాదప్రక్షాళన మొనపెదప దేహము గాంచుటయు దొంపిగొన్న యంగికములు తేజోవంతిములై యుంట గాంచి దిక్కుఁదోపని మాపంతియు దేపక దేజుపుగానుండి లింగదర్శనమునవేసి వేవేగ నాజాయపచ్చుచుండెను. దూడయ్య యంతయు లింగముహూర్తమున మేల్కాంచి నిత్యకృత్యంబులదీర్చి భృంగిమాహాత్మ్యమను యంత్రరాజమున తేజోమూర్తియై గురులింగార్చన మొనరించుటయు తత్ప్రదేశమును గురించి ఏతత్క్షేత్రశంఖుస్థాపన కన్నులారగాంచుట నావిప్రుడీ స్థానవిశేషమునకీయన మాహాత్మ్యమేకారణభూతమగునని గ్రహించి "శరీరమాద్యం ఖలుధర్మసాధనమ్" అనియెంచి భగవద్భక్తులకులోత్తముల పృచ్ఛింపనిచ్చగింపక వచ్చి యాతని పాదోదకము పాదమస్తకము స్నానమాడుటయు సతనిరోగము భృంగిభూషను సేవాతత్పరుని ప్రభావంబున నివారణగుటయు నావిప్రుడు సంతసిల్లి గురుభక్తియుక్తుడై నీచమనక యగు బాగు దూడయ్య యప్రతిమాన శైవభావంబు లోకంబున జాటుటయు తదితరులమాటలేల నేడువందల విప్రులాతని పాదములసన్నిధిఁబడి మ్రొక్కి నిరామయులై వెడలిపోవుచుండిరి. లోకవిభాకరుండగు ప్రభాకరుండు నీశ్వరారాధనఁజేసి తన యంగమచ్ఛమునుఁ బాయుటఁజేసి ద్వాదశరుద్రుఁడై లోకారాధ్యుఁడయ్యెనుకదా! సామవేదుండను విప్రోత్తము డాకాపథంబున బోవుచు నరణ్యమధ్యమున బ్రాహ్మణులకు తొలిగిమెలగ కపలలము సలిలమున పక్వముజేయుచు నిటలాక్షునకు 'సో శంభో మాంపాహి' యని నైవేద్యమిడుచున్న యాతని నిర్లక్ష్యమునకు సామవేది రోషించి కషాయకంఠుఁడై, శురా! ఎగ్గెంచని పగ్గకుపో

యి మమ్మగ్గువ చేయుచుంటివా! ఉల్లితిని మల్లెలు ముడుచుకొందువు గాని, ఏగూటిపిట్ట ఆపలుకులనే పలుకును మసిబూసిన మారేడగునా! నీసిగ్గుమాల! ఆలగ్గుమానము బోచ్చె, చెచ్చె చెప్పులనందు నుంచిన నీమాలకుని భక్తపరాయణుడని మోసపోవుదునుకొంటివా! కొంటీ! నాపేరు నీతీ రేచెప్పక చెప్పవని యధిక్షేపించుటయు శ్వపచయ్యనా నొప్పనా శంభుభక్తుడు సాధూత్తముడయ్య నాధనోక్తుల నామూఢద్విజునికి ఋజుమార్గము, ప్రయోజనమార్గము, ముక్తిసంసర్గము భక్తివనర్గళ ప్రభావము ప్రబోధింప దయయుంచి కించుబూనెను ఆదృష్టిపటుత్వమున విప్రుడు గిమయుక్తిచిక్కి నిశ్చేష్టుడగుటయు తన్మహత్వభావమున చకిత భక్తిపిజ్ఞానుడై తక్కుగలబాడబులు సహితము ప్రక్కజేసి మక్కువపడి దూడయ్యగొనుసగు ప్రసాదంబుల మాంసాదనంబని యెంచక పంచియించి భక్షించుటయు నతనికి ప్రణమిల్లి శిష్యులై యీ జగన్నాథ ప్రసాదము మహాధనముగా నానాటి బాడబులెల్లరు గొల్లగ నొసవిరి ఈశ్వరోపాస్తిలేని ద్విజునికంటె సీసనాంతరంగికకొల్వు నల్పు శ్వపచుండైనను భంగల నుత్తమసంజాతుడౌ గదా!

ఉద్భటార్యుని కథ

హేయకార్య విసర్జితుండును, సద్గీతదుర్మతవార ప్రభాస్వంతుండును, లింగార్చనావశ్యుండును, అఘువిదారుండును, కైంకర్యయుక్తుండునగు నుద్భటార్యుడు వల్లకియను పట్టణము నిజమహత్వంబున సర్వపవిత్రము నరించుచుండెను ఏతత్పట్నమునకు భోజుడధినాథుడుగా నుండును. అతడు సుశీలుడు సద్గుణసంపన్నుడు. భక్తసౌహృదుడు విమతభీషణుడు. దుష్టసంహారకుడు. శిష్టపరిరక్షకుడు. గురుసేవాపరుడు. శైవరహస్యవేది. ఉద్భటార్యుని పరిబోధమున మంగళప్రదుని నిస్సంగును సంగతులు సాంగమునెఱింగి లింగార్చనా కౌతూహలమానసుడై సిద్ధాంతియగు గురుకైంకర్యమున నశ్వరలోకార్థము లనర్థములని సరకుజేయక

సుస్థిరసాయుజ్యపదవికి యదను వెదకుచూటయు, శైవరహస్యవిదూరులు ను కర్మభ్రష్టులునగు పామరజనము నృపాలుడీలీల నిలనేలమాని మా నని మందిమేళకుల వేడబముల నుద్భటుని భటునివలె చిటివోటి శివగీతముల జేతుల మూతుల కోతగా బూతినాది బూతమూర్తిగా కితకితలాడుచుండునా. కానిమ్ము క్షుద్రమార్గము బాపి రాజ్యపారతంత్రమునకు దిరిప్పనిమనల గొప్ప యుప్పుడేల చెప్పవలెను అని బిట్టువగచి యొక్క పెట్టున భోజునకీ స్మార్తమతము రాజ్యాలిప్తమనియు, ఉద్భటార్యుడుత్తమపీఠ్యుడు కానందు నతడా వేళనుండి యుపదేశములు దేశీయములు కాబాలనందు విసర్జనీయములనియు, నీచసంజాతుల సంగతి యుత్తమకులజుల కసభ్యములనియు వాదబలీయముగా పెద్దనుద్దులెత్తి పొత్తముల సత్తువులం జూపినను గురుపదారవిందధ్యానా యత్తచిత్తుండును, శైవసేవాప్రధానుండునగు భోజుండు బ్రహ్మజిజ్ఞాసువుల పశువులుగానెంచి పశుపతియందె డెందముంచుటయు నాకూటబాపలు మూగతోపక ప్రాపుగానక కానకపోయిరి. ఇంత కొంతకాలమునకు విమతుల నధోగతి పాల్జేసి తానుత్తమపథము నలంకరించెనో యన నుద్భటుండు లింగదేహము చాలించి శాశ్వతసాయుజ్య పట్టభద్రుండయ్యెను ప్రతివాదభీతిలేమి నైష్ఠమదుర్మతగులు చెలరేగి చెడవాసి యుద్భటార్యున కగ్నిసంస్కారము శేయ ప్రేతభూమికిం గొంపోయి యుంచుటయు తత్పరిసరవటజూటంబుల మాటుననున్న భూతపిశాచంబులు చమ్మలుమాని కుతూహలముగా విలోకించునంతలో ప్రేతహోమమగుటయు తద్ధూమోద్ధూతములైన కింకరవర్గముసహితము తమపూర్వకృత పాపపరిపక్వమై కైలాసగిరిచేరెను అందొక్క భూతమగు వెనుకంజని జట్టులేక దిట్టముడిగి డగ్గిలుటయు నాయులికిడికులికి భోజుగు భూజము రోజుటయు నాభూతము నద్దడగి కొయ్యోద్దిక జేరి ! ఏలికా ! నేను భూతమును. నాదొకమనవి. నాపరోక్షమున బందుగులెల్ల యుద్భటార్యుని ప్రేతధూమ ప్రభావంబు

న ప్రీతకల్మషులై పుత్రచారిత్రులై భూతాధినాథుని రాచకార్యమునైన నీడిపోయిరి ఇదియు నాయదృష్టమే కావునను భయతారకముగా నొక్కఁ ఫక్కినొక్కి చెప్పెద. కాదనరాదు ఈ ప్రేతసంచయము గావించు ధూమము పెంపుననే నిలింప పదవినందెద•తోఁడనె నీవీవటవృక్షము నాశ్రయింపుము నావెంట నీవును ముక్తిసంగుడవు కానేర్తువు ఇట్లు భయత్రకార్యసిద్ధియగునన విని గురుసంసర్గ మీమార్గముననైన లభించుగాక యని నిశ్చయించి వటముక్రిందను సంచయనవిధు లాచరించి బంధుయుక్తముగా భోజుఁడా వృక్షారోహణ మొనర్చుటయు భూతములతోడ్పాటున భక్తధూమ ప్రభావంబున భోజుఁడు గురుసాన్నిధ్యమును శంకరుసాన్నిధ్యమును సాధించెను భక్తాశ్రయముక నోడతోడి పడవ వలె నల్పుఁడు నుత్తీర్ణుఁడగును అల్పజ్ఞలు తృణముల సంగ్రహించి భవజలధిలో మునిగిపోదురుకదా !

### దోహరకక్కయ్యకథ

మదనన్నైరియంగ మదినిలిపి తదావేశంబునకుఁ బురికొల్పి,తద్భక్తపరుల నర్చించి, తత్ దైవతముక స్మరించి, వర్ణించి, కీర్తించి, యాశ్రయించి, వరించి, మైహికంబగు గాహ్యాన్తరంబుల తన్మహాత్వప్రభావంబున సూర్య కిరణంబుల నిచయమువలె, ఝంఝూవాతంబున జీమూతంబువలె ప్రత్యర్థింగి ప్రబలవిజయము గాంచిన సంచితపుణ్యులలో నగ్రగణ్యుడనఁ దగు దోహరకక్కయ్యావధానుకలయన చరిత్రంబువినపవిత్రంబును పాప లతికాలవిత్రంబునుకదా ! విశిష్టవేదపురాణనిలయంగ బని తనివిలేని పేరెన్నికగన్నకపటవల్లియను బ్రాహ్మవటితొల్లికలదు. ఆగ్రామమే కక్కయ్య స్వస్థానము అప్పురమున విద్వాంసుఁడొక్కరుంకు జేరి మీరినపెరిమతో పురాణగాధల శ్రోతలుజోతలు పెట్ట కట్టుదిట్టంబుగా వివరించి సవరించుచుండును అతని యుక్తికౌశల్యము బహుళవ్యమును బహుజనసంస్తవ్యమును, నవ్యమునువిష్ణుప్రభాసం

భావ్యమును, హరదూషణానసంతవ్యమైయుండును. విష్ణుదశావతారములు
వివరించిననోట హరవిశ్వాసందర్శనము నభివర్ణింపఁడయ్యె. విష్ణుమధువై
రియన్నపట్ల హరుఁడు మదనవైరియనఁడయ్యె, విష్ణుజగన్మోహినియన్నచోఁ
గరకంఠుఁడుగ జగన్మోహి' యనన్నొల్లఁడు విష్ణువు విమతులగు రక్కసుల
నుక్కడించెనన్నచోఁ, నంచికావల్లభుఁడు వైష్ణవ సంతానము సంహరిం
చెనని నుడువఁజాలఁడు. విష్ణువు ఖగపతివాహనుఁడన్నచోఁ, గరళకంధరుఁ
డు నందివాహనుఁడని ప్రశంసింపఁడాయె పురాణస్థములైన యాదికథల
వినియుంపని పెడబుద్ధి పుక్కిట పురాణములెత్తి జనాకర్షణమునఘనాకర్ష
ణమే భక్తసంతర్పణమును పరావకర్షణమనిహరణము జెందునా మందు
నియందము మాలిఁచాదమునుగాంచిపామరులుభ్రమయుదురుగాక, శివ
తన్మయత్వమునంది, లింగమూర్తితో నైక్యమందిన కక్కయ్యకీపౌరా
ణికములు వెక్కసమానుగాని యక్కరయగునే! శివభక్తులట్టివేకదా!
విమతకథల సారము గ్రహించెను ఉత్సహించెను సంకల్పించెను.
ఇష్టదైవతను సంప్రతించెను దైవబలము తోడ్పాటుగా, తోడ్తోవచ్చి,
సభ సంభ్రాంతినొంద, పౌరాణికుడు పరువెత్త, నువ్వొత్తుగావచ్చి పొత్త
మును సంగ్రహించి కిక్కయ్య దానిని చించి చిదరజేసెను అపరుద్రు
డ్రుడోయని భక్తావేశంబున కాగ్రించి యావిప్రునిపై బడి సింగము కురం
గమునట్లు దేహము లేహము జేసి, యెముకలదుమ్ములవైచి, ప్రేగులనాగు
లమెడవైచి, శోణిత్తుకుల కుంకుమపూరసమువలె మైనలది, పునుక జే
గొన్న చూపరకు భీభత్సంబుగా కక్కయ్య విలయకాలక పాలధారివలె, నట
రాజమూర్తివలె నద్భుత కృత్యమొనర్చుటయు. భక్తపరాయణుఁడగు
కక్కయ్య నెదిరింప సాహసించు వైష్ణవులు మందునకైన కానరారై
రి. నిజభక్తియన నిట్టిదికదా! శైవకృత్యంబులు సదా జయ
ప్రదముకదా!

---

## భోగి దేవయ్యకథ

నృప లా ! ఈశ్వరభక్తులు సమంచితశక్తియుక్తులనుట తెల్లము కదా. నిగ్రహానుగ్రహాయుతులగు గంగాధరకింకరులని భోగీకథ చిత్రకథను సుపుసును. తొల్లి కెంచావియను భూసురాగ్రహారముకలదు అందు భోగి దేవయ్యను విప్రోత్తముడు వసియించుచుండును. అతడు అశేషభోగిభూషభక్తజన భక్తిభావనాసక్తుడు. అతడారీతిని లింగజంగమసపర్యాసక్తుడై నంత శితికంఠరుడు ఏతత్ భక్త ప్రభావంబు స్వభావంబునో, స్వరూపంబునఁ బరీక్షింప నెమ్మదినెంచి నెమ్మదిగా లింగమూర్తి మెడన్వ్రేలించి, యాపాదమస్తము బూతిధారణమొనర్చి రుద్రాక్షుల రక్షగట్టి, త్రిశూలము గేలదాల్చి, శ్రుతులరోగిపడగలుబ్రవేలించి, హరశంభో అని శంఖముపూరించి భోగియెట్టయెదుట నొక పంచతరూపమున వచ్చినిలచెను దేవయ్య యట్లరుదెంచిన జంగమ దేవరను దేవరనభివర్ణించి ప్రత్యుత్థానము జేసి శివదవ్యంబు లనుచితసత్కారములఁ బూజించి, యుచితాసనాసీనుంజేసి సద్గోష్టిసల్లాపంబుల గుశల ప్రశ్నల గడపుచున్నంతలో లింగనైమిత్తికంబగుటయు దేవరయ్యభక్తిసంపన్నుండై యభ్యాగతినర్చింప యత్నించుటయు నాకువానామానవవేషధారి గ్రహించి సాక్షాత్ శివహృదయముగావునఁ దావచ్చిన కార్యమవార్యమగుట దేవరయ్య ముఖారవింద మవలోకించి యవధార్యా ! అశనాతురత యేల ! నావిన్నపమాలింపుము. నాదలంపు వచన మీావ చిరమునఁ బొనర్చుకున్ననాతిన్న సార్థకము లేదు. వెఱ్యాను దెచ్చియారగింప జేసితివా? నాభక్తహృదయము సాదువడి నీకష్టముసఫలమగును. అనినను భక్తులయెడ సంకోచమనంగీకారమగుట చేయసభ్యమనియెంచక మించిన దేమని తలంచి యొక మొదవును వంచించి యామాంసము రుచ్యంబుగావించి జంగమదేవరను సంతృప్తి పరచుటయు నీవత్తమానము గ్రామమామూలాగ్రము కీర్తమానమయ్యెను. ఈ_

మ బ్రాహ్మసంజాతుఁడగు దేవర నీచస్నేహమున వర్ణసంకరుఁడై మఱి మాలి తాసికూళ్లు కర్కశులకు గౌరవించి విందుచేయుటవిని యులికిపాటి ల్వాఁజాలు మేటిబడిఁరులఁ గొని దేవరయిల్లుజుట్టి యశ్లీలములబలుకువారు, అనర్థముల నడపించువారు, తలుపుల నడలించువారు గోడలబెకలించు వారు లోనివారల నదరించువారు నై యీవలకు రాకపోకల బోయిన గుడిసెలాగి యగ్నిహోత్రము దాగొత్తెదమని బహువిధాలాపంబుల 'నాథ భక్తవరుల వంచింపఁ బూనుటయు దేవయ్య యాకుమతిసంఘముల నుల్లంఘింపనెంచి దైవభారమొంచి యీవలనరుదెంచి, ధైర్యోత్సాహ ములు రెట్టింపఁ అయ్యలారా! మీరెల్లరువర్ణనిర్ణేతలగు ప్రముఖులు, నేనువర్ణసంకరుఁడను. నాసహచరులా నీచాతినీచులగు మాలమేళము. అట్టివానినన్ను విప్రోత్తములు దృష్టిశంక జేయుట శంకరుని వంకబెట్టుట సంభావ్యమే. ఈపొంతవీడుట యుభయులకుపాడియే కావున నిదేనాదే వుని నమ్మి మీసమ్మె సహింపలేక యీ వీడు నేడు వీడిపోవుచుంటిని. అని కలహము చాలించి గేహమువీడి మిత్రునిగూడి పురబాహ్యప్రదేశ మునవిడిసెను భక్తులు సంకల్పసిద్ధులుకదా! శైవప్రతిష్ఠితంబులగు పజ్జ లింగములు, శార్ఙ్గధరాంభుజగర్భముఖ్యదేవాళిని సంప్రతిష్ఠితములగు లింగములు స్వయంభూవరలింగమూర్తులును భోగయ వెంబడి గోవు వెంట వత్సములట్లు దశదిశల నెగయుచుండెను పీఠములుగాయును, దేవళులప్రక్కలించును, సోమసూత్రముల కంతల దాటును, పూవురా ళ్ళబెకల్చును, హిమనగజాత్మజను విడిచిపోవును తామరతంపరై చను ను డీకొనివెంటబడును, పంతగించి యతిక్రమింపజూచును, దొర్లులాడు ను, కలహించును, సహించు, ఈవిధమున గ్రామమునగల లింగమూ ర్తులు పర్వతపంతలవలె బంతులవలె భోగయ్య వెన్నంటి స్వేచ్ఛావిహార మొనరించుటయు కెంచావిదై వాపరాధంబున భక్తజనాగ్రహంబునకు గురియై పాడుగోరుచుండెను. వెండియు మేదినీమండలికంపించెను, తారలు

రాలెను. నభోవీధియల్లాడె సూర్యచంద్రులు తెన్నుతప్పిరి. చిమ్మచీక ట్లుగ్రమ్మెను సస్యములువాడెను. బావులుపూడెను ఘూకరాకములు కూడెను, వాయువు స్తంభించెను దూమముప్రకోపించెను. నిప్పువానకు రిసెను. తెప్పలుమునిగెను. గుండులు తేలెను. పురములంటుకొనెను. వనము జలమయమయ్యెను. ఇట్టిభయోత్పాదములు లేటస్తి ంపవంచనా పరతగానెంచి యుద్ధివచ్చి యచ్చటివిప్రులు చెచ్చెరవచ్చి నోచ్చుకొని దేవయ్య పాదముల జాతములబిగబట్టి దీనులై స్వయాంకృతాపరాధ మునకు పశ్చాత్తప్తహృదయము లైనట్లు కన్నీరుమున్నీరుగా బాష్పజ లంబున నాపరమ శివునిపాద ప్రక్షాళనమొనర్చుటయు దైవ్యోద్భోదన మే ప్రధానాంశమును భక్తప్రశంసనమే ప్రాణప్రదముగా గొను దేవ య్య బాపనయ్యలమొక మిత్రత్వముబూని వారివేడుకొలు నపురప్రవేశ మగుటయు నాతని ప్రభావంబున తొల్లియథా యథమైన లింగములు యథాపకార్యముగా స్వస్థానంబుల నలంకరించుటయు గాంచి మిథ్యా జంగము సహితము గొనియాడి వేడిచనియెను.

## గుడ్డవ్వ కథ

తొల్లి పాండుపుర మను క్షేత్రముకలదు, అందు వేదవిదులను వదనుగొన్న వదుగురు బాపలు కాపురముందురు. ఏతత్ క్షేత్రప్రాంత మున నొక్క మాలపల్లెయుండు, అందొక పేదరాలు వృద్ధురాలు వసియించును ఆమెను గడ్డవ్వయని పిలుతురు ఆమె దిక్కుమాలినది సర్వాంగ కుష్టిపీడిత. పట్టరాని పరమేశ్వరుని భక్తురాలు. ఒకనాడామె పని వడిపాండుర పురమునకు బోవలసెను. పండిన పౌడల కాయవలె, కాయమునిండ గంటులు, చమ్ములు గొనుర సిస్రావము, పైవ్రాలు మక్షికలు, పుడువడిన యంగములు, తుండెము లైన వ్రేళ్లు, ఆవికృత రూపము, బాధాస్వరూపము, గాంచి జాలిపడుటకు సాయపడుటకు మూరు కర్కశహృదయులు, మర్కటహృదయులు ఆనాటి విప్రనా

లు; హేయమెవడి ఆమెంగో ! చిత్తచోర్పీ ! నాపాపము నిన్నుకట్టికుడుపుచున్నది కానవా ! ఒడలెరుగని పొగరున తొలిపుట్టునే బెట్టిదమునే కొంపకూల్చితి వ్రా యీనాటికి పెద్దరోగమువచ్చెను. ఆ చెడ్డరోగి వనమెల్లచెరచును. ఈ యంటువ్యాధి యీవీధులవారికి పంచిపెట్ట వచ్చితివా ! కాని జాతి వానవు. పడగెంటనైన భయమగునట్లు మాచొట్టెల పాలటి దయ్యమువలె యమువలె నిట్లు సాహసించినందుకు చెప్పవలె అని బెగడింప నామె హృదయము చలించినది. మదిగదలెను వ్యాకులము హెచ్చె, భక్తులశపథము శాస్త్రబద్ధముకదా ! పరమేశ్వరుని ప్రార్థించెను. ఈ నికృష్టజీవనముకంటె నాసేవయేలగ్గు. ఈ జరాభారముకంటె నీచరణసన్నిధియే మేలు నిక్కంపుబత్తిమెయి నిను నేనారతము మ్రొక్కిన దైవసాక్షాత్కారమై యీహేయకాయము బాసి నాశత్రువుల గ్రమ్మన్నగాతమని నిశ్చయించి సోమేశ్వరుని దర్శింప గిరుక్కునమరలెను. శిలయుదాక నొడలు జలదరించెను వ్రేళ్లు తెగిపడెను. పాదములు నొచ్చిజల్లెడ తూట్లువలెను. నీలమండ లుల్లెను. పాదభ్రష్టమయ్యెను. పదభ్రమకముతో సాగెను. కడక కుంటివడి తొంట్లుబారెను. భక్తిరసానాస్వాదనమున ప్రమత్తులగువారిని బాధలుపీడింపవుగా. చేతులతో శివుబలెపాకెను. గండురాచేల నొరసిహస్తములు గ్రస్తములయ్యెను. జరుగు నాధరము సహితము దుర్గమైన నామాచెత హృదయపీఠనధివసించి యున్న తేజోమూర్తి నిగాశకుదావీయదయ్యె. ఆమె నేలబడి బండవలె దేహాభిమానము మాని దేవుని దయఁ గాని స్వామి కైంకర్యమునకు బోవుచుండుటయు భక్తవత్సలుండును, శరణాగతరక్షకుండును గౌరీవల్లభుఁడునైన కపర్దికృపాంతరంగుండై యామెనెదుర్కొని, మన్నించి, కార్యమరసి వరము వేడుమనుటయు నామెయిట్లనియె "దేవాదిదేవా ! లోకైకనాథా ! భక్తజనకల్పవల్లీ ! ప్రమథాధినాథా ! బృందారకులకు సహితముజూడ గూడని నాదివ్యస్వరూప

నాకన్నులకాంచు భాగ్యము నాపుణ్యమున చేకురినది నాజన్మతరించి నానోములు ఫలించినవని త్వదీయ సందర్శనమున నేను చరితార్థనైతి. వేరకోరిక లేల'' అని సంతసించి సంస్తుతించుటయు నామెబక్తిభక్తుడ చ్చెరువడి యువ్వా! చల్లకువచ్చి ముంత దాచనేల, నాకటాక్షమున నాకువజ్రకాయమగును. నీలోటువెంచి గేటుసలిపిన మూఢబుద్ధులకే వ్యాధిని పక్షపాతముగా బంచిపెట్టితి, అన్నంత అనుభవింపక తీరునా, అని అంతర్ధానమై యామె నిత్యసేవకనుకూల మగునట్లా పురమున సిశ్వరుండను లింగరూపమును దాల్చి యవతరించెను ఆభక్తురాలు శాపవశమున నప్పురమున బ్రాహ్మణులెల్లరు పైత్యరోగముచే బాధ పడుచు కర్మపరిపక్వమగుటచే నోపు తమవ్యాధి మూలము గ్రహించి చింతించి కడజాతియని మెడిచులువిరచిన గుడ్డవ్వను దర్శించి తమతప్పు లనొప్పుకొని దయయుంచునదిగా పాదములబడి ప్రార్థించుటయు సహ జామలహృదయ మగు కోమలి హృదయమున వారియెడ దయకుదిరి 'నిరామయులగునట్లు' వరమిచ్చుటయు నాబాపలును రూపములుస్ఫుర ద్రూపములుగా మారుటయు నెల్లవారలీమె నిష్టదైవతముగా నిత్యా రాధనల పూజించుచు భుక్తిశేషంబుల నారగించుచుండురు. నృపాలో త్తమా! భక్తవరుల వర్ణప్రకర్ష ము బాలయుదుకదా! నామతులకు శంభుడ తండ్రి. పార్వతియె తల్లి. పరివర్తులే బందుగులు. పాటిభక్తులే సోదరులు. మసిపాతనుజుట్టినను మాణిక్యంబగు. అడుసునబుట్టిన తామరదైవపూజ్యము కంపల పుట్టిన యనల ము పూర్వక్రియలకెల్ల పూజ్యము. వ్యాసుడు బోయెతకుపుట్టడా. వాల్మీకి శబరుడు కాడా. తక్కుగల యోగుల సాంప్రదాయములు నైచ్యములని యెంచి లోకమహాత్ములం బ్రశంసించుచనేకాని పూజింప మానెనే. వారు లోకారాధ్యులుగాకపోయిరే! బిజ్జల భూవల్లభా! కపర్దిపదారాధనా నిధానులగు భక్తులు దుర్దమశక్తులుకదా! ఇన్న

చండాలురని డాయనోడిగూరయు కూతలకేమికొంటిత. కర్మచండాలురని రొమ్ము విశ్వాస రహితుల, వృథాజల్పుల,కపలుక్యోస్యుల, విండవాదుల కుహనాభక్తుల, జాతివైషమ్య చర్చలతో మీబోంట్లకు భగవత్తత్త్వ రుల కుప్రమేయ మేల ! భక్తనిరపన ద్వైన దూష్యము కదా! మూఢుల పెంపున మీరిట్లు కాని వడువున శివ నాగమయ్య, మా యయ్యాను విమతసంఘమున నగుబాటుకు బుఱిగొల్ప జెల్లునే యనుట యు బసవారాధ్యుని సాహసవచనములకు బిజ్జలుడు తోకత్రొక్కిన త్రాచువలె కోపాటోపహృదయుఁడై బసవునివైపు మోమై ! అయ్యా రే! అనాదిసృష్టి పర్యంతము శైవంబనియు, తద్భక్తులభేద్యులని యు నీబరిడవాదము శైవశిష్టత్వము నాదృష్టికి దురూహ్యము నీపక్షపా తబుద్ధి యీసిద్ధాంతములకూత కోలయిచ్చుచున్నది శివనాగమయ్యపై వాలిన మక్షికము లింగాక్షికమని నియమాంతర్యము. ఈభక్తుని మొడలు జిడిపిన క్షీరముని వైష్ణవుని దేహ మొకిపిన రక్తముచిందునా అని ప్ర తిక్షేపించెను బసవడదెయుదనని మొడనెంచి నృపాలునీక్షించి ప్రకాశ ముగా దేవా ! వారుతమభేదముల నధికారరీతులెంచి తమతోడికొను టకేకొన! అయినను సమయమగుట ప్రత్యర్థిపరముగా నీమస్యలనిర్వా దితముగా పరిష్కరించి నాహృదయమును ద్వైవికముగా వంచింపజాల. ఇదే శైవసాంప్రదము సూచించెద తనమహత్త్వము తేటతెల్లమగును, చూతము; నిశితకరవాలమును చేబూని భక్తిపరవశమున శివనాగుని హస్తద్వయమూ రయమున చెండాడుటయు నాపరమేశ్వరుని కృపాప్రా బల్యమున నాగమయ్య నరకవడియు వడిచెడక దిగులుపడక శివసహస్ర పారాయణ మొనర్చుచుండెను. భక్తపాదరేణువగు బసవడు భక్తదేహ మునుండి పాలుగొను దుగ్ధంబుల మొనవుకడ లేగవలె మూగి జొరవ డి గడువడి గుక్కిళిపుటయు జూషరకబ్బురమయ్యెను. వెరపుగానక పూవక వైష్ణవులెల్లరు వేగవై శివనాగుని దుగ్ధపాన మొనర్చుచుండు

టయు బిజ్జలనాథుఁడు కలవరము వారించి రాజచిహ్నాదుల పరిత్యజిం
చి కిరీట మొజ్జగించి, సింహాసనము వర్జించి దిగివచ్చి శివనాగుని భక్త
మూర్తి కివలగాని దండప్రణామము నాచరించి తన దుడుడుపాటునకు
క్షమియింప బ్రార్థించుటయు శివనాగుడు రాజును లేవనెత్తి హృదయ
మును హత్తించి తత్తరమునుడిపి యజ్ఞానకృతమగు నపరాధము విరో
ధము కాదని బుజ్జగించు నంతలో దైవకటాక్షమున ఖండితహస్తద్వయ
ము యథాపూర్వముగా నుండుటయు దవ్వులను పారజూచు బౌద్ధ
య్యలు వెనుకటి కయ్యములుమాని నెయ్యములుబూని శివనాగుని పా
దపద్మములకువాలి క్షమార్పణ వేడుటయు నాతడందరి నూరార్చి
పంచాక్షరి నుపదేశించుటయు వారు కైవారములొనర్చి కైంకర్యము
నర్పిరి. బిజ్జలనాథుఁడు శివమెక్కి శివసాధుని శిశ్రూషమై సేనగొమ్మై
నెక్కించి శివనామస్మరణ జేయుచు నగరసంకీర్తనమొనర్చుటయు బస
వని శివనాగుని దైవభక్తి లోకమెల్లమై తన్నామస్మరణ మరితహారణ
మయ్యెను.

భక్తులు పాస్వాదనకథ

శివనాగుని దైవాదేశము దేశదేశముల నల్లుకొనుటయు బిజ్జల
రాష్ట్రమంతయు శైవాచారమయ్యెను. తొల్లింటి వర్ణభేదము అంతరిం
చెను మతకక్షలు మటుమాయమయ్యె. బహుదైవతావాదనలు పటా
పంచలయ్యె. జాతివైషమ్యములు సమసెను వితండవాదనలు గూటబ
డియె శైవమతోద్ధారకుఁడని బసవున కప్రతిమాన గౌరవప్రపత్తు లత
వడియె. తన్మూలమ్మున దేశసంక్షోభ ముడిగి జనసామాన్యమున స
ర్వాంగీ ముఖముగా దైవభక్తి వర్ధిల్లుటయు దర్వీ వనవాస కొనరిం
చు శాక్తేయ ఏమతమునకు సైపక బసవని మేలిమనైన పరాభవించి
తమవ్యాప్తికి మార్గమరయ నిశ్చయించుకొని చేడిమూక లెల్ల గూడిగ
ములట్లు అప్పనరంబుల నుపహారంబులఁ దెచ్చి బిజ్జలున కందిచ్చి సెలవు

బడసినపిదప కార్యనివేదిముగా భూపా! మాపాపమేమనందుము. అనా
దినుండియు శైవప్రధానులమై ప్రసాదంబుల కర్తలమైన మేము ఈబ
సవుని గుర్మతకారణంబున వనములమధ్య మాంసములైన మాదుచుం
టిమి. పూర్వశైవులమగు మమ్మిట్లారగిసేయుట మతోద్ధారకులకు
సమ్మతమగునే! వైష్ణవమత సాంప్రదాయములకుగంటె శైవముమో
సెత్తైనని యూసగొన్న మాగాసితగునే. న్యాయమరయ బంపుడనునం
తలో బసవడు మంగళవీరికకు వచ్చుటయు బోయవ్యాజమంతయుఁ
బూసగ్రుచ్చినట్లు బసవనికి నివేదించుటయు నృపాలుని, కృపాళుని పేరో
లగంబున బసవనమంత్రి యిట్లనియె, ప్రభూ! వీరు పూర్వశైవులమని
కదా వాదము అట్టిచో వీరశైవుల సాటంతి వీరికెవ్వరిత్తురో చూతము
గా. వీరశైవ ముగ్రలింగారాధన కాన తద్భక్తులు విషప్రసాదమును
నాస్వాదించుట కర్తవ్యము భిన్నము, విచ్ఛిద్రము, అలక్షికము, పా
తుకము, విశ్వటత్, భైరవము, ఉగ్రము, అను శైవనాదులలో తొలి
మూడు పూర్వములనియు తక్కుంగల వారమనియు సుప్రసిద్ధమగుట,
ప్రాణాపత్యులకు విషప్రసాదము పరమార్థికము కావున కర్పూరము,
కాలకూటము, గస్తూరి, కర్పరము, గరళము పంచాపస్తత్రి పిటమున
పంచభక్ష్యము శేయుంచి ప్రసాదములిప్పింపుఁడన రాజు వల్లెయనుట
యు నుపకర్యముల పుటము రాకకు కల్వములు కాలిపోయెను రోకళ్ళం
టుకొనియెను. నేల బీగులుకొనియెను. విషవాయువు లుప్పతిల్లెను. జల
ము జ్వలితమయ్యెను. ఆవిడ్డూరప్రసాదము మెసవు బొట్టెల నువ్వులు నిలు
చు బొట్టెలను సందేహమున నొండొరుల మోముల దీనులై జూచు
శాక్తేయుల రమ్మని చేరజీరి బసవడు తోడిబత్తులతో సాపాటుబెట్ట ప
రవిశ్వాసమున శాక్తేయులు విషమని తాగివెరచి కొండము మానివ
చ్చినదారిఁ బోవుటయు బసవని యాశీర్వాదమున వీరశైవులు విష మ
మృతప్రాయముగా తాగివవర్తిల్లిన భక్తి యట్టిదికదా!

## జగదేవుని కథ

తొల్లి యెల్లవిద్యలకు నొజ్జయగు బిజ్జలుపురమున జగదేవుడను దండనాథుఁడుండెను. అతఁడు మహారథికుండయ్యు సత్వగుణప్రధానుఁడు. రాజ్యకార్యజ్ఞుఁడయ్యు భగవత్పరాయణుఁడు దండనాథుడయ్యు కర్మయోగరతుఁడు. మండలాధీశ్వరుండయ్యు చంద్రధర పదసేవామండనుఁడు. ప్రవితుల చారిత్రుఁడు. ధూర్తజనదూరుఁడు అతఁడు యతిరాజగు బసవరాజ. భూమణుసేవా పరతకు పరిమితానందమంది యాతని మందిరమున కేగి విభూతిసమృద్ధుండును కింకరజన పరివృతుండును, బిల్వదూర్వాసనుండును, రుద్రాక్షమాలికా సహస్రభూషిత దేహుండును, నిరంతరశివపూజాధరుఁడునగు యోసంపన్నుని యిష్టదైవతాసుప్రసన్నునిమున్నుగాంచి పులకితహస్తుఁడై, వినయ వినమిత గాత్రుఁడై మెల్లనవివరించి కైంకర్యము జేసి సమాధినొక్క మోల హెచ్చుభాషింపక యొదిగి యుండుటయు బసవఁడు యోగనిద్రమేల్కొని జగదేవుని వందనము లందుకొని కుశలప్రశ్నించి దండనాసనమిచ్చుటయు మన్నించి పనియడిగెను. అంత భక్తానురాగుఁడగు జగదేవుఁడు గురురాజగు బసవని యాంతర్యమెఱిఁగి భక్తాగ్రణీ! సర్వార్థసిద్ధులగు సిద్ధుకెరుగని రహస్యములున్నే! అయిన నదుత్తరమిచ్చుట నాకర్తవ్యము. కాన మనవి సేతు, గురుకటాక్షమున దేవరయనుజ్ఞనొంది దేవతార్చన సలుపనెంచి తమసన్నిధానమున నా తాత్పర్య మెఱిగింపవచ్చితిని. గురువులాజ్ఞ శిరసావహాముకదా! ఈ సమారాధన నిర్విఘ్నముగా నిర్వహింప తమదే భారము. సర్వజంగమ సంయుతంబుగా దయచేసి నాయిచ్చునల్పార్చన సుముఖముగా గ్రహించి యీభక్తపాదరజము నుత్సహింప వేడుచున్నాను తమదర్శనమున మాపాపవేశములు పరిహారమగును. గురువులు మెట్టిన మందిరము సుపవిత్రమగును. మీరుత్రొక్కినధూళి సర్వాంగరక్షయగు. మీపాదోదకము సర్వవ్యాధి నివారణమగు తీర్థము. మీయు

చ్ఛిష్టములు మాపితరులకు సద్గతులు, ఆతిథ్యమంగీకరించి నాయాహ్వానము నాశీర్వదింపుడను జగదేవుని దైన్యభాషకు సంతసించి భక్తప్రియత్వామును గురుకార్యముకాన విభూతియుఁ దిమగు బెట్టుజగదేవుని పిలుపునకు సమ్మతించుటయు మనసిడఁగొని జగదేవుఁడు గృహాభిముఖుఁడయ్యెను. బసవఁడు యథాపూర్వముగా సమాధిలో ప్రవేశించెను. జంగమదేవరలు రుద్రజపముల మునిగిరి. జగదేవుఁడింటికేగి స్త్రీజనముల రావించి భక్తజనసంతుష్టముగా గురుదేవర వచ్చునుగావున యథాశక్తి వంటకములను సిద్ధచేయక వడ్డింపుమనుటయు వల్లెయని గృహదేవతలు తమపతనా చాతురికి బసవఁడు బహుమతించునట్లు యుక్తమెరసి వివిధభక్ష్యముల, భక్ష్యభోజ్యముల షడ్రసపరిపాక శాకముల, రమ్యతరంబగు సన్నపుటన్న పాయసదధిదుగ్ధమాదిగల యెల్లపదార్థము, భోజనార్హ వస్తుసమితి వండివార్చి తగ దొంతులు పేర్చియుంచిరి. అపరాహ్ణమతిరిగినది. వంటకములు చల్లారినవి. చనుబాలైన సొంటవి బాలలు గోలుమనుచుండిరి. జంగమదేవతలెల్ల పిలుపందివచ్చియుండిరి పార్థివము చేయువారు. లింగాష్టకము చేయువారు. రుద్రజపము సల్పువారు. పంచాక్షరుల వల్లించువారు రుద్రసహస్రము జూచువారు. దేవతార్చనలు సల్పువారు. లింగాయతులందరు విచ్చేసిరి. దేవరలు చాపలుతీర్చిరి. ఆరాధ్యులు సత్ప్రతులు చర్చించుచుండిరి. శివపూజాద్రవ్యములు సంసిద్ధమయ్యెను. బసవలింగము మాత్రము గానరాదయ్యె. అతిథులన్నాతురులై యుంటనుంటల భావ్యముకాదని రొంచి జగదేవుఁడు లింగధారుల రావించి యాలస్యము బాపుట కర్పించి యవసర నైవేద్యము కావించెను. బసవఁడు తన పరిచారి కవిసముచే కానచటకు రాకమున్నె కావల కాళ్ళుగడిగి జగదేవు డాభ్యర్చకముగావించిన తెలంగాతింగి సమా గ్రాసుతోయత్సుఁడై యాలనింటికిఁబో నలిగిమెలగుచుండెను. జగదేవుడీ యపరాధము గ్రహించి బసవని యనువయించి తోడితేర మర్గముఁజో

చ్చెను జగదేవుని రాక బసవనికిఁ బొగ్గి కింనవయున వలె నగుటయు బసవడు మంటచే తొంటి తున్నవల సున్న జేసె తనకడనున్న కింకరులతో 'నీవిశ్వాసఘాతుకుని మోముఁ జూడరాదు' అంగపట్టము కట్టుడగత్యమైన యర్థము లవశ్యాకర్ణింతము. అని జంకుగొనక మృషాలింగారాధ్యా! నీవిపోడ శేలనేర్చితివి. నీవు శివగేహము బయలు వెడలుము. నిరంతర శివసేవారతులును, అతులమహిమాన్వితులును, జంగమార్చనాసంగతులు నగు భక్తవర్యుల నార్యుల సత్కరింపమాని మూఢులగ్రస్థాన మిచ్చిన నీమతము మాబోంట్లకు విమతమగుగాక సమ్మతమగునెట్లు? విపరీతవిధానీయుం బరిశ్చాన్నమగును! కుతంత్రులు, మతస్వతంత్రులు, విమతపరతంత్రులు నగు నీబోంట్ల సమాదరము మాపట్ల సమాధానముకాదు. భక్తులనీవిధి తిరస్కరించుటకాక నీయుద్దేశ మేమికానోపు అర్ధేందుకోటిరుచుద్ధ నిష్కళంకభక్తిప్రకారము సాధనలేని కర్మచండాలుల కెట్లవగాహనమగును ఏకదైవతారాధ్యులలో విశేషజాతము లల్పజాతము లుండునెట్లు, అచ్ఛిద్రమగు భక్తకోటికి ఛిద్రోపాసనము చెల్లునెట్లు! ఏకతరుజనితమగు శాఖ లన్యోన్యప్రాబల్యమున కంఠకలహములు పడినట్లుండును. సముద్రాస్తతరంగములు రూపసంఘర్షమునకు దిగినట్లుండును క్షేత్రమున సస్యమే పునః ద్రోపులాడినట్లగు సంశయవ్యాదయులే పాపాత్ములు. వారికి ఆత్మవిశ్వాసమే లేదన్నచో గురుభక్తికదురునెట్లు? భక్తినిశ్చయము సూన్యమైన పరమార్థమెట్లు సువ్యక్తమగును? స్థానబలిమి కాని తనబలిమి కాదన్నచో; ఆత్మవినాశమును జడము నుశాశ్వత మగుచున్నది. అట్టిచో నేకేశ్వరారాధనమున కగత్యము కానరాదు. జగదేవా! పరపత్వము లేనివాడు భక్తుడెట్లగును? "భక్తిలేనిపూజ పతితజేటు" ఒక కథకలదు విను:

---

## పలేశ్వర కేతయ్యకథ.

పూర్వము దేవబ్రాహ్మణ సామ్రాజ్యమని మిగుల వన్నెకెక్కిన శంఖవత్తనగు పురంబున కేతయ్యయను శూద్రుఁడొకఁడు కాపురముండెను. అతఁడు శంభుభక్తులకెల్ల మిక్కిలి అతని సువ్రతంబు సన్యాసావధాన్యము పుత్త్ర మిత్ర కళత్ర సగోత్రజనులను యింటనున్న భోజన పశు గోపాలురను, శునః మార్జాలమూష పెంపుఁడుమృగములను తన గేహాన రచ్ఛత్రమున కేఁ లింగపట్టాభిషేక మొనర్చెను. తానొకప్పుడైనఁ భవి, తప్పక చూడఁడు. మాటలాడఁడు లహీనుల నాత్మలోనైనఁ దలంపఁడు వారల నూష్యవాక్యముల కర్ణపుటములఁ జొరనీయఁడు ఆదరుల వేశ్మలఁ ద్రొక్కఁడు. ముట్టుకోఁడు. వారితో బేరమున కొనఁడు, అమ్మఁడు. వార వరిహించి జనులన్న ప్రేతివివరింపనేల ? వారిని నేల నడువనీయఁడు. క్రిందనిలువనీయఁడు. ఏ యుటబోనీయఁడు. శిరసావహించి యల్లాను ముద్దుగా వాత్సవత్సముల ఫ్రౌలె భుజమున వీపున వహించి ముదియును. అట్లు భవినహానంచార రహితుఁడు, భక్త్యారూఢమతియునై సత్కాలక్షేప మొనర్చు కేతయ్య పవిత్రచారిత్రము పాపకర్ణకంటక మగుటయు నాయసూరి వైష్ణవనామకులెంచి యెన్నినెగులుల బొగిలించినను, నిజమహాత్వమున కేతయ్య తృణప్రాయములుగా నెంచి యవిలేనియట్లదే తొలగు భానుకీప్తి వలె కేతన ద్విగుణితభక్తియుక్తుఁడై శివావధూతయని ప్రబల విఖ్యాతిపరుఁడై యుండె అట్లు భవులా భక్తుని చిత్తం బెత్తెరంగునైన మొత్తంబకమికి నుత్తలపడి యతనివిత్తుల గాదులంత గాల్పింప నుంచి తెరపడను చెరకుండ మళ్ళలో నేమివిత్తునో చూతముకాకని యా తులువలు గామలనుం జిమ్ములుపెట్టిరి. ఆయెడఁ గేతనాద్యూడా మొత్తుల మోస మెత్తింగి కొట్టాణములు రగిలి సెగలెగయు, ధూమము మేఘములుగట్ట ధాన్యమంతిక ముకుగొట్ట, ధైర్యముపీడక, శౌర్యముబూనక తొగుప్రమ్మరక, పరులరమ్మనక, చిచ్చార్చబోలు కింకరుల శంకఁజేసి

నిర్భీతుఁడై యాజ్వలన జ్వాలల కట్టెదుట పరిశయాగ్నిముఖము నకాల రుద్రునివలె భద్రుఁడై యుండి మడిసీరుపడిన యదుమశ యాబుగ్గి ను డిలో విత్తించుటయు దైవబలమున కేశయ్య కాసాయల ఫలసాయము వర్ణనాతీతమగుటయు సీభక్తి విరాజితుని సీరాజములు మంత్రాక్షతలు గా భక్తవరులు తలదాల్చి 'ఆహా! ఏమిచోద్యము: పూర్వము శివబ్ర హ్మయ్య మాన్యములు ధాన్యములువేయకనే ఫలించెనని కనిక ఇపుడు కనులారగాంచిన యీచిత్రము పూర్వచారిత్రమును బలపర్చుచున్నది. శివభక్తులెంతకు జాలరని, జంగమపుంగవులు కేశయ్యకీర్తి సంకీర్తనము లో పొద్దులుపుచ్చుచుండ విఫలప్రయత్నులగు విరోధివర్గమంత పరాభ వమునకు సహింపక కేశయ్య నెంతకైన వంచించి వైష్ణవాధిక్యతను లోకములో పట్టముగట్టుటకుగా ప్రబల ప్రయత్నములు చేయుచుండిరి. వైష్ణవుల మూఢులు యాధిక్షేపించు కేశయ్య వశు భక్తి యెట్టిదో పరీక్షింతము. అని నిశ్చయించి యొక చీకటిరాత్రి పశువులశాలలోఁ జొరఁబడి, వానిని కట్లూడ్చి విడఁగి, మెడత్రాళ్లు డ్రెంచి, సాలఁ జెరవించి గ్రామముఁ దప్పించి నూత్నమార్గముఁ బట్టించి యెంతేనిఁ జనిరి ప్రాణ లింగములు తమ శాలలో నుంటచే పశువులెంత జిజ్ఞాసువులో నిదర్శన మగుటమూనెను మొలచిడిన పచ్చికలలో నిల్చిరి పైరుపచ్చలకుఁ బ్రోలిరి. కంటకములు నట్టు మొదవులాదరి కేగి కకుంటువలె పదములదము కరా లిరి మొలఁగుచు లింగదర్శనము లేక సీగముచుట్టుట వ్రతాభంగమని యెంచి కుత్తుకబంటి జలమునఁ దిగమరల్చినను ద్రోదులఁ ద్రిప్పి. వాల ముయెత్తి వెన్కువాలును వాల్చను ఇట్లేడహోరాత్రములు నోరెరుగని కసవు మేయు పశువులయ్య వ్రతనిష్టను దాహాశనములుమాని నియతి యూని యుంటచోరహృదయమున మునదయగదువార 'లయ్యారే! పసిబూన్చువారే కాని, పాపము పంచుకొనువారెవ్వరు? మనలయకృ త్యమున నీసాధువులు నిత్యకృత్యములుమాని ప్రత్యవాయము బూని

నవి ఈపశుహింసా దోషము మనకట్టెల ఘటింపకమానదు. ఈపాప మొడిగట్టుకేటి ఘనకార్యమని లోదలంచి యాపశువర్గమును లందవెడ లించి యెప్పటిదానికిఁ జొప్పించుటయు రాహువు క్తచంద్రమువలె నవి యిలుపాపించుటయుఁ గని సహజకోమలహృదయుఁడయ్యు, పరసంప ర్కవిముఖుఁడగుటచే కేతయ్య తనతువ్వాలు వైరికిఁ జిక్కి శైవ ముడిచె నని భ్రాంతించిలివి యూకాకకు పరోక్షుఁడగుటయు పశువులు నిష్టాయు త్తములన్నట్లు పారుగువారలు పులుద్రోసిన మూఁచెట్టక కట్టుగట్టెను. యజమానుని తాట స్వము సహేతుకమని నిశ్చయించి నాలనున్న వత్స ములు తమ తల్లులపరామృశించిచుటయు నుడిగెను. గోవులు లింగమూ ర్తైపుఁజూపులుదీపించి తద్గ్గసమునకు కన్నులనీరుగ్రక్కుచుండెను కేతయ్య యుందలిసంకేతము గ్రహించి గోవులు నిర్దోషములని మన్నించి వానిని మందఁ బెట్టుటయు వత్సములగాంచుటమాని యాగోవులభక్తి యుట్టిప డ ప్రాణలింగమునకు ప్రదక్షిణములుగావించి, మోరలతో మేరలకుద్ధి జేసి, లింగాతసున తమస్వద్ధరలు వర్షించుటయుగాంచి కేతయ్య మానుమభక్తికంటె, పశుభక్తి యెన్నిమడుపులమించెనో కదా! ఇట్టి సాధువుల భూంతరంగిక పారిభాష్యముఁ దప్పిదూష్యమని వృథాభాధఁ బెట్టితి! నాయఘము బాయుటెట్లని పశ్చాత్తాపముఁతో వానిని ప్రణ మిల్లుటయుఁ జూపరికత్యానంద సంధాయకమయ్యెను. కుమతులు కేతయ్య భక్తితాత్పర్యములకును, సమభావమునకును, భూతదయకును, కరుణామతికిని మెచ్చుకొని తమయకార్యములకు నొచ్చుకొని యటపై నాతని యాంతరంగిక శిష్యులైరి

## సవరద నాచరయ్యకథ

తొల్లి శైవాచారసంపన్నంబని సన్నుతిగని ప్రఖ్యాతలింగారా ధ్యులకావాసంబగు శివనేరను పట్టణరాజమొండు కలదు. అందు శైవ భక్తాగ్రగణ్యులై నిరంతర జంగమపూజావిరాజిత గేహరాజులై, విరా

జితలింగార్చనా తత్పరమతియు నాన్యేతరమతియునై నిష్ఠాగరిష్ఠుండని పేరెన్నికఁగన్న నాచరయ్య దేవరప్రతివాది భయంకరుఁడై ప్రియవాది మోదితుండై యనాదిలబ్ధ శివసేవాకృతపుణ్యుఁడై నాణ్యుఁడై, యసామాన్యుఁడై, మాన్యుఁడై వర్తిల్లుచుండును. అతని కాంత యుమాకాంతసదృశ భక్తిసమాక్రాంత హృదయాంతరాళ భక్తసంపూజితనయశీల. ఒండు చూలాలగుటయు నాచరయ్య యామె లింగముఁగ్రహించి యర్ధోదయకాలంబునఁ బ్రతిష్ఠాపించుటయు నావె కాంత వ్యత్యయమున జంటశిశువు గంటయుఁ జేఁడియునుడువ విని నాచరయ్య చెవులకు ములుకులుగా పుత్రోత్సాహముమాని వీనికి మున్నలింగము సంగ్రహింపఁబడమి వీఁడుపదహీనుఁడు. ఇచ్ఛాసృష్టముగావున దవ్వులద్వైపుఁడు. అంత్యుతుని మోముగాంచ మెంచరాని దోషమబ్బును. శరణోక్తసరణి నర్ధోదయకాలంబునంద గురులింగసాంగత్యంబు సంభవింపదని నాచరయ్య యా యఖిలభక్తలోకము విలోకింప తన తనయుని విసర్జించెనన వినియు వేదోక్తసన్మార్గంబు విసర్జించి, భక్తులవర్జించి, దుర్మార్గంబవలంబించి పంచశరభంజను భక్తి మాలంబె సంగని త్రాటమాలల నగ్రేసరులని యాధ్యాత్మికులని, యారాధింప సభ్యమగునే పశుపాలపతియగు భర్గుడుండగ పశుప్రాయులై యచిరభ్రంశంబునఁ జేసి యాతన జీవులగు వారి మాట నుడువనేల అతులిత శుద్ధశైవాచార మర్మములు వంచనమతుల కేమి బోధపడును. ఇద్ధగార్ధభ మడుగులరుచి యెరుఁగునే పాల్లు మెసవుఁగాక! అంధుఁడు, పదార్థమూఢుండు, లోకబాంధవుని యాదిత్యుని సర్వతమోసంహరుని, కర్మయోగుని దివ్యప్రభాసంపత్తి నెట్లుగాంచనేర్చు, చేశిమూక పూర్ణిమాచంద్రు సత్కళానిరతి నెట్లు వాక్రువ్వఁజాలు. బధిరుఁడు నాగస్వరమాకొనునెట్లు! కోతి రత్నపరీక్ష నెరుఁగునే! కుక్క స్వర్గమునందునే! ప్రాజ్ఞులకుగాక యజ్ఞులకు కాలకంధరుని కింకరుల ప్రాశస్త్యము తెల్లమగునెట్లు! ధరలో లింగనైష్ఠికత,

ముంజేతికంకణము, కరతలామలకము; ముంగొంగు బంగారము, ముంగి ట పన్నిధానము అట్టి సద్భక్తిమార్గము వదలి వదరుట ఖండశర్కర యుండగా దసి తవుడు బొక్కుటయగు. శివసేవయను నిశితచంద్రహాస మునఁ బాపవల్లరుల ఛేదింప నసాధ్యమగును. బండకత్తులబూనవచ్చునే చేరువనున్న కల్పతరువు మాని మిట్టపై రొట్టెఁజెట్టు గట్టునే! సంసారజ లధి నుత్తరించు నోడవీడి భవజలధి కల్లోలమగు ప్లావముఁ గోరనగునే! రమణీయమగు రత్నరాజిఁ బోనాడి గాజుపెల్లల మూటగట్టనగునే! దొడ్డి లోనిగామధేనువు మాని సంతలోని గొడ్డుఁగొననగునే! మాంగళ్యము మాని దుష్టకర్మకలాపము జేయుటేల? 'తేనసహాసఁ వసేత్' అను శ్రు త్యర్థ మగ్రగ్రామ్యముకదా! శుద్ధగాంగోదక స్నానమున వాయసము విము లీరక్తమ గాంచునే! నైజవక్రమగు శునకపుచ్ఛము గంధపుఁగోవినిఁ జుట్ట తిన్ననగునే! యుగములుగా జలధిలో నానినను కటికిరాలు కఱ మబ్బి మెత్తబడునే! కామధేనుపాలతోఁ బ్రోదిసేసినను వేములు తి పిగాంచునే! మసిపుటము పెట్టిన మకిలిబోవునే! కట్టిస్వభావములు సు లువుగా వదలుట దుర్లభము అట్లేయగుగాక పదిపడినాగటి గసవుగట్ట చిక్కకుండ బెక్కుచాల్జమున్నములకు విత్తులు లెడబెట్టు నధమునిరీతి నా రభనసార భూరుహములఁ గూల్చి చెముడుదొంకల పాతనగునే! పవిత్ర పీఠికాక్షేత్ర మధ్యంబున నపవిత్ర మూత్ర పురీషముంజేసె తీర్థమని వేడు కూర్చునిపగిది. మృడలింగపరాఙ్ముఖానేకాన్యదైవభజనంబులు తమ్ము లుగాలేల రాజరాజసఖపరాఙ్ముఖ పూజలు ఓటికడవలోని నీరములు నీ డలేని ధారుణీరుహములు, జలలేని దిగుడుబావులు, యెన్నత్తనిపైరు. ఆకలి యుడిగిన జీర్ణప్రాణములు, అనాధ్యాయములేని చదువులు; వెలు గులేని వెన్ను, త్ర్యక్షపరాఙ్ముఖుఁడై యజ్ఞమాచరించిన దక్షుఁడు శిర శ్ఛేదమొందెను. 'కలభస్మ మెల్ల ముందర జగన్నుత విప్రులకిచ్చి' అనిశప థము వహించిన పరశురాముఁ డేగతిఁ బొందెను. గురుహితోక్తుల నిత

సించి, నిర్దయుండవైన 'బద్ధమైన హరుఁడైనన్ వారిద్వైన వారిబాధ వ్రం ...
తిరుగఁగ నేరదు నాదుజిహ్వా' అన్నబలి వైష్ణవపూజామహాత్మ్యమొంతయు
దెచ్చెను!! వేదరహస్యవేది, పృథివీ సురకోటికి అత్యాదరబుద్ధితో నిష్ఠా
ర్ధసత్కారమొనరించిన ఫలము, శంభుభక్తి సంపాదకుఁడైన యొక్కభ
క్తునకు బట్టికుబికుఁ జేసిననగుచు తాదృతవైదికోక్తులకుఁ దప్పచరించుట
సాహసముకదా ! అని బహుభంగుల బసవఁడానతిచ్చిన జగదేవుఁడశ్రు
పూరిత నేత్రుఁడై, స్వగుణనిహ్నవపూర్వకముగా బద్ధాంజలిపుండై భక్త
పరాయణుఁడై యిట్లు ప్రస్తుతించెను దేవా ! కృతాపరాధిని, దైవవం
చనుఁడను భక్తుల తిరస్కరించితిని. కర్మబంధుఁడను. కష్టుఁడ. ఖలుం
డను దుర్మదాంధతో పేతుఁడను, దుష్కృత్యయలయుండను ప్రజ్ఞమా విహ
యజ్ఞానపాతకుఁడను. శంక లేని యనాచారసంపన్నుఁడను, వేయేల? నేను
సర్వాపరాధిని నాయొనరించిన పాపమెందును వినఁబడు. ఈహీనకళేబర
మునోల్లను ఈనీచప్రాణికిసహింపను. మొండికబ్రతుకు మోయలేను.
ఈపాపజీవనము గడుపలేను ఈప్రారబ్ధకర్మ మనుభవింపజాలను. ఈస్వ
యంకృతాపరాధము నోర్వలేను కావున గుర్వాజ్ఞయైనచో భవస్సన్ని
ధానమునందే ప్రాణముపరిత్యాగమొనర్చి శాశ్వతశర్వలోకసిద్ధినందెదను.
అని దీనుఁడై పలుకుటయు బసవన్న భక్తానుమతియై యిట్లువక్కాణించె
ను శిష్యా ! ఇంతసాహస మవివేకమనిపించుకొనును. పైగా ప్రాణహ
త్యాదోషమున శివద్రోహము వాటిల్లఁగలదు అపరాధులకుపశ్చాత్తాపమే
ప్రాయశ్చిత్తము. మరియు పిపీలికాది రుద్రపర్యంతము సకల చరాచర
భూతకోటికి సృష్టిస్థితి సంహారకారకుఁడై, స్వయంభువగు నీశ్వరుఁడీ ప్రాణి
కోటికినిజమహాత్మ్యము ప్రసాదించియుండుటచే నేతద్భక్తులువిరక్తులై జీవత్య
క్తులగుట దైవపాతకమగుసదాగతియగు ప్రాణాపత్యమున దైవసంఘటన
ముసఁజేసిబహుళకార్యంకరములు త్పన్నమగు. ఆయుత్సవముల దైవకృ
ముచేతార్థాది భక్తప్రతిష్ఠాపన మొనర్చుటకొకపురుషుఁ డుద్భవించియుం

డు. శైవరాజ్యమున ననంతారిష్టము లల్పకాలమున సంభవించుసూచన లున్నవి ఆకష్టములఁగడిదేర్చ, మతమును పునరుద్ధరింపు మహాత్ముఁ డగ త్యముఁగదా! అట్టిశోభన సంస్కారములు నీయందభావ్యములు. కావున నిరాశఁజెందకుమని యూరడించెను. జగదేవునియందు వాత్సల్యముఁ జూప బసవఁడు శిష్యబృందము లుభృంగికై వారలు జేయ, కింకరులుబిళ్వదళ పూఁదనోనర్ప, దాసీజనము నాగపట్టముబట్ట, భటులుపట్టినత్రిశూలముమోయ, జంగమ దేవరలు సంకునినదంబుసలుప, ఆరాధ్యులు 'లమోరుద్రమన్యమ్యడయే' యనునమోవాక్యయ లుచ్చరింప జగదేవుని మందిరమునకు అతిథియై మంగళతూర్య సహితముగా నేతెంచుటయు భక్తపాదరజము జగదేవు డుద్విజణీకృతపూర్వోత్సాహుఁడై గురుజంగములప్రాంగణమునిల్పి కుటుంబసహితముగా నెదురేగి యతిథిసత్కారములశాస్త్రసమ్మతముగా నెరపియోపినకొలది వివిధాన్నపానముల మృష్టిభోజనసంతృప్తులఁ జేసి భక్తాభీష్టిసంసిద్ధినికృతార్థుడయ్యె

## మల్లయ్య మధువయ్య కథ.

బిజ్జలపురంబున శైవ భక్తపరాయణులగు నిద్దరు క్షుద్రసోదరులుండిరి. పెదయయ్య నీశ్వరకృపాపారతంత్ర్యమునవారు నిత్యజంగమార్చనాధ్యులై బహుళినుతిగాంచుటకు వైష్ణవులగు నాయూరి విప్రులు వృథాసూయాపరవశులై వారి నెవ్విధినైన బరిమార్పకృతనిశ్చయులై బిజ్జలునిసభఁజేరి రాజభూషణా! మాపాలపుట్టిన జెట్టలనేమందుము. ఈ పాషండమతగుల తిరస్కారములమెంచు 'దిన దినగండము నూరేండ్లయుస్సు' కదా! దురాచారసంపన్నులును, మతవిపన్నులును, రాజద్రోహులగు; తక్కిన శైవుల కేల, మల్లయ్యామధువయ్యలు, మాపాలిటిదూతలుకదా! అని తేఁపోని నేరములనారిపోయుటయు, సహజవిప్రపక్షపాతియగు బిజ్జలుడదేయదనుగా వారిని రాజసభకీడ్పించి వారినేత్రగోళంబులఁ బెరికించెను. ఆనిష్కారణవంచనకు ప్రకృతియలిగి దేశారిష్టములె

న్నిరోకల్పెను. అతివృష్టి యనావృష్టి యీతిబాధలుతరచయ్యె దోషి
ష్టి హెచ్చెను. అగ్నిహోత్రభయము కలిగెను అర్భకులుమరణించిరి ఆమ
యములతిశయిల్లెను ఋతుభేదము సంఘటిల్లెను. కాటకములుకలిగెను
బూటకములు ప్రబలెను ఈ దురంతముల బిజ్జలునిఏవత్ రాజ్యము
సంక్షోభమందుచుండ వెర వెఱుఁగక నృపాలుఁడు రాజ్యవినాశమునకు
వెంగగొని యుండెను శైవులీమతవంచకునిగతియెఱిఁగి బసవని సహిత
ముగా జనుదేవునిదర్శించి ఆర్యా! మున్ను శైవసిద్ధాంతమురిత్తముగా
దు. మల్లయ్యమధువయ్యలను-నిరుపముగా రాధ్యులకు భూపుడొనర్చి
న యపకార మీసర్వ విపన్మూలమైనది లోకమిదిమరచుఁ గక
భక్తలోకము, త్రిలోచన విలోకన మీవంచనసహించునె! భక్తసం
త్రాణుడవు నీవయని పురిగొల్పుటయు శివప్రసన్నతచే రక్షణకర్తవ్య
మూహించి, భక్తసమూహంబు నాహ్వానించి వారి యాశీర్వాదముల
నంది బిజ్జలునిఁ బరిమార్చి సజ్జనుల రక్షించుట కభయహస్తమిచ్చి,
దేవునెంచి, హస్తమునకరవాలమూని నిండుసభయను నెలకొని యూర్తా
వనులకు వార్తావహుల సందేశములకు వందురు బిజ్జలునియెట్టయెదుట
లయకాలరుద్రుని భాతి, భీతి దోప నిలిచితఁ మస్తకమును తనకర
వాలధారల ధునిమెను, సభికులెల్లరీ యనర్థమవగా హనగామిదండధరుఁ
డే ధరణీపాలుని పాలిట మృత్యువగుట తెమ కేగలియని మతిచెడి వెత
పడి పికాపికలై పారిపోయిరి. మూఢులు ప్రాణాపాయంబని దిక్కెరుం
గక యథా యథలగుటయు శైవులువిజృంభించి రాజకులంబును ముట్ట
డించి తత్ బంధుసందోహము మిత్రవర్గంబును బరిమార్చిరి బిజ్జలరా
జ్యమంతయు శైవశోపోపహతమగుటయు వైష్ణవాళి తమకు వేరుగతి
లేమికివగచి బసవునిపాదముల శరణుజొచ్చి లింగధారులైన తనపూ
ర్వారిష్టములఁ బాపి తరుణోపాయముగాంచిరి. మల్లయ్య మధువయ్య
లకు పరదైవతము భక్తిపెంపున, పరమభక్తులకు జగదేవుడు, బసవ

మంత్రి, మహాత్మ్యమున బిజ్జలునివల్ల నష్టమైన దృష్టి పునఃప్రసాదితమయ్యెను, ఇట్లు వైష్ణవరాజ్యసంహారకుఁడును, శైవమతసంపాదకుఁడునైన జగదేవుని యపారభక్తికిచ్చ మెచ్చి కైలాసవిభుఁడు-బృందారకసేవ్యుండును, కింకరభజనానువర్తకుండును, షణ్మాతృకాసహితుండును, ఢుండివిఘ్నేశ్వరపరిసరుండును, గౌరీసమేతుండును, నందివాహనారూఢుండును, కుబేరవిహితుండునై సాక్షాత్కరించి జగదేవుని సతానసహితముగా పుష్పకవిమానారూఢుల గావించి వియన్మార్గంబున ననర్గళతుంబురని నాదంబులు చెలంగగ శశిరసాయుజ్యపదవీపట్టభద్రునిఁ గావించెను. భూలోకమున బసవమంత్రి కొంతకాలము శైవసంఘసంస్కారముఁగావించి, శైవదిగ్విజయ దశదిశలవెలయించి, యప్రతిమానశైవనిష్ఠాప్రతిష్ఠప శిష్యవర్గముల కుపదేశించి యికభూలోకమున పరమతభయమ్ము స్వప్నతుల్యమగుటచే నైహికంబులవిసర్జించి, యేకాంతవర్తియై, తృణజలసమృద్ధంబును, శైవక్షేత్రంబునగు బల్లణాపురీసంగమేశ్వరు ప్రాపుచేరి తనమంత్రబలమున నాయతరిశక్తిని స్వాధీనముఁజేసికొనునటయు బసవని శైవమునకు మెచ్చి సంగమేశ్వరుఁడు బ్రత్యక్షుడై బసవని తనలో నైక్యమొనర్చి తాను నిజాంశనొందెను ఇట్లు పారభక్తిసంయుక్తులైయైహిక శైవాచారసామ్రాజ్యమునకు బసవరాజప్రోత్సాహకుఁడును జగదేవుఁడు కారణకర్తయునై తమనిష్ఠాప్రపత్తులనిహమున భక్తిసామ్రాజ్యమునకును పరమునముక్తిసామ్రాజ్యమునకును పట్టభద్రులయిరి ఈబసవపురాణము పఠించినవారికి భక్తిపదంబును, విన్నవారికి విభవంబును, చదివించినవారికి సకలసామ్రాజ్యములును, వ్రాయించినవారికి పాపనాశంబులును, నిత్యపారాయణులకుసాయుజ్యపదవియు గలుఁగును.

సర్వము సంపూర్ణము.

---

శ్రీ చింతామణిముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.